# అపూర్వచింతామణి

(ఇదియొక హాశ్చర్య కరమగు నవల.)

చింతామణి దేవలోకమునకుజెందిన వజ్రరాజముకాదు. పురాణములయందు జెప్పఁబడిన బిల్వమంగళుని యొంపుడుకత్తెయగు వేశ్యయునుగాదు (చింతామణి) ఈ పెనునవలయందలి [illegible] సహజసౌందర్య సౌభాగ్యములకు పుట్టినిల్లు [illegible] తనప్రశ్నావళికి సమాధానమొసగగల [illegible] మానినితప్ప వేరొక్కరిని వరింపనను ఘోరశపథముచేసిన ధీరచిత్తయగు యువతీలలామ,నూఱురు వేయిమంది రాకొమరుల యమపురికిసందర్శమున అంపగలిగినవారి, కథాకల్పనావిధాన మెంతయు చక్కఁగనున్నది. శైలి మృదుమధురము. అత్యద్భుతసంఘటనకు యీనవలారాజమే నిలయము. చదివిచూచిన సర్వము మీకే తెలియును. 1-వ భాగం 1-0-0

2-వభాగం 1-1-0 రెండుభాగములు ఒకేతూరికొనువారికి 2-0-0

# లొంగనిదొంగ

ఎంతటి గజదొంగలైనను ఒకసారిగాకున్న ఇంకొకసారైనను పట్టుపడుచునుండుట నిక్కము కాని యీగ్రంథమందలి దొంగవిషయమట్లు చెప్పుటకు వీలులేదు. యీతడు గజదొంగ; చదువుకొనినదొంగ; లొంగనిదొంగ; కార్యాచరణయందు ధైర్యము,చురుకుదనము, చమత్కారము, యీతనినుండియే వ్యాప్తిగావించినదనవలెను. లేకున్న పట్టపగలు బ్యాంకు నెట్లు దొంగలించగలడు, కమలతల్లికి గుణపాఠ మెట్లుచెప్పగలడు వజ్రాపహరణము, నెట్లుసాగింపగలడు, దొంగలగుంపులనే ఎట్లుమోసగించగలడు; సతీశునకు సతీశుడేసాటి. అతనిసాహసచర్యలు వర్ణనాతీతము. గ్రంథముచదివి ఆంధ్రమహాజనులెల్లరును దయచేసి కొనిచూడవలెను. వెల 0-4-0

# నాడీజ్ఞానము

ఇందు నాడులఉత్పత్తి, నాడీనిదానము, నాడీలక్షణము, మొదలగు 200 విషయములు వైద్యులకేగాక ప్రతివారికిని సులభముగా తెలియునటుల తెనుగుతాత్పర్యముతో చక్కఁగావ్రాసి చిన్నసైజున క్రొత్తగా ముద్రించియున్నది. 0-3-0

## పంచపాండవుల వనవాసము

ఇది శ్రీమహాభారతమునందలి యారణ్యపర్వమునంగల కథల ననుసరించి వ్రాయబడినది. ఇందు వైశంపాయనుండు జనమేజయునకు పాండవు లరణ్యవాసమున సూర్యవనము, రామఋషివనము, మృగ మహాఋషివనము మొదలుగాగల 12 వనములయందు జరిగిన కథలు గలవు. దీని వెల 0-8-0

## నాగడికూతురు

"నాగడికూతురు" అను నామముతో నొకగ్రంథమా!

యని కొందరాశ్చర్యపడుదురు.

ఔను నాగడికొమరితనామమున ఒకగ్రంథము వ్రాయవలసిన యగత్యముకలదు. దీనితో దొంగసంన్యాసులెవ్వరో, నిజముగుసంన్యాసులెట్లుందురో, యిందుమూలమున చదువరులే గ్రహింపగలది. నాగడి కూతురువలన రావుసాహెబు భార్య తులశమ్మ పట్టుబడుటపడినది. పెండ్లిమూలమున డబ్బులాగ యెట్టిప్రయత్నములు జరిగెనో తెలిపినది. పెద్దయుద్యోగములకై ప్రాకులాడువా రెట్లు తరుణీశయముల నెరవేర్చుకొనెదరో విశదపరచినది. అంతయు పాత్రోచితమగు ముద్దులొల్కుభాషతో ముచ్చటగవ్రాయబడినది. హాస్యముప్పొంగ పకపకప్రతి పాఠకులు తప్పకనవ్వెదరు. 0-2-0

## నవనీతారిష్టము

తెనుగు తాత్పర్యసహితము.

జాతకునకెన్ని యోగములున్నను ఆయుర్యోగములేనియెడల నవి యన్నియును నిష్ప్రయోజనములగును. గనుక మొట్టమొదట ఆయుర్దాయనిర్ణయ మత్యావశ్యకము. అందును జననాదిగా పదిరెండుసంవత్సరములలోపల బాలుడు తల్లిదండ్రులయొక్క దోషముల చేతను, బాలగ్రహములవల్లను నశించుటచేత ఆయుర్జ్ఞానము తెలియుట దుర్లభము. అట్టిగండాంతరములను కనిపెట్టి తద్దోషనివారణార్థమై యథావిధిగా శాంతులను జరుపుటచేత ఆయుర్వృద్ధిని సౌఖ్యమునుపొందును. 0-8-0

శ్రీ ర స్తు.

# ప్రపంచపంచకాలవైనాసములు.

## భగవత్ప్రార్థన.

ఉ. శ్రీకరమైన శేషగిరిఁ జేరి జగంబున భక్తకోటిన
స్తోకదయార్ద్రదృష్టులను జూచి నిరంతర మీప్సితార్థముల్
జోకనొసంగు నిత్య పరిశుద్ధగుణాకరు వేంకటేశు ను
ద్రేకముఁ దలంతు నామదిని సుస్థిరభక్తి సభీష్టసిద్ధికిన్.

క. శ్రీమదలర్మేల్మంగా-
హేమనిభాంగా పదంబ నింద్రాదిసుర
స్తోమార్చిత సఘభంగా
స్వామినినిదయాంతరంగఁ జాలనుతింతున్.

క. సకలసురసిద్ధసాధ్య
ప్రకరస్తుతు నేకదంతు పాననుని వినా
యకు భక్తిఁ దలఁతు మత్కృతి
కొకటియు విఘ్నంబుగలుగ కుండుట కొఱకున్.

క. స్మరియించెద వాక్శుద్ధిం
గరుణం గలిగించుటకు జగద్వంద్యనునుం
దరవేణి నలునిరాణిన్
వరదాయప్రదమైన శ్రీవాణీన్ వాణిన్.

గీ. సుకవులను గురుపండిత ప్రకరములను
వినుతిగావించెదను మత్కవిత్వమందు
గలుగు నెరసులు మన్నించి కరుణతోడ
గుణములున్నంతపట్టు గ్రహించుడంచు.

చ. వసుధజనుల్ దయారహిత * వర్తనులై యవినీతి నెవ్వఁడుఁ
స్వసుఖములుఁ స్వలాభమును * చాలఁగఁగోరి ధనాశనొందువారు
వసిఁగొని పెక్కుచందముల * వంచనఁ జేయు విచిత్రకార్యముల్
వసయునుజూచి నేఁదెలియఁ * బల్కఁగఁబూనితి తత్కుతంత్రముల్

ఆ. దీనిఁజదివి కేని * మానవుల్ తామెట్లు
మోసపోవునదియు * మోసగించు,
వారుచేయుపనులు * వారెట్టివారొటఁ
దెలిసికొని మెలంగఁ * గలరుచెడక.

సీ. శ్రీవత్సగోత్రజ * శ్రేష్ఠుఁడై విఖ్యాతి
జెందిన లక్ష్మీనృ * సింహసూరి,
పుత్రుండ పుణ్యచ * రిత్ర సావిత్ర్యంబ
యందు నేనుద్భవ * మైనవాఁడ,
పిచ్చయాహ్వయుఁడ వ్యా * ప్తిఁ జెయుమహాలక్ష్మి
యనుపేరుగలదియు * నైనసాధ్విఁ,
ప్రమదం బెలర్పఁ జే * పట్టినవాఁడను
శేషాద్రివిభుని భ * జించువాఁడ,

గీ. సమరవిజయాశ్వచారిత్ర * మాదియైన
గ్రంథములు పెక్కులొగి పద్య * గద్యఫక్కి
వ్రాసి వెలయించి నుతిఁగొన్న * వాఁడనిపుడు
తెలిపెదను వంచకుల తంత్ర * ములనుపూని.

# దైవప్రార్థన మోసము.

ప్రపంచమున మనుష్యజన్మము నెత్తినవాని కేదియో యొకకోరిక కలిగియేయుండును. అట్టివాఁడు తన యపేక్షఁ దీర్చుకొనుటకుఁ దలంచినపుడు భగవంతునిసయితము మోసముఁజేయుటకు వెనుకదీయఁడు. ఆకార్యము తనకు సాధ్యముగానిదని వాఁడు తలంచుటలేదు. అది వానిసహజగుణము. ఉదయముననే నిద్రలేచి కండ్లునలుపుకొనుచు తనలో నేదేని యొకటి లాభకరమైన కార్యముం దలంచుకొని దానికొఱకై ప్రయాణమైపోవుచు దారిలోనో, లేక పయినమైనసమయముననో, గణేశ్వరుఁడు, పరమశివుఁడు, విష్ణువు, సుబ్రహ్మణ్యుఁడు, దుర్గ, కాళి, మారి, పోలేరమ్మ, హనుమంతుఁడు, మధురవీరుఁడు, వీరభద్రుఁడు మొదలుగాగల దేవతల యాలయములనుచూచి "విఘ్నేశా! బ్రతుకుతెరువు వివరింపవయా!" యని యడిగిన చందముగా గుడిలో చొచ్చియో వెలుపటనుండియో తనలో, "ఓస్వామీ! ఓమహాతల్లీ! నేను తలంచినకార్య మనుకూలించి ఫలసిద్ధియైనయెడల మీ దేవళము విడియఁగొట్టించి మిక్కిలి యున్నతముగను, నాణెముగను, దృఢముగనుం గట్టించెద. కుంభాభిషేకము చేయించెద. మహాడాడంబరముగా తిరునాళ్లనుజరిపించెద. మేలయినవస్త్రములును, రత్నాభరణములుం దెచ్చి సమర్పించెద. జతలుజతలుగా పొంగళ్లుపెట్టించెద. మదించిన దున్నపోతులను, పొట్టేళ్లనుం, గోళ్లను బలియిచ్చెద. నెదురుకుంభముం పోయించెద, దేవళములచుట్టునుం బొర్లుదండము బెట్టెద" నని "గుడిలోదేవుడి కంగటిలో టెంకాయ లర్పణ" మనులాగున నొక టెంకాయుం గొట్టుటకునయితము తనకు గతిలేకపోయినను "వేయిటెంకాయలం గొట్టెదను, వాహనములుచేయించెద, పూలతేరుఁగట్టించెద" నని తనకుతోఁచిన ట్లంతయుం జెప్పి, మహాభక్తితో స్తోత్రముఁజేసి దారిలోపోయెడివా రెవ్వరేనియుం దనచర్యల నెఱుంగబోయెదరేమో యని యెంచి నలువంకలంజూచి రెండుచేతులతో పెళపెళ చెంపలుగొట్టుకొని కణతలుకందునట్లు, పిడికిళ్లతో మొట్టుకొని, చేతులుమార్చి చెవులుపట్టుకొని గుంజిళ్లుపెట్టి, భూమిమీఁద సాగిలంబడి దండముఁబెట్టి లేచి కరములుజోడించి నిలుచుకొని, "హరిహరీ! శివశివా! అది

వేంకటేశా! కరి మొరాలించి రక్షించిన కరుణాకరా! సభలో ద్రౌప దికి మానభంగము గలుగకుండ వలువలొసంగిన పరపురుషా! ప్రహ్లా దునిగాచిన పావనస్వరూపా! నీకు ప్రతిసంవత్సరమును బ్రహ్మోత్సవ ముఁ జేయించెదను. కాలుండు పట్టికొనిపోవవచ్చిన మార్కండేయుని గాచిన మహాదేవా! త్రిపురంబులను నాశమొనరించి జగంబులకు భయంబుమాన్పిన కైలాసనిలయా! హాలాహాలముంద్రావి ప్రాణులసం రక్షించిన పరమేశ్వరా! నీకు నిత్యాభిషేక నిత్యదీపారాధన నైవేద్య ములు నడుచుచుండుటకుం దగిన యేర్పాటులంజేసెద నోమహాశక్తీ! అంకాళమ్మా! పోలేరమ్మతల్లీ! మీ కేటేట జాతరలుం గొలువులుం జేయించెద. కల్లును సారాయమును, బుడ్లుబుడ్లుగాను, పీపాయిపీపాయి గాను తెప్పించి సమర్పించెద. మీకు ముడుపులుగట్టుకొనెద. త్రాగని వాళ్లను త్రాగునట్లుచేసియు, నాడనివారి నాడునట్లుచేసియు, పోలీసు వారివశమై యపరాధములు చెల్లించునట్లుచేసెద. ఎన్నియాటంకములు కలిగినను మీప్రార్థనలు తప్పకచెల్లించెద" నని యెన్నెన్నియో లెక్క పెట్టుటకు శక్యముగాని ప్రార్థనలు చేసికొని వెడలిపోయి తానుపోయి నంతట తలంచినకార్యము సఫలముకాగానే "కొండంత దేవు నికి గోరంతపత్రి" యని యైనను సమర్పింపక "ఏదో యొకటి యెప్పు డో యొకనాఁడు జేయవచ్చును ఎంచిన దేమియును లేదుబో" యనెడి యుపేక్షతో దినములు గడుపుచు, కాలము జరిగినంతట తాను గావిం చిన మ్రొక్కుబడులను దేవుళ్లు మఱచిపోయినారని యెంచి కాలగా కర్పూరమునకైనను గతిలేని వాని చందంబున గనపడుచు, మొదటి తనభక్తిమాయమై దేవాలయములు కనఁబడినపుడు వానిముందుగా బోయినచో నొకవేళ తన ప్రార్థనలు దేవుళ్లకు జ్ఞాపకమునకు వచ్చు నేమో యని వానికి వెనుకదారిగా చుట్టిపోవుట కారంభించును. వాఁడు తనలో "ఔను! నిజమే! అపుడేమో ప్రార్థనము జేసితింగాని యవి యన్నియుంజరుపుట కెవనికి సాధ్యమగును? ఎంత డబ్బుగావలయును? కలిగినంతవట్టును దేవుఁడనియు ధర్మ్యమనియు కర్చుచేసుకొని పిమ్మట నేనేమి చేయవలయును? బిడ్డలును నేనును నల్లాడవలసినదేకదా! బాగు, బాగు! దేవుఁడు తానుగావచ్చి చెప్పినట్లు జరిగించలేదని యడుగ గల్గోవునా? అదిగానేని యపుడాలోచించెదగాక. ఆ దేవుఁడు వచ్చుట

యు నడుగుటయు నెట్లో చూచెద. ఒకవేళ దేవుఁడు తానుగానే యడుగుటకు వచ్చినయెడల మిద్దెమీఁదనో, గాదెలోనో, యేమూలనోదాగి (తాను రేపు దేశయాత్రచేయఁబోవుట నెఱుంగక) "ఎచ్చటికో దేశయాత్ర చేయఁబోయినాఁ" డని చెప్పించెద. అటులచెప్పించనచో మునిగినదేమి? ఆనాఁడేమో తెలియక మ్రొక్కుకొంటినిగాని యది నిజముగా మనస్ఫూర్తిగా నెఱింగి చేసిన ప్రార్థనకానేకాదు. నేను తెలిసియే చెప్పితిననుట కాధారమెయ్యది? సాక్షియెవ్వఁడు? సాక్షియును లేదు, స్వామియును లేఁడు. దేవుఁడు నాకుజేసినమేలెయ్యది? అన్నిటికిని నేనేకర్తనుగాని దేవుడుండుటయు సహాయముఁ జేయుటయునున్నదా? పట్టిమాట. దుర్భ్రమయే గాని మతేమియును లేదు. "భగవంతుఁడొసంగలేని ఫలమును, ప్రయత్నమువలనఁ బొందనగు" నని పెద్దలు చెప్పుదురు. నేను కష్టపడి ప్రయత్నించి చేయకున్నయెడల నేకార్యమునకైనను ఫలముకలుగునా? ఎట్లుకలుగును? గుడులేమిటికి? కొనేళ్లేమిటికి; వీనివలన నావంతేనియుం బ్రయోజనము లేదు. ఇవియన్నియుం దెలివిలేని వారలు నిజముగా నేమోయున్నదని భ్రమించి విగ్రహములుచేయించి పేరులు బెట్టి పూజించెదరు అంతేగాని విశేషములెవ్వియుం గలుగవు. ఇదియెఱింగిన నావంటివారు దైవమునకు భయమొందనేమిటికి? ఆవేలుపు లెవ్వరో, యేమిచేయుదురో చూచెదగాక" యని తమమాటలను వేఱువిధముగాత్రిప్పి దైవమునే వంచింపజూచు మోసగాండ్రుం గని వేలుపులే భయమొందిరన్నకున్నపుడు వారివిషయమున మనవంటివార మేమిచేయగలము? వ్రాయునది సత్యముగానే వ్రాయుట మనము చేయవలసినవిధి ఇదిచదివినవారిలోనను, వినిన వారిలోనను వేయింట నొక్కఁడైనను, వివేకవంతుఁడై సత్పథంబున వర్తింపక పోవునా? చూతము. ఈనమ్మకముతోడనే నేనీవిషయములు వివరించుచున్నాను.

క. కేవలవంచకులై భువి
దేవతలంగికురువెట్టఁ గి దివిరెడివారిం
కేవిధమున జేయఁగమది
లోవెఱతురు? సంశయించి రీలోకమున, ఖళీ!

# జవుళీయంగళ్ల మోసము.



లోకములో ప్రతిమనుష్యునకును నత్యావశ్యకములైనవి రెండు. అవి యేవనఁగా: కూడును, గుడ్డయును. ఈరెండింటిలో, కూడు ప్రాణాధారమైనదైనను నది యొకపూట లేకుండినను, తనయింట నెట్టుల భుజించినను నెవ్వరికిం దెలియదు, గాని వస్త్రముమాత్రమందఱికిం గనబడునట్టిదిగాన సాధ్యమైనంతవరకును శుభ్రమైనవిగా ధరించుకొనుచుండవలయును. ఎవఁడు మేలైన వెలపొడుగు వస్త్రములు ధరించునో వానికి లోకమున గౌరవమును మరియాదయుం గలుగును. "కట్టలేనివాఁడు కట్టెతోసమాన" మని లోకోక్తి గలదుగదా! "పొట్ట వాడినను, కట్టుమాయగూడ" దనియుం జెప్పెదరు. కాఁబట్టి మనుష్యునకు మంచివస్త్రము కలిగియుండుట ముఖ్యముగాని, పేదవారికది సాధ్యముకాక పోవచ్చును. అయినను తమశక్త్యానుసారముగా తాము కట్టుకొనెడి బట్టలు శుభ్రముగా నుంచుకొనుటకుం దగినవిగా కొనుచుండవలయును. మనము వస్త్రములుకొనుటకై జవళీ యంగళ్లకుం బోయినపుడు వారియొప్పును, నేర్పును, మార్పునుం దెలిసికొనుట యసాధ్యము. వారిలో వారుమాటలాడుకొనుమాటలును, లెక్కలును, విలాసములును, గుఱుతులును, మిక్కిలినూత్నములైనవై యుండును. కండ్లచెదరునట్లు రంగురంగు గుడ్డలతోడను, పలుతెఱఁగుల యద్దములతోడను, దీపాలతోడను తమయంగళ్లనలంకరించియుందురు. బట్టలుకొనుట కెవ్వఁడైనను వచ్చినయెడల మహావినయముతో వానికినమస్కారముఁ జేసి తత్పూర్వమతని నెచ్చటనో చూచి సంభాషించి యెఱింగియున్న వారివలె నతిచాతుర్యముగా మాటలాడుదురు. వచ్చినవాఁ డడిగినరకము తమదగ్గఱ లేకపోయినను "కలదు కూర్చుండుఁడు, ఇంచుకదయచేసి మాయొద్దనుండెడి రకములనుచూడుఁడు. మీరు కొనకపోయినను పోయెదరు. కడ్డాయమేమియును లేదు గాని మీవంటివారు ముఖ్యముగాచూచుటయే చాలును. అదియే మాకులాభము" అని యతనిఁ గూర్చుండఁజేసి, యొకటి నడుగుటకులోపల పదియారు రకములు తెచ్చి యాంగడీయంతయుం బఱచి వానిని వర్ణించి వర్ణించి యతనిమనస్సు తిరుగునట్లును కొనుటకు కోరికకలుగునట్లునుం జేయుదురు. మ

తలువిప్పి విదిర్చి విదిర్చి వెడల్పునుం బొడవునుం గలిగియుండునదియుం బోలె, బహుతంత్రముగా రెండుచేతులతోడను బట్టుకొని గుడ్డయొక్క నాణెమును నేతచదరమునుం జూపుదురు. కొనెడివాఁడు వేఱురకము డిగినను, లేక తానుగానే యైనను, "అయ్యా! ఇదిగో! వేఱుగా వెల పొడుగు రకముకూడాయున్నది చిత్తగించండి" యని యదేవస్త్రములుండు బీరువాలో, లోపలనుంచి యుండెడి, "కాంచీపురం అ. వ. మడి. తీసుకొనిరా! ఒరే! ఆరణిగట్టిచాయ. క. క. విలాసం తెమ్ము" అనిచెప్పునదు తోడనే లోపలనుండుపిల్లవాఁడు మడతలు మడతలుగా తెచ్చి ముందువేయును. ఆతేబడినవన్నియు మొదటగనపఱచిన దానికంటెతక్కువ రకముగానేయుండును. అందు. అ. క. విలాసమనునది. అడుగ పడియున్నది క. క. విలాసము. కష్టపడక కట్టిపెట్టినది ఇట్లే పలుతెఱఁగులరహస్యపు విలాసములు పెక్కులుండును. ఇంక వెలల విషయమనిననో, వారినేర్పునంతయును నప్పుడు వినియోగింతురు" ఏమండీ! మీకు వ్యత్యాసముగాఁ జెప్పుదుమా? కరారువెల చెప్పెదము. ఇదిగో! మఱియొకరికైనయెడల మేముచూపము. మీకు పట్టి చూపెదము చిత్తగించండి, మీదయకావలయునుగాని నాలుగణాలు యెక్కువగా మీవంటివారియొద్ద యెక్కువలాభమును మేముపొందగోరము. మాకు రూపాయకొకయణా మీరులాభమిచ్చిన చాలును. మీవంటివారు మాయంగడికివచ్చుటయే మాకుగొప్పలాభము. ఇతరులవలె తరాతరంబులెంచక యత్యాసచే మేములేనిపోని ధరలుచెప్పెడివారముకాము. మావ్యాపారమునందు మీబోంట్లకు నమ్మకము కలుగవలయునుగాని లాభముముఖ్యముకాదు. క్రమముగా వ్యాపారముఁజేయుచుండినయెడల భగవంతుఁడిచ్చినమట్టుకే మేముతృప్తినొందుటమంచిదని కరాకధరయే చెప్పుచుందుము. మాన్యాయమునెఱింగి మఱియొకసారి మాయంగడికే రావలయుననెడికోరికతో మీకు పట్టీని చూపించుచున్నాము" అని తాముగానే తయారుచేసి పెట్టుకొనియున్న పట్టీకనబఱచి, (ఈతగింజనిచ్చి తాటిగింజ తీసుకొనులాగున) కుళ్లాయి వేసి, యొకటికి మూడంతలలాభముతో డబ్బులాగుకొందురు. "నెల్లూరు, సేలము. ఉప్పాడ, కాకినాడ, కొఱనాడు, సీమ, బనారసు, మొదలైనచోట్లనుండి మేలైనధోవతులు, పంచెలు, వివిధములయిన

చీరలు, చిత్తాపలు, క్రొత్తక్రొత్తదినుసులు తెప్పించియున్నాము. ఓయమ్మా! రండి, రండి, చూడండి, మీకుయిష్టమయిన రకములున్నవి, చవకసముగాయిచ్చెదము. అన్నియునంగళ్లే! అంగళ్లను మనుష్యులే! ఏమిప్రయోజనము? మాయొద్దనుండు రకములు క్రొత్తవి. ఇట్టివి యితరులయొద్దదొరకవు. వారు సాధారణమైన సరకును తెప్పించి యెక్కువ వెలకమ్ముదురు. మాపద్ధతి యదికాదు. లాభము లేకపోయినను, అసలువెలకయినాయిచ్చి కాతాసంపాదింపవలయునని మాయభిప్రాయము ఇదిగో! రకములుచూచిపొండు" అని వచ్చుచుంబోవుచుండు స్త్రీలనుమహావినయముతో పిలుచుచుండుదురు వారిమాటలువినినమ్మి యేయమ్మయైనను వచ్చినయెడల మఱినాడే మొదటిచాయకువచ్చినవియు నడాసుగాపడియున్నవియు కాగితములలో బహుజాగ్రత్తగా కట్టబడియున్నవియునైన పళపళమను మాయరంగులతో మెఱయుచుండు చీరలు తెచ్చి యెక్కువవిలువగలవియుబోలె, క్రిందనొకగుడ్డపఱచి దానిపై నాచీరలను బహుజాగ్రత్తగాపఱచి చూపి ప్రశంసజేసి యేమేమో కపటపుమాటలు చెప్పి వానిని కొనుటకు సమ్మతింపజేసి తనలో మఱియొకనితో "ఒరే! ఏదీ? ఆపట్టీయిమ్ము అమ్మగారు మొదట మనయంగడికివచ్చినందున నెక్కుడుధరచెప్పెదమని భయపడుచున్నది. మన న్యాయమీమెకు తెలియవలెను. మఱియొకసారి వేఱెయంగడికిపోవదలంపకూడదు. లాభములేకున్నను, మొదటితడవయగుటచే యసలుధరకైనా యివ్వవలసినదే!" యని తామువ్రాసిపెట్టుకొనియున్న పట్టిని చదివి, పరిభాషలో నొకరితో నొకరుమాటలాడుకొని "సరే! నష్టమయిననయ్యెను. యీయమ్మగారి కాతాయుంటేచాలు" నని ప్రకాశముగాపలికి, రెట్టింపువెల, లాభము, దుకాణముబాడుగ, ధర్మము, వడ్డీ, సంబళము, యివియన్నియుంజేర్చి ధరనుకట్టనేర్పుతో తీర్మానించి యంటగట్టి డబ్బులాగుకొందురు. గుడ్డలుచించి యిచ్చునప్పుడు "యిదేబోణియిపుడే యంగడితెఱచినాము ఈదినము మీచేతిబోణి చూడవలయును. ఏదీ? రూకలు ముందుబోణిచేయుమని తొలుతనే క్రయమును తీసుకొందురు. మోసమునకు మాతృస్థానము చెన్నపురిలోనిజవుళియంగళ్లని చెప్పక తప్పదు. జవుళియంగళ్లలోని మోసము నెఱుంగని పల్లెటూరివారలయినప్పటికిని వర్తకులించుకైనను దయయు, ధర్మము

ద్విషత్కుంభుల శోషణందేహ విశోషనివారకంబులు. వివరణము భువి నన్మానరాహిత్యము. చికిత్సలు సకలరోగహరసాధకంబులు. కావున నిట్టింబుగఁ గన్పట్టంజేసినట్టులఁ జెక్కు వైద్యగ్రంథంబులు లెక్కకు మీఱియుండుటంజేసి వానియం దీగ్రంథమును నిజబుద్ధినై శేష్యంబు పగిదిజగతీజనులు నిజశరీరరక్షణార్థంబై యభ్యసించిననారోగ్యలక్ష్మిని బొందఁగొందురు. సకలపురుషార్థసిద్ధి దాని వెనువెంటనంటియుండు.

అట్టియభ్యాసలోపంబున వైద్యులపాదములఁబట్టునావశ్యకము తటస్థించు. ఇప్పుడు సర్వసాధారణంబుగ వైద్యశాస్త్ర మెఱింగినవారికి ననుభవము కొఱవడియుండు. అనుభవ ముండువారికి శాస్త్రజ్ఞానము శూన్యమైయుండు ఈరెంటినెఱింగి సమయోచితముగఁ జికిత్స సేయు వాఁడే రాజవైద్యుండు. శాస్త్రానుభవజ్ఞానవిహీనుండగు వైద్యుం డమృత తుల్యంబులగు నౌషధముల నొసంగిన నవి శస్త్రము, పిడుగు విషము, అను వానింబోలి రోగిం జంపు; కావున మనహిందూదేశమునందిప్పుడుగల వైద్యులలోఁ గొందఱు మొఱకులు శాస్త్రానుభవముల రెంటియందు నొకదానినైన నెఱుంగక యుదరపోషణార్థంబై బూటకిమాటలచేఁదమ కేఁటి జ్ఞానధాటిగల రోగులకోటిని నమ్మించి నెక్కుడు బాధను కలుగఁ జేయుచు "యమాద వ్యాధితో వైద్యో యమః ప్రాణహరో మతః। ధన ప్రాణహరో వైద్యః పాపినంతం వివర్జయేత్ ॥" అను వచనప్రకారము వారి యర్థప్రాణముల నపహరింతురు అట్టివారల యమకింకరులకంటెఁ గష్టాత్ములనుటకుఁ గొంకనేల? అక్కటా! "వైద్యంబును సంగీతమును దెలియనివార లెవ్వరును లేరు" అను లోకోక్తి యేల కల్లయగు? ఎక్కడఁజూచినను లెక్కకు నెక్కుడగు పెక్కండ్రు వైద్యులు పిక్కటిల్లి యుందురు గాని యందు నిజమారసిన నూటి కొక్కండైన నిక్కంపు వైద్యుండు చిక్కుట మిక్కిలి యక్కజంబు.

నెంచక, వారినేమార్చుచుండుదురు. వెలపోడుగు దినుసులనుచూపి, మట్టమైనవానినిచ్చుటయు, మూరతక్కువగా యున్నదనిన, వెడల్పు భారీయైనదని కొలతఁబట్టిచూపుటయు, చాయపోవునేమో, యనిన "ఓహో! వెలసరసముగాయిచ్చుటవలన యిట్లుతోఁచుచున్నదా? దళసరిగుడ్డ. గట్టిచాయ ఈవెలకీనెంబరుగుడ్డ ప్రక్కయంగడిలో యిచ్చిన యెడల మాకుదీనిక్రయమేయివ్వనలదు. ఊరకనేయిచ్చెద" మని నమ్మికబుట్టునట్లుచెప్పుట, మొదలైనతంత్రములుచేయుటలో, వారినిమించినవారులేరనిచెప్పిన, యదియతిశయోక్తికాదు. లేచిపోవుచున్నవారిని గుడ్డపట్టిలాగికూర్చుండబెట్టి బేరమాడుదురు. చెన్నపట్టణపు జంటిల్మేనులుగాయుండువారువచ్చిరేని యంగళ్లవాళ్లయదృష్టముపండినదే! అందును, తమ సకియలతోజోడిగావచ్చినయెడల యింకచెప్పవలసినదియేమిలేదు. ఇతర దేశముల బొంబాయిమల్లు, మజలీను, కేంబ్రిక్, లాంగ్ క్లాత్ సిల్కుదినుసులు, కారికముమల్లు 1703 నెంబరుచలువమల్లు, మొదలైన రకములనడుగుటకు పూర్వముగానేయెత్తి వారిముందువేయుదురు. "ఇంకను క్రొత్తరకములచెక్కులు, చీటిచీరలు పలువిధములైనవియున్నవి. మల్లులోనకపీసునుతీసినయెడల నాలుగుపంచెలును నొకతుండుగుడ్డయునగును. ఒకగజముగుడ్డ ధారాళముగా యొకరవికయగును, చీటిచీరలు యెనిమిది-తొమ్మిది, గజములలో యున్నవి. గాని అమ్మగారికి యెనిమిదిగజములచీరయే చాలును" అనిచెప్పి వానిపై బుద్ధిప్రసరింపఁజేయుదురు. ఒకవేళ నేతైన చీరనుతీసికొనిపోయినచో యదిలోపల కొట్లబెలుసుపడి కుట్టనదిగాయుండును. నెలచెప్పుడములో, "ఒకేధర మీకో వ్యత్యాసముగాచెప్పము గనుక ఒకేమాట. మరల మీరునెలయడుగ కూడదు" అని వేయిసత్యములుచేసి చెప్పుదురు. "అయ్యా! కొంచెము మాయందు దయయుంచి పోస్టుముద్రతో యుండు పట్టిని చూడండి, మానిజము మీకు తెలియవచ్చు"నని తమకు యితరవిషయమున వచ్చియుండుకవరులో వ్రాసిపెట్టియున్న లిస్టును వెలలునుంజూపుదురు. ఇకవేళ నెనరైనంగొంచెము తక్కువనెలయడిగెనేని "ఇదేమిరాకర్మము. పాడుకోతి యడ్డముగా నడుస్తుంది" యని పరిభాషలో తిట్టుదురు. ఈమాటలయర్థము నొకవేళకనిపట్టి స్త్రీలులజ్జపడి "కానిండు గుడ్డనుచించుఁ"డనిచెప్పినచో, రెండుచిటికెనవ్రేళ్లను గుడ్డక్రిందఁజేర్చి యాగు

డ్డ మిక్కిలిగట్టిదై చింపుటకుకష్టమయియున్నట్లునటింపుచు, ఊపిరిబిగి యబట్టిచింపుదురు. నిజముగా యదిపట్టుకొన్న వీడివచ్చునంతటి దార్ఢ్య ముగలదై యుండును. గజము కఱ్ఱతో కొలుచునపుడు గజమునకొక యంగుళముచొప్పున తమయొద్దనిలుచు ప్రక్కకు త్రోయుచులాగి బిరబిరంగొలుతురు. 6 గజములుతీసికొని యింటికిపోయికొలిచినయెడల 5½ గజముగాయుండును. తీసుకొనిపోయిన వాఁడావస్త్రము నొకనెలది నములవరకునుం జినిగిపోకయుంచుకొనఁగలిగెనేని యతఁడెంతయో గట్టివాఁడనిచెప్పవచ్చును. యదిపదునైదుదినములలోపలనే చినుగుపట్టి పోకయుండనేయుండదు. ఇటువంటి పగలుకొళ్లగొట్టు మోసగాండ్రను చూచి భయపడి కొని కట్టుకొనలేక పరమశివుఁడు పులితోలును ఏను గుతోలును గట్టుకొన్నాఁడుకాఁబోలు. వీనమూలాభమున కాసపుట యుత్తమము. మోసముజేసినవాఁడు తుదకు దానరిగాకతప్పదు. ఈజవ్వళి యంగళ్ల వర్తకులవిషయమున కడుజాగ్రత్తగా ప్రవర్తించుటమంచిది.

గీ. జవ్వళియంగళ్లవారి మోసంబెఱుంగ
వనజభవుఁడైననేరఁడు మానుజులెంత?
సాధ్యమైనంత వఱకును జాగరూకు
లై ప్రవర్తింపనగుఁ గాన సదసికేని.



# బియ్యపు వర్తకుల మోసము.



ఈబియ్యపు వ్యాపారముఁ జేయువారు కాలము నెఱింగి యెచ్చటనంటఁ బండి పుష్కలముగా బియ్యము దొరకునో యాచోటులను తెలిసికొనిపోయి మిక్కిలి చౌకగా బియ్యమును పట్టి తెచ్చెదరు. అక్కడను యీపనులలో బాగుగా నారితేరిన ఏజంట్లనుంచుదురు. వారుసమయమునకుఁదగినట్లు బియ్యమును తయారుచేయించిపంపుదురు. బియ్యమును దంచియిచ్చువారుసయితము మూడుపాళ్లు తమయిలాకావారలుగానే యుందురు. వారు వడ్లను తగినంతకాలము నీళ్లలోనూరఁబెట్టి యుడికించి యెండలోపోసి చక్కగా యెండినంతట గోటితో నొలిచినవిధముగా గింజలువిఱుగకుండులాగున బహుపక్వముగా యుమకను తీసివేయుదురుగాని, రాయి, ఇసుక, తవుడు మొదలగునవిమాత్రము తీసివేయరు. ఈయుపవస్తుసహితముగానే బియ్యమువచ్చి చేరును. ఆబియ్యమునువంట చేసినయెడల గబ్బుకొట్టుచుండును. ఆవాసనకు పేగులు పెకుకొనిబయటికివచ్చును. ఇట్టిబియ్యములో తవుడుతీసినది యెక్కువ వెలగలది. తవుడును రాయియు లేనిబియ్యము మఱియు నధికమైనధరఁ జెప్పుదురు. కొనుటకుపోయినప్పుడు రకములు వేఱువేఱుగాజూపి "అమ్మా! చిన్నసంబావులు, పెద్దసంబావులు, గుండుసంబావులు, కళింగసంబావులు, వాడసంబావులు, కారుసంబావులు, నెల్లూరుసంబావులు, జిలకరసంబావులు, పిషాణములు, మొలకొలుకులు, గడ్డవరి, పిచ్చువరి, స్వర్ణవరి, ఇన్నిదినుసులున్నవి. అన్నము మల్లెపూవులవలె నైసుగానుండును. మిగుల నోదుగుబడి గలిగినవిగానుండును. మంచి రుచిగలిగి యన్నమారోగ్యమును కలిగించును. మాయొద్ద మేలురకం బియ్యము కలుగుటచేఁబట్టి ముప్పాతికపాలు యీపట్టణములోనివారు మాదగ్గఱనే తీసికొనిపోవుదురు. సాధారణముగా మాకు బస్తాలుబస్తాలుగా విశేషముగా సెలవగును. చిల్లరవిక్రయం చాలాతక్కువ. అదుగో! తరగరి యున్నాడు. అతనికి కొలతకూలినిచ్చివేయుడు, కరారుగానుండు వడితో, పెద్దగాచెప్పి కొద్దిగాకొలుచుటలో తరగరి భూపతినాయుఁడు,

చాల మంచి నేర్పుగలవాఁడు. యోగ్యుఁడు. వచ్చినవారతఁడు కొలిచిననేతప్ప మాకొలతకుసమ్మతింపరు" అని చెప్పుదురు. వర్తకులననుసరించి కొలతగాండ్రయంగళ్లయొద్ద యెప్పుడునుంగనిపెట్టుకొనియుందురు. ఇట్టికొలతలు కొలిచినవారలే కాళ్లుచేతులు పడిపోయి మహారోగములతోడను, కుష్ఠురోగములతోడను నల్లాడుటకు సిద్ధమైయుండు పాపాత్ములని చెప్పవలయును. బియ్యమునుకొను పేదసాదు స్త్రీలయొక్కతిట్లకును, దీవనలకును, పాతకమునకును నాధారమైనవారీ యన్యాయపు కొలతఁగొలిచి లోకులనోళ్లుగొట్టి వర్తకులకు లాభము జేయు క్రూరాత్ములే! ఇంకకూలివారలన్ననో, మెత్తైనబియ్యమును తమయొడిలో వేసికొని "అమ్మా! బియ్యపుమండీనా? పోవుచున్నారు. ఇదిగో! ఈబియ్యమునుచూడండి. ఈరకము మాయొక్క యంగడిలోమాత్రమేయున్నవి. రండిరండి నయముగా వెలతీర్మానంచేసియిప్పించెదను. ఈరకముతప్ప మీరువేఱుబియ్యం తీయవలదు. తక్కినవన్నియును కలపటమైనవి" యనిచెప్పి తనవాడుకయంగడికి పిలుచుకొనిపోయి తానే క్రొత్తవానివలె యంగడివానితో తగవులాడి ధరయితరపుమండీలకంటె యెక్కువగా తీర్మానించును. మండీవాఁడు తనకుగొప్పనష్టము కలిగినట్లు కోపగించుకొని "ఓహో! మంచివాఁడవే! నీవెందుకువచ్చినావోయ్. బాగానేయున్నది బేరముచేసిపెట్టితివి. మాకు లాభములేకుండునట్లుచేసినావు. నీవంటివారలతో బేరముచేసినయెడల మేము దివాలాకావలసినదే! చాలుచాలు. ఈయమ్మవలన మాకు రెండణాలువచ్చునని తలంచితిమి. అదిలేకుండునట్లు నీవుపుణ్యముగట్టుకొంటివి. ఇంతమాత్రముచాలు. నింకబో"మ్మని కంఠశోషచేసితగవులాడుదురు. అటుపళ్లచెప్పి, మైదుపడులగునట్లుకొలిచిన యాబియ్యమును గోతములో వేసిమూటగట్టి యాకూలివానితో "అబ్బా! మూటయెత్తుకొనుము చిన్నంగడివీథికిపోవలయు" నని చెప్పినయెడల వాఁడు మూటనెత్తుకొని బహువేగముగా, యాస్త్రీని కలుసుకొననీయకుండా ముందు నడిచి వెనుకయామె పిలుచుచుండినను నిలువక "రావమ్మా రా! ఆవీథి నేనెఱుంగుదును బరువు నెత్తినపెట్టుకొని నిలువరానిదేమి, నీవు మోయుచున్నగదా తెలియును" అనిచెప్పి బిరబిర చంగాయంగళ్లసందులోదూఱి నిమిషములో మూటతోకూడా మాయమగును. ఈయో

మొఱ్ఱోయని, వానినిగానక కూతలుబెట్టుచూ మరలి మండీయొద్దకు వచ్చి, మనిసిగురుతులు చెప్పియడిగిన, మండీయాసామి కోపగించుకొని, "ఛేష్. నీవుయెవరమ్మా! శుద్ధపయిత్యముఁబట్టిన దానవుగాయున్నావు. ఎవఁడో దారినిబోయెడివానినిపిలుచుకొనివచ్చి బియ్యపుమూటను వానితలపై బెట్టి పిలుచుకొనిపోయి వాఁడేమరించిపోగా యిచ్చటికివచ్చి వానిసమాచారమునుగూర్చి మమ్మడిగెదవేమి? బాగానేయున్నది. పో! పో!" యని బయటఁబంపివేయుదురు. నిజములో యీ మండీవ్యాపారులు దొంగకూలివాండ్రకు సహాయముగాయుండి లోకులనన్యాయముఁజేయించి, వాఁడేమార్చి తెచ్చిన బియ్యములో సగము తాముగైకొని సగము వానికొసంగుచుండుదురు. కాదేని తమవద్దికి కొనుటకై వచ్చినవారికి యోగ్యుఁడైన కూలివానినేర్పాటుచేయవలసినది తమకువిధికాదా? ఇతరులిచ్చుటకంటె వీరుతక్కువధరకు బియ్యమివ్వగలరా? ఇట్లు, దుర్గంధపుకంపును, కొలచుటలో తంత్రమును, వెలలోయన్యాయమును, మొదలయిన యకార్యములు బియ్యపువర్తకులు చేయుచున్నయెడల పేదవారలు బ్రతుకుటెట్లు? చావవలసినదే! ఇట్టివారలను దేవుఁడే విచారింపవలయును.

క. తండులవర్తకులారా!
మండీలకు వచ్చుపేద మనుజుల కడుపుల్
మండింపక దేవుండొక
డుండుటఁదలపోసి మెలఁగుఁ డుచితపుభంగిన్.



# మూర్ మార్కెట్టు విపరీతమైన మోసము.

ఈమూరుమార్కెట్టు చెన్నపురిలో, 'పీపిల్సుపార్కు' అను పేరుగల శృంగారపు తోఁటలో కట్టఁబడియుండు కట్టడము. దీనికి మూర్ దొరగారి పేరుపెట్టి కట్టుటచే, మూర్‌మార్కెట్టని చెప్పుదురు. ఈకట్టడములో, సామానులమ్మియుండు తీరును, మనోజ్ఞాలంకారమును వర్ణించుటకాదిశేషునకైన శక్యముకాదేమోయని తలంచవలసియుండును. సాక్షాత్పరమేశ్వరుఁడే స్వయముగావచ్చినను, అతనికి సయితము గిల్టువేయు పుణ్యాత్ము లిందుగలరు. మాటలాడనేర్చిన కుక్కయైనను మూర్‌మార్కెట్టువ్యాపారులతో మాటలాడుటకుసాధ్యమేకాదనవలయును. ఇంచుక యేమరినచో తలమీఁదఁగుడ్డసయితము మాయమైపోవును. ఎంతచాతుర్యముగలవాఁడైనను, సమర్థుఁడైనను, యీమార్కెట్టుకుపోయినప్పుడు తుదకుదమ్మిడియైనను వారికిసమర్పించి యిల్లు చేరవలయును. అపరాధ కానుక చెల్లింపక తప్పదు. ఒకవేళ నూటికొకఁడెవ్వఁడైన నేమారకవచ్చెనేని వానినంతయో గట్టివాఁడని చెప్పఁదగును. వ్యాపారశాలను ప్రవేశింపగానే వర్తకులు "కమాన్ సార్ సిట్డౌన్ సార్, వాట్ డుయు వాంట్ సార్, దిస్ యీజ్ గుడ్ తింగ్స్ సార్, వెరి ఛీప్ రేట్, సార్ సార్, కమాన్, కమాన్, హియర్" అని యించుకైన తడబాటులేక నోరునొప్పి గలుగునని యైనను కొంచెము నిదానింపక, ఇంగ్లీషుభాషాపాండిత్యములో మహాప్రసిద్ధికెక్కినవారివలె తెలిసియుతెలియనిబట్లరు యింగ్లీషుమాటలతో బిరబిర సామానులపేరులన్నిటిని యొకగుక్కలో చెప్పివేయుదురు. అప్పుడు వస్తువులఁ గొనుటకుపోయినవాఁడు, మార్కెట్టువ్యాపారుల యింగ్లీషుమాటలను విని "ఆహా! ఇట్లు వచ్చియురాని యింగ్లీషు మాటలాడుచున్నారే, వీరు హిందువులుగ యుండియు స్వదేశభాషలయిన, యఱవము, తెలుఁగు వీరికి కలియనే తెలియదా? ఇంగ్లీషువారిచే తయారుచేయబడిన వస్తువులను ముట్టగానే వీరి స్వభావ యంతరించినది కాఁబోలు" నని తలంపవలసియుండును మనలనడుగత్తి యవలఁ బెట్టనీయక కూఁతలు

బెట్టి యూరక పిలుపఁ దొడంగుదురు. ఏవస్తువును తీయుటకిష్టము లేకున్నను వీక్షచేయుచు తొందఱకులోఁబడి విధిలేక యేదైన నొకవస్తువు నెత్తుకొని వెలయడిగిన యెడల, యావస్తువు యొక అణా వెలచేయునదిగా యుండిన, యెనిమిది అణాలు లేక ఆఱుఅణాలును చెప్పి యెత్తిన వస్తువును మరల క్రింద బెట్టనీయక మిగుల నయమైన మాటలు చెప్పి సమ్మతినొందింపఁ బ్రయత్నింపుదురు. వస్తువును తీయువాఁడు భయపడిపోవునట్లు వెంబడి నుండెడి యంగడివాఁడును, వర్తకునికే సహాయముగా మాటలాడును. లాభము లేక వస్తువు నివ్వఁజాలరని యెంచి యాఅణాలు చెప్పిన వస్తువును మూఁడణాలకడిగినచో, యంగడివాఁడు యిష్టము లేనివానివలె సంకోచించి, విసుగుతో "సరి! ఎత్తండి సార్ ఇపుడే యంగడి తెఱచినాను, మొట్టమొదట బేరము. అసలువెలకైనా యివ్వవలసినదని యిచ్చినాను అదియునుగాక మీరు గొప్పవారుగా నున్నారు. మీయిష్టప్రకారముగానే తీసుకొనుఁడు. మఱియొకరికి ధరకివ్వఁజాలను. కొంచెము సేపు మీరు నిలిచి చూచుచుంటిరేని ఇదే మాదిరి వస్తువును మీకండ్లకెదుటనే యర్థరూపాయకు విక్రయించెదను. కానిండు కానిం"డని యాయొక యణా చేయుదానిని మూఁడణాలకిచ్చును. తీసిన వస్తువునకు చాలినంత డబ్బు లేకపోయిన యెడల చేతిగొడుగో, మీఁదిగుడ్డయో, మఱియేదో యొకటి లాగుకొందురు. అవియును లేకయున్న యెడల నోటబట్టరానితిట్లు దిట్టుదురు. ఎంతటి వీరశూర విక్రమార్కుఁడుగానుండినను వీరియొద్ద తనశక్తి యెంతమాత్రమునుం గొఱగాకపోవును. నిమిషములో నంగళ్లవారందఱునుంగూడుకొని యతనిమీఁదికి తగవులాటకు సిద్ధమగుదురు. ఆసమయమున నెవనిజంభమును సాగనే సాగదు సందునదూఱి పాఱిపోవుటయే యుత్తమము లేదేని దెబ్బలు పడక తప్పదు.

క. మూర్ఖాళికెట్టిన ॥ సుంతయు
ధర్మంబను మాటసున్న ॥ తానెవఁడైనన్
కర్మవశంబున బోయిన
మర్మముఁ దెలియంగ లేక ॥ మదివెతనొందున్.



# గడియారముల మోసము.

వెలుపటి యూళ్లజనులు వచ్చినపుడు వారినిచూచి, గడియారముల యంగడివాఁడుగాని, మఱియొకయంగడివాఁడుగాని, యొకఁడు సుమారు రెండురూపాయలు వెలచేయునదియు, బంగారు, లేక వెండి తోఁగిల్టువేయఁబడినదియునైన యొకగడియారమును చేతఁబట్టుకొని ఇతరగ్రామవాసునివలె వేషముధరించి, వచ్చినవారికి యాగడియారమునుచూపుచు "నేనుదూరదేశమువాఁడను ఇచ్చటికొక కార్యార్థముగా వచ్చినాను నాయొద్దనుండిన డబ్బుకర్చువడిపోయినది. ఇపుడు చేతనొక దమ్మిడియైనను లేదు. ఈచెన్నపట్టణములో నెంత డబ్బుతెచ్చినను, నిమిషములోకర్చుపడును. నేనుత్వరితముగా మాయూరికిపోవలసియున్నది. ఇచ్చట నెవ్వరునునాకు తెలిసి చేబదులుగానిచ్చువారు నయినను లేరు. ఏమిచేయవలయును? నాయొద్ద యీగడియారము మాత్రమున్నది. దీనినయినను విక్రయించి డబ్బుతీసుకొని యూరికిఁబోఁదలంచినాను. కాఁబట్టి యమ్మివేసెద"నని బయటియూళ్లవారికి వినునట్లుగా చెప్పుచు వారియొద్దకువచ్చును. వానికి లోనౌశవుకాండ్రైన యంగడివర్తకులాగడియారమున చూచి రు 12లు మొదలు రు 15ల వరకును బేరముఁజేసి రూపాయలు వానికి బలాత్కారముగా నివ్వఁబోవుదురు. వాఁడా రూపాయలు పుచ్చుకొనక వారినిచూచి "ఏమయ్యా! చాలా మోసముగాయున్నదే! మొన్ననే దీనిని రు 50 లకు కలకత్తాలో తీసినాను. ఇచ్చటికివచ్చినాను. నాయవసరమునుబట్టి నేనువిక్రయింపఁదలంచితి. అయినను నింతటి యన్యాయమైన వెలకడుగనచ్చునా? ఈలాగున మీరు మీసొత్తుగాయుండిన యిచ్చివేయుదురా? ఓయబ్బా! చెన్నపట్టణములోని యాసాములు సామాన్యులుగారని చెప్పుదురు. అది నిజముగానేయున్నది. గుమ్మడికాయను కూటిముద్దలో దాచేవారుగా యున్నారే! సరిసరి! మీరడిగిన ధరకివ్వఁజాలను. నాగడియారమును మఱియెవ్వరికైన నిచ్చెదనుగాని యివ్వండి యివ్వండి" యని విసుగుచు కోపముగలవానివలె నభినయింపుచు వారిచేతనుండు తన గడియారమును తీసుకొని మరలును. ఇదియంతయుం జూచుచుండిన యన్యస్థలమువాఁడు మిక్కిలియపేక్షతో తానాగడియారమును చేతికిఁ

తీసికొని దానిని తెఱచిచూచును ఇట్లతఁడు చూచుచుండగా మఱి యొకయంగడివాఁడా గడియారపు స్వంతగానిని పిలుచును. నాలుగైదు మాఱులుపిలుచునంతవఱకును, గడియారముగల యాసామి పోకపిమ్మట కడుబిగువుతో పిలిచిన యంగడివానియొద్దకుపోవును. ఆయంగడివాఁడా గడియారమును రు 20ల వఱకునడిగి వెలహెచ్చించును. అధరకును నివ్వనొల్లనని యాగడియారగాఁడు బయటియూరియాసామి కొసఁగి “అయ్యా! మీకుకావలసియుండిన మొదల వారడిగినదానిపై నింక నైదురూపాయలుచేర్చియిచ్చిదీనినితీసికొనుఁడు. వస్తువుచాలామంచిది. ఆమోసగాండ్రకిచ్చుటకన్న మీకొసంగినపేరైననుండును. ఆలోచింప వలదు. తీసుకొనుండుసారె. మీరీనెంబరుగడియారము నీపట్టణములో తీయనెంచి ఏయినపఁడున రు 60 లకు తక్కువగా యివ్వఁజాలరు. నేనునాయవసరమునుబట్టి యిట్లునష్టమున కమ్ముచున్నాను. జాగ్రతగా వాడుకొనిన మీయొద్దనిది 15 సంవత్సరములు బాగుగాపనిచేయును” అనిబహువినయకరముగా మాటలాడును. బయటియూరివాఁడు తనలో “అన్నివిషయములను తెలిసిన యీయంగళ్లవర్తకులే రు 20ల కడుగుచు న్నారు. ఇతఁడా మొత్తమునకు సయితే యివ్వఁజాలనని నిరాకరించెను. కాఁబట్టి ఇతఁడుచెప్పినట్లు యిది యేబదిరూపాయలకే తీసియుండును. ఇతఁడు పరగ్రామవాసుఁడుగా కనబడుచున్నాఁడు. ఈచెన్నపట్టణపు మోస గాండ్రవంటివాఁడుగా నుండ లేదు. ఏదో యవసరమును బట్టి యమ్ము కొనుచున్నాఁడు. ఇంక నైదురూపాయ లిమ్మనికోరుచున్నాఁడు. కావున యిచ్చి తీసికొనుట యుక్తము” అని తనలోయెంచి వాఁడుకోరిన లాగున నధికముగా నైదురూపాయలునిచ్చి గడియారమును తీసుకొని తానులాభముగల బేరముచేసినందుకై సంతోషంబునొంది పోవును. ఆగడియారము వానియొద్ద రెండుగంటలకాలము నడుచుట మహాకష్ట ము. కొన్నిగంటలలోపల చక్రములుతిరుగక యదిప్రాణములేని శరీరము వలె గానఁబడునదే! కొనినవాఁడు తనకు విక్రయించినవానిని కనిపట్టఁ జాలక తన యవివేకమునకు దుఃఖించి దానిని పారవేయవలసినవాఁడగు

గును. అమ్మినవాఁడు తనకుసహాయముగా బేరముసాగించిన యంగడి వర్తకులకు తమయేర్పాటుప్రకారము కమీషన్ యిచ్చిపోయి మఱియొకవిధముగా వేషమునుధరించి వేఱొకగడియారమును మొదటిదానివంటిదితీసుకొని యింకొకని కెవనికైనను టోపీవేయుటకు బయలుదేరును. "ఓగుణవంతులైనవర్తకులారా! మీమనస్సునకు సరిపడని యెఱింగియు నటువంటిపనినిజేయు మిమ్ము దేవుఁడుమాత్ర మే లిచ్చే యును? మీకుమీరే యోజించి యక్రమప్రవర్తనమును మానిన యెడల కొంతద్ధైనను మేలుగలుగును."

క. గడియారంబులఁ గొనఁగా
గడఁగినవారిట్టివంచకప్రభువులచేఁ
బడక మెలఁగినవారల
నడిగితగినచోట్లుదెలిసి నాయదిఁగొనఁగన్.



## సులోచనములమ్మువారి మోసము.

ఒకఁడు నాలుగణాలువెలచేయుగిల్టుకమ్ములను, అద్దపుపెంకుబిళ్లలును, నందముగానమర్చిన సులోచనములనుచేఁబట్టుకొని ముక్కుటద్దముల వ్యాపారముఁ జేయువానికి సమీపములో నటునిటుండినఱుగుచుండి యచటికెవ్వఁడైననుకొనుటకై వచ్చినయెడల నెచ్చటనుండియో యపుడేవచ్చినవానివలె యంగడివానియొద్దకరుదెంచి తనయొద్దనుండెడి యద్దపుజతనుచూపి "అయ్యా! ఈయద్దములజతను తీసుకొనెదరా? నేను వీనిని విక్రయించఁదలంచినాను" అనిచెప్పును. అంగడివాఁడు చేతఁదీసికొనియటుజూచి, "యివి యేనికమ్మెదవు? మంచిరకముగానే యున్నదే!" యనును. తెచ్చినవాఁడు వ్యాపారస్థునితో "ఇదినాతండ్రి తనకుఁగా చాలాగొప్పవారియొక్క సిఫారసుపై ఇంగ్లాండునుండి తెప్పించుకొన్నాఁడుచూడుము. అసలుస్ఫటికపుబిళ్లలు ఆయన చనిపోయినాఁడు. కావున వీనితో మాకెవ్వరికిని యావశ్యకము లేదు. అందువలన నమ్మివేయఁదలంచినాను. మీకుకావలసియుండిన తీసుకొనుఁడు. బలాత్కారమేమియును లేదు. వస్తువుమంచిదైయుండిన నెవ్వరైననుతీసి

కొందురు. వెలపోదని భయపడవలసినదిలేదు" అని బిగువుగామాట లాడును. అంగడివాఁడు దానిని బాగుగాపరిశోధించువానివలె నటునిటుం ద్రిప్పిత్రిప్పి మరలచూచి తృప్తినొందినట్లునటించి "దీనిని రు 5 లకు యిచ్చినయెడలతీసుకొనెద" నని యడుగును. తెచ్చినవాఁడిష్టపోల్లనని దానినితీసుకొని కొంచెమటుపోగానే కొనుటకై వచ్చియున్నవాడు వాని వెంటబోయి తనకిమ్మనియడుగును తెచ్చినవాఁడతనిఁజూచి "ఏమయ్యా! నాతండ్రిగారు స్వంతమునకుఁగా రు 25లకు తెప్పించినాఁడు. పాపాత్ముఁడైన యీయంగడివాఁడన్యాయపు ధరకుయిమ్మని యడుగుచున్నాఁడు. తనసొమ్ముగాయుండిన యెడల యిటువంటిమేలైనదానిని నలుబదిరూపాయలవెలచెప్పి యుండును. పరులసొత్తును తెగతేరగా కబళింపఁబలంచినాఁడు. వానియొద్ద యిన్నోబిళ్లలున్నవిగదా! దీనితో సమానమైనదాని నొకటిఁ జూపుమనుండు. అటులచూపెనేని నేనీజతను వానికుచితముగాయిచ్చిపోయెద. ఈమూాన్నాక్లెట్టు వ్యాపారముఁ జేయువారు గొప్ప మోసగాండ్రు, మహాదుడుకుగా మాటలాడుదురు" అని మిక్కిలి న్యాయస్థునివలె పలుకును. వానిమాటలు సత్యమనినమ్మి కొనవచ్చినవాఁడా యంగడివాఁడడిగిన ధరకంటె నొకరూపాయయో, రెండోయిచ్చి దానినితీసుకొని తాను సక్కకొమ్ము త్రొక్కివచ్చినట్లుభావించి గొప్పలాభముపొందినవానిలాగు తలంచుకొనిపోవును. అమ్మినవాఁడంగడివానికి కమీషనిచ్చి మఱియొకజతనుబట్టుకొని తిరుగుచుండును. అయ్యో! పాపము! కొన్నవాని కాసొత్తు 4అ దమ్మిడీలకంటె నెక్కువ చేయదని పిమ్మట తెలిసి చింతించును.

కాఁబట్టిజనులారా! వంచకులమాటలు నమ్మకుండు చక్కగాయోజించి ప్రవర్తించుట మంచిది లేనియెడల నష్టమును, వ్యసనమును పొందుదురు.

క. ముక్కద్దము లక్కఅవడి
యొక్కఁడనైనం గొనంగ నేగినచోఁదాఁ
జక్కగనెఱిఁగినవానిని
యొక్కనివెంటఁగొనిపోవు టుచితముచాలన్.

మూడు, రెండు, ఒకటి, యిట్లుచెప్పి బేరము జరిపి యైదు నిమిషము లలో కడపట పదియణాలకో, యెనిమిదణాలకో, ఆరణాలకో, యిచ్చి "దొఱికినవరకును గోవిందా!" యని వచ్చినమట్టుకును పట్టుకొనిపోవుదురు. తీసుకొనిపోయిన వానికాపేనా లక్షణము మఱునటి క్షణమున తెలియును. ఇట్లుచేయుచుండుటచేత "ఊరుఁజెఱిచిన వాఁడొంటెద్దువాఁ"డన్నట్లు వీరివలన నిజమును తెలిసికొనుటకు నయితము కష్టముగాయున్నది. నిజమైన 14 కారెట్లు పేనాలను తీయవలయుననినను, సందేహింపవలసినట్లేర్పడినది. ఈపాలి వ్యాపారము మనదేశమున నెపుడంతరించునో తెలిసినదికాదు. ఎన్నఁడు మనభారతీయులు సుగుణవంతులగుదురోకదా!

క. నానావిధముల ఘోరట
పేనాలనుజూపిచూపి పేదలనిడియె
లైనఁగికురించియొగలకు
వానినివిక్రయముఁ జేయువారినెఱుఁగుడీ!

---

## వేరుశెనగల మూటలు వచ్చినట్లు నటించి చేయు మోసము.

నిళుప్పురము తిరువణ్ణామల మొదలైనచోట్లయందలి రైలుస్టేషనులనుండి యొకప్యాసు అనగా రైల్ స్టేషనులో మనమొప్పగించెడి సామానుల కొసఁగెడి రశీదు ఫారము. దానిని సామానులనప్పగించు స్టేషనులోయిచ్చి యెత్తవలసిన దానినెట్లో దొంగిలించితెచ్చి, దానిలో, మూటలవివరము, తూనిక, చార్జి, పేరు, విలాసము దిగుమతికావలసిన స్టేషను మొదలయినవి వ్రాసుకొని, శనగగింజల వ్యాపారము చేయువారి మండీలకుపోయి తాను 200 మూటలు మేలయిన బాగుగాయెండిన సరకును తెచ్చియున్నట్లుచెప్పి ధరవిచారించును. ఆవంచకుని మాటలనువిని, మండీవర్తకుఁడు మిక్కిలి యాశనొంది యాసరకునంతయుం దానే తీసుకొనునట్లు చెప్పి "అయ్యా! వెలవిషయములో మీరాయిష్టప్రకారము మీరెసింపు ఈయూరిలో వెలవిచారించి దానిపైనొకపావు

నాయొద్ద యెక్కువగా తీసుకొనుఁడు. దానికధికముగా మీరుకోరరా" దనిచెప్పెను. దైన్యముగానడుగుకొనును. వచ్చినవాఁడు కొంచెము యోచించి "సరే! ఆలాగేకానిండు మొత్తముగా మీకేయిచ్చెదను. గాని, నాతోకూడ మఱియొకయాసామి వచ్చియున్నాఁడు. అతనినిపంపి వేసిననేగాని నాసరకు నాయిష్టప్రకారము అమ్ముకొనుటకు వీలుండదు. అతఁడు సి. వి. నాదమునినాయుఁడుమండీ తనకువాడుకచోటనియు నచ్చటసరకునిమ్మనియుఁ జెప్పుచున్నాఁడు. అతఁడు చెప్పినచోట నిచ్చుటకు నాకుసమ్మతిలేదు. మీరుమంచివారుగా కనబడుచున్నారు. ఇది మొదలు నేనుమీయొద్దనే వాడుకనేర్పఱచుకొనఁదలంచినాను. నాతోడును మానుపుకొనవలయును" అనిచెప్పి తానువెంట దోడ్కొనివచ్చి కొంతదూరముగా కూర్చుండబెట్టియున్నవానినిచూచి "అతఁడే నేను చెప్పినమనుష్యుఁడు వానికి రూ 100లు ఇవ్వవలయును. అవియిచ్చిక్లబ్బులో వానికి భోజనముఁ బెట్టించివచ్చెద. ఇదిగో! ప్యాసురశీదు. దీనిని మీయొద్దనుంచుకొనుఁడు పిమ్మటవచ్చి యన్నివిషయములనుమాట్లాడెదను. ఇపుడు నూఱురూపాయలివ్వండి" యని పలుకును. ఆశాపిశాచమావేశించియున్న మండీవర్తకుఁడు తనలో "వీనికిముందుగా రూపాయలడ్వాంసుగయిచ్చితినేని పిమ్మట వెలవిషయములో వీఁడు మనయిష్టము చొప్పున నొప్పుకొనఁగలఁడు. ఇన్నూఱు మూటలు మొత్తముగా యున్నవి. విడువకూడదు. సరకుమంచిదిగా నేయుండు" నని యాలోచించి యారశీదునుతీసుకొని, వానికి నూఱురూపాయలు నిచ్చివేయును. వచ్చినవాఁడా రూపాయలుతీసుకొని తాను కూర్చుండబెట్టివచ్చినవానితోఁగూడి పాఱిపోవును. వర్తకుఁడు సరకుతెచ్చిన యాసామినిఁగానక యొచ్చి నిరీక్షింపవలసినంతకాలమువరకును యెదురుచూచి తానంతట సందేహముతో రయిల్ స్టేషనుకుఁబోయి రసీదుచూపి మూటలనుగూరించివిచారించినయెడల అయ్యో! పాపము! తాను కేసులో చిక్కకొనక తప్పించుకొనివచ్చినచాలును. అదియే గొప్పలాభము చెందినట్లని తోఁచును. "రూపాయలుపోయినఁబోవును కేసులో దగుల్కొనక పోతినేని మంచికాలమనియెంచవలయు" నని తల్లడిల్లి యెట్లోయొకవేళ

తప్పించుకొన్నయెడల "బ్రతికితి దేవుఁడా!" యని యిల్లుచేరును. ఇటువంటిమోసగాండ్రను నమ్మి వ్యాపారముఁ జేసినయెడల బాగుగానే వర్థిల్లుదురు. ఈమాయావాదుల విషయమును జ్ఞాపకమున నుంచుకొన వలయును.

ఆ. వేఱుకనగవస్తు విలుచుటకై తెచ్చి
నాఁడననుచు మోసగాఁడు చెప్పి
నటుల నేవచించి యటనటఁగి కుదిరించి
ధనముఁగొందురెట్టిఁగి కానుమేలు.

---

# సరాబు అంగళ్ల మోసము.

ఎవఁడైననొకఁడు బంగారమునమ్ముటకై సరాబులయంగళ్లకు పోయి చూపినయెడల యాబంగారము నొరగల్లుమీఁద 5 నిమిషముల వరకును మాటలాడుచూ రాచిచూచును. ప్రక్కయంగడివానికి చూపి వన్నెజూడుమనును వాఁడు తీసుకొని తనరాతిపై రాచిచూచును. యిట్లు నలుగురైదుగురు రాచిరాచి చూచెదరు. మఱియొక్కడైనను బంగారు తెచ్చినయెడల దానికి దీటుచూచుటకు నయిగమీఁదబంగారముతో మరల రాచుదురు. దీనినిఁబట్టి యోచింపగా దీటుచూచుటకు సయితము వారి యొద్దబంగారుండదని తలంపవలయును. అంతటితో నిలిచిన చాలు పేచిఁ జేసినట్లే; అటుల రాచిరాచిమైనంతట దానిని ప్రావనముతో నైచి, యెత్తి యెంతవన్నెగలదానినైనను, తక్కువవన్నెయని చెప్పి నిర్ధారణఁ జేసి తక్కువవెలకడిగి 'నరసాయెత్తు క్రయంయింత" యని తీర్మానించు కొని దానినికరఁగి "ఇది వన్నెతక్కువబంగారము మున చెప్పినప్పటి వెలకు తీసినయెడల మాకుగిట్టదు. మఱియెవ్వరికైనను ఇమ్ము. తప్పించియిచ్చినయెడల నేనుతీసుకొనను" నని ధనము దించివేయును. నెల్ల నెక్కించువారేగాని యొసఁగ తీసుకొనవొల్లకుండుదురు. మరియు లేక వానికేయివ్వఁదలంచినచో,తూనికవేయుటలో స్వారామోసముఁ జేయు దురు. వారియొద్ద తీయునపుడుపయోగించు నగయు, నిచ్చునపుడు నుపయోగించునదియు రెండువిధములైన పడికట్లుందును. తమకనుకూల

మైనదానినివేసి తూచి చిల్లరగా గురిగింజలయెత్తు తక్కు తేలినయెడల దానిని త్రోసివేసి లెక్కఁజెప్పుదురు ఇవ్వవలసినట్లేర్పడినడబ్బులో 1అణా 2అణాలు ధర్మకర్చులకని పట్టుకొని మిగతనిచ్చివేయుదురు. తమకు జిక్కినవానిని వాహూరకపోనివ్వరు. "తనకొకతూనికయు దారుబోఁతులకొక తూనికయు" ననుట వీరియందు తెలియవచ్చును.

క. తెలివిచెడిపైడినిసరా
బులయొద్దకు విక్రయింపఁగ బోయినవారల్,
బలుమోసగించినగబాల్
నెలఁకువతో సంగ్రహించి కె నొప్పింతురొరున్.



# బంగారునగలు చేయువారి మోసము.

బంగారుపనివారికి పాపభీతియున్నదా? తల్లి తాలిబొట్టులోనను తస్కరింపకమానరు. ఈరకమువారు మనతో నెంతటి యన్యోన్య మైత్రి కలిగియుండినను, తాముచేయు పొడిఁబెట్టుటపనిని విడువనే విడువరు. వీరియొద్దకుపోయినపు డెంతటి జగజ్జాలతంత్రజ్ఞుఁడయినను నేమరి పోవలసినదే! తప్పదు. వీరును సరాబులవలె రెండువిధముల పడికట్లు పెట్టుకొని మోసగింతురు. చేరికాపులు చేయుటకై మనము బంగారమునిచ్చి దగ్గఱఁగూర్చుండి కరఁగించినయెడల ఆకరఁగుచున్న బంగారుపై సీసకారుతో మాటిమాటికిని వక్షఃపొట్టును యెత్తివేయుచు కలియబెట్టుచున్నట్టుండి రెండుమూడుసార్లా పొట్టుతోఁగూడా సీసకారుతో బంగారునుకూడా తొత్తుకొని యాకారును కుంపటిలోఁగ్రుచ్చి మిగిలినదియెత్తి కడ్డీగాఁబోసితూచియిచ్చెదరు. ఇంతపనియు నొకనిమిషములోనై పోవును. కంసాలులు మొదలుగాగల యీబంగారపు పనివారియొద్ద కొంచెము యెక్కువగా నగలుచేరియున్నపక్షమున తామా స్థానమునువిడిచి మాయమైపోవుటయుంగలదు. చేరిగాజు (కాపు)లుచేసి వాగికడ్డీని దూర్చుటకు పూర్వము తూనికవేసి యెత్తు యింత బంగారమని ఆసామికిచూపునపుడు ముందే యాబంగారపు గొట్టమునకు లోతట్టున నాముదము నుపూసిపెట్టుదురు. అందువలన యెక్కువతూనిక తేలును. ఈవిషయము

నగలవానికి తెలియనే తెలియదు. మేలైన బంగారమునిచ్చినయెడల వారియబ్బమీఁద యాన పెట్టిచెప్పెదను. వరహాయెత్తు బంగారములో 4 గురిగింజలయెత్తైనను యిత్తడినికలుపక మానరు. అటులకలిపి ఆయెత్తు మంచిబంగారమును తాముపరిగ్రహింతురు. ఈరీతిగా లోకుల నన్యాయముగా మోసగించి దానిని కొనిపోయి సారాయియంగడికో, కల్లుదుకాణమునకో, లేక తత్కాలదయాపరవస్తుశాలలైన కాఫీక్లబ్బునకో, దినదినమును కిస్తికట్టినచ్చుచుందురు. సర్కారుకిస్తైనను నొకనాఁడుగడువుదొరకును గాని సారాయి కల్లంగళ్లకొకగంటయైనను తడవుచేసిన ప్రాణము మీఁదికివచ్చును. ఇట్టి మహావంచకులైన దుండగీండ్రచేతఁ జిక్కినయెడల యమునిచేఁ జిక్కినట్లే! ముద్దుపెట్టి తియ్యని తినుబండమును తీవరముగాతీసుకొనుటకు ఆటంక మేమిగలదు? అకటకటా! వీరికి భయపడియే పరమానందస్వరూపుఁడైన పరమేశ్వరుఁడు బంగారపునగలుధరించుటనువిడిచి పాముల నాభరణముగా ధరించఁదొడంగెనుకాఁబోలు, "కంసాలిజిత్తు లంగడిలోను, చాకలివానిజిత్తు చారిలోను" నన్న సామెత వీరిజిత్తులవలననే కలిగియుండును. మొదట నగసాలజిత్తును చదివినాము. వెనుక చాకలివానిజిత్తు రాబోవుచున్నది. గమనించియుండుఁడు. గమనించియుండుఁడు.

గీ. పసిడిఁగొనిపోయి యగసాలిపాలుఁజేసి
బదులువాఁడిచ్చు తక్కువపైఁడిఁదెచ్చి
నష్టమొందుదురెఱుఁగక నగలుచేసి
యొసఁగినదిచాలుననిలోకు లసలుగనక.



# వడ్డికి డబ్బునిచ్చువారు చేయు మోసము.



మనయిండ్లలోనుండు ముసలమ్మలుకొందఱును, చేయిదిరిగిన నేర్పఱికత్తెలుకొందఱును, అత్తకు మామకు మొగళ్లకు మఱియు నింటఁగల యితరులకును తెలియనిలాగున వస్తువులను దొంగతనముగా నొరులకొకటి సగముగావిలిచి, తానునుతినక మనసార పరులకును యివ్వక డబ్బునుకూడబెట్టి యుంచెదరు. ఆడబ్బును వడ్డీలకెవ్వరికైన నిచ్చి వృద్ధిచేయవలయుననెడి యపేక్షగలవారై రహస్యముగా స్వయముగానో, లేక దీనికిగాయుండు తరగరి యాడంగులమూలముగానో, వడ్డికి యెవ్వారికేనియు నిచ్చుటగలదు. మొదట మొదట కొంచెముగా పయికమునిచ్చి దానివలన వచ్చువడ్డియు, వరవు, రాశి, చూచి యధికముగా యివ్వనారంభింతురు కొన్నిసమయములలో, తరగరికత్తెలకు కమీషను రహస్యముగా యేర్పఱచుకొని కొందఱు మోసకత్తెలయిన స్త్రీలు బంగారునగలును, వానివలెనేయుండు గిల్టునగలునుం గుదువ యుంచి ద్రవ్యమును తీసికొనిపోవుదురు. ఇదియంతయుం బరమరహస్య వ్యాపారమగుటచే నగలు మంచివో, కావో, యని చూచుకొనుటకు నయితము వారికి వలనుగాకయుండును. తరగరిమాటలే వారికి వేదవాక్యములు. చాలాకాలమువరకును నగలుతీసుకొని డబ్బునివ్వక దినములు జరిగినంతట తమయొద్ద కుదువపెట్టిన మనిషి పేరును, అడయాళమును, చెప్పి యక్కప్రక్కముల యిండ్లలో విచారింతురు. ఇప్పుడు, నడుము లోనుండినది నడినెత్తికెక్కును. ఆనగలలో కొన్ని, దొంగిలించి తెచ్చినవిగాయుండి పోలీసుల పరముగావలసిన దుర్దశయును తటస్థించును. "గిల్టునగలుదీసి, నల్లిగిలించినది. వడ్డికి డబ్బునిచ్చినదుష్టులేదు ఘుష్న లేదు" అనెడి పాటకుగుఱియై తమధనమును పోగొట్టుకొని యిగిలింతురు. అత్త, మామ, వదినె, మరది, మగఁడు, మొదలగువారి కిటువంటి స్త్రీలపై తమకు గలిగియున్నప్రియమును విడుతురు. దురాశయు

అని బెదరించును. మఱియొకఁడంతలో దారినిఁబోవువానివలెవచ్చి వారువివాదపడుచున్నచోటనిలిచి యావృత్తాంతమును విచారించును.

చూచినవాఁడు:—"అయ్యా! బంగారుకడ్డీయొకటి యీయమ్మ యిచ్చటఁబడియుండగాచూచి తీసికొనెను. నేనును చూచి దానికొఱకై వచ్చుటకుముందే యీమెయెత్తుకొన్నది. దానిలో నాకున్యాయభాగము యివ్వవలయును. అదిసుమారు 80రూపాయలు మతింపుచేయఁదగినది. ఇంచుమించుగా నాఱుపానులుండుననుకొంటిని అంతటికితగ్గదు. న్యాయముగా నాకుదానిలో భాగముపంచియివ్వదేని నేనువిడువను. పోలీసువారికి చెప్పియొప్పగించెదను" అనును.

మధ్యస్థుఁడు:—"ఉండవయ్యా! బహుతొందఱకాఁడవు నాత్రగాఁడవునుగా యున్నావు. కొంచెము తాలిమితో మాట్లాడుము. పోలీసులో చెప్పిన పక్షమున నేమిఫలము? చెప్పుమయ్యా! సమాధానము. త్వరపడెదవు. ఏదో యొకవిధముగా మీరిరువురును సమాధానముగా తీర్మానంచేసికొనిపోక, పోలీసఁట, యొప్పగించుట యఁట, పాపము! ఈయమ్మ యెవ్వరోగాని మంచియోగ్యురాలుగా కనఁబడుచున్నది. నేను శీఘ్రముగా పోవలయును. నీవీమెను తొందఱపెట్టుటచూచినంతట పోవుటకు కాళ్లురాలేదు. స్త్రీలను తొందఱపెట్టకూడదు. త్వరితముగా నెట్లోయొకలాగున నాయెదుటనే తీర్మానమును చేసికొనుఁడు. నేను మందలయుండి మీతగరారుతీర్చిపోయెద" "ఏదీ? అమ్మా! నీకు దొఱకిన యాబంగారమును చూపుము?" అని దాని నామెయొద్దనుండి చేతికితీసికొని బాగా త్రిప్పిత్రిప్పిచూచి యామెను కొంచెము యెడముగాపిలుచుకొనిపోయి "అమ్మా! ఈకడ్డీ నెవరో పోగొట్టుకొన్నారోగాని నీకుప్రాప్తమున్నందున దొఱకినది. బంగారు [illegible] గలది నాబుద్ధికి నూఱురూపాయలు వెలచేయునని తోఁచుచున్నది. పాపము! నేనువానితో నీకుగామాటలాడెదను. "పొంతులనుచూచిన భూతములుకూడా భ్రమించు" నని సామెతగలదుగదా! నీవు తెలియని యాఁడుదానవుగానున్నావు. నేను ధరనుతగ్గించి మతింపుచెప్పి వానిని [illegible] తీసుకొవలసినదనియు [illegible] గప్పుచుబుచ్చి కడ్డీని తీసుకొనిపోవ [illegible] జెప్పెద. ఒకవేళ వాఁడునీకిచ్చుటకు తనయొద్ద ధనములేకున్నయెడల వానిభాగమునకు నీవుకట్టియివ్వవలసిన దానికి

నేనొకమాదిరిగా యేర్పాటుచేసెద. ఈరెండువిధములలో మరియొక విధము ననుసరింపవలయును. లేకున్న కడ్డీని వాండుకొనిపోవునుగాని విడిచిపెట్టండు. కాదేని పోలీసువారితోనైనా చెప్పును. పోలీసుకు పోయినచో యొకవేళ దొంగకేసు క్రిందిచార్జిచేసినను చేయుదురు. పిమ్మట చాలాకష్టమును నష్టమును కలుగును. నీవేమియుం బలుకకుండుము. నేనే తీర్మానముచేసి నిన్నుపంపెదను" అని రహస్యముగాచెప్పి మరలి చూచిన వానియొద్దకువచ్చి "అయ్యా! నేను బాగుగా చూచినాను. ఇది నీవుచెప్పినంత వెలచేయదు. 50 రూపాయలు మతింపు తక్కువగా నుండదు. కాబట్టి యీమెకు దానిలోసగము రు 25 లు యిచ్చి కడ్డీని తీసుకొనిపొండు. ఇంకవృథాగా తగాదాపడవలదు. నేనాలోచించి పక్షపాతములేక న్యాయముగాచెప్పినాను"అని తీర్మానముచెప్పెను. చూచిన వాండు కొంచెము సమ్మతింపనివానివలెనటించి "సరే! పెద్దమనుష్యులుచెప్పినట్లు వినకపోవుటమంచిదికాదు. అలాగే యిచ్చెదనుగాని నా యిల్లు కోడంబాకములోనున్నది. ఈమెను నావెంట రమ్మనిచెప్పుము. తోడ్కొనిపోయి రూపాయలనిచ్చిపంపెద" ననును. మధ్యస్థుండు వానిమాటలకు సమ్మతింపక—"ఏమయ్యా! అక్రమముగాయున్నది. ఒక యాడుమనిషి యేమి? నీవెంటరావడమేమి? అటులవచ్చుటకువీలుగాదు" అనును. ఇంతలో యాస్త్రీ మధ్యస్థునితో "అలాగైతే నాయిల్లు తండియారుపేటలోయున్నది. ఇతనినచ్చటికి నాతోకూడారమ్మనండి. ఇతనికి రూపాయలిచ్చి కడ్డీనేనేపుచ్చుకొంటాను" అనిచెప్పును. మధ్యస్థుండామె మాటలనంగీకరించినవానివలె "ఔనౌను. ఈమెచెప్పినది బాగానేయున్నది. ఏమయ్యా! ఈమెతోకూడా పోయి నీభాగము రూపాయలుపుచ్చుకొనెదవా?" యనును. దానికివాండొప్పుకొనక "సరే! సరే! బాగుగానే యున్నది. ఈమెమాత్రము రాకూడదంట. నేనుపోవలయునంట నాకేమియుం బనిలేదని యభిప్రాయము కాంబోలు. ఇచ్చట నాపక్షముగా మాట్లాడువారెవ్వరును లేనందున తోంచినట్లంతయుం జెప్పుచున్నారు. చాలు చాలు ఎదీ? కడ్డీని యివ్వండి? కొనిపోయి పోలీసులో యొప్పగించెదను. పిమ్మట యెట్లు కావలసియుంటే యట్లుజరుగంగలదు" అని కడుబిగువుగా బలుకును. మధ్యస్థుండైయున్నవాండు వానినిం జూచి "తాళుమయ్యా! తొందరపడె

దన్న. కొంచెము శాంతమును వహింపు" మని యామెను మరల దూరముగా పిలుచుకొనిపోయి "ఇట్లు వృథాగా కాలహరణముఁ జేయుట మంచిదికాదు. మఱి యెవరైనావచ్చి రేని యీరహస్యము బయలుపడును. ఊరకుంటే కాదు. నీయొద్ద నేమైనా? యున్నదా?"యని యడుగును. ఆమె "ఆ! నావద్దనా? రెండురూపాలుమాత్రమే యున్నవి" యనిన "సరి! అవియుండనిమ్ము గాని, నీచెవులలోనుండు కమ్మలుమతింపునేసి వానికిచ్చివేయుము. బంగారుకడ్డిని వానికివ్వవలదు. నీవేతీసికొనిపొమ్ము. నేఁడునీకు మంచియదృష్టముకలిగినది, నేను చెప్పినట్లుచేయు" మని చెప్పుచునేవచ్చి, "అబ్బా! ఈమెయొద్ద ఇపుడుడబ్బు లేదు. ఇదిగో! ఈమెకమ్మలున్నవి. వీనిని నీకు చేరవలసిన రూపాయలకు చెల్లుగాతీసుకొనిపొమ్ము. ఈకమ్మలు 10 వరహాలు, లేక 8 వరహాలకు తక్కువగాక వెలచేయును" అని యామెనుచూచి "అమ్మా! ఏవీ? యాకమ్మలుతీసి నాచేతికిమ్ము?" అని పలుకును. చూచినవాఁడు "ఆహా! ఇదిమంచిమధ్యస్థమయ్యా! బేష్ బేష్. మధ్యస్థమనిన ఇట్లుండవలయును. నే నిచ్చినట్లైతే రూపాయలు ఇరువదియైదు రొక్కముగా యివ్వవలయును. మీరిచ్చునట్లైన పదిరూపాయలు వెలచేయు పొట్టకమ్మలిచ్చి నూరురూపాయల బంగారును తట్టుకొనిపోవలసినది కాఁబోలు. మంచిదే! ఇది బహు యోగ్యమైన మధ్యస్థము" అని నిరాకరించి మాట్లాడును ఇంతలో మధ్యస్థుఁడామెకమ్మలుతీయించి చేతబట్టుకొని "అమ్మా! రెండురూపాయలున్నవంటివే. ఏవీ? అవి యిట్లిమ్ము?" అని యడిగిపుచ్చుకొని కమ్మలును రూపాయలును వానిచేతఁబెట్టి వానితో "అబ్బా! వ్యర్థముగా పెటపెట మాట్లాడవలదు. నేను చెప్పెడిమాటలు వినుము. ఎవరైననేమి పాపము! ఆడమనిషి. ఇవి తీసుకొని నామాటకు బదులుచెప్పకపొమ్ము. ఈమెను చిక్కులుపెట్టుట మంచిదికాదు. నలుగురికిం దెలిసిన యెడల సంకటముగలుగును. పోలీసువారికి తెలిసి పట్టుకొనిన యేడ్పింతురు. వృథాగా యీసొత్తుమీకిరువురకును లేకపోవును. కష్టపడుదురు." అని రెండుచేతులునుం బట్టుకొని బతిమాలుకొనును. వాఁడు మిక్కిలి వినుగుతో కమ్మలును రూపాయలునుంబుచ్చుకొని "సరి! ఇది నాదుర్బలము. సహాయులులేకపోయినారు" అని గొణుగుచు వెడలిపోవును.

మధ్యస్థముచేసినవాఁడామెను పంపివేసి, తానెచ్చటికో పోవువానివలె కొంచెముదూరముపోయి తనసంగడికాండ్రతోఁ జేరును. అంతట వారని దీసుకొని తమకుల దేవతయైన సారాయియుండుదివ్యభవనమునకుపోయి నిత్యకానుకనుచెల్లించి మహోత్సాహముతోఁ బోవుదురు. పూసాయలును కమ్మలును సమర్పించినకడ్డినితీసుకొనిపోయిన యామెయన్ననో, యధికసంతోషముతో, యేపనియునుగమనింపక దానినెచ్చటనైన నితరులకెఱుంగరానట్లు కుండలలోఁదాచి మాటిమాటికినివచ్చి దాని నెత్తిచూచుటయు, దాచుటయు, నిట్లే కాలము జరుపుచుండును. "ఇంగితములేనిదానికి బంగారుదొరికితే పగలు రాత్రియు పట్టిచూడడమే!" యనునట్లామెతగా, యెవ్వరితోడను జెప్పక కడ్డినిమాత్రమప్పుడప్పుడు తానితానిచూచుచు, వారివారిని మురుగులుచేయుటకును, గొలుసులుచేయుటకును, బంగారెంతపట్టునదియుం, కూలియెంతయైనదియును విచారింపుచుండును. బంగారునుచూపుమని ఎవరేనియు నడిగినచో దృష్టిదోషముకలుగునని చూపనేచూపకుండును. తుదకు సంతోషముహెచ్చయించి తనకు తానుగానే తెచ్చి రహస్యముగా యెవ్వరికైనను చూపును. బుద్ధిమంతులైనవారా కడ్డీనిచూచి గిల్టువేసిన యిత్తడికడ్డీయగుటఁదెలిసికొని, పరిహాసింపగా, కన్నవారెల్లరును గేలిసేయగా, సదియిత్తడియని స్పష్టపడుటయు, సిగ్గును, దుఃఖమును నతిశయింపగా, మనిగుచచ్చి దానివలె మూలగూర్చుండి యేడ్చును. ఎంతటిబుద్ధిశాలులుగాయుండినను పైనచెప్పినట్టి మోసము నెఱుంగఁజాలక యేమఱిపోవుదురు. కావుననట్టివారలారా! ఇట్టిసందర్భములలో జాగ్రతగాయుండుట మంచిది:—

ఆ. మోసగాండ్రుగిల్టుఁ జేసియిత్తడి
తునకతెచ్చినైచి కనకమనుచు
వాదులాడిధనము వంచించికొందురు
వారిచేతఁజిక్క వలదుసుమ్ము.

——

# కుట్టుపనివాని మోసము.



కుట్టుపనివానియంగడిలో గుడ్డనుయిచ్చి కుట్టియిమ్మనిన దాని లోనేదో యొక భిన్నమును పెట్టక మానరు. ఒకగజముగుడ్డలో పాతికగజమైనను దొంగిలించి యెట్లోచాలినంజాలక కత్తిరించి, కొలతకు సరిగానో యించుక తక్కువగానో కుట్టి మన నెత్తిన వేయుదురు. ఒకవేళ మనము "ఇదేమి? చాలకుండాయున్నదే!" యని యడిగిన "ఇప్పుడిట్లే యుండినను చలువచేసినంతట సాగి సరిగావచ్చును" అని సమాధానము చెప్పెదరు. పాతగిలి చిరిగిన నూలును పెట్టి తమకిష్టమువచ్చినట్లు కుట్లు దగ్గరగానో దూరదూరముగానో కుట్టుదురు. వీళ్లును, బంగారుపనివాండ్రును వడ్ల, కమ్మర, కంచర, మొదలైన పనులు చేయువారి వలెనే, దినములో, వారములో, నెలలో, సంవత్సరములో, తాముకుట్టి యిచ్చుటకు గడువుచెప్పుటగలదు. అయితే సాధారణముగా దినముల లెక్కయుండదనియే చెప్పవలయును. గుడ్డనెవ్వరైనా యిమ్మని తొందరపెట్టినచో మనమివ్వగానే చించికత్తిరించి పెట్టిన తునుకలను మూటగట్టి తీసుకొని పొమ్మని చెప్పుదురు. అటుల చింపినదానిని గొనిపోవుటకు మనకుమనసుండదు. ఒకవేళ తీసుకొనిపోయినను, నొకడుచించినగుడ్డను మరియొకడు కుట్టనొల్లడు. వారిలో నిట్టికట్టుబాటొకటి కలదని చెప్పెదరు. కాబట్టియే యిచ్చినతోడనే యందుకొంత దొంగిలించి మిగతను తనయిష్టముభంగిని కత్తిరించిపెట్టును. మనమిచ్చిన కొలత ప్రకారము మరల తునుకలనింకొకనిచే కుట్టించుటయును సాధ్యముకానేరదు. వీరిలో నొకరివంచకతనము నొకరు బయలుపరచవలసివచ్చునను తలంపుతో, "మేమొకరు చింపినగుడ్డను మరియొకరముకుట్టనొల్లము" అని గౌరవముగా చెప్పుకొందురుకాని, నిజమేమియునుగాదు. కొన్నిసమయముల లో కూలి నిర్ణయముగా యేర్పాటుచేసుకొనక వచ్చినయెడల కుట్టినకాగానే వారడిగినంతయుంగూలి యిచ్చితీరవలసినదే! ఇవ్వనియెడల బిరబిరకుట్టినకుట్లు విప్పివేయుదురు. కష్టపడి డబ్బుసంపాదించి కొన్నగుడ్డను చెడగొట్టుకొనుట కెవనికైనను సమ్మతమై యుండునా? వారడిగి

నంతయు నివ్వవలసినక్లేవచ్చును. ఈకుట్రపువాండ్రు సామాన్యమైన యాసాములని తలంపకూడదు. మాటలాడునపుడు కడునెమ్మదిగాను న్యాయముగాను సంభాషించి పనివిషయములో తమచాతుర్యముం జూపుదురు. కావున వీరిపట్ల చాలాంజాగ్రతగా ప్రవర్తింపవలసి యుండును.

గీ. మాయకుట్రపువారి నమ్మంగరాదు
పత్త్రములగుట్టనొసఁగిన నానిఁజాల
చిక్కులనుబెట్టియలయించి టక్కుఁజేసి
సొమ్ముదోంగిలిపోవును గోపకవిషయ.

---

## చెప్పులమ్మువారి మోసము.

కూజలీయంగళ్లు, చైనాబజారు, మూర్మార్కెట్టు మొదలగుస్థలములలో ప్రతిదినమును, సాయంకాలమున, పలురకముల చెప్పులజోళ్లను తీసుకొనివచ్చి "చెప్పులయ్యా! చెప్పులు జోడయ్యా! జోడు" అని గొంతెత్తి యఱచుచుండు మాదిగవాండ్రు పెక్కండ్రు యిటునటుం దిరుగుచుందురు. ఆ చెప్పులన్నో ప్రాతవి కొలుసంపాదించి క్రొత్తముగా కనంబడుటకై బంకమన్నుపూసి పయినిమీఁదను లోపల పెట్టినమట్టి కనబడకుండునట్లాగున నేస్పుతో కుట్టి దానికి పాలిష్‌వేసి, తళుకుగా పెట్టుకొని, మాటిమాటికిని తుడుచుచు, చేతబట్టుకొని యందఱకుం గనపఱచుచుండుదురు. ఎవండైనను చూచి భ్రమించి బేరముచేసినయెడల నది నాలుగణాలు సయితము తాళనిజోడుగాయుండినను రెండో, రెండున్నరయో రూపాయలువెలచెప్పి "అయ్యా! ఇదిమేలైన క్రోంచర్మముతో కుట్టినది నాలుగుసంవత్సరములు చెక్కుచెదరకుండును. యీరకము జోడి దియొకటియే యున్నది. మీకు కాలతసరిపోవు" నని చెప్పుదురు. కొనందలంచినవాండు తక్కువవెలకడిగి, తనకు దానిపైంటి యెక్కువనక్కఱ వలదని ఖండితముగాచెప్పినయెడల, సమయానుసారము "వచ్చినదిగాబట్టు వల్లకాటిరాముండా!" యన్నట్లు దొరకినమట్టుకును చేతవేసుకొని పోవుదురు. కొనినవాండా చెప్పులు వేఖువేఖుతునుకలుగా విడిపోయి యుపయోగము లేకపోయి పాఱవేయును. ఇందు పేదవారుగానుండు

మాదిగలు కొంచెము చిన్నమోసములుచేసినను చేయుదురుగాని, డబ్బుగలమాదిగవాండ్రు తమగౌరవమునకు లోటుగలుగకుండుటకై, పెద్దపెద్దమోసములనేచేయుచు, సంపాదించుచుండెదరు. వీరితంత్రము గొప్పది

ఆ. చెప్పులమ్మువారి తప్పుమాటలునమ్మి
మోసపోయిజోడు దీసుకొనక
బాగుగాగదానిఁ బరిశీలనముఁజేసి
కొనుఁడుదారబోసు కొనకడబ్బు.



# రంకులాడులు చేయు మోసము.

కొన్నవానినివిడిచి కన్నవానినెల్లనుం దడవుచుండెడి కొందఱు బుద్ధిలేనిరంకులమారిగాడిదలుసాయంకాలము సుమారు 7,8గంటలైన తరువాత చాలాయంతస్థుగల మంచికుటుంబములోపుట్టిన జవ్వానులవలె కొంచెము మేలై కనుపడుచీరెయు రవికయుధరించి, గిల్టునగలు పెట్టుకొని రస్తాలలో నొకప్రక్కగా కడునడకువతో పోవుదురు. మింటనుండు చుక్కలను, తలలోనివెండ్రుకలను లెక్కపెట్టినను పెట్టవచ్చునుగాని, ఈలాటిస్త్రీలతో కూడినపురుషులను లెక్కఁబెట్టతరముగాదు. ఉత్తమపత్నికి యొకరా, యిద్దరా? గణితముచేయు చిత్రపుత్రునడిగినను, వీరిపురుషులనులెక్కించి చెప్పజాలక తడబాటునొందును. ఇటువంటి మహాగుణవంతులు తామొంటిగా నడివీధిలోపోవుచుండచూచిన కోడెకాండ్రువెనుదగిలిపోవుచుందురు. అటులపోయినవారిలో నెవ్వఁడైనను, తానూరకుండక "అమ్మా! ఎక్కడికిపోవుచున్నారు? ఒంటిగా వెళ్లుచున్నారే!" యనిమఱియాదగామాటలాడును. అవుడదిమృదువుగా

స్త్రీ—మీరెక్కడికిపోవవలయును?

మగవాఁడు—ఏమీ? నేనురాయపేటకు పోవలయును.

స్త్రీ—ఆలాగా? మంచిది. నేను మైలాపూరికి పోవలయును. అబ్బా! యొంటరిగాపోవుటకు భయముగాయున్నది. రాయపేటను దాటిన, పిమ్మట మైలాపూరికిపోవుటలో భయములేదు. "జనములు నడమాడుచుండుదురుకదా!"యని యెంచివచ్చినాను—అనిచెప్పును.

ఆపురుషుఁడు దానిని పిలుచుటకును మాటలాడుటకును, నెవరైనం జూతురని సంకోచించి, భయపడి, దొంగకు తెలుగుట్టిన విధముగా గుక్కురు మిక్కురుమనక నిర్విణ్ణుఁడై నిలుచును. ఒకవేళ నెవఁడైనను, కొంచెము ధైర్యశాలిగాయుండి దగ్గఱకుపోయి "ఏమీ? నాయొద్ద రూకలుపుచ్చుకొని మరలయివ్వకవచ్చినావు. నారూకలుయిచ్చి వేయు" మనియడిగెనేని, "అయ్యో! ఇదియేమయ్యా! ఇతఁడెవరు? అన్యాయముగా నన్నుబలాత్కరింపవచ్చినాఁడు. రవ్వఁజెండి తోండఱి పెట్టుచున్నాఁడు. కుయ్యో! మొఱ్ఱో" యని కూతలుబెట్టి జనులనుజేర్చి నేరము మోపి యాపురుషుని తగులుపఱచుటయునుంగలదు. ఇటువంటి దొంగరంకుముండలబ్రతుకు యేసీమలోచూచినను ప్రబలముగా వృద్ధియగుచున్నది. ఈకలియుగములో వీరికితోడుబోయిన సోమరిపోతులైన దుర్మార్గపు పురుషులును పెక్కండ్రుకలరు. వీరికిని వారికిని జతసరిపోయినది. ఇట్టిచెట్టగుణముగల స్త్రీలపొంతకరుగక మెలంగుట క్షేమకరము.

ఆ. రంకులాడులాడు రీ బొంకులువినిలొంగి
యాసఁజెందినమ్మి రీ నర్పణంబుఁ
జేసిఫలములేక రీ చింతతోపండ్లిగి
లించుపురుషులిదిద రీ లంచుకొనుఁడు.



# వేశ్యల మోసము.

వేశ్యాజాతిలో జన్మించినవారు "భగవంతునకు మేమే సేవఁజేయవలసినవారము. దేవాలయములలో నెక్కువగా స్వాతంత్ర్యముఁగలవారమును మేమే! మేమే దేవునికిఁ బ్రియుల" మని దేవుని పేరుఁ జెప్పి దేవాలయములకు ముద్రవేయించుకొనెడివాడుకకలదు. సాధారణముగా నెల్లచోటులనిట్లు జరుగుచుండుటను మనము చూచుచున్నారము. ఇటువంటివారు బ్రతుకలేక తమ్మాశ్రయించియుండునట్టియు ధాఘుపనిచేయుటయందు చాతుర్యముఁగలిగి యారితేరినట్టియు మనుష్యులమూలముగా, నెవ్వనినైన ధనికుఁడుగాయున్నవానిని బహులాఘవముతో తమవలలో వేసికొని, వానితలఁదడవి, వాని తెలివితేటలు పూజ్యమగునట్లు చేయుదురు. "ప్రియనాయకా! మనోహరా!" యని మహాప్రియముగలవారివలె బిలుచుచు మాటిమాటికిని తమచేఁజిక్కుకొనినవానికి, మోహమును, తమపై కూరిమియు నతిశయింప నటించి పెదవితో పెదవిఁ గదియించి ముద్దులొసంగియు ముద్దుఁబెట్టుకొనియుం జొక్కించి, "మోహనాంగా! నిమిషకాలమైనను నేను నిన్నెడబాసియుండఁజాలను. ఎప్పుడైన నటుల సంభవించెనా? నా ప్రాణములుపోవును. ఈమాట నెప్పుడును నీవు మరువవలదు. నా దేహమును, ప్రాణములును, నాకుగలిగినయాస్తి సర్వమును ఈమూఁటను నీకు మనఃపూర్వకముగా దత్తముఁజేసితి. ఏమోసని తలంచెదవు కాఁబోలు. దేవునిసాక్షిగా నీపాదములు సాక్షిగా యీమాటసత్యమసత్య" మని శిరమున చేయినిడి బాసలుచేసి నమ్మింతురు. గాని యదియంతయు మాయాజాలమగుట నతఁడు కడపట తెలిసికొనును—ఇంత మాత్రమేకాదు. ఒకవేళ నేదేనియుం గొంచెమసంపర్కము తటస్థించియుంటచే యాలస్యముగావచ్చినయెడల, వచ్చెడిసడిం దెలిసికొని పడకటింటమంచముపైఁబడి కడుదీనముగా నేడ్చుచుండును. ఇంటిలోనికి రాగానే మెల్లగాఁదలయెత్తి క్రీగంటఁజూచి దిగ్గున లేచివచ్చి పైఁబడి కౌఁగిలించి కన్నులనీరు కాలువలై పాఱగా వెక్కివెక్కి యేడ్చుచు, వానికి తమయందు కనికరమతిశయించునట్లు నటింతురు. అట్లేడ్చుటఁజూచి వారినుంచుకొనియుండు పురుషులు లాలించి ముద్దిడుకొని మిక్కిలి కూరిమితో

"ఏమీ? ఇట్లుండుటకు కారణమెయ్యది? ఏడ్చుచుండెదవేమిటికి? ఎవరే మనిరి? ఏమి కావలయును?" అనియడిగిన యెడల జాలిమించులాగున నతి దీనముగ గద్గదస్వరముతో "ఇంతతడవు నీవు రాకుండుట కేమి కారణము? నిన్ను చూడకయుండ లేనని ముందే చెప్పియుండ లేదా? ఆమాట నపుడే మఱచితివి కాబోలు. ఔను? పురుషుల కెప్పటిమాట లపుడే! పిమ్మట వారుమఱచిపోదురు. ఈపాపపుస్త్రీజాతికి మాత్రము వారివలె మనస్సు దృఢముగాయుండదు. తాము వలచిన వానికి హృదయపూర్వకముగా తమశరీరమునర్పించి యతనితోడిదియ లోకంబని నమ్మి, యెల్లపుడుందమ ప్రియుని నీడ బాయజాలక తపించుచుందురు. మామానసము వెన్నవలె కరంగును. మీకటులనుండదు. పురుషులు రాతిగుండెగలవారు ఊ! ఔను మోసము! ఎదటబడినపుడే యాలాలనయును, ప్రియమును, అడుగు దాఁటి పోవలఁబోయిన యంతయు మాయమగును. నీవు నీ తృప్తి నెఱింగియు నిట్లు నమ్మినదాన నగు నన్ను ఏడ్పించపెట్టుట నీకుచిత మిది కాదు. పదినిమిషములు నీవాలస్యముగావచ్చినందుకే నామానసమార్వ లేదు. ఏమో మునింగినట్లు కడుపు కుములుచున్నది. నీరాకకై యెదురుచూచిచూచి నాకన్నులుఁ పూచిపోయినవి. ఇంకమీఁద నిటులఁజేయునట్లైన నేనుసహింప లేను." అని తనకతనిపైఁగల ప్రేమ మెఱుఁగవచ్చునట్లుపలికి వేడుకొనును. లేక, యలుకఁబూని బిరబిరంబోయి నేలఁబరుండి పలుకకపొరలును. ముందటికంటె నధికముగా నేడువనారంభించును. ఈవిధమునంతయుంజూచి దానినివలచియున్న, ధనికుఁడైన లేవ యనునీటుకాఁడు తనమనస్సుకరంగి "ఆహా! ఈసుందరాంగికి నాపై నెంతటి ప్రియముగలిగియున్నది? నన్నెడబాసి పదినిమిషము లాలస్యముగానుండినందునకే యెంతతపించుచున్నది? ప్రేమయనిన నిదియే ప్రేమ. వరించినయెడల నిటువంటి పొలతుకనే వరింపవలయును." అని తలంచుకొని దానిపై నత్యంతమైన యనురాగముగలవాఁడై, చేరఁబోయి, లాలించియు బతిమాలియు, నేమేమియో వస్తువులందెచ్చియిచ్చునట్లు ప్రమాణముఁజేసియు, ముద్దిడుకొని, మెల్లగా లేవనెత్తి, తనపై నుండునది యెంతటివెలపొడుగైన పరిశుభ్రవస్త్రముగా యుండినను, దానితో ప్రియురాలికన్నీళ్లుతుడిచి, ప్రసన్నచిత్తంజేసి, యది యేదియడిగి

నను ముందువెనుకలాలోచింపక తెచ్చియిచ్చుటకు సంసిద్ధుండై యుండును. అప్పుడా మాయలాడి యతఁడు సంపూర్ణముగా తనకు వశుండాయెనని తెలిసికొని మిగుల మోహము గలదానివలె నభినయించి శృంగారచేష్టలొనరించుచు, సమయముఁజూచి, సందర్భానుసారముగా "నాకా నగలు కావలెను, మంచివసతియైన యిల్లు కావలెను నాపేరట కొంతభూమి యుండవలయును ఆబీరువా కావలయును. ఈమంచము కావలయును. ఆచీరగావలయును. ఆరవికగావలయును. ఈవస్త్రి కావలయును. ఎల్లప్పుడును నేను మంచిపాలు త్రాగవలయును. దానికై మట్టునదియు సమృద్ధిగా పాలనిచ్చునదియునైన యావు నొకదానిని తెప్పించి యివ్వవలయు" నని యిట్లే కొంచెకొంచెముగా నొక్కొక్కటిగా, వానివలన, ద్రవ్యముగను, నగలుగను, భూములుగను, వస్త్రరూపముగను క్రమముగా సంగ్రహించుకొని తనచేతి కీలుబొమ్మనుచేసి వానినాడించుచు, తలంచినట్లు సకల భోగములననుభవించి కడపట వానిని బికారికింగను గావించికాని విడువదు. అంతమాత్రముతో బోయిన నదియును గొంతమేలుగానేయుండును. వాఁడప్పటికైనను ధన్యుఁడే! యని యెంచవచ్చును. గాని ప్రతిఫలముఁ గలిగింపక పోనివ్వరు. అదియేది? ప్రాణములున్నంతవరకును నల్లాడుచుండునట్లు తీఱని పలువిధములైన దుర్వ్యాధుల ననుభవింపఁ బాల్పడఁజేసి విడుతురు. తంత్రగత్తెలైన వెలయాండ్రు తమవిటకాండ్రకు కడపట నొసంగి గౌరవించెడి ప్రత్యుపకార మిదియె కాని మఱియేమియును లేదు. వారినివలచి వారిమాటలు నమ్మి వారికోరినట్లెల్ల ధనమును వెచ్చపెట్టి లోలత్వులకాఁగానై, రోగములచే పీడింపఁబడి, ఱెక్కలువిఱిగినపక్షివలెనై యీగలుదోలుకొనుచు, వీధుల బిచ్చగానివలె దిరుగవలసిన దేశప్రవేశ్యాలోలుండు సుఖమొందఁజాలఁడు. లోకములో పురుషులెందఱో యిట్లు భోగముపడుచుల మాయలకు లోనై, తమయాలుబిడ్డల నల్లాడఁబెట్టి, రేయింబగళ్లు వారిగృహములే స్వగృహములుగా నెంచి యచట బడియుండి ధనముఁ బోగొట్టుకొని యాభాణాల చేయర్ధచంద్రప్రయోగము నుపొంది వెలువడి, జోగులై, పరదేశులై "అన్నమోరామచంద్రా!" యని యల్లాడువారును, ప్రాణములు పోఁగొట్టుకొన్న వారునుం గలరు. ఇది యందఱు నెఱింగిన విషయమే! ఇదియంతయు వయసుగత్తెలయిన మాయలాడులు నటించువిధము. ఇంకగొంతవయసుచెల్లినవారన్ననో?

ఊరకుండెదరా? అదివట్టిమాట! తమసామర్థ్యముకొలందియుఁ దాము ను, చూడకమానరు. పెద్దచేయిగలవారుగా తమకెవ్వరునుంగనిపింపక పోవుటచే కొందఱు వయసుచెల్లినవేశ్యలు,సాయంసమయములయందు తమ ముఖములను, బాగుగా కడుగుకొని, గోడకు సున్నముఁగొట్టువిధ ముగా (ముసలిమొగమగుటచే ముడతలుతెలియకమఱుగుబడునట్లు)దట్ట ముగా ఫవుడరుఁగొట్టుకొని, సొగసుగబొట్టుఁబెట్టుకొని, కన్నులకాటుకఁ దీర్చి, తళతళమెఱయుచుండు చీటిచీరెను విచిత్రముగా చుంగులుజాఱ ధరించి, గ్లాసుగోమల్లుననో, మఱియేదైన నొకరకముననో కుట్టించిన జాకెట్టుదొడిగి, తనశరీరముయొక్క కలబందకంపు కొంతతొలంగు భంగి గమగమపరిమళించు, వాసనచందనమునలంది, తాంబూలము నునమలుచు, సగముముఖముకనుపడునట్లు వాకిలియోరగానిలిచి, వీధి నివచ్చుచుంబోవుచుండువారింజూచి, కన్నుసైగలును, చేతిసైగలునుం జేసిపిలుచుచు, "రాండీ! పరవాలేదు జంకెదరేల? క్రొత్తవారెవ్వరును లేరు" అని బహుప్రియముగలవారివలెపలుకుచుందురు.ఎవరైననువారిమాట లునమ్మి ఇంటిలోనికిప్రవేశించితిరేని, యింకచెప్పవలసినదేలేదు. ఏమిచే యుదురు? వలలోచిక్కుకొన్నాఁడనుటయొఱింగి చేయిఁబట్టి పిలుచుకొని పోయి వగలమాటలఁబలుకుచు,కౌఁగలించి మంచముమీఁదఁగూర్చుం డఁజేసి ముద్దుబెట్టుకొని ముసిముసినగవులునగుచు పైనచేయివేసి, ప్ర క్కఁగూర్చుండి "మీవంటిగొప్పవారు సంవత్సరమున నొకనాఁడైనను మాయింటికివచ్చిచూచి పోరాదా? మేమేమినేరముజేసితిమి? మీ రిదివరకు రెండుమూడుసారులీవీధిలోపోవుచుండఁగాచూచి పిలువవలయు నని తలంచితినిగాని మఱియెవ్వరో మీవెంటనుండిరి. గాన మీరాకకో సమువచ్చునేమో యని తలంచిమానితి. నాయదృష్టముచే నేఁడు మీ తోమాట్లాడుటకుసమయముతటస్థించెను. ఎప్పుడైనామీసొత్తునొకరూ పాయ మేమనుభవింపఁగూడదు కాఁబోలు. ఏదీ? నేఁడేమేనియుం గల దేమోచూచెద" నని మాటలాడుచు వానిచొక్కాయజేబునను, బొడ్డుకొంగుననుందడవి యున్నపట్టుకుంగొని "మీసొమ్మునకు మేము సర్వస్వతంత్రులము. మాదేహము మీధన" మని వానిని నోరెత్తనీ యక చేయుదురు. వారిచేష్టలచే తన్మయుఁడై, యాపురుషుఁడు తనకు టోపీవేయునదియోచింపక వారేమిచేసినను మాఱుచెప్పక నవ్వుచుం

డుసు. అటుల డబ్బులాగుకొనినంత మీఁదిమాటయేమి? "సరే! మీరెచ్చటికో తొందఱగాఁబోవుచుంటిరి. మీపనికి భంగముగాఁబిలిచి యిచ్చుటతడవుచేసినాను. పోయి యాపనితీర్చుకొని రండు, రేపురాత్రికి దయచేసిన యనుకూలముగాయుండును నాకునిండా ప్రియముగలదుగాని యేమిచేయుదును? ఈదినమెందువలననో తెల్లవారుజాము మొదలు కడుపునొప్పి ప్రారంభించి చాలాబాధపెట్టినది. ఇంచుకతగ్గినదిగాని యిపుడున్నూ సంకటముగానే యున్నది. అయిననేమి? మునిఁగిపోయినదా? ఈదినముజరుగుకార్యము రేపుజరుగును. మనసుకలిసినంతట నెపుడైన నొక్కటియే! మీదయయుంటే యదియేపదివేలు. మఱచిపోయెదరు సుమా! పోయిరండీ!" యని పంపివేయుటకుందగినమాటలు నేర్పుగాఁ జెప్పి యిలువెడలింపఁజూతురు. ఆపురుషుఁడు చేయునదిలేక గుక్కురు మిక్కురుమనక పోవలసినదే! వారు తమయొద్దనుండినరూకలుపోఁగొట్టుకొని మొగముల్ప్రేలవైచుకొని లేచిపోవుచుండఁగా తమకెంతయో ప్రీతియున్నట్టునటించి "ఇదిగో! మఱచిపోయినాను. ఒకమాట రేపువచ్చెదవా లేక మానెదరా! మీదయ యెట్టిదియో తెలియునుగాక. కాని వచ్చునపుడు క్రొత్తగావచ్చియుండెరకము బాలామణిచీరయొకటి తీసికొని రండు మఱచిపోవలదు. అదికట్టుకొని మీతో" అని లజ్జనభినయించి "ఇంకనేమియుం జెప్పజాలను. ఆచీరను తెచ్చిననే నేను మీతోమాటలాడుదు" నని పంపివేయును. వెలవెలబోయి దేబెమోములతో యాపురుషులు యిలువెడలి యెవ్వరైనా తామచటనుండి పోవుటనుచూతురేమోయనెడి సందేహముతో యటునిటుంజూచుచు పులిబాఱింబడి తప్పించుకొనిన లేడిచందముగా వీధింబడి "బ్రతికితిమిరా! దేవుఁడా!" యని నిట్టూర్చి వెడలిపోవుదురు. అంతటనైనను బుద్ధి దెచ్చుకొనని యవివేకులైన కొందఱు మఱునాఁడు తామామాయలాడులయొద్దకుఁబోవనెంచి వారుచెప్పిన చీరలుబజారులోవిచారించి వానివెల రు 50-60లు గానుండుటవలన కొనిపోవుటకు శక్తిచాలక వారి ముఖమునుచూచుటకులజ్జించి, యాదారిని పోవుటనుసయితము మానుకొందురు. ఒకవేళ పురుషులలో నెవఁడైనను గడుసువాఁడుగాయుండి, వేశ్య వెడలబంపుటకు చూచినపుడుపోక, తానేమైనను ముష్కరముఁ జేయఁదలంచినయెడలయింతకుపూర్వము మీరుచదివినరంకులాండ్రకథ

లోవలె జరిగిననుజరుగును లేదా? వానిచేతిలో నేదేనియు నొకవస్తువు నిచ్చిబిరబిరవాకిటికిపోయి "దొంగదొంగ ఎవఁడోదొంగవచ్చి ప్రవేశించి మాసొత్తులుగొనిపోవుచున్నాఁడని,నిమిషములోగుంపునుగూర్చియవమానపఱచి పోలీసువారికొప్పగింతచేసిననుం జేయుదురు. మిత్రులారా! ఈవేశ్యలుచేయు తంత్రములంజెప్పఁదలంచినచో యనంతములున్నవి. వానిని వ్రాయుట కిచ్చట చోటుచాలదు. ముఖ్యముగా జెప్పుట యేమనఁగా:—వారి తంత్రములకును, మాయమాటలకును లోఁబడక జాగ్రతగా పురుషులు ప్రవర్తించుట శ్రేయస్కరమనియే! లోఁబడిన చెడక తప్పదు.

క. కలుగని కూరిమితమకుం
గలిగినవిధమున నటించి కపటోక్తులచే
నలరించిడబ్బుఁగొనియెడి
వెలయాండ్రనునమ్మువారు వెతపడుదురిలన్.

---

# బిచ్చగాండ్రుచేయు మోసము.

కష్టపడి యేదేనియుంజనిచేసిసంపాదించి పొట్టబోసుకొనుటకు ప్రయత్నింపని సోమరిపోతులు కొందఱు సకలమునునెఱింగిన మహాత్ములవలె తలనుజడలుదాల్చి నడినెత్తిలో ముడిఁబెట్టి దేహమంతయువిభూతిపూసుకొని, యోగదండమును, నిడుపైన యినుపనీరుకాయనుం బట్టుకొని వచ్చి, చెట్టుక్రిందనో, దేవాలయములయొద్దనోకూర్చుండి యన్యులతో పలుకక, మౌనముగాయుందురు. సామాన్యజను లటువంటివారినిఁజూచి ఎవరో, మహానుభావులనియెంచి, భయభక్తులుగలవారై, నమస్కరించి,తమకుతమకుతోఁచిన కానుకనుసమర్పించిపోవుదురు.సాయంకాలమునయామోసపుసోమరులటుల తమకుదొఱికిన డబ్బునకు గంజాయింగొని చిలుములోబెట్టి యాపొగను బీల్చియు, సారాయముండ్రాగియు దేహములు తెలియక పొరలుచుండుదురు.

ఇంకఁగొందఱు, నాగదారిమీఁదను, ముండ్లకంపలమీఁదను, తంత్రముగా, నిలిచియుం బరుండియుఁ గూర్చుండియు, యోగముద్ర నుండువారివలెనటింపుదురు. వారికిశిష్యులమని పేరుఁబెట్టుకొని కొంద

ఋప్రక్కనునిలిచి "స్వామి మహాత్ముఁడు యోగమునుబూనియున్నాఁడు. వీరినిదర్శించిన సకలసంకటములుం దొలంగు" నని చెప్పి పాలను పంచ్చును, తమగురువులకు కొని సమర్పించునెపంబున డబ్బుసంపాదింతురు. చీకటిపడగానే, గురుశిష్యులుకలిసి యాడబ్బును కొనిపోయి సారాయియంగడిలో కానుకను జెల్లించి యానందింతురు.

మఱికొందఱు, చిన్నబిడ్డలకు, ముఖముననుదేహముననుచముఁరుఁబూసిలోపలకుంకుమముబెట్టి మడిచినదూది బిళ్లలను చముఁరులోతడిపి యచటనచటనంటించి పంచబెట్టి, చీమును, రక్తమునుంగారుచుండుప్రవణములవలెగనుపఱచుచు, "అయ్యా! ధర్మము. అమ్మా ధర్మము. కన్నులారయీఘోరమునుచూడండి, చూచి యూరకబోవకుఁడు. ధర్మమివ్వండి" యని మొరబెట్టుచు, యాచించి, డబ్బును సంపాదించుచుండుదురు.

మఱికొందఱు, వీధులవెంబడిని నిలిచి, వచ్చుచుంబోవుచుండువారలంజూచి, మహాదైన్యముతో "అమ్మా! యొకకాలణాయుంటే యివ్వండి అయ్యా! కాలణాయివ్వండి, వీరికిభోజనముపెట్టించిన ఫలముకలుగును. నేఁడుప్రొద్దున మొదలుకొని యింతవరకును, నేమియునాహారము లేదు. మిక్కిలి యాకలిబాధించుచున్నది" యని యాచించి డబ్బునుసంపాదించి మహాసంతోషముతో సాయంకాలమున కల్లంగడికిఁబోయి చెల్లగట్టివత్తురు.

ఇంకనుంగొందఱు, యెక్కడనైనయుండు గుడ్డి, కుంటి, కుష్ఠుపి, మొండి, యిటువంటివారిని పిలుచుకొనివచ్చి, రోడ్లవెంబడిలోనను, వీధులమొదటను, తేరుతిరునాళ్లు జరుగుకాలమున దేవాలయగోపురద్వారముల యోరనుంగూర్చుండబెట్టి,తామొకపాత్రమునుబట్టుకొనినెంబడినిలిచి జనులకు వారినిచూపిచూపి, యాచనఁజేసి గాసులుసంపాదించి, యందేదోకొంచెమా, గుడ్డికుంటి,వారలచేతఁబెట్టి తక్కినదితాము తీసుకొందురు. పాపము. తామటులతీసుకొన్నను, యాడబ్బును వారు వ్యర్థముగా తమయొద్దనుంచుకొనక సద్విషయముననే వినియోగింపుదురు. ఏమిచేయుదురు? కల్లంగడి కామేశ్వరీదేవి కర్పింతురు.

ఇంకకొందఱు చిన్నబిడ్డలను చేటలలోఁబెట్టి కావిగుడ్డలుగప్పి యుగ్గుపాత్రలు చేతఁబట్టుకొని పోయెడివారిని వచ్చువారిని, పాలధర్మ

ము. బిడ్డకుపాలిచ్చినధర్మ" మని యఱచుచు, యాచించి డబ్బుసంపా దింపుదురు.

మఱియుం గొందఱు వృద్ధులుగానుండువారు, తురకము, అఱవము, తెలుఁగు, యింగ్లీషు, భాషలలో నోటీసుముద్రింపించి గొప్పవిజ్ఞాపనపత్రికా గితములయట్టి కానోటీసునంటించి చేతికిదారముఁగట్టి వ్రేలాడవైచుకొని కూర్చుండి ముందుగుడ్డనుపఱచి తామే దానిమీఁద కొన్నిపైసాలను వేసిపెట్టుకొని జనులను యాచింపుదురు. ఆనోటీసు నెవ్వరైననుచదివిన చో, యందిట్లుండును, "నేనుండునది యుత్తరమున నెల్లూరుజిల్లా, భార్యచనిపోయినది. నాయిల్లు కాలి సర్వమును నాశమైనది. నాకు కుమారులునలుగురును, నైదుగురుకుమార్తెలుండిరి. వారిలోకొడుకులు నలుగురును, మహామారివలనను, కలరావలనను, నొకరివెంబడియొక రుగా మరణించినారు. కుమార్తెలలో నొకచిన్నదిసయితము మృతినొం దినది. ఇంకనలుగురు కూతుండ్రున్నారు, వారుప్రౌఢవతులై యుండుట చే శీఘ్రముగావివాహములు జరిగింపవలసినది యగత్యముగాయున్నది. నేనువృద్ధుఁడను, అదియునుంగాక సర్వమును పోగొట్టుకొని చెడినవాఁ డను. అందఱుప్రభువులును తమకుతోఁచినసహాయముఁ జేసి పుణ్యము నుగట్టుకొనుఁడని వేడుచున్నాను." అని యుండును. దానినిచదివిన వారు మనసుకరఁగి "అయ్యో! పాపము! బాగా బ్రతికిచెడినాఁ" డని యెంచి, యేదోతోఁచిన రూకయో, పాతికయో, వేసిపోవుదురు. ఆడ బ్బునుచేర్చి, పాడుచీట్లాటకో, గంజాయి, మద్దతుమాజమునకో, కల్లు సారాయికో, సమర్పించి, ముసుఁగువేసుకొని ముండలవలె బోవుదురు.

ఇంకనుంగొందఱొకతంత్రముబన్నుదురు. ఒకఁడు తనపైగుడ్డలో నొకకొనను కొంచెము బియ్యమును, మఱియొకకొనను కొంచెము ఉప్పు ను, నాలుగైదు మిరపకాయలునుం గట్టుకొని యెవరియింటికైనను వచ్చి, వారికి జాలిగలుగులాగున "అమ్మా! మేము కాంచీపురముకాపు రస్థులము, నాభార్య తొమ్మిదినెలలగర్భవతిగానుండినది. దానిపుట్టినిల్లు తిరువళ్లూరు, అక్కడికిపంపుటకొరకు పిలుచుకొనివచ్చినాను. ఇచ్చ టికిరాగానే నొప్పులుకనిపించి ప్రసవించినది. అదిగో! ఆప్రక్కవీధిలో నొకపుణ్యాత్ము యింటివసారాలో యున్నది. ప్రసవమును నచ్చటనేయైన నది. ఆమూఁడవయింటిలో కొంచెము ఉప్పును, మిరపకాయలు, చింత

పండునుయిచ్చినారు మీరు దయచేసి పథ్యముగానుండుటకనువుగా నూకలుగాని ప్రాతబియ్యమునిచ్చితిరేని మీకెంతయోపుణ్యముకలుగు" నని యుపచమత్కారముగా తీసుకొందురు. ఇట్లే చాలాయిండ్లకుబోయి మాయమాటలుచెప్పి బియ్యమును, వస్తుసామగ్రియుసంపాదించి వానినికొనిపోయి తమకంటె బీదలగువారికి విక్రయించి యాడబ్బును త్రాగుటయందుపయోగించెదరు.

మఱికొందఱు ఒకయి త్తడితట్టలో రాగితో చేయబడిన పాదములును శూలములునుంబెట్టుకొని, తాము దేహమంతయు విభూతిబూసికొని యాతట్టను చేతంబట్టి వీధులలోతిరుగుచు, తమ్ము సమీపించిన వారితలపై తటాలున చిటికెడువిభూతింజల్లి, నిలువరించి, వారినోటిలో కొంచెముబూదివేసి "ఓయబ్బా! నీచింతలన్నియు నేటితోతీఱిపోయినవి. విభూతితగిలింది. వీడిందినీయజ్ఞానము. ఇంకనీకేమియు గొరంతకలుగదు. శంకరుండుతోడై నీకు సంతోషమును కలిగించును. సకలకార్యములును సఫలములగు"నని చెప్పి, మరలకొంచెమువిభూతిచల్లి శూలముతో దేహమునుతడవి తలమీఁదయుంచి "నాయనా! దేవునికి కానుకసమర్పింపుము. భగవంతునకొకదక్షిణనిచ్చుకొనుము. శీఘ్రముగా నీకార్యములు కూడివచ్చు" నని చెప్పి వారిని విడువక కానులు లాగుకొందురు గాని కడపట నవి కల్లంగడిలోచేరును.

ఇంకం గొందఱు లజ్జలేనిస్త్రీలు జేనవెడల్పుగల కందను నడుమునకుఁజుట్టుకొని యంగములన్నియుం దెలియుచుండగా యింటింటికింబోయి "అమ్మా! కట్టుటకు గుడ్డలేదు. ఇదిగో! చూడండి. నన్నీగతిఁజేసి నామగఁడు మరయొకదానిని మరిగి దానితోకూడా యెక్కడికో పోయినాఁడు. తినుటకు కూడును, కట్టుటకు గుడ్డయును లేక నేనిలాగున నల్లాడుచున్నాను. మానహీనముగా యున్నది. కరుణించి యేదయినా యొకప్రాతగుడ్డనిచ్చితిరేని మీపేరుజెప్పి కట్టుకొంటాను. మీకుమిక్కిలి పుణ్యముకలుగు"నని బతిమాలి యడుగును ఆడుమనిషి యట్లు మానము చెడి తిరుగుటనుచూచి స్త్రీలు "అయ్యో! పాపము! ఆడుపుట్టువుఁబుట్టి దిట్టుఁనుండుట మిక్కిలియుం గష్టముగదా!" యని కనికరించి ఏదయినను ప్రాతబడిన చీరయో, ధోవతియో, పంచయో యిచ్చినయెడల దానిని ఎట్టుకొని యచటనుండి మఱుగునకుబోయి యావస్త్రమును

విప్పి తనవారిచేనొసఁగి మఱియొకవీథికిపోయి మొదటివేషముతో యాచించి సంపాదింతురు.

ఇంకనుంగొందఱు పోదామాయకాండ్రు పలుపువేషముల మోసగించి డబ్బుసంపాదించెదరు. ఒకఁడు యింటింటికిని వచ్చి "అమ్మా! నేనుండునది పుదుచేరి. పెద్దఆసుపత్రిలో నాకుఁగలిగియుండిన వ్రాత్రరోగమును తీర్చుకొనుటకై యిచ్చటికి వచ్చినాను. రెండుమాసములాను పత్రిలోయుంటిని. దేవునిదయవలన కొంచెము నెమ్మదించినది. అచటి నుండి బయటవచ్చినాను. రెండుదినములనుండి యాహారము లేదు. నేను బీదవాఁడనగుటచే నాయొద్దదమ్మిడియైనను లేదు. దయచేసి మీరు కొంచెము సహాయముచేయుఁడు నాయూరునకుఁబోయి చేరెదను" అనికడుదీనముగా చెప్పి గోడుగోడున నేడ్చును. చూచినవారు వాని మాటలునిజములని నమ్మి జాలిపడియేదైనం గొంచెముఱెలుచార్జికిగా వానికొసంగుదురు. యిటులనే యక్కడక్కడనడిగి సంపాదించి రూకలనెత్తుకొనిపోయి కులదైవమగుకల్లంగడికర్పించి తప్పఁద్రాగియానందముతో సంగడికాండ్రనుగూడి పాటలుపాడుచుండుదురు.

ఇటువంటి సోమరులగు బిచ్చగాండ్రనుగూర్చి వ్రాయఁదలంచినచో యీపుస్తకముచాలదు. ఈలాటిసోమరుల నొకమారుపట్టుకొని తగినట్లు దండించినయెడల వీరిసంఖ్యతగ్గిపోవును. అదిచేయువారెవరు? కుంటివారును, గ్రుడ్డివారును వేరుగతిలేని కారణమున బిచ్చమడిగికొనిపోయి జీవించుట న్యాయముగాయుండును. వీరైనను చేయఁదగినపని నేదేనియునిచ్చిచేయించినచో, సుఖముగాజీవింతురు. మంచిదేహపటుత్వముగలిగి పనిచేసి సంపాదింప గలవారయినను బిచ్చమెత్తుటకు ప్రారంభించి లోకులను మోసగించుట మిక్కిలి శోచనీయమైనవిషయము. పుణ్యాత్ములగు వారు దానము ధర్మముఁజేయునపుడు దుష్కార్యములకువినియోగించు దుర్మార్గులకొసంగక, యోజించి యన్నవస్త్రములకుగతిలేని వారినిగుర్తించుట మంచిది.

క. పలువిధములైనవేషం
బులుదాలిచిజనుల మోసకములుజేయుచు డ
బ్బులను గడించుమహామా
యలకాండ్రకు ధర్మమొసఁగు టక్రమముజనుల్.

# మార్వాడీల మోసము.

ఉత్తరము గుజరాత్ దేశమునుండివచ్చిన గుజరాతీలును, మార్వాడీలును ఇచ్చటికిఁజేరి మొదటమొదట నొకచిన్నయరను బాడుగకుతీసుకొని యంగడిఁబెట్టి వ్యాపారమునకు ప్రారంభింతురు. ఆవ్యాపారమేమనగా, వస్త్రములును, పాత్రములు మొదలగువస్తువులును, కుదువయుంచుకొని వడ్డీకి డబ్బునొసంగుదురు. అదిసామాన్యమగు వడ్డీకాదు. కుదువయుంచినవి వస్త్రములుగా యుండినచో నెల 1కి-రు 1కి 0-2-0లును, ఇత్తడి, రాగిసామానులుగనుండిన రు 1కి 0-1-6 యునువడ్డీ పుచ్చుదురు. బంగారు, వెండినగలయినయెడల, రూపాయకు 0-0-6 యును 0-1-0 యును తీసుకొందురు. వీరియొద్ద మూడువిధముల లెక్కపుస్తకములుండును. కుదువయుంచినదియొక నెలయైతే వీరు దానికి మూడు నెలలకు లెక్కపుస్తకములో వ్రాసియుంచుదురు. కుదువయుంచిన సొత్తును తీసుకొనుటకు బాకీమొత్తమును పూర్ణముగాకట్టిన పిమ్మట దానినిచ్చుట నాలుగైదుదినములకుగాని యాసొత్తు నొసంగరు. ఎక్కువ విలువచేయు గలసొత్తుగాయుండిన "ఇప్పుడు రూపాయలు మిమ్మునడిగినామా? అవసరములేదు. కావలసియుండిన మీకింకను డబ్బిచ్చెదము తీసికొనుడు" డని చెప్పుదురు. ఒకవేళ యవసరమునకై రూపాయలడిగిన, యాసొమ్ము యొక్కమతింపుధరలో నాలుగింట నొకభాగము మాత్రమే యొసంగుదురు. అయ్యయ్యో! ఈమార్వాడీలచేతజిక్కుకొనిన సొత్తును, సొత్తుగలవాడును తప్పి బయటపడుట మహాకష్టము. కుదువలేక యప్పుతీసుకొనెడి పక్షమున వానియాస్తిని తెలుసుకొని రు 100లకు రూకలు డిస్కౌంటుగాతీసుకొని రు 75లు మాత్రమిచ్చి రు 100 కు బాండువ్రాయించి పుచ్చుకొని నెల 1కి రు 10ల ప్రకారముగా వడ్డీతోకూడా ఖండితముగా వసూలుచేసుకొందురు. ఒకనెలవాయిదా తప్పినేని వడ్డీకి గుదుకువడ్డీ కట్టితీయకమానరు. ఇచ్చినరూపాయలు బాండులో చెల్లువేయక పెట్టియుండి యొక్కొక్కప్పుడు బాండునుకోర్టులో దాఖలుచేయుటయును గలదు. అరకాసైనను విడువరు. తమయొద్ద సొత్తును కుదువయుంచినందుకుగాని, పయికము చెల్లుయిచ్చినందుకుగాని యొకదానికిని రసీదు నివ్వరు. అంతయును, వారిని, వారిమాటనునమ్మి చేయవలసినదే! వారు

మాత్ర మితరులను నమ్మరు. ఇది యేమనగా తామెపుడును నసత్యమును పలుకని పుణ్యపురుషులఁట, తక్కినవారు తమవంటివారు కారఁట, ఈయన్యాయమును దేవుఁడే విచారించవలయును. ఇటువంటి పరమచండాలురయొద్ద మనసొత్తును పెట్టి మనవిలాసమున్నా వ్రాసియిచ్చి యేదైనాయవసరముకలిగి కొంచెమధికముగా డబ్బునడిగితిమేని, ప్రాణములుపోయినను యివ్వనేయివ్వరు. ఈపరదేశ కేపుమారులు మనదక్షిణదేశవాసుల నణుమాత్రమైనను నమ్మరు. ఈసత్యసంధులు తామొకటిలోనాలుగవవంతుగా డబ్బుయిచ్చి చేర్చిపెట్టినసొత్తులను మొత్తము చేసుకొని యున్నట్టుండి యంతయు మూటగట్టుకొని యొకరాత్రికిలో నబనంగడి తాళమువేసి రయిలెక్కి యితరులకు తెలియకుండాపోయి స్వదేశమునుచేరుటయుంగలదు. అక్కడక్కడనుండు మార్వాడీలను తలక్రిందుచేసినట్టుండినను, దానికైనను సమ్మతించెదరుగాని, మనమడిగినచో పారిపోయినవాఁడుండెడి వాస్తవమైన స్థానమును మనకు చెప్పనే చెప్పరు. కొంతమంది మార్వాడీలు ఒకనెలవాయిదాపై కుదువయుంచుకొని డబ్బునిచ్చి సొత్తుగలవాఁడు రూపాయలుచెల్లించు తేదిలో యంగడి తెఱవక తాళమువేసియుంచుదురు. సొత్తుగలవాఁడు రూపాయలందీసికొని తిరిగితిరిగి యూరకబోవలసినదే! పిమ్మట వచ్చినపుడడిగినచో "నేను నాయంగడిని తెఱచియేయుంటిని, మీరేరాలే" దని సాధించును. తరువాత రెండునెలలవడ్డిని తీసుకొని సొత్తునిచ్చును. ఇటులనే సాకులుగలిగించి యపుడపుడంగడిని తెఱవకయుండి సమయముచూచి తమయూరికి పారిపోవుదురు. లేదా? మఱియెచ్చటనైనను దూరముగాపోయి యంగడినిబెట్టుదురు. ఒకవేళ నెవ్వఁడైన యున్నచోటును తెలుసుకొని పోయి యడిగినయెడల సగమునకు సగమైనను దొరకుటయుగలదు. గాని యిటులపోయి చిక్కులుపడి యడిగి తెచ్చుకొనుటకు పేదవారికి సాధ్యముకాదు. పాపము. వారేమిచేయుదురు? తమసొత్తు వడ్డిలోమునిఁగిపోయినదనియెంచి, చేయునదిలేక యెట్లో, గాలమును గడపుదురు. ఇంకఁ గొందఱు మార్వాడీ పుణ్యపురుషులు రు 10 లలో యొకకమ్మలజతను తయారుచేయించి యుంచుకొని తమయంగడికివచ్చువారికి వానినిచూపి "ఇవి కుదువయుంచబడినవి. వడ్డి యధికమైనందున మామొత్తమునకు చెల్లుగావచ్చినది. ఇది ప్రాతనగ. బహుద్ర

ఢముగను, సుందరముగనుం గట్టబడినజత. న్యాయముగా కట్టించేదలంచినచో కూలిమొదలైనవగులుబడు లెక్కవగాయగును. మేము కూలి తగ్గించి యిచ్చెదము. యింతమంచిజత మీకు చిక్కుటకష్టము. యొక్కొకటి యెప్పుడో యొకసారి యిట్లువచ్చును, వెలయునుసంతయధికముగాలేదు. రు 50లు మాత్రమే! తీసుకొనుడు. చాలామంచికన్నులని పలుతెఱంగుల తంత్రపుమాటల చెప్పి తీసుకొనునట్లుచేసి యొకటికి నాలుగంతలధికముగా డబ్బునులాగుకొందురు తరువాత యానోవ్నులు త్వరలోచెడిపోయినవని వారినడిగినప్పుడు మీరు వాడుకొనుటలో దోషమువలన నవి చెడిపోయియుండుసని చెప్పుదురు. ఈప్రకారముగా డబ్బును సంపాదించి కూడబెట్టి కొన్నిదినములలో ధనికులై తమదేశమునే మఱచిపోయి, ఈదక్షిణదేశమునే మాతృభూమిగా నెంచుకొనియిచ్చటనేమిద్దెలుమేడలుంగట్టుకొని, గుమ్మడిపండులవలెను,బానకడుపవలెను, పొట్టలుపెంచుకొని, ఏనుగులవలె బలిసి మదోన్మత్తులై, నిర్లక్ష్యముగా కోర్టులకును, గోడ్లయందును దిరుగుచుండెదరు. ఇది మనము చూచుచునేయున్నారము. వీరిలో నెవ్వడైనను తా నిచ్చటికివచ్చి తాను తెచ్చినధనమును వృద్ధిచేసికొనుటకు చాలనిపేదవాడైయున్నచో చేసెడి యుపాయమేమనగా, తటాలున ముసుగుబెట్టుకొని చచ్చినపీనుగువలె పండుకొని, తలప్రక్క దీపమును, రూపాయలనాణెల తట్టస్తాంబాళములును నుంచుకొనియుందురు. వారిబంధువులందరును వచ్చి, వారివారి శక్తికితగినట్లు రూపాయలును, సవరములను, తట్టలో వేసిపోవుదురు. ఇట్లువేసినడబ్బు నూఱుల లెక్కగాయగును. ఆడబ్బును పెట్టుకొని, వ్యాపారమును సాగించి, గొప్పధనికుడుగాను, సాహుకారుగాను, మోటారుకారులలో నెక్కి తిరుగువాడుగాను, గౌరవనీయుడుగాను నగును. ఇదేమి ప్రభుత్వము? చూచితిరా! ఒకటికిరెండుగా యక్రమవడ్డీకట్టి మోసపులెక్కలువేసి,లోకులసొత్తు నక్రమముగాసంపాదించి సదా సుఖముగా భోజనముచేయుచు జీవించునట్లు వీరినుదుట బ్రహ్మ లిఖించియున్నాడు కాబోలు.

క. అకటా! మార్వాడీ వర్తకులవలననష్టంగొనంగం దగ
దెవ్వరికిన్, యొకవేళం గొనినచో తప్పక కష్టము నష్ట
మునరుం బడ్డయుదురు జనుల్.

# కూరగాయ లమ్మువారి మోసము.

సాధారణముగా తక్కిన యన్నియూళ్లకంటెను చెన్నపురిలో కూరగాయలయంగళ్లు విశేషమనియే చెప్పవలయును. నలుదిక్కుల నితరస్థలములనుండి యిచ్చటికి నానాదినుసుల కాయగూరలును, దినదినమును రైలుబండ్లమీఁదను, యెద్దులబండ్లమీఁదను వచ్చుచుండును. అటుల వచ్చుచుండుటచే నిలువచిక్కి విశేషముగా గడ్డదినుసులును, కాయదినుసులును, కుళ్లిపోవుచుండును. అటుల కుళ్లినవానిని యేలము వేయుదురు. లేదా? పైరిజుచీట్లువేసి వచ్చినమట్టుకును సొమ్ము జేయుదురు. వానినితీసినవారు, గడ్డలుగాని, కాయలుగాని కుళ్లినవరకునుం గోసివేసి వానిపై మంచివానిని కొంచెమువేసి కొనవచ్చినవారికి మంచివానినిమాదిరిచూపి ఆవెలకే యాకుళ్లినవానిని సయితముచేర్చి తూచివేయుదురు. ఇదేమి? కుళ్లినవిగాయున్నవేయని యెవ్వరైన నడిగిరేని మిక్కిలి కోపముతో "ఏమయ్యా! మేము మనుష్యులముగామని తలంచితిరా? మీయొద్ద డబ్బుతీసుకొని చెడిపోయినసరకు నిచ్చుటకు మేమంతటి తెలివిలేనివారమా? అటులచేయకూడదని మేమెఱుంగమా? మాటలలో నలుగుడు కొంచెముకలిగితే యాభాగమునిచ్చుట ధర్మముకాదని చక్కబరచి పెట్టుకొని యిచ్చుచున్నాము. దీనికంటె మంచి వెచ్చటనుండునో యీయంగళ్లలో చూపుడు చూత" మని దడదడ చెప్పివేయుదురు. ఎంచి యివ్వవలసినవైనచో మనల నంటనివ్వరు. వారేయెంచుదురు. ఆయెంచెడివేగములో పదింటికొకటి, లెక్క యధికముగాజేర్చి లెక్కింతురు. మనము యింటికితెచ్చి లెక్కపెట్టినచో నూటికి పది ఖండితముగా తగ్గిపోవును. తూచి యివ్వవలసియుండినచో వెలకుతగినట్లుండు తక్కెడతోడను, ఆతక్కెడకుతగిన గుండ్లతోడను తూచుదురు. మొగ్గుగాయిచ్చినట్లు కనపరచుటకై వస్తువు వేసియుండువైపున తాముతూచు, కాయలో గడ్డలో తటాలున వేయుదురు. ఆ విసరున కది క్రిందికివాలును. వెంటనే పట్టుకొని, తీయవచ్చిన వారిగుడ్డలోపోయుదురు. లేక త్రాసుముల్లును పడెనట్లు వేసియుండు ప్రక్కకు వంగునట్లుగా వ్రేలితో యదిమిపట్టుదురు లేక కాలిబొటనవ్రేలిపై,

గుండ్లు వేసియుండుతట్ట నానించి మీఁదికి లేచియున్నట్లు చేయుటయో, కాయలు వేసిన ప్రక్క తట్టను క్రిందికడంచుటయో, యొకటిచేసి క్రమముగాయిచ్చినట్లు కనబరతురు. తీయవచ్చినవానికిని యంగడివానికిని మధ్య తక్కెడయుండుటవలనను, కాయలు మంచివిగానుండునో లేదో యని కొనవచ్చినవాఁడు చూచుకొనుచుండుటవలనను క్రిందినైపున కాలిప్రవేలితో యంగడివాఁడు చేయుచుండుతంత్రము తీసికొనువాఁడు తెలిసికొనఁజాలఁడు. వాడిపోయిన వంకాయలు, నిమ్మకాయలు మొదలగువానిపై మాటిమాటికిని నీళ్లుచల్లుచు, వానిని మంచివానితో కలిపి యెట్లో తంత్రముచేసి యెంతిచెడిపోయినవాని నైనను, నెవరికో యొకరి కంటగట్టి డబ్బుజేసుకొందురు. కొంచెము గడుసువాఁడుగా యుండి, యెవఁడైనను, "ఇదేమి? ప్రాతగుండువేసి తూచుచున్నావే" వని యడిగిన, మొగము చిట్లించుకొని "అయ్యా! ఇది మంచికాలము కాదు. ప్రాతగుండ్లే కరారుగానున్నను. ఇప్పటివి వీసెకు పలముతక్కువ. ఆగుండ్లతో తూచి, మిమ్ము మోసముచేయుటకు నిష్టము లేక, నేనీ ప్రాతదానినే వేసితూఁచినాను వాడుకగా మావద్దతీసికొనువారు క్రొత్తగుండ్లు వేసితూచిన కోపగించుకొందురు. వారు యీప్రాతవానినే వేయుమని తగవులాడుదురు. కాఁబట్టి యీవాడుకనుబట్టి నేనిట్లుచేసినాను సరే! మీకిష్టము లేనియెడల కాయ లిచ్చిపోయుండి, క్రొత్తగుండు వేసి తూచియిచ్చెదను. అట్లుచేయుట నాకును మంచిదియే!" యని తక్కెడతట్టను పట్టుకొని, తీసుకొనినవాని నందుబోయుండని త్వరపెట్టుదురు. కొనవచ్చినవాఁడదినిజముగానేయుండునని నమ్మి మరల నోసంగక తానేమో లాభముగాతీసిన వానివలె నెంచి క్రయమునిచ్చి వెడలిపోవును. అవి యింటికి కొనిపోయి యొకవేళ తూనికవేసినయెడల వీసెయైనచో ౩౫ పలములకు ఖండితముగా సరిపోవును. చూచితిరా? అల్పవ్యాపారముగా కనబడు కాయగూరల వర్తకముయొక్క తీరు యిట్లుండును. వస్తువులుమార్చియు, తప్పుగుండ్లు వేసియు, తూనికలో మోసముఁజేసియు, యిబ్బడివెలచెప్పియు, ఈపాపాత్ములు లోకుల నేమరించి యన్యాయముగా డబ్బుసంపాదించెదరు. వీరిచాతుర్యమును తెలిసికొనుటకు సాధ్యముకాదు. వీరిటువంటి తంత్రవిద్య నేయుపాధ్యాయునియొద్ద నేర్చుకొనిరో తెలియకున్నది. వీరిని దేవుఁడే విచారింపవల

యును. కాయగూరలు తీసెడువారు, యీ మహానుభావుల మోసములను గుర్తించి కడుజాగరూకులై కొనవలయును. లేదా? టోపీ వేసుకొనవలసినదే!

క. నమ్మించి కూరగాయల
నమ్మెడివంచకులు పరుల కై యర్థంబును తా
మెమ్మెయినేని హరింతురు
దమ్మము నెంచరు యెఱుంగఁ కై దగుఁగొనెడి తఱిన్.

## సారాయి యంగళ్ల మోసము.

సారాయిత్రాగెడివా రదియమ్మెడి యంగడివాని దయయుండినచాలునని యెంచి, వానియొద్దకుఁ జేరుచుండుదురు. అంగడివానికి తమపై దయతప్పునేమోయని త్రాగుబోతులు వాఁడు చేయుమోసమును గమనించి తెలిసికొన బ్రయత్నింపరు. వారికేమియుం దెలియదు. సాధారణముగా సారాయినమ్మెడువారు స్వచ్ఛమైనదిగా యిచ్చుటయే లేదు. సగమునకుసగము నీళ్లుచేర్చి యందు మైకముఁగలిగించు వస్తువులనుగలిపి విక్రయింతురు. పై యధికారులాతంత్రమును తెలిసికొనినచో కష్టమువచ్చునని యెంచి వారినెట్లో తమకు లోబరచుకొందురు. కొలుచునపు డాకొలతపాత్రమును తమముఖమునకు సరిగాయెత్తి పట్టుకొని బుడ్డినుండి యందు సారాయింబోసి కొలుతురు. అపు డాకొలతపాత్రము తమవైపున కొరగియుండును. దానివలన నాల్గింట నొకభాగము కొలతకు తగ్గిపోవును. చిన్నపాత్రముగా యుండుటచే చూచువారల కాతంత్రము తెలియదు ఇదియునుగాక, బుడ్డినుండి కొలతపాత్రములో సారాయిని బోయునపుడు మీఁదికెత్తి సన్నగా నిదానముగాఁ బోయుదురు. అటులబోయుటెందుకనగా ధారగా మెల్లగాఁ బోసినచో నురుగుకలుగునంట. నురుగువలన కొలతపాత్రము నిండినట్లు తోఁచును. మఱిన్ని లక్కయో, మైనమో కొలతగిన్నెకు లోవైపున నంటించియుండుటయుం గలదు. లోకుల నన్యాయముచేసి సంపాదించి, తనయింట యాలుబిడ్డల నల్లాడబెట్టి గడించినడబ్బును సారాయియం

గళ్లకు దారబోసి తప్పత్రాగి వీధులలో బొరలు యీమోసగాండ్రై న త్రాగుబోతులను సారాయియంగడివాండ్రు మోసగించుట న్యాయ మైనదే! యది తగినప్రాయశ్చిత్తమే!

సారాయిత్రాగెడివారు, ఉదయమున త్రాగువాఁడు, మధ్యాహ్నము త్రాగువాఁడు, సాయంత్రము త్రాగువాఁడు, రాత్రి త్రాగువాఁడు, బుడ్డిబుడ్డిగా త్రాగువాఁడు, పాతికత్రాగుడుగాఁడు, అరత్రాగుడుగాఁడు, పూరాత్రాగుడుగాఁడు ఇటుల పలువిధములవారుగలరు. ఈయన్ని తెఱగుల త్రాగెడివారును, నంగడివానిదయకు పాత్రులై యుండవలసినదియే, వాఁడు వీరినందఱి నెఱింగియుండును. ఆత్రాగెడి సమయము వచ్చినయెడల భార్యమెడలో తాళిబొట్టునైనను తెగనమ్మి రూకలుతీసుకొని యంగడియొద్దకు హాజరుకావలసినదే, తప్పదు. ఈమ హాత్ములు వచ్చుసమయ మంగడివాఁ డెఱుంగును గాన, యెవని కెట్లు చేయవలయునో యట్లుచేయుటకు సిద్ధముగాయుండును. ఒకఁడు ముందువచ్చి తప్పత్రాగి దేహస్మృతి తప్పి యాయంగడికి యెదురుగానే రోడ్డుపైఁబడి వాంతిచేసికొనుచు, చూచువారల కసహ్యముగా పొరలుచుండగా, మఱియొకఁడువచ్చి యంగడివానితో యీపొరలుచుండు వానికి యిచ్చినదానికంటె కొంచెము యెక్కుడు ఘాటుగలదిగా యిమ్మని యడిగి కైకొనును. ఆహా! ఆమోసంద మూషగనుహంసలకే తెలియవలయును. గాని యన్య లెఱుంగఁజాలరు. ఎప్పుడును ధారాళముగా సారాయనును మంచినీళ్లవలె వాడుకొనుచుండు త్రాగుడుగాండ్రు నయితము కొందఱుగలరు. క్రొత్తగాత్రాగుటకు ప్రారంభించిన ...రును, కొందఱు త్రాగుబోతు పెద్దమనుష్యులును, ధారాళముగా యందఱివలె యంగడిలోనికివచ్చుటకు కొంచెము సంకోచింపుదురు. అటువంటియోగ్యులు తీసుకొనుటకై మఱియొకప్రక్క గోడను చిన్నతలుపు సమర్పబడియుండును. అచ్చటికివచ్చి వారు తలుపు తెఱచి వెలుపటనుండి యంగడివానినిఁబిలిచి 'రెండున్నర' యనిచెప్పి క్రయం రూకలు వానిచేతి కందియిత్తురు. అంగడివాఁ డారూకలుతీసుకొని తన యిష్టప్రకారము కొలిచి గ్లాసులోపోసి అందియిచ్చును. దానినిపుచ్చుకొని "మసాల్ వడలున్నవా? యుంటే యివ్వండి లేనియెడల నాలుగు గింజలు శనగలో, పెసలో పెట్టండి" యని యడిగి, యున్నవని యం

గడివాఁడు వదలిచ్చినేని సరే యున్నది. లేదన్నచో నాలుగుగింజలు శనగలైనను బెట్టించుకొని నోటవేసుకొని మరలుదురు. సారాయి త్రాగినంతట మొకిరింపుకలుగును దాని నడఁగించుకొనుటకే వార లటులచేయుదురు. త్రాగికాగానే యెటువంటివస్తువులను వేనినైనను నోటవేసుకొనుట వారికివాడుక. ఆపుణ్యాత్ముులు ముక్కులు బిగబట్టి కనుబొమలు ముడుచుకొని, నోరు వెంగ్యముగా తెఱచుకొని త్రాగుట ను చూచుచున్నప్పు డెంతయు వింతగాయుండును. అంతటిమహాశక్తి ముతో పానముచేయుదురు. అప్పటివారిరూపములను ఫోటోపట్టి యా పటముల నమ్ముకొనిన మంచిలాభము దొరకును. అటుల యంగడి వానివలన టోపీవేయించుకొని, వాఁడిచ్చిన సారాయిం ద్రాగి రోడ్లపై పాడుచు నాడుచు వచ్చుచున్నపుడు వారివినోదములనుచూచి వర్ణించుటకు దేవతలకు ప్రభుఁడైన వేయికండ్లుగల యింద్రునకునయితము సాధ్యముకాదని చెప్పవలయును. ఇటువంటివార లదృశ్యులనియు దొంగలనియుం బేరొందుట కాటంకమేమి? తనబుద్ధిని హరించి వెఱ్ఱివానిం జేయు యీపాడుసారాయికి తనడబ్బునంతయు సమర్పించి బీదలైనవా రెందఱోగలరు. ఈత్రాగుబోతు తనమును సారాయంగడు లాణములును మనదేశమున నడుగంటినగాని, భరతఖండము మంచి స్థితికి రాజాలదు. అయ్యో! అటువంటికాలమువచ్చునా? ఎన్నఁడు?

గీ॥ ఆలి మెడ తాళినైనను ౹ నమ్మితినఁగఁ
గూడ లేకున్న డబ్బును ౹ గొంచుపోయి
మద్య దేవతకర్పించి ౹ మహిని బొరలు
సట్టివాడుక విడిన సౌఖ్యంబుగలుగు.



# చాకలివారల మోసము.

సాధారణముగా పట్టణస్థలములలో చాకలివానికి యుతికియిచ్చుటకై గుడ్డ నిచ్చినప్పుడు మరల నది మనయొద్దకువచ్చునేని క్రొత్తవస్త్రము కొన్నట్లే తలంపవలెను. గుడ్డమైల మురికిపోగొట్టుటకని యెల్లా యినపెట్టె యుపయోగించి గుడ్డను దూదిపింజవలె జేయుదురు. మనము వేసిన గుడ్డల పట్టి వ్రాసిగాని, లేక యట్లే యుంగరీవానికిచ్చిగాని సాధాయి త్రాగుదురు. వేసినగుడ్డ నడిగినయెడల "సామీ! నేనేమిసేతును. ఏటి యోరగా యూరవేసియుంటిని, తటాలున నీళ్లువచ్చికొట్టుకొనిపోయినది. నేను చూచుచునే యుంటిని. పట్టెపిల్లను చూచుచుండుమని చెప్పితిని. ఆదియాటలాడుచు నీళ్లువచ్చినదే చెప్పలేదు. మీదేకాదు ఇంకా గొప్పవాళ్లవి చాలాపోయినవి. వారితో సమాచారమును చెప్పగా మన్నించి పొమ్మన్నారు" అనిచెప్పును. చాలా చింతపడుచున్నట్లభినయించి దండములుపెట్టును. కొన్నిచోట్లలో యీచాకలివారలు గొప్పవారి విలువగల వస్త్రములను చేర్చుకొని మూటగట్టుకొని దూరముగా నేదేనియుం బల్లెకు పాఱిపోవుటయుంగలదు.

చెన్నపట్టణములో వంచనలేని వాషింగ్ కంపెనీయనియు, మోసములేని లాండరీయనియు, పలువిధముల పేరులతో బోర్డులువేసిన చాకలివారియంగళ్లుగలవు. చొక్కగా చలువచేసి యివ్వఁబడునట్లు పత్రికలు నయితము ప్రకటనఁజేయుచుందురుగాని కూలియో యేమాత్రమును తక్కువ యుండనేయుండదు. గుడ్డయొకటింటికి ఒకఅణా, రెండణాలు తీయకవిడువరు. కొంచెము శీఘ్రముగ కావలయునని కోరితిమేని యధికచార్జి యివ్వవలయును. తప్పదు. వీరియొద్ద గుడ్డనిచ్చితిమేని యొకచలవతో యాగుడ్డసరిపోయినట్లే! మఱుచలవకు దానిరూపమేయుండదు. దూదివలెనైపోవును. ఇట్లు పోగొట్టుటకన్నను కొంచెము శ్రద్ధపుచ్చుకొని మనమే యుతుకుకొనుట యుక్తము. ప్రతచాకలివారలకు బదులుగా మేము క్రొత్తచాకలుల మేర్పడినామని యెక్కడచూచినను తురకలును, ముదలి, నాయుఁడు, గొల్ల, మాల, సెట్టి మొదలుగాగల వారునయితము గుడ్డలను చలవఁజేసియిచ్చెడి వ్యాపారము నవలం

బించి యంగళ్లుపెట్టి పెద్దపెద్దపేరులతో బోర్డులనువేసుకొని కూర్చుండి పుట్టినదిమొదలు గుడ్డల నుతుకుటయే వృత్తిగాజీవించు చాకలివారి బ్రతుకును చెఱుపుచుండెదరు. ఇటువంటి లాండరీలలో గుడ్డలనిచ్చు విలాసపురుషులు ప్రతినెలయు గ్రొత్తవికొనుటకు డబ్బు సంపాదించి పెట్టుకొనియుండక తప్పదు. జనులారా! ప్రతిదినమును శుభ్రముగా మీవస్త్రములను మీరేయుదుకుకొనుట మంచిదికాదా? యుద్యోగస్థులుగాయున్నచో యోగ్యుఁడైన చాకలివానిని విచారించి వలసినంత వరకును తనగుడ్డలను చలవఁజేయించుకొనవలయునేగాని వానికిని యింటఁగలవస్త్రములన్నియు వేయకూడదు. వేసినచో మొదటచెప్పినట్లు చేయకమానఁడు.

క. చాకలికి గుడ్డవేయుట
యేకడుమోసంబుతెచ్చి కీ యివ్వకదానిం
బోకడ యిడికలుఁ ద్రాగుం
గాకుండిన విక్రయంబుఁ కీ గావించుకొనున్.



# ఇల్లు బాడుగకు తీసుకొనునట్లు చేయుమోసము.

ఒక ముసలివాఁడు, ముసలిదియును, నొకచో నొకయిల్లు కాళీగాయున్నదని చూచి తెలిసికొని కాళీపడియున్న యిల్లునుఁజూచి యింటివారి దగ్గఱకుపోయి బాడుగ మాట్లాడుదురు. ముసలిది తాము మాట్లాడుకొనినస్థలము నటునిటుంజూచి యిష్టపడినదానివలె నటించి, ముసలివానితో "ఈ యిల్లు మన కనుకూలముగానేయున్నది. నాకు సమ్మతమే! మంచిదిరండీ! పోయి రేపటిదినము మనకు కావలసినసామానులను తీసుకొని వచ్చిచేరుదము. రేపువచ్చునట్లును మఱియెవ్వరికి నివ్వకుండునట్లును, మీరు వీరితోచెప్పి లేనండి, ప్రొద్దైనది. వచ్చినపని యనుకూలముగా కుదిరినది ఇంకపోవుద" మని చెప్పును. ఆమాటలువినగానే ముసలివాఁడు మండిపడి, వాకిట యరుగుపైఁగూర్చుండి కదలక, మహాకోపముతో, ముసలిదానింజూచి "ఒసే! ఇంకనోరుమూ

నుకొని యూరకుండుము. నీప్రసంగము చాలును. నేనక్కడనే నీకు చెప్పియుండలేదా? ఆచండాలుని ముఖము నిక నేను చూతునని తలంచితివా? ఓసే! ఓసే! ఎంతధీమసము? ఎంత పొగరుబోతుతనము? ఆహా! నన్నుత్రాకి వాఁడు చేయెత్తికొట్టినాఁడే! యటువంటివానిముఖమును చూడఁదగునా? ఛీ! ఛీ! వానియెదటికైనం బోవుదునా? నేను బుద్ధిలేనివాఁడనని తలఁచితివిపో కాఁబోలు. ఇష్టమున్నయెడల నీవుపొమ్ము. నన్ను తొందఱపెట్టవలదు. ప్రాణములు పోవుచున్నను నేను రానని బహుఖండితముగాను, కడుక్రోధముతోడను పలుకును. అప్పుడిట్లువాదించుకొందురు.

ముసలిది—మీకిదియేమి వెఱ్ఱితనము? వాఁడు మనబిడ్డకాఁడా? తెలివిలేక తొందరపడి యొకదెబ్బ కొట్టినాఁడు. నిజమే! అయిన? తండ్రి సహించుకొనకూడదా? ఇంతవయసుచెల్లినను మీకింకను మంచిచెడుగులు తెలియలేదు. అయినంతవరకునైనది ఉండనివ్వండి. కుటుంబవిషయములనుగుఱించి యింతటి యాగ్రహముఁజెంది సంసార రహస్యములు బయటఁబఱచవచ్చునా? రండి లేవండి రేపటిదినము వచ్చి మీయిష్టప్రకారమే యిచ్చుటచేయుదము.

ముసలివాఁడు—ఓసే! ఒకటేమాట. నీకుకావలసియుంటే నీవుపో! నేనురాను. నాకు కనమాఁడా వాఁడు? భగవంతుఁడు నాకేదో యొకవిధముగా జీవనమునకిచ్చియున్నాఁడు. నాకువచ్చు పింఛను పదిరూపాయలు నాకుచాలును. వానినిపెట్టుకొని సుఖముగానుంటాను. వాఁడు నాకుదండుగగా నొకపూటకన్నను పిడికెడన్నము పెట్టలేదు. నాపింఛను నెలకు 10 రూపాయలున్నాను తెచ్చి చేతులో పోయుచున్నందున, నింతకాలముఁ బెట్టినాఁడు. ఇంకనేమి? నేను బ్రతుకలేనా? చూతము. నాపింఛనే నాకుచాలును. వాని సంపాద్యము నాకక్కఱలేదు. నాబ్రతుకుతెరువు నేనెఱుంగుదును. వ్యర్థముగా [illegible]ంపఱచేయకుము. నీవు గాడిదజన్మమెత్తినదానవు? పోవే! పో! బుద్ధిలేనిదానా! ఇంకొకసారి యింటికిరమ్మని చెప్పితివా? తరువాత నీయెముకలు విఱుగఁదన్నుదును. బాగుగా యోజించుకొనుము. నాయిష్టప్రకారము నడుచుకొనెడిదానవైనచో, ఇవిగో! ఈరెండురూపాయలను తీసుకొని

యంగడికిపోయి, కావలసిన వస్తువులఁదెచ్చి వంటచేయుము. ఇవే. రూపాయలు తీసుకొను" మని బహుబిగువుగా చెప్పెను.

వీరివివాదమును విని యింటివారలు దగ్గరకువచ్చి, "ఏల? ఇట్లు తగవులాడుట కేమికారణము?" అని విచారింతురు. ఇదికలిగినదేకదా! వారటుల నడిగినంతట ముసలిది వారలంజూచి "అమ్మా! ఇంతవయసు చెల్లిన పెద్దవాఁడైన యీయన యెంత వితండపుమనిషిగాయున్నాడు? మీరేచూడండి? ఒకవేళ మనకడుపునపుట్టినవాఁడు, మనకుమారుఁడు మతిలేకతిట్టినాఁడు. తిట్టినసేమి? ఇంతయాగ్రహముఁ జెందవచ్చునా? వాఁడుచేసినది నేరమే! కాదనను, గాని, యైనను పెద్దవాఁడైన తనకు కొంతశాంతము కలిగియుండవలయును. అట్టేలేచి వేరుగానుండుటకు వచ్చినాఁడు. సరే! తనయిష్టప్రకారమే యుండవచ్చును. అయిన తటాలునరాగానే వచ్చినచోట నన్నియు నమరియుండునా? వంటచేయుటయుం బెట్టుటయు నెట్లు? ఈదినముపోయి కావలసినసామానుగొని రేపు వచ్చిచేరుదమని పిలిచినందుకుగా యిటులమాట్లాడుచున్నాఁడు. మంచిదిగానే యిల్లుకుదిరినది, చేత డబ్బున్నా పెట్టుకొనియున్నాము. అయిన? వంటచేసికొనుటకు పాత్రములు కావలయునుగదా! అవిలేకున్న నెట్లుజరుగును? ఎక్కడనుండివచ్చును? పోయి వానినైనం దెచ్చుకొనవలదా? ఈకష్టమంతయుం దనకేమితెలియును? మీరైన నీయనకు కొంచెము తెలియచెప్పిపంపుడు. ఇదేమిపాపమో మహాయుగ్రముగాయున్నాఁడు" అనిచెప్పెను. అపుడు యింటివారు తమవలననైనంతవరకును ముసలివానికి సమాధానముఁ జెప్పెదరు గాని యతఁడు "ససేమిరా"యని వారిమాటలు తిరస్కరించి "ఈవిషయమునుగురించి మీరెవ్వరును నేమియు నాతో చెప్పవలదు. నేనింక యీప్రక్కముఖముఁబెట్టకుండునట్లు ప్రమాణముఁ జేసుకొన్నాను. మీరెంతచెప్పినను ప్రయోజనములే" దని ఖండితముగా మాటలాడును. అపుడు యింటివారుతమలోనొండొరులు వీఁడుకడురోషగాఁడుగాయున్నాఁడు. ఈముసలిది యెంతపీకులాడినను, మొదటనుండియు పట్టుదలవిడువక యొకమాటలోననే నిలిచియున్నాఁడని చెప్పుకొనివారివివాదమునుమాన్చి ముసలిదానితో "సరే! ఎంతచెప్పినను నింక నితఁడురానసనుచున్నాఁడు. కొరకె నీవు బలిమాలుటవలన కార్యములేదు కాని మేము పాత్రముల

నిచ్చెదము. ఇప్పటికి వంటచేసుకొనుడు. రేపటికిపోయి తెచ్చుకొందువుగాక మీసామానులు” అనిచెప్పి తమయింటనుండియైనానిలో వారికి కావలసిన పాత్రములు తెచ్చి యొసంగుదురు. ముసలిది నిద్రపోక వారి మాటలకు సమ్మతించినదానివలె నభినయించి యాపాత్రములు తీసుకొని తాము బాడుగకు తీర్మానించుకొనిన గదిలో వంటచేయును. ముసలిదియు ముసలివాఁడును భోజనము జేయుదురు. అదిమొదలు తమకేదియో పనియున్నలాగున మాటిమాటికని వెలుపటపోవుటయు, వచ్చుటయునుగానుందురు. వారిపను లేమోయని యింటివారు దాని నంతగా గమనింపకుండుదురు. సమయముచూచి వారలిద్దరును తమ పెట్టెనుండునట్టియు, మఱియుం జేతికిఁజిక్కినట్టియు పాత్రములనెత్తుకొని సందడిలేకుండా నాఁటిరాత్రియో లేక, మఱుసటిరాత్రియో సజాగ్రతగా కమ్మిదీయుదురు. చూచితిరా! తంత్రము. పాత్రములనిచ్చినవారిపని లబలబలు కావలసినదే! ఇట్లు బహుయోగ్యులవలె నటించి పరులసొత్తుల నపహరింతురు.

గీ. బాడుగకుగదిఁగొని వంట కై పాత్రములకు
తట్టుముట్టాడఁగని దయఁదలఁచి యింటి
వారొసంగిన నడురేయి కై వాని సంగ్ర
హించుకొని పోవుదురుగాన కీయఁదగదు.

---

## దారినిపోవు వారిసొత్తు నపహరించు మోసము.

కొందఱు పోదాలును, దొంగలున్నను, యువకు లొకటిగా కూడి, దారిలోపోయెడివా రెవరైనను, సంచిలోగాని, యొడిలోగాని, యేదైనా యుంచుకొని పోవుచున్నారా! యని కనుచుండుదురు. ఎవఁడైన నటువంటివాఁడు కనుపడఁగానే, వీరిలో నొకరితో నొకరు జగడము పెట్టుకొని కొట్టుకొనుచు, వారిలో నొకనిని, తక్కినవారలు తరుముకొనివత్తురు. దెబ్బలుతినువాఁడు మహాభయముఁజెందినవానివలె వేగముగా తరుముకొనివచ్చెడివారికి చిక్కక పరుగెత్తివచ్చి యా పోవుచున్నమనుష్యుని తటాలున గట్టిగా కౌఁగలించుకొని, “అయ్యా! సామీ!

సామీ! నన్నురక్షించండి ఈపాపాత్ములందఱును నొకటై నన్నుఁగొట్టుచున్నారు అయ్యో! వచ్చుచున్నారు నేను వీరిచే దెబ్బలుపడి చచ్చిపోవునట్లున్నది ఇంక వీరు నన్ను బ్రతుకనివ్వరు. మీరు నన్నుకాపాడి వీరిని నాయొద్దకు రానీయక తరిమివేయండి" యనిగోడుగోడున నేడ్చెను. అదిచూచి యామనుష్యుఁడు పరితాపముగలవాఁడై, కొట్టవచ్చుచున్నవారింజూచి "ఏమిరా! ఈయన్యాయము. ఒకనిని మీరిందరుచేరి కొట్టవచ్చునా? పాపము! వీని నెందుకుకొట్టెదరు ఇదిమంచిపనిగాదు. పొండుపొండు లేనియెడల ఠాణావానితోఁ జెప్పెదను. నృగా చిక్కుపడుదురు. ఇంక వీనిజోలికిరావల"దని తనయొద్ద యున్నవానికి సహాయముగా మాటలాడెను. కొట్టవచ్చుచున్నవారా మనుష్యునిచూచి "ఏమి సామీ! మీరు వానిదుర్మార్గము తెలియక చెప్పెదరు. వీఁడెంతపనిని చేసెననుకొంటిరి. మమ్ము మోసముచేసి యెట్లు చెరిచినాఁడు? పరమదుర్మార్గుఁడు. మేము వీనిని విడిచిపెట్టిపోవుదుమా? ఎట్లుతప్పించుకొనునో చూతము. సామీ! మీరు విడిచిపెట్టి మీదారినిపొండు. వీని నీదినము విడువము" అని మాటలుపెంచి కౌఁగలించుకొని యున్నవానిఁబట్టి లాగి యందఱు నామనుష్యుని చుట్టుకొందురు. ఆమనుష్యుఁడు వారి దుర్మార్గమునకు కోపముజెంది వివాదపడుచుండగా వారిలో నొకఁడు నేర్పుతో యామనుష్యుని సంచిలోనో జేబులోనో యుండినదానిని సంగ్రహించుకొని మెల్లగా వెనుకగానే మరుగై పోవును. అంతట తక్కినవారా కౌఁగలించుకొని యేడ్చుచున్నవానింజూచి "సరే! పొమ్ము. ఈదిన మీయనవలన నీవు బ్రతికినావు. రేపటికైనం జిక్కకపోవుదువా? చూతముగాక" యని వానినిబెదరించి విడిచిపెట్టిపోవుదురు. కౌఁగలించియున్నవాఁడా మనుష్యునితోఁ కూడా కొంచెముదూర మరిగి, మఱియొకదారిఁ బోవువానివలె నింకొకవీధిగుండాపోయి తన సంగడికాండ్రతో చేరి సంపాదించినసొత్తులో భాగమును పంచుకొనును ఇటుల నక్రమముగా సంపాదించినసొత్తు త్రాగుటకో సిగరెట్లు బీడీలుం గొనుటకో నాటకములకో కాఫీహోటలకో సమర్పింతురు. మఱికొందఱు దారిలో నెవఁడైనను జేబులోడబ్బునుంచుకొనిపోవుచుండుటను కనిపట్టి యొకనివెనుక నొకఁడు బిరబిర యామనుష్యుని కెదురుగావచ్చుచుందురు. మొదటివాఁడా మనుష్యునకు సరిగావచ్చి తటాలున నతఁడు తన

పైఁ దాకినట్లు తాఁకి నిలుచుకొని, మహాకోపముతో తనముఖమును యామనుష్యునిముఖముతో చేరినట్లుచేసి "ఏమయ్యా! నీకు కండ్లు తెలియవా? పైఁబడెదవేమి? కొంచెమైనను నీకు తెలియకున్నదే! దారినిఁబోయెడివారినినయితము గమనించకపోవలెనా?" యని తగవునకుప్రారంభించును. వెనుకవచ్చుచున్నవారు వారివివాదమునుచూచువారివలె చుట్టునునిలుతురు. ఆమనుష్యుఁడు తనలో "ఇదేమి సంకటమువచ్చినదిరా? వీరిచేతచిక్కుకొంటి" నని తనలో తగవులాడుచున్నవారికి సమాధానముఁజెప్పుచుండును. అటుల నేమరియుండుసమయములో నొకఁడు చుట్టునుండువారి వెనుకనుండి యతిలాఘవముతో యామనుష్యుని జేబులోయుండినడబ్బునో, మనిపరసునో, యపహరించుకొని పారిపోవును. వాఁడు సొత్తును కొనిపోవువరకును నెదురుతాఁకినవాఁడు తగవులాడుచుండి, వాఁడు మరుగుకాగానే యామనుష్యు నొకమారు కడు తిరస్కారముగా "చాలుచాలు నీకిది మంచిదికాదు. పోవయ్యా! పో పో!" యని యలక్ష్యముచేసి పలికి విడిచివెడలిపోవును. ఆమనుష్యుఁడు తాను వానినుండితప్పించుకొన్నదే గొప్పయదృష్టముగా నెంచుకొని వెడలిపోవును. ఆవల యాదుర్మార్గులుచేసుకొని లభించినడబ్బును పంచుకొని తమకులదేవత నారాధించుటకై మద్యశాలం జేరుదురు. ఇటువంటివారలనుసయితము కనిన తలిదండ్రులు తమపుత్రులుగా నెంచి సంతసించుచుందురుకదా! ఆహా! వీరినిగురించి కాలము దుఃఖించును. జయిలు వీరికై యెదురు చూచుచుండును.

క. దారింబోయెడివారిం,
గ్రూరులు గికురించియిట్లు గొందురు డబ్బుల్
వారలు చేరఁగవచ్చిన,
దూరముగాఁ దొలఁగి నేర్పుతో జనగదగున్.



# జట్కాబండివారి మోసము.

చెన్నపురిలో జట్కాబండిని మాట్లాడుటకు బండ్లు నిలుచుచోటునకుఁ బోతిమేని యొకరికంటె ముందుగా నొకరువచ్చి "రండి! సామీ! ఇదిగో! సిద్ధముగా బండికట్టియున్నది, యెక్కండి, శీఘ్రముగా తీసికొనిపోయెద. ఇచ్చటనుండెడి వానిలో నాగుఱ్ఱమే మంచిది త్వరితముగా పరుగెత్తు"నని యడ్డమువచ్చును. అందఱును నిట్లే పలుకుదురు. ఎవనినో యొకని చూచి, మనముపోవదలంచిన స్థలమును జెప్పి "ఆచోటు నీవెఱుంగుదువా? తెలుసునా" యని యడిగినచో "ఓహో! ఏమిస్వామీ! ఇట్లుచెప్పెదరు. ఈపురిలోఁ బుట్టి పెరిగి బుద్ధితెలిసినది మొదలు యీవృత్తిలో యుండి యూరంతయుం దిరిగెడి నేనెఱుంగనిచో టొకటియున్నదా? రండిరండి యెక్కండి. రోడ్డులో బండిచాలసేపు నిలువఁగూడదు. పోలీసులు పట్టుకొందురు శీఘ్రముగా యెక్కండి యెక్కండి" యని బండిని దాపునకు లాగుకొనివచ్చి నిలిపి ద్వార పట్టును. బాడుగ యెంతయని యడిగితిమేని "ఎక్కండిసామీ! మీరు క్రొత్తవారివలె నడుగుచున్నారేమి? మీకు తెలియనిదేమియున్నది' కష్టమునుచూచి మీయిష్టప్రకారము బాడుగయివ్వండి. త్వరితముగా యెక్కండి" యని మిక్కిలి దడబుడజేసి తనబండిలో యెక్కించుకొనును. మాటిమాటికిని నసపెట్టుచు చవుకుతో కొట్టుచుండినను, వానిగుఱ్ఱము మడుగెత్తిపెట్టుటయే కష్టముగా యుండును. త్వరితముగా తోలుమనియంటిమేని కోపగించుకొని, "ఏమండీ! దేహము చెమటపట్టునట్లు గుఱ్ఱము పరుగెత్తుచున్నను, నింకనుం దరుమమనెదరు బాగుగానేయున్నది. ఇంతకంటె వేగముగాపోవునా? ఇదిమాత్రము మనవంటిజీవము కాదా? శక్తినిమించి యెట్లుపోఁగలదు? మీరులాగితే కష్టము తెలుసును. బండిలోకూర్చుండి యెన్నిమాటలైనం జెప్పవచ్చు"నని యధికప్రసంగముఁ జేయుటకు ప్రారంభించును. కాని యంతకంటె నడిపింపఁడు. అదియునడవఁజాలదు పోవలసినస్థలము సమీపముగాయుండినను, దాఘదారినిపోక యటునిటుం జుట్టిచుట్టి చాలాయాలస్యముఁ జేసి తీసుకొనివచ్చి, బాడుగ యివ్వబోయినపుడు మిక్కిలి తడవైనదనియు, చాలాదూరమనియుం దగవులాడి రొష్టుచేసి యొకటికి రెండంతలధికముగా బాడుగఁదీసికొనును. వానితో తగవు

లాంతఱుఁబాఱక యెక్కివచ్చినవాఁ డడిగినంతయు నిచ్చివేయును. కొంచెము యేమరినవాఁడుగా తోఁచునేని పోరాటమునకుసయితము సిద్ధపడును. కొందఱు బండివాండ్రు "శీఘ్రముగా కొనిపోయెద" మని యెక్కించుకొని, కొంచెముదూరము పోయి నిలుపుకొని యింక నెవరైనను వచ్చి యెక్కుదురో యని చూచుచుండును "అబ్బా! ఇట్లు తడవుచేయుచున్నావే! పోనిమ్ము. నేను శీఘ్రముగాపోవలయు" ననినయెడల కోపముతో "బేష్. ఏమయ్యా! మీకు బొచ్చే యీయెప్పుడుబాడుగకా పోవడము? చాలుచాలు యింకెవరైననుకుండా యెక్కక పోనిచ్చుటకు వీలు కాదు. ఇష్టములేకున్న దిగిపొండి" యని ఖండితముగాబలుకును. అట్లులనైన నాకేసరిపడు"దని బండిని దిగినయెడల "యంతవరకును వచ్చినందుకు బాడుగ నిచ్చిపొ"మ్మని తగాదాపెట్టును. మఱియొకబండివాఁడును వానికి సహాయముగానే పలుకును. తుదకు యిచ్చితీఱవలసినదే! ఎవఁడైన నేదేనియు వస్తువును బండిలోపెట్టి మఱచి దిగిపోయి కొంచెముదూర మరిగినంతట జ్ఞప్తికివచ్చి మరల వానియొద్దకుపోయి యడిగినయెడల "నాబండిలో నేమియు లేనేలేదు. ఇదిగో! బండి యిట్లే విప్పిపెట్టియున్నాను. ఉంటే చూచుకొనుఁడు" అని యావస్తువును దాఁచుకొని యేమియుం దెలియనట్లు పలుకును. వీరుచేయు పనులు మఱియు నెన్నోకలవు. ఈ బండ్లవాండ్లయుపద్రవము పట్టణములయందేగాక బయటి యూళ్ళయందును చాలచోటులలో కలిగియుండును. ఇట్టిదుర్మార్గులయిన బండ్లవారల బ్రతుకు తెరువు మంచిది కాకపోవుటవలననే, దేవుఁడు వీరిదౌష్ట్యము సహించుటకై లెక్కలేని మోటారు కారులును, ట్రాంబండ్లును. యేర్పడునట్లుచేసెను. అయినను పూర్ణముగా నింకను వీరివలనఁగలుగు సంకటములు నివర్తికాకున్నవి. గుఱ్ఱములు, యెద్దులు మొదలగువానియొక్క శాపమే వీరికి మోక్షము కాని వేఱేమియును లేదు.

క. జటకాల్ దోలెడివారలు
కుటిలాత్ములు వారినమ్మఁగూడదు మాటల్
దిటముగఁ దమకుంగుదిరిన
యటుమీఁదట నెక్కిపోవుటర్హంబు జనుల్.



కాలణాగాని వేంకటేశ్వరుని పేరుచెప్పి వానిచేతగల చెంబులో పైగుడ్డనందుగుండా వేయుదురు. ఈలాగువాడా యూరంతయుందిరిగి సాయంత్రమువరకును సంపాదించుకొని కూడినడబ్బుతో లేచి సూర్యుడస్తమించగానే, కల్లంగడికిపోయి మహాభక్తితో తాను తెచ్చిన కానుకలు చెల్లించి యాలుబిడ్డలతో, సురామహాదేవిని సేవించి యానందవారిధిలో నోలలాడుచుండును. మఱునాడును నిట్లే మఱియొకగ్రామమునకుపోయి డబ్బుసంపాదించును. మఱియొకనాడీదేవిధముగా సంపాదించబూని మట్టిపాత్రతో నంటించిన వెండ్రుకలజడలును, దాడీమీసములును నంటించుకొని పట్టెనామములుదీర్చి తానుతనభార్యయుపసుపులో తడిపినగుడ్డలుకట్టి కొంగుముడివేసుకొని తానుయిత్తడిపళ్లెమును భార్య నామములుబెట్టిన చెంబును చేతబట్టుకొని యింటింటికినివచ్చి, ముందుచెప్పినట్లే, తనకు గొప్పవ్యాధి కలిగినదనియు, యెన్నిమందులు చేసినను కుదురకపోయినదనియు, తనకు యేడుగొండలవానికొండకు గొంగుముళ్లువేసుకొని భార్యతోకూడా వచ్చి సేవింతుమనటుల మొక్కుకొని మునువుగట్టుకొంటిననియు, తనబాధ తీరినదనియు తిరుపమెత్తి కానుకలుగొని ప్రార్థన చెల్లింపబోవుచున్నాననియు బొంకి పాటగా చెప్పుచు "గోవిందా! గోవిందా! వడ్డికాసులవానికి కానుకలు సమర్పించుకొనండి, ఆయేడుగొండలవానికి ప్రీతిగా కానుకల నివ్వండి" యని కూతలుపెట్టి కడుభక్తిగలవానివలె నటించి వారువారు నిచ్చెడి కానులను చేతితట్టలో వేయించుకొని పోవుచుండును. కాని యివ్వ శక్తిలేక యెవరైనను బియ్యమును పెట్టినను వలదనిచెప్పడు. దానికై వానిభార్య పట్టుకొనియున్నచెంబులో వేయించుకొనును. యిట్లు సంపాదించి బియ్యమును తమకు భోజనమునకు పెట్టుకొని డబ్బును గోవిందనామస్మరణతో కల్లంగడికో, సారాయియంగడికో కొనిపోయి తానును తనభార్యయుం దప్పత్రాగి చేతిరూకలు "గోవిందా! గోవిందా!" యని కానుక చెల్లించిపోవును ఈకల్లంగడిభక్తులు తనపేరుచెప్పి "గోవిందా! గోవిందా!" యని యఱచెడి చెవులు తూట్లుపడునట్టి ధ్వనికి సహింపజాలక కాంబోలు వేంకటేశ్వరుండుపోయి యేడుకొండలకావల చేరియుండుటయని తోచును. ఆహా! ఏమిమోసము? భగవంతుని పేరుచెప్పి కపటవేషములతో లోకుల నేమరించి డబ్బు సంపాదించి,

కల్లుసారాయిత్రాగి యానందించెడి యిట్టివార లేగతిని పొందుదురో తెలిసినదికాదు. భగవంతుఁడీ దుర్మార్గుల దుష్ప్రవర్తనము తొలఁగించుకాల మెపుడువచ్చునోగదా! ఇట్టివారు దృఢకాయులుగాయుండియు శరీరకష్టముచేసి సంపాదించి జీవించుటకు సమ్మతింపరు. మన దేశమున నిటువంటి బిచ్చగాండ్ర సంఖ్య దినేదినే మితిమీరిపోవుచున్న దేకాని తగ్గుట లేదు. ఇది కాలమహిమకాఁబోలు.

క. అరదుగ పాటలుపాడుచు
తిరుపతికే గెదనునేను దేవునిఁగొలువన్
వరదునకుఁ గానుకలిమ్మనె
దరు కపటపు బిచ్చగాండ్రు దానినెఱుఁగుఁడా!

---

## బిచ్చగత్తె వైద్యుని వెదకునట్లు చేయు మోసము.

ఒకస్త్రీ తన పైఁటకొంగుతో బిడ్డను నడుమున కొకవైపున గట్టుకొని బిచ్చపుగింజలు వేయించుకొనెడిసంచి మఱియొకవంక భుజమునకు దగిల్చి యింటింటికిని వచ్చి.

### పాట.

ఆదిలచ్మిమిసీత యడవుఁకుబోయె - రామాహరీ!
కాయలాకులుదిని కాపురముఁజేసె - రామాహరీ!
మాయలేడిని సూచి మాతల్లిసీత - రామాహరీ!
పట్టినాకిమ్మని పతినికోరింది - రామాహరీ!
విల్లునమ్ములుగొని వెడలెరాముండు - రామాహరీ!
అఱచెనేయాలేడి హా! సీత! యనుచు - రామాహరీ!
ఆమాటలువినగానే యుకలిపోయింది - రామాహరీ!
మాయన్న పోవయ్య! మరదిలచ్చుముఁడా! - రామాహరీ!
అదిగోవింటివెయన్న యఱచుచున్నాఁడు - రామాహరీ.
అనిచెప్పితామరిది నంపెనాసీత - రామాహరీ!

అని యిట్లు పాటపాడుచు బిచ్చమునడుగును. ఇంటివారలు బిచ్చము పెట్టగానే, యచట యాయింటివారుగాని, మఱియెవరుగాని యుండినయెడల

చూచి వారు స్త్రీలుగా యుండినను పురుషులుగా యుండినను "పుణ్యాత్ములారా! మిమ్మొకటియడుగుతానండీ! ఏమనగా నా సమాచారము చెప్తానండి! మేముండుచోటు నెల్లూరుసీమలోనండి! ఉన్నట్లుండి నా కడుపులో గొప్ప బాధపట్టింది. అదియింతింత బాధయని చెప్ప శక్యముగాదు. గర్భములో ఒకటే మంట! ఒకటేపోటు కూడు లేదు నీళ్లు లేదు. ఒకటే అల్లాటమైపోయింది. ఎవరేమి చెప్పితే యామందులంతా తిన్నాను. అధికము కావడమే కాని తగ్గడము లేదు. యెముకలు బయటపడ్డాయి. పుల్లలాగా అయిపోయినాను. ఇంక బ్రతుకలేననితోచింది ఏమి చేసినను కుదరలేదు. లేవశక్తిలేక సంవత్సరకాలము మంచములో పడి యుండినాను అంతట ఒకపుణ్యాత్ముడు ఆయయ్య మనిసియని చెప్పలేనండి! ఆయొక్క ఈశుడే! ఆ యేడుగొండల దేవుడేనండి! మేముండేచోటున ఆ దారినే పోతూవుండి వాకిట మంచంపై బడి అల్లాడుచుండే నన్ను చూచి మా కర్మకి యేమి కరుణపుట్టినదో పిలిచినట్లు నాదగ్గరకు వచ్చినాడండి! నన్ను యెగాదిగా చూచి తలయాడించి "ఈలాగున యెన్నాళ్ళనుండి బాధపడుచున్నా"వని యడిగెను నేను చెప్పలేక పలుకలేదు. మావాళ్లు సవిస్తారం అంతా చెప్పినారండి! ఆయన యొద్దనుండిన సంచిలోనుండి యేదో చిటికెడు భస్మం తీసి నీళ్లు తెమ్మని యానీళ్లలో వేసియిచ్చినాడండి! అంతే! ఆయనయిచ్చింది. "నెలదినములలో మరలి యీదారిని వస్తాను. అప్పుడు నీకు నెమ్మదిగా ఉంటుంది" అని చెప్పిపోయినాడండి! మరుదినము తెల్లవారేవరకు ఆ బాధ మూడుపాళ్లు తగ్గిపోయినది ఆమరునాడు బాధమాయమైపోయింది. కులాసాగా ఉండింది. దేవుడిలాగా వచ్చి నా బాధ మాన్పినాడండి" యని మరియు దనకు మందిచ్చినవాని ననేకవిధంబుల శ్లాఘించుచును, వినుచున్నవారు దానిని "అతడు నెలదినములయిన తరువాత మరల వచ్చినాడా?" యని యడుగుదురు. బిచ్చపుది "ఔనండి చెప్పిన ప్రకారం వచ్చినాడు. నేను పాదములకు మ్రొక్కి "మీదయవల్ల బ్రతికినా"నని వేడుకొన్నాను. నా పెద్దబిడ్డకు దేహమంతా పొడలు, గజ్జి, కురుపులు కలిగి బాధపడుతుండిందండి! ఆబిడ్డను చూచి యేదో పత్ర కట్టి తినమన్నాడు. తనదారిని పోయినాడు. అంతే! ఒకటే పూట దానితోనే యాపుండ్లు, పొడలు నాలుగైదురోజులలో యెండిపోయి దేహం బంగారులాగా అయిందండి! ఆయన దేవుడేగా!

మణిసిగాడండి!" అని చెప్పెను వినుచున్నవారు "అతఁడెచ్చట నుండు నదియు తెలిసికొంటివా?" యని యడుగుచుండిరి. బిచ్చపుది "అడిగినా నండి! ఆయన యేమియు చెప్ప లేదు వెళ్లిపోయినాడు. రెండోసారి ఆయన వచ్చినప్పుడు మఱియొకమనిషి యాపుణ్యాత్మునితో కూడా వచ్చి యుండెను. ఆ రెండవవాయన నాతో రహస్యంగా "ఆయన యందే చోటు యెవరికన్ని చెప్పఁడు ఇట్లనే యేండ్లవాఁడుగా యుండి యిప్పటికి సంసారపు జోలిమాని పెద్దల పాదంబట్టినాఁడు. గొప్పగొప్ప గోసాయివాళ్ల నెన్నోచుటుకాలు, పరమ హంసక్రియలు నేర్చుకొన్నాఁడు. ఎప్పుడూ గంజాయి తాగుతూ ఊరూరు తిరుగుతుంటాఁడు. ఎవరికైనను యేదైనా ఉపకారము చేస్తే తనకు గంజాయాకు కొనుక్కుతప్ప మఱి యేమిన్ని తీసుకొనేవాఁడు కాఁడు." అని చెప్పినాఁడు. నాదగ్గఱ రెండురూపాయ లుండినవి. ఆపుణ్యాత్మునికి అంతటి ఉపకారం చేసినవానికి వెయ్యిరూపాయలు యిచ్చినా ఋణము తీఱదు. మేము పేదవాళ్లము. గంజాయికని యీ రెండురూపాయలైనా యిచ్చి దండము పెట్టవలెనని నేను తెచ్చే లోపలనే వెళ్లిపోయినాఁడు. రెండోమనిషి చేత యివ్వబోతే తాను తీసుకోవడం లేదన్నాఁడు. ఇంతమాత్రం చెప్పడం యెందుకంటే, నా మొగుడికి యిపుడు శూలనొప్పి తిరిగిపోటు కలిగి మంచంలో పడి బాధపడుతూ లేవలేకున్నాఁడండి! ఆయన పాదములు పట్టుకొని వేఁడుకొంటె యేదయినా యిస్తాడని ఆయనవలెనే తిరుగుతుండే వాళ్లనంతా విచారించుకొంటూ గ్రామాలన్ని తిరుగుతున్నానండి! నిన్న అదిగో! ప్రక్కయూరిలో యొక మనిషి కనుపడినాఁడు. మీతో చెప్పినట్లే నా సంగతులన్ని చెప్పినాను. నేను చెప్పిన గుఱుతు లెల్లాయని. "ఓహో! ఔనౌను. చూచినాను. నిన్న సాయంకాలము నాకొక బాధయుండగా చూచి మందిచ్చిపోయినాఁడు. యేమియు తీసికొనలేదు. నేనె బలవంతము చేసి గంజాయికని యొక రూపాయ నిచ్చినాను. ఆప్రక్కయూరికట్లు వెళ్లినాఁడు. అక్కడికిపోతే చిక్కవచ్చు" నని చెప్పి ఈయూరు దారిచూపించినాఁడు. నిన్న ప్రొద్దు గూకునప్పటికి వచ్చినాను. రాత్రియంతా యొకచోట పడియుండి ప్రొద్దటినుండి వీధివీధిగా తిరుగుచున్నాను. కనుపడలేదు. మీరెవరైన చూచియుంటిరేమోయని యడుగుటకే యిన్ని చెప్పినాను. సుమారు నలుబదియేండ్లుండును. గుండుమొగము, చామనచాయమనిషి, పొట్ట

పట్టి రంగుగుడ్డలు కట్టుకొని యుంటాఁడు. మొగాన పచ్చబొట్టుపొడిచి యున్నది. మెడలో రాతిపూసలదండ వేసుకొని యుంటాఁడు. ఆమనిషిని యీప్రక్కవచ్చినపుడు మీరుచూచియుంటే చెప్పండి మీకుపుణ్యం ఉంటుంది. వెదకి కనుకొంటాను. ఒకవేళ మీరు చూడకున్నట్టయితే ఇతట్టు వచ్చినయెడల, యొక యాడగూతురు, ఈలాగాకష్టపడి వెదకుచున్నదనిచెప్పండి" అని యీప్రకారము చెప్పివినుచున్నవారిని బతిమాలుకొనును వారు "అటువంటివాఁడిచ్చటికిరా లేదు. మేముచూడలేదు. వచ్చినయెడల యీలాగే చెప్పెదము పో" మ్మని పలుకుదురు. అది వెళ్లిపోవును

మఱి కొంతసేపటి కాయాడుమనిషి చెప్పిన గుఱుతులు సరిగా గలిగిన మగవాఁ డొకఁడు సంకకు సంచి నొకదానిని తగిలించుకొని యావీధిలోవచ్చును. ముందువచ్చిన యాఁడుది వానిని గురించిన చరిత్ర మచ్చటచ్చట చెప్పిపోవుచున్నందున, నెవరైనను వానిని చూచిన వారు పిలిచి "పాపము! యిన్నాళ్ల యాఁడుమనిషి వెదకుచున్నది. ఇంతకు కొంచెము ముందుగా యీవీధికివచ్చి విచారించి బిచ్చమడుగుకొని పోయినది, దానికిని దాని బిడ్డకును నీవు మందునిచ్చి వారికి కలిగియుండిన బాధలు మూఁడుపూటలలో నివారణయగునట్లు చేసినావఁట." అనిచెప్పి "అది చెప్పిపోయిన మాటలు వాస్తవమేనా?" యని యడుగుదురు. ఆమనుష్యుఁడు తలయూఁచి "ఔను! నిజమే!" యనును. ఇంతలో నలుగు రైదుగురు చేరుదురు. వారిలో నొకఁడు "నాకొక బాధయున్నది. ఏదైనను మందు నిచ్చెదవా?" యనియడుగును. "ఆలాగే! యిచ్చెద"నని యొకరివాకిట యరుగుపై సంచి ముందుబెట్టుకొని కూర్చుండి వ్యాధిచిహ్నములనడుగును. అతఁడు తనకుకలిగిన బాధయు, నెప్పటినుండి కలిగియుండునదియుం జెప్పును. ఆవైద్యుడు తలయూఁచి "ఫరవాలేదు నేనింత గురుప్రసాదంయిచ్చెదను. సద్గురుని కటాక్షం మూఁడుపూటలలో మీకు బాగైపోతుంది. భయములేదు. గురునాథుని దయయుంటే అన్నిరోగములునిష్ఫలమైపోతాయి నేనుయిచ్చునది గోసాయిచిట్కామందు. మీకుదొరికేదికాదు. నాసద్గురునియాజ్ఞ లేనందున మందుకుగా నేనేమియు పుచ్చుకొనడము లేదు. ఇంతజనులకు ఉపకారం చేయుమని గురునాథుఁడు చెప్పినాఁడు. మందుకు ఖరీదుతీసు

కొనేయెడల నేనిచ్చుదానికి యాభై రూపాయలగును. మీకు గురునాథునకు నమ్మితంగా, ఊరక చేయిస్తాను. గురుప్రసాదం (గంజాయి) తీసుకొనుటకు నా కేదైనాయిస్తారంటే. ఈమందు పథ్యము గిథ్యము లేదు. అన్నియుతినవచ్చును. అన్నిపనులు చేయవచ్చును." అని చెప్పెను. మందు తీసుకొనదలచిన మనుష్యుడు "మంచిది. ఆలాగే! మందుయిమ్ము" అనును వాడు సంచిలోనుండి చిన్నసీసాలు రెండుమూడుతీసి, యందలి తెల్లగను, యెఱ్ఱగను, నల్లగను, నుండెడి మూడురంగుల భస్మములను మూడింటినుండియు, కొంచెకొంచె మొక కాకితపుముక్కలో వేసి కలిపి "సద్గురుప్రసాదం" అని పొట్లముగా మడిచి యడిగినవాని కొసంగి "ఇది మూడుపూటలమందు ప్రతిదినము నుదయమున నీళ్లలో మూడింట నొకభాగము వేసి త్రాగవలెను మూడుదినములుచేయుండి గురుకటాక్షం మీదేహం బంగారం అయిపోతుంది" యని చెప్పెను మందుక్రయంకోరనందుకు సంతోషించి, తీసుకొనినవాడు గంజాయికిగా వానికొకరూపాయకు తక్కువ లేకుండాయిచ్చి, యచటనుండెడి తక్కినవానితో "గోసాయిక్రియలు తప్పక మేలుచేయును. ఇవిదొరకడం చాలాకష్టము. ఏమందులవలననుం గుదురనివ్యాధ్యము లోకపూటలలో గోసాయిమందులవలన నివర్తియగును ఈమధ్య మా మేనత్త కొమారునకు బలమైన యొకవ్యాధి సంభవించి యెన్నోమందులుచేయించితిన్నాడు. యెంతో డబ్బు కర్చుపెట్టినాడు. వైద్యులకు లెక్కయే లేదు. ఏమియుప్రయోజనము లేకపోయినది. ఒకనాడు ఢిల్లీ యొక బైరాగివచ్చి గంజాయి కేమైనా యివ్వమనియు, పరమహంసక్రియ నిచ్చెదననియుచెప్పగా వానిమాటలు యెవ్వరును నమ్మలేదు. రోగిగా యున్నవాడు "వ్యాధివచ్చినవాడును, వెఱ్ఱివాడును నొక్కటియే!" యన్నట్లు "ఏపుట్టలో యేపాముగలదో యెవ్వరెరుంగుదు"రనియెంచి యొకరూపాయి నిచ్చి వానియొద్ద చిటికెడుభస్మముతీసుకొని తిన్నాడు. ఆయాశ్చర్యము నేమనిచెప్పవచ్చును? రెండుపూటలకే వ్యాధి మాయమైపోయినది. అందఱును నవుడానందించి యాబైరాగిని వెదకినారుగాని యతడు కనుపడలేదు. కాబట్టి యిట్టివారిమందులవలన తప్పక గుణముకలుగును" అనిచెప్పెను. అంతట లోకములో ప్రతివానికిని, యేదో యొకసంకటము కలిగియేయుండునుగదా! వారువారును, కథ

పులోమంటయనియు, నొప్పియనియు, జీర్ణశక్తి లేదనియు, నిట్లే తమకు తమకు కలిగినరోగములు చెప్పుదురు. వాఁడు వారివారికిని తనయొద్ద నుండెడి భస్మములనుకొందఱికి కలిపియు, కొందఱికి కలుపకయు, నిట్లు మార్పులతో నిచ్చి గంజాయికిగా ప్రతివానియొద్దను డబ్బుతీసుకొని సీసాలుసంచిలో వేసి భుజమునకు తగిలించుకొని "జేగురునాథా! భగవాన్! జేసద్గురుస్వామి!" యనిపలుకుచు లేచి యటనుండి కదలిపోవును. మందుతీసుకొనినవారు వాఁడుచెప్పిపోయిన పద్ధతిప్రకారముగా పుచ్చుకొని యందుచే ప్రయోజనములేకపోయినంతట వానిమాటలునమ్మి గంజాయికని డబ్బుసమర్పించి వాఁడిచ్చినపొడి తీసుకొనిన తమ యవివేకమునుగూర్చి చింతింపుదురు, వాఁడిచ్చినభస్మములు, నామకొవ్వు రొముక్కయు యిటుకరొముక్కయు, బొగ్గుమొక్కయు, మెత్తగాచేసిసీసాలలోపోసియుండిన పొడులేగాని మఱేమియునుగాదు. వానికిముందు వచ్చినయాఁడుదియు వాఁడును భార్యాభర్తలేగాని యన్యులుగారు. ఆయువతి ముందుగా నచ్చటచ్చట నటులచెప్పిపోవుచుండును. వెనుక మగవాఁడు సంచితో బైరాగివలెవచ్చును. ఆయాఁడుదానిమాటలువినిన వారునమ్మి వానియొద్దమందుతీసుకొని గంజాయికొనుటకుగా ననెడి నెపముతో వాఁడడిగినట్లు డబ్బునిచ్చి కడపట తాము నెత్తివెంగళప్పలగుదురు. ఆమోసగాఁడు యీతెఱగున డబ్బుసంపాదించి సాయంకాలమున తామేర్పఱచుకొనిన సాంకేతికస్థలములో భార్యనుకలుసుకొని మహాదుత్సాహముతో సారాయిదుకాణమునకుపోయి తాను సంపాదించిన డబ్బునుచెల్లగట్టి కావలసినంత త్రాగి ముసాఫరుఖానాలోనో, చావడిలోనోపోయి శయనించి పరమానందమనుభవించుచుండును. జనులారా! చూచితిరా! బిచ్చగాండ్రు చేయుమోసము.

గీ. మూడుపూటలలోరోగ ములనుమాన్పు
వాఁడుగోసాయివాఁడె! యీ వంకననుచు
వెదకియాఁడుదిపోవగా వెనుకమగఁడు
వచ్చుదానొక్క బైరాగి వలె నెఱుఁగుఁడు

# డుబుడుక్కి వాండ్ర మోసము.

భరతఖండమున హీనజాతులని చెప్పబడువారిలో డుబుడుక్కివారు నొకతెగవారని చెప్పదగినవారు. ఈతెగవారికి, గృహములుగాని, నివాసస్థానములుగాని, వ్యవసాయపు భూములుగాని యుండవు. కుటుంబసహితముగా, నూరూరునుండిరిగి బిచ్చమెత్తుకొని జీవింపుచుందురు. ఆయాగ్రామములలోని చావళ్లలోగాని, సత్రముల వెంబడిగాని వీరు రెండుమూడు కుటుంబము లొక్కజట్టీవచ్చిదిగి, యాచుట్టుప్రక్కల గ్రామములలోతిరిగి భిక్షమెత్తుకొని వసతిగాయుండు మఱియొకయూరికిఁ బోవుచుందురు. వీరికి భిక్షమెత్తుకొనుటయే జీవనముగాని, కాయకష్టమునకు పూనుకొని యితరకార్యములేవియైనం జేసి సంపాదించుకొననొల్లరు. వీరలుచేయుపనియేమనగా, వేకువకాలముననే లేచి ముఖముగడుగుకొని గంజిద్రాగి, మోమునకావిబొట్టుబెట్టి కుంకుమరేఖదీర్చి ద్యైదాగురకముల గుత్తులు మెడచి పాగాచుట్టుకొని చొక్కాయితొడిగి తలగుడ్డకును చేతులకును రాగితాయెతులుగట్టుకొని, రెట్టలకు పలువిధముల కడియములుతొడిగి, యక్కడక్కడ యాచించి సంపాదించిన మంచివియును జినిగినవియునైన వివిధరంగుల వస్త్రములను పాదములవరకును జీరాడుచుండునట్లు రెండు భుజములమీదను వేసుకొని యొకవంక పెద్దదగు కిట్లసంచి జగిలించుకొని వీపున పులితోలుగాని, చిఱుతతోలుగాని యొకదానిని వ్రేలగట్టుకొని, డుబుడుక్కియనువాద్యము చేతఁబట్టుకొని దానిని కడునేర్పుగా వాయించుచు, గ్రామములో ప్రవేశించి "ఈవీధికి మంచికాలము రాబోవుచున్నది. మేలైన దినములురానున్నవి ఏకొఱంతయునుం గలుగదు మిక్కిలి సంతోషం కలుగును. మంచిలాభమువచ్చును. పలుకవే, యంబా! మేలైనవాక్కునీయవే! మహామాయీ! పలుకవే, కాళీ! పలుకవే! మంచిమాట చెప్పవే! ఆయీ! మళయాళశక్తి! ఉద్దండశక్తి! అంకాళభగవతీ! కట్టికాత్తాయీ! భద్రకాళీ! శుభమైనవాక్కునీయవే! తల్లీ!" యనియఱచుచు, వీథులుతిరిగి యొకరియింటికివచ్చి "అయ్యగారికి మంచికాలము వచ్చును. మంచియదృష్టము కలుగబోవుచున్నది. మేలైన శుభసమాచారము వ్రాసినజాబువచ్చును. అడుగో! ఆపిల్లవానికి అదృష్టపట్టు

తుంది. బొజ్జ పెరుగుతుంది. ఇనుపు పెండ్లాలకు మగఁడు కాఁబోఁతాడు. సంసారము పాలుపొంగినట్లుగా పొంగుతుంది, మహాశక్తి, మళయాళ దేవత మేలైన పలుకు పలుకుతున్నది. అట్లు చెప్ప వేయంబా! యిటుల బలుక వేతల్లీ! అయ్యకు జయకాలము జయకాలము. ఒకరిమూలముగా తలఁపనితలంపుగా కొంతడబ్బు రాగలదు. మీకు పట్టియున్న పీడ వదలి పోతుంది, శనితొలఁగిపోయినది. అదిగో ! ఆమూలగా యుండేవాఁడు మీమీఁద విరోధం సాధించుచున్నాఁడు మిమ్ము చెఱచుటకు ప్రయత్నము జేయుచున్నాడు. మీకు పగవాఁడైన యా చండాలుఁడు. ఆపాపాత్ముఁడు. ఇంకకూడినంతశీఘ్రములో "అయ్యో! యని కూలిపోఁగలఁడు. వానికి చెడ్డకాలం చేరువలోయున్నది. ఈచిన్నవాఁడు బలే మోసగాఁడవుతాఁడు డబ్బుగలవాఁడవుతాఁడు. ఆ యదృష్టం ముఖమున కనబడుతున్నది, అయినను, బలేరోసగాఁడు. కోపం ముక్కుమీఁదనే యుంటుంది, ఆదిశక్తి, దుర్గాంబ, మహామాయి కలిగినది కలిగినట్లు పలుకుచున్నది, మీపై పగఁబూనియుండే చండాలుఁడు, ఆదుర్మార్గుడు వానినోట మట్టిపడుతుంది ఒకచిన్న పనిచేసినయెడల వాఁడు మట్టిలో కలిసిపోవును. ఇదో! ఈవైపుననుండి దుష్టపిశాచమొకటి రాత్రులు తిరుగుతున్నది. ఈయింటిసమీపముగా రాకుండునట్లు దానివాత మన్ను వేస్తాను. నేనొకన్నులైన యుపకారంచేస్తాను. మీపగవాఁడు పాడైపోవునట్లు చేస్తాను. అయ్యా! మీరు తొడిగివిడిచిన ప్రాతచొక్కాయ యొకటియివ్వండి చాలును. అదిగో! ఆయింటిస్వామిగారు యీపంచదయ చేసినారు. వారుమహారాజులుగా ఉండవలెను. వారిని దేవుఁడు రక్షించును. అమ్మగారు తొడిగివిడిచిన రవికయదిగో! దండెముమీఁద వేసియున్నది. అదిదయచెయ్యండి మీకుపట్టిన పీడవదలునట్లు నేనుమంచి కార్యము చేసిపోయెదను. మరేమియునాకు మీరివ్వనక్కఱలేదు. మీరుపైన వేసుకొనియుండే వస్త్రమునుయివ్వండి. అదేచాలును. అమ్మగారూ! ఒకపడిబియ్యమును, మిరపకాయలును, చింతపండును, ఉప్పున్ను, చేటలోతీసుకొనిరండి! నేను గొప్పపనిజేసియిస్తాను. మరల మీబియ్యమును మీరేతీసికొనిపొండు! నాకక్కఱలేదు. అయ్యగారిచ్చే వస్త్రము చాలును. నెలదినములలో నేను మరలవస్తాను. అపుడు మళయాళశక్తికటాక్షం మీకుకలిగితే, తిమ్మడికి యొకవస్త్రంయివ్వండి,

అమ్మా! తాయీ! మేలుచేయువే! తల్లీ! జగదాంబా! నీవతొలిగించవే! యాదిశక్తీ! పరంజ్యోతీ! బగళాముఖీ! అమ్మా! బియ్యం వేగం తెన్నండి, మీపగవాఁడు నాశమైపోతాడు. మీకుపట్టిన శని తొలఁగిపోతుంది. మంచియదృష్టం పట్టుతుంది" అనియిట్లు తోఁచినమాటలన్నియుం జెప్పును వానిమాటలన్నియు నట్టివని యెఱిఁగి, వాఁడు ధరించియున్న కడియములు, తాయెతులు కుంకుమరేఖలు కావుబొట్లనుంజూచి భ్రమసియు తెలివిలేని స్త్రీలా మాటలనునమ్మి, వానిమాటలలో నేదేనియు నొకటితమకుటుంబ విషయమున సరిదాకినయెడల యదియాధారముఁ జేసికొని వాస్తవముగా డుబుడుక్కువాండ్లకు మళయాళశక్తి పెశ్యమై యుండి భూతభవిష్యద్వర్తమానములను చెప్పుచుందురనియు, వారియొద్దగొప్పక్రియలుండుననియుదలంచి, తమపీడవదలించుకొనుటకై వాఁడు చెప్పినట్లు బియ్యమును యితరవస్తువులుం దెచ్చి వానిముందు పెట్టుదురు. అటులయుంచగానే, వాఁడుతనయొద్ద వెంద్రుకత్రాళ్లుచుట్టి బంకపూసియెండఁబెట్టి తయారుచేసి సంచిలో పెట్టుకొనియున్నట్టి యెముకను వెలికిఁదీసి, "ఇదిగో! ఇదియొకచండాలునియెముక. ఈపాపాత్ముడు నాశమైపోయినాఁడు. వీనినోటచుట్టివేసి మంత్రముతో కట్టుకట్టినాను. మీపీడవీనిమూలంగా వీడిపోతుంది. ఈదుర్మార్గుఁడనుభవిస్తాఁడు" అని చెప్పియాయెముకను వారుతెచ్చిన బియ్యముమీఁదపెట్టి "అంబా! పగవాని మట్టిలోగలుపవే! మళయాళశక్తీ! నాశముఁజేయువే!" యని పాడి తానుంచిన యెముకపై నుమిసినట్లుగా యాబియ్యమున, కాటి తుప్పతుప్పననుమిన్నైచి, పండ్లుగొఱుకుచు, గ్రుడ్లురిమి యెముకను చూచుచు "ఒరే! చండాలుఁడా! తొలఁగిపో! తొలఁగిపో! ఇంకనీవి యింటివంక తలయెత్తిచూడవద్దు. చూచితివా? మళయాళశక్తి నిన్ను మట్టిపాలుచేస్తుంది. శీఘ్రముగా, వేగిరముగా, ఓరిపాపాత్ముఁడా! తొలఁగుతొలఁగు" అని వలుకుచు, యెముకనుపట్టుకొని చేటలోనిబియ్యమునకు మూఁడుసారులుచుట్టి, మరల బియ్యపైనుంచి మూఁడుసారులు ముందటివలెయుమిసి, యంతటయెముకను సంచిలో పెట్టుకొని, "అమ్మా! నేటితో మీపీడవదలిపోయింది. మీకు పగవాఁడుగాయుండే పాపాత్ముఁడు మట్టిపాలైపోతాఁడు. ఇంక భయములేదు. మళయాళతాయి మీకు సాయముగా ఉంటుంది. మంచియదృష్టం కలుగుతుంది. అమ్మ

గారూ! ఇదిగో! మీరు తెచ్చినబియ్యము వస్తువులతో తీసుకొనిపొండు"
అనిచెప్పును. ఎదటనుండి, వాఁడుమనుష్యుని యెముకయనిచెప్పి దాని
తో దిగదుడిచి మీఁదయుంచఁబడినదియు, మాటిమాటికి నెంగిలి
యుమిసినదియు, పీడతొలఁగుటకై పెట్టినదియునైన యాబియ్యమును,
వస్తువులను ముట్టుటకునయితము సమ్మతింపక వివేకహీనులైన యా
యాఁడంగులు భయముచెంది "మాకక్కఱలేదు. వస్తువులును బియ్య
మును నీవేతీసికొను"మని చెప్పుదురు. అటుల వారుచెప్పెదరనుటయుం
దేవాఁడెఱిఁగియుండును. గాన, వానినితీసి తనసంచిలో బోసుకొని,
తానాపనిని చేసినందుకై మంచిదిగాయొక యంగవస్త్రమును, దానికి
వడ్డీగా యొకరవికయుం బుచ్చుకొని వెడలిపోవును. ఈమాయకాండ్రైన
"డుబుడుక్కవాండ్రు సంతానములేనివారికి బిడ్డలుకలుగుటకు క్రియలుక
లైన" మనిచెప్పి, మూడువర్ణముల నూలుకండెలు తెప్పించి తమసంచి
లో పెట్టుకొనియున్న యెండినవేరొకటితీసి యంగుళముపొడవుత్రుంచి
దానికానూలుచుట్టి, "సాంబ్రాణిపొగవేసి రెట్టకుకట్టుకొనుఁ"డని యి
చ్చి, యొంటి, యర, రొక్కముగాని, బియ్యముగాని, వస్త్రముగాని
సమయానుసారముగా నొడఁవుకొని పోవుటయుంగలదు. ఇట్లుసంపాదిం
చినగుడ్డలును, బియ్యమును, తమకంటె పేదవారైన జనులకు విక్ర
యింతురు. ఇటువంటివారియొద్ద డబ్బుకూడా యుండునని లోకులుచె
ప్పెదరు. అదియెంతవరకునిజమో దేవునకేయెరుక. ఇవి మగవారుచేయు
పనులు, ఇంకవీరిలో స్త్రీలు చినిగినవస్త్రములను కుట్టియిచ్చెదమని సూది
యుదారమునుగొని యింటింటికింబోయి యడుగుదురు. మనయిండ్లలో
తమవస్త్రమును కుట్టుకొనజాలని సోమరులైనస్త్రీలు, గుడ్డలు కుట్టుటకు
వారిచే యిచ్చినయెడల కుట్టుచున్నట్టేయుండి యింటివారేదైన పని
గలిగిలోపలపోయిన, సమయమునుచూచి కుట్టుచున్నగుడ్డలోమూరెడు
చించిదాచుకొని మిగతనుకుట్టి మడిచియిచ్చి కూలి తీసుకొనిపోవుదురు.
సమయముదొరికెనా? మొత్తముగా యిచ్చినగుడ్డల నల్లేయెత్తుకొని
పాఱిపోవు వారునుంగలరు. తరువాతయింటివారు లబలబలాడవలసిన
దే! వారినికనిపట్టుటకు సాధ్యముకానేకాదు. వెదకఁబూనినచో వృథా
ప్రయాసముతప్ప లాభములేదు. ఈజాతిబిచ్చగాండ్రులనే తిరిగినంపా

దించుకొని జీవనముచేయుచుండుగాని స్థిరముగా నొకచోట నివాసము నేర్పఱచుకొని యుండెడివారు కారు.

గీ. మాయదుబుక్కవారల మాటలెల్ల
సత్యములగునని నమ్మఁగా జనదుజనులు
మనలఁగురించి యేదేనిఁ గొనుటకొఱకు
పలుకుదురు సర్వవిషయముల్ దెలిసినట్లు.

---

## వీధి భాగవతగాండ్ర మోసము.

వేషములుకట్టుకొని యాటలాడువారికి భాగవతగాండ్రని పేరు. వీరు కొంచెకొంచెము భూమిపుట్రపెట్టుకొని వ్యవసాయము జేసికొనుచు తమ యంతరమునకుఁ దగినట్లు యిల్లువాకిలి సేద్యమునకు కావలసిన పశువులుంగలిగి పరిపాటిగా జీవనసదుపాయము గలవారై యుందురు. వ్యవసాయము జరిగింపవలసిన కాలమున యాపనులు జరిగించుకొనుచుండి, తీరుబడిగాయుండుకాలములో పదుగురు పదునైదుగురు జతగూడి మేళముగట్టి యాటలాడి డబ్బు సంపాదించుకొనుటకై యూళ్ళకు ప్రయాణమై పోదురు. సాధారణముగా యిటువంటి మేళములలో, బ్రాహ్మణేతరులును, చదువు తెలియనివారును, స్వల్పజాతులవారును, శరీరకష్టము చేసి సంపాదింపనొల్లని సోమరులును ముఖ్యముగాచేరుదురు. ఇట్టివారలగు నాటకగాండ్రకూటమునకే భాగవతమేళమని పేరు. వీరలేదేనియొక గ్రామమునకుఁబోయి, యందలి పెద్దమనుష్యులను ప్రార్థించి యాటకుగా తాంబూలమునుపుచ్చుకొందురు. ఆటకుగా నిర్ణయింపఁబడినదినము కొంచెము దూరముగాయుండినయెడల మఱికొన్ని గ్రామములకుపోయి యక్కడక్కడ గ్రామస్థులను ప్రార్థించి కేళిక తాంబూలములంగొని, ఏగ్రామములో ముందుగాజరుగునట్లో యాగ్రామమునకు తామెంతదూరమునసుండినను నాఁటి సాయంకాలమునకు వచ్చిచేరుదురు. ఆదినము గ్రామస్థులే వీరికి మూఁడుపూటలును భోజనము పెట్టవలయును వీరుతమయిండ్లలోనుండునప్పుడు చల్లనీళ్లును, గంజినీళ్లును త్రాగుటతప్ప యన్నమైన భోజనమెఱుంగరు. కావున తామాటలాడవచ్చిన గ్రామములలో, తమ కన్నము పెట్టెడివారి కొంపలు కూల్చివేయుదురు చెప్పవలసిన

లేమి? ఒక్కొకడు రెండుసేరుల బియ్యపుటన్నముతోఁగాని సంతుష్టి నొందఁడు. "ఆకలిగొన్నను కనపచేనుదొరకిన" దన్నట్లు మితములేని యకభుజింతురు. గ్రామస్థులకష్టము భోజనముపెట్టుటతో తీఱునదికాదు. ఆటపందిరి వేయించవలయును. వేషములకు తగినట్లుమంచివస్త్రములు సంపాదించి యివ్వవలయును. వీరియొద్ద కట్టుబట్టతప్ప వేఱుగుడ్డలుండవు. వేషముసామానులు, జెముడుకొయ్యలు, పొనికకొయ్యలు మొదలైన నవానితో తయారుచేసి, యుద్ధపుముక్కలు, కాకిబంగారము, నతికి యుండును. కొందఱుభాగవతులు కేళికనాఁడు తత్పూర్వ మక్కడక్కడ తమకు గ్రామస్థులు బహుమానముగా యిచ్చినబట్టలుగాని, చాకలివాఁడినడిగి తెచ్చుకొన్నవానినిగాని కట్టి వేషము వేయుటయుంగలదు ఇంక యాటక్రమమున్ననో, మొట్టమొదట చోపుదారివాని వేషముతో నొకండువచ్చును. వానిసంభాషణయంతయు హాస్యముగాయుండును. అట్టియాభాసకరమైన యసహ్యపు మాటలువిని జనులు మహానందమునుఁ జెందుదురు. అంతటయిరువురు తెరఁబట్టుకొందురు. తెరకువెనుక మహాడంబరముతో, సుంకరకొండడి వేషమువచ్చి నిలిచి గంతులు వేసిపాడుచు, వెలుపటికివచ్చుటకులోపల రెండుమూడుసారులు తెఱ వంచునట్లుచేసి తనముఖము జనులకు కనఁబడునట్లుచేసి మరల తెఱ యెత్తించును. కడపటిసారి తెరగుడ్డ నర్థభాగమువంచుదురు. అవుడు హాస్యగాఁడు తానుసిద్ధముగా యుంచుకొనియున్న సొరకాయబుఱ్ఱలో నుండు గుగ్గిలపుపొడి పిడికిలినిండుగాఁగొని యిరువంకలచాకళ్లుబట్టుకొని యున్నదివ్వెటీలనొకటిగా చేర్చునట్లుచేసి వేషగానిముఖమున కెదురుగా యాగుగ్గిలపుపొడిని దివ్వెటీలమంటపైఁజల్లును. అదిభగ్గుభగ్గున మంట లెగయగానే, తెరతీసివేయఁబడును. అంతట పెద్దపెద్ద కూతలువేయుచు వేయుచుఎగిరిగంతులువేయుచు, వేషగాఁడు సభలోప్రత్యక్షమగును. ఓ దేవుఁడా! ఓయబ్బా! ఓతండ్రీ! ఆహావమేమిరూపము? ఎక్కడిగాంభీర్యము ఏమనవచ్చును? ఎగిరికుందెనవాలనిలిచి గ్రుడ్లుగిరగిరద్రిప్పుచు, ఉరిమిచూచుచు, చేతిలోకొయ్యకత్తినిపట్టుకొని శక్తిగుడిముందు నిలిపి యుండుభేతాళశిలావిగ్రహము వలెచూచుటకు భయంకరముగానుండును. అంతటిచక్కని సుంకరికొండడి వేషగాఁడు సభానమస్కారము చేసి పాడుటకారంభించును. ఇంక చెప్పవలసినదియేలేదు. మెడను

ముగా పాడుటయుంగలదు. ఈలాగున బహుమతిగా యివ్వఁబడిన డబ్బు నందరు నొకటిగాచేర్చి సమముగా భాగములుపంచుకొని,యాటకై యివ్వఁబడినకట్నము రూపాయలున్ను విభజించి తీసుకొనిపోయి రేయింబగళ్ళు విధివిరామము లేక, సారాయిగాని కల్లుగాని త్రాగి యొడళ్లెఱుంగక పొరలాడుచుందురు. కొన్నియూళ్లలో వీరికి ప్రతిసంవత్సరము నొకటియో రెండో యాటలాడి కట్నముతీసికొని పోయెడి మామూలుహక్కుసయితము కలిగియుందురు. ఏదైనను సందర్భమువలన మామూలు గ్రామములలో యెందైనను నేసంవత్సరము గాని,యాట జరుగకపోయినపుడా గ్రామమున కలహముగాని, ఏదోయొకవిపత్తుగాని సంభవించెనేని, ఆయూరివారి భయము చెప్పితీరదు "మన గ్రామములో మామూలుగా జరుగుచుండిన కేళికను నిలిపినందున, దేవుఁడికి కోపము కలిగినది. సంకటములు సంభవించినవి. ఇంకనిలుపకూడ"దని యప్పుడేయందఱును చేరి యాలోచించి గ్రామంలో చందాలు వసూలు చేసి, కేళికనాడించుటకు ప్రయత్నముఁ జేయుదురు.

సాధారణముగా పల్లెటూళ్లలో యిటువంటి వ్యర్థులైన యవివేకవంతు లెందఱో గలరు. వీరివలె నిరుపయోగకార్యములకు డబ్బువెచ్చపెట్టెడివారు మఱి యెవ్వరునుండరు ఈమతిహీనులు తాము చేయుపనులు మిక్కిలి గౌరవము గలిగించుననియు తామెంతయు సమర్థులనియుం దలంపుచుందురు. మన దేశవాసుల కిటువంటి యవివేకము తొలంగినపుడుగాని దేశము మంచిస్థితికిరాజాలదు. కటకటా! ఈపాడు త్రాగుబోతురోత వేషగాండ్ర యాటలు మెచ్చుకొని డబ్బుదారబోసెదరే కాని, యాడబ్బు నేదైన సత్కార్యములకు వినియోగించకూడదా? అటులచేసినచో వీరిమర్యాదకు లోపమువచ్చుననియు దేవుఁడు తమ్ము శిక్షించుననియుం దలంచుచుండెదరు కాఁబోలు.

గీ. అర్హమనియుఁ గాదనియెంచ కాటగాండ్ర
కర్థమొసఁగిన ఫలము సుంతైనఁ గలదె?
ఆవగను దుర్వ్యయంబు జేయంగనేల?
మంచిపనులకుదాని వెచ్చించరాదొ?

---

# బట్టలు దొంగలించుకొనెడివాని మోసము.

దొంగలించుటయం దాఱితేఱిన వాండ్రెట్టి మోసగాండ్రు చేయుట కొఱకుగా భిక్షమునకు వచ్చినవారివలెనడుగుచు యింటిన డవలోనికి వత్తురు. ఇంటివారు లేచేనియుం బనిగాయుండి తమ్ము గమనిం పకున్నయెడల నటునిటుంజూచి తమకు కనుపడిన వస్త్రముం గొని చల్ల గా జాఱిపోవుదురు. గుడ్డలేకాక యాంసమయమైన పాత్రసామగ్రి సంచక్కి నచో యదియుం గృహస్థాశ్రమము గావలసినదే! పాటి కొంగులు, ఇంటి వారు గాలికొఱకు కిటికీ తలుపు పెట్టియుంచినప్పుడు చూచి మెల్లగా నిడుపైన వెదురుం గొనిపోయి, మంచముమీఁదగాని దండెమున గాని వేసియుండు గుడ్డలను కొక్కెముకొనతో తీసి చంకఁబెట్టుకొని జాఱుదురు. ఎవరేని యిండ్లలో బట్టలుతుకువారలు బంధువులుగా నుండు వారి యింటికి వచ్చియుండి చిన్నకట్టుగాను దొంగలమూటవలెఁగాక, ధోవతిగాని, చీరగాని, వెలగల నారగట్టియున్నమూటల చూచి పక్క కెవ్వరి కానరాని సమయమునుగాని వచ్చి వీధిలోవచ్చు చుం బోవుచుండెనేని వారికి సందేహము కలుగకుండునట్లుగను. "చీచీ! ఈ యిండ్లవాండ్ర కన్నిసారులు చెప్పినను కొంచమైనను బుద్ధిలేదు. నాకెముదు నాగరికతయు మించిపోయినది. గర్వము మెండైనది. చెప్పి నమాటను లేశమైననువినరు. వీధిలో గుడ్డను యెండగట్టినమాటయే జ్ఞాపకము లేదు కాఁబోలు యెండినతోడ చూచుచుండి విచ్చుకొని పోరాదేమో! అంతకంటె చేసెడిపనియేమి? ఒకసారి దానినెవరైనం గొనిపోయిరేని పిమ్మట బుద్ధివచ్చును. అప్పుడుగాని జ్ఞాపకము కలిగి యుండదు. ఇటువంటి వారలు సంసారమెట్లుచేసెదరో తెలిసినది కాదు." అని స్వగతగానివలె మహాకోపముతో దానిని బిరబిర విచ్చి చుట్టి యటునిటుంజూచి చంకఁబెట్టుకొని మాయమగును. పిమ్మట చెప్పెడి దేమికలదు? గుడ్డనారగట్టినవా రదియెండినదేమోయని చూచి విప్పు కొని పోవుటకువచ్చి దానినిగానక రోదనగానమునకు ప్రారంభించి శోక వరాలిరాగ మాలాపనఁ జేయవలసినదే! ఇటువంటి కేవలమాయవాండ్రు, జోగులవలెను, సన్యాసులవలెను, దాసరులవలెను? బుడబుక్కలవాండ్ర వలెను, మఱియు ననేకవిధములైన మాయవేషములతో భిక్షమున

కు వచ్చినవారివలె యింటింటికిఁబోయి, యచ్చటచ్చటయిండ్లలోని సందర్భములును, వస్తువులుండు స్థలములును, మార్గములును,కడు నేర్పుతో కనుఁగొనిపోయి, రాత్రికాలములలో తాము గురుతుపెట్టుకొని పోయిన యింటికివచ్చి దొరకిన వస్తువులను సంగ్రహించుకొని దారిఁ బట్టుదురు ఆహా! వీరి నేర్పు నెంతమెచ్చినను మెచ్చుకొనవచ్చును. లోకములోగల జీవకోటిలో యెక్కువనేర్పు నొకమానవజాతికే కలుగుచున్నది. ఎందువలన? వీరుచేయు దుష్కార్యములను మోసమునే కారణముగాని వేఱుగాదు. ఇటుల చెడుకార్యములు చేయక సత్ప్రవర్తనము కలిగియుండెడి సజ్జనులకు భగవంతుఁడు సహాయముఁ జేయకమానఁడు.

ఆ. తలుపుఁ దెఱచియింట నేతామెఱుంగనివారి
నింటికడవదాఁట నెచ్చటయును
చెఱువులోనఁజొచ్చి చేతఁ జిక్కనవాని
నపహరింపఁజూతు రదనెఱింగి.

---

# మాయసన్యాసుల మోసము.

మోసగాండ్రిద్దరు ముగ్గురుచేరి యొకఁడు కావి లంగోటా పెట్టుకొని మట్టిపాలతో నంటించిన మాయజడలుదాల్చి యినుపనీరు కాలుఁ బట్టుకొని గొప్పయోగివలెను, తక్కిన యిరువురును శిష్యులవలెను వేషములుధరించి, పట్టణములకు కొంత దూరముగాపోయి మార్గము వెంబడి యొకచెట్టునీడను కూర్చుండి యుండుదురు. గ్రహచారముచాలక యాదారిని పోవుచుండువారిలో నెవఁడైనంబల్లెటూరివాఁడు కొంచెము మంచి యామాసామిగాకనుపడెనా? వానికి టోపీవేసివంపుటకు ప్రయత్నింతురు. ఎట్లనిన, గురువుగాయుండుసన్యాసి యాదారినిబోయెడు మనుష్యుఁడు సమీపించగానే వానినిపిలిచి "పుణ్యాత్ముడా! ఒకపైసా యిచ్చెదవా? చాలును. బంగిత్రాగు చిలిమిగొట్టము తీసుకొనవలయు" ననియడుగును. ఆగ్రామవాసి యంతటిదైన్యముగా నడిగినందున కనికరించి "స్వామీ! అలాగేయిచ్చెద. ఇదిగో తీసికొనుఁ"డని తనచొక్కా జేబినుండితీసి యొకకాలణా యివ్వఁబోవును. కాని సన్యాసితీసుకొనన్నొల్లఁడు. గ్రామవాసినిచూచినవ్వి "నీవు చాలామంచివాఁడవుగాయు

న్నావు. ఏమిచెప్పెదవోయని యడిగినాను. నాకవశ్యములేదు పొమ్ము పొ"మ్మనిపలుకును. గ్రామవాసి యతనిమాటలువిని తనలో "ఔరా! పోవుచున్నవానిఁబిలిచి యడిగియివ్వఁబోయిన వలదనుచున్నాఁడు. అడుగనేల?" యనితలంచుచు దారిఁబట్టినాలుగడుగులు పెట్టుటకులోపలనే యాసన్యాసి యేమో యోజించినవానివలె నభినయించి మరలయామనుష్యునిఁబిలిచి "పుణ్యాత్ముఁడా! యోగ్యుఁడవుగా కనఁబడుచున్నావు. సాధువునకు రెండణాలుగంజాయికివ్వకూడదా?" యనియడుగును. అపుడువెంబడినిలిచియున్న శిష్యులలో నొకఁడామనుష్యునిఁజూచి యిమ్మని సైఁగఁజేయును. గ్రామవాసి, "కాలణాచాలదని కాఁబోలు వలదనెను. పాపము! రెండణాలునునిచ్చెదను." అనితలంచి తటాలున జేబులో చేయిఁబెట్టితీసి యోగిచేతఁ బెట్టఁబోవును. కొట్టవచ్చినపుడు వెఱచి వెనుకకుఁ బోవువానివలె యాసన్యాసివెనుకకుబోయి "వలదువలదు. నీడబ్బునీవేయుంచుకొనుము. నాకక్కఱలేదు. నీమనస్సుశోధించుటకుఁదలంచి యడిగినాను. అంతమాత్రమేగాని ఇది నాకేమిచేయుటకు? ఇంకనీవుపొమ్ము. కోపములేనివాఁడవు. మంచివాఁడవు. నీకుభగవంతుఁడు సాయమగుఁగాక" యనిపలుకును. ఆసంసారి సన్యాసియొక్క మాటలకు మిఱియునాశ్చర్యముఁజెంది తనలో "ఇదేమివింత? ఇతఁడు రెండుమారులును మొదటనడిగి వెనుకవలదనెను? నిజముగా వేడుకగా నేనేమిచెప్పెదనో చూతమని యడిగినాఁడనియే తోఁచుచున్నది"యని తలంచుకొనుచు పోవనారంభించును. నూరుగజములు పోయినంతట, సన్యాసి యతనిని మరలబిలుచును. సంసారియచటనే నిలుచుకొని తిరిగి చూచి "ఇతఁడుమాటిమాటికినిం బిలుచుచు నాప్రయాణమునకుభంగముచేయుచున్నాఁడు. అడిగినట్లు యివ్వఁబోయినను తీసుకొనుటలేదు. ఏలనో మరలబిలుచుచున్నాఁడు" అని యించుకయాలోచించి మరలి యతనియొద్దకువచ్చును. ఆయోగి నవ్వుమొగముతో సంసారినిచూచి "గుణవంతుఁడా! ఈసదానందునకు నీవ్రేలధరించియున్న యుంగరము నిచ్చుటకు సమ్మతింపుదువా? ఇచ్చెదవా?" యనియడుగును. ఉంగరము చాలావెలగలదగుటచే సంసారి దానినిచ్చుటకు కొంచెముసంశయించును. ఈసారిశిష్యులిరువురును వెనుకనుండి ఇచ్చివేయుము భయపడవలదని" హస్తములతోడను. నేత్రములతోడను సైఁగఁజేయుదురు. సం

సారిసంశయించుచుండుటను యాయోగసన్యాసిచూచి "నాయనా! ఏమీ? సందేహించెదవా? ఇంతలోనే చిత్తశుద్ధితొలంగిపోయినదా? సరే! ఆలాగైనచో, "ఇచ్చుటకు సమ్మతముగానుండలేదనిచెప్పి వెడలి పొమ్ము చాలును. నీవటులచెప్పుటయే మాకుసంతోషము. దేవునకు నీయందనుగ్రహము కలుగలేదనుట తెలిసికొనియెదను" అనును. మరల శిష్యులుత్వరితముగాయిమ్ము. ఘగవా లేదని సైగజేయుదురు. బుద్ధిహీనుఁడైన యావల్లెటూరివాఁడు 'ఇంతకుపూర్వమువలెనే మనశ్శుద్ధిం దెలిసికొనుటకే యిటులనడుగుచున్నాఁడు. ఈసన్యాసి నిరపేక్షుఁడుగా కనుపట్టుచున్నాఁడు. ఉంగరమునిచ్చినను యిక్కఁడుతీసుకొననొల్లఁడు. మరలనిచ్చుటనిశ్చయము. అడిగినప్రకారం సందేహమువీడియిచ్చెదను. పిమ్మట నెటుల నేమేమిచెప్పునో చూతము" అని యెంచి తటాలున వెల పొడుగైన తనయుంగరమునుతీసి సన్యాసిచేతఁబెట్టును. అతఁడుముందు డబ్బువలదనిచెప్పినట్లు చెప్పక యుంగరమును బుచ్చుకొని యాసంసారి చేతిలోచిటికెడువిభూతిపెట్టి "నాయనా! చాలాసంతోషము సంతోషము, ఆనందము ఆనందము. పరమాత్ముఁడు నీకుచాలాసహాయము చేయును. ఇల్లుచేరుటకులోపలనే మంచియదృష్టము నీకుకలుగును. ఇంకపోపో! నీచిత్తశుద్ధికి మెచ్చి చిటికెడు విభూతియిచ్చి ఈపరమాత్ముఁడు నీయందనుగ్రహముచూపినాఁడు. భయపడవలదు. వెడలిపొ"మ్మనును. "సందేహింపక కొంచెముదూరముపొమ్ము మరలపిలిచి నీవస్తువును నీకొసంగు"నని యాశిష్యులలోనొకఁడు సన్యాసికితెలియక చెప్పినట్లు చెవిలో గుసగుసఁబలుకును. ఆవెఱ్ఱిసంసారి వారిమాటలునమ్మి. స్వాములవారు కొంచెముదూరము పోయినంతట పూర్వమువలెనే పిలిచి యుంగరము నిచ్చునని తలంచి. అచ్చటచ్చట నిలిచినిలిచి తిరిగిచూచుచు పోవుచుండును. ఆమహాత్ముఁడీసారి ముందటివలెచేయక కూర్చుండియున్నట్లుండి, గ్రామవాసివఃఆియొకమాఱటుతిరిగిచూచుటకులోపల శిష్యునమేతముగా నదృశ్యుఁడగును. ఇంకనేమియున్నది? సంసారితాను మోసపోయిందుటను తెలిసికొని యేదిశకువరుగెత్తి యెందువెదకినను, మాయమైపోయిన మహాత్మునియొక్కగాని, శిష్యులయొక్కగాని జాడయేకనుపడదు. ఇంటికిపోవుటకులోపల యదృష్టము కలుగునని చెప్పెను. ఆయదృష్టమిదియే కాఁబోలునని మొగము వేలవైచుకొని చింతయు దైన్య

ముసు మనంబుగూర్చుచుండగా యింటికిఁ బోవును. ఇతఁడు మోసపో యి సొమ్ముఁ బోగొట్టుకొని వచ్చెనను విషయము పిమ్మట నతఁడే చెప్పగా వినినజనులు "వీఁడు శుద్ధవెఱ్ఱిగొప్పగా యున్నాఁడు యేమరి సొమ్మునుదార బోసికొని వచ్చినాఁ"డని చేతులుగొట్టి పరిహసించినవ్వుదురు. ఇది సొమ్ముపోఁగొట్టుకొనినదిగాక నైవిశేషము. ఇటువంటివారుగాక యోగ సన్న్యాసులమని వేషముధరించి లోకులను మోసగించెడి మహానుభావులు కొందఱు గలరు. వారలుచేయుపనులు వేఱువిధముగా నుండును. ఎట్లనిన, పక్కాదొంగ గాండ్రిదలిద్దరు ముగ్గురుకూడి ముందుచెప్పినట్లే యొకఁడు యోగీశ్వరుఁడనెడి పేరుఁబెట్టుకొని గురువుగను, తక్కినయితరువురును శిష్యులుగను వేషములువేసుకొని దూరముగాయుండెడి వసతియైన గ్రామము నొకదానిని చూచుకొని యా యూరివెలపటనుండు మామిడితోఁట లేక చింతకాయతోఁట యిట్టివానిలో యేదోయొకటి యనుకూలముగాచూచి యందుచేరుదురు. వారిలో గురువైనవాఁడు బ్రతుకుజీవనముగా తమయొద్దసంపాదించి పెట్టుకొనియుండు మాయజడలును, నిడుదలైన మాయగోళ్లనుధరించి సొరకాయబుఱ్ఱనొకదానిని ముందుంచుకొని యోగదండమునైన నానికూర్చుండి కండ్లుమూయుచు తెఱచుచుం మిణుకరించుచుండును. మౌనముద్రవహించి యెవ్వరితోడనుం బలుకఁడు. ఎదుటకొయ్య పావకోళ్లుంచియుండును. చూచినవారు, జడలును, దాడి, మీసములును, గోళ్లును నిజముగా పెంచబడినవిగానే తలంతురుగాని యవి యంటించుకొనినవని తెలిసికొనఁజాలరు అంతటి నేర్పుగా వానినంటించుకొనియుండును. రెండుమూఁడురోజు లట్లే యేదోయొకవిధముగా వారాతోఁటలోనేయుండి కాలముగడపుదురు. అంతలో గ్రామవాసులలో నెవ్వఁడైన నొకఁడుచూచి "ఓహో! ఎవ్వఁడో మహాత్ముఁడు వచ్చియున్నాఁడు. గ్రామములో ప్రవేశింపనొల్లక కాఁబోలు యీతోఁటలోచేరినాఁడు. విచారించెదగాక" యని సమీపించి దండముఁబెట్టును. యోగిపలుకఁడు. శిష్యులామహాత్ముఁడుమాటలాడడనియు యోగనిష్ఠలోనే యెల్లపుడు నుండుననియు జెప్పుదురు. ఆసంసారి గ్రామములోనికిఁబోయి, యావృత్తాంతము నందఱి జనులకెఱిఁగించి "గొప్పయోగి యొకఁడువచ్చి మనగ్రామముచెంతజేరి యుండగా మనము వారిని విచారించి సత్కరింపకుండుట శ్రేయస్కరము కాదు"

అనిచెప్పెను. అంతట యాయూరిలోని పురుషులును, స్త్రీలును, గుంపు లుగుంపులుగాగూడి యోగీంద్రుని దర్శనార్థముగా, యతఁడున్నతోఁట కువచ్చిచూచి మౌనముతో కూర్చుండియుండెడి యామహాత్మునకు మ్రొక్కి, శిష్యునిచూచి స్వామివారివృత్తాంతమును విచారింతురు. శిష్యుఁడువారితో, "మహాయోగీశ్వరులవారు. శ్రీశైలపర్వతమునందలి యొకకోనలో నివసించియుండుదురు. అప్పుడప్పుడు వీరు దేశయాత్రచే యుటకలదు. ఇప్పుడున్నూ అటుల యాత్రచేయుటకేవచ్చినారు. ఈదా రినిపోవుచుండి యిచ్చట వారికి హాయిగాతోఁచినందున రెండుమూడు దినములుండి పోవఁదలంచి నిలిచినారు. మేము వీరికిశిష్యులము - ఇంకను నెందఱోశిష్యులున్నారుగాని వారలాశ్రమమందే యున్నారు. ఈమహా త్ముఁడు చాలాకాలమునుండి బ్రహ్మయోగమనెడిగొప్పయోగమునవ లంబించియున్నారు. అది యిప్పుడు పూర్ణమగుసమయము తటస్థించి నది. ఆయోగము సంపూర్ణముచేయుటకు మూడునెలలుపట్టును. దానిని కడపటిదాని పోవుట కిదియనుకూలమైనస్థలముగా యున్నదనియు నిచ్చ టనేయుండి కడపుకొనిపోవలయుననియు, లేక మఱియొకగ్రామముద గ్గరకుపోయి నెరవేర్చుకొనవచ్చుననియు నిట్లుయోజించుచున్నారు. ఎచ్చ టనుండినను నదిప్రారంభించుటకు స్థిరముగా యొకస్థలము నిర్ధారణచే సికొనినఁగాని ప్రయత్నించుటకు వలనుగాదు ఎచ్చటనైనను సరే! ఆయో గము సమాప్తముకాగానే వెళ్లుదురు." అని చెప్పెను. ఆమాటలువిన్న గ్రామస్థులు తమలో కలిసి బలుకుకొని, "చాలగొప్పవాఁడుగా కనఁ బడుచున్నాఁడు. ఈ యోగీశ్వరుఁడు చేయఁదలంచిన యోగము నిచ్చ టనే సంపూర్ణముఁ జేసికొనిపోవుట మన గ్రామమునకు క్షేమకరము. ఏదో మనవలననైనంతవరకును సహాయముచేయుదము. వీరి నిచ్చట నిలుపుటయేమంచి"దని నిశ్చయముచేసి శిష్యునిఁ బిలచి "అయ్యా! మీరిది యూరనుకొంటిరా? పాడనుకొంటిరా? ఇంత గొప్ప మహా త్ములు తలఁపని తలంపుగా మాగ్రామమునకు వచ్చుట మాయదృష్ట ముకాని వేఱుకాదు, ఇట్లుండగా చేయదలంచిన కార్యము నిచ్చటనే జరుపుకొనక మఱియేగ్రామమునకైనా పోవలయు ననియేల తలంప వలయునట్లు? ఇతర గ్రామస్థులు చేయునంతటి సహాయము మేముచేయఁ జాలనా దితలంచితిరి కాఁబోలు. ఆలాగు మీరెంచకుఁడు. ఇంకనెక్క

డికిని బోవలసినదిలేదు. ఇంక దీనికొఱకై స్వాములవారు రేపటికిని బోవలదు, వీరుచేయు యోగము నిచ్చటనే పూర్ణము గావించుకొని పోవచ్చును" అని దృఢముగా జెప్పి యపుడే ప్రయత్నించి వారుండుటకై యచ్చటనే వసారా యొకటి కల్పించి యందుండుడని ప్రార్థించి రంతట శిష్యుండు "అది నాయిష్టము కాదు రాత్రికి మహాత్ముడు నిష్ఠ చాలించి యున్నపుడు చెప్పి వారియభిప్రాయమును తెలిసికొని మీకు చెప్పెదను. రేపు మీరిచటికి రండు విషయము తెలియు"నని చెప్పి పంపివేయును. గ్రామజనులు పోయినంతట వారుతమ మాయపు వలలో దగుల్కొనిరని సంతోషచిత్తులై యారాత్రి గడపుదురు. మఱునాడు గ్రామస్థులు మరల నరుదెంతురు. శిష్యుడు వారితో ఈక్రింది విధముగా సంభాషించును—గ్రామస్థులు అయ్యా! యోగీంద్రు లిచ్చటనుండుటకు సమ్మతించినారా? ఏమిచెప్పినారు? యుండెదమన్నారా?

శిష్యుడు—మాకేమియుం జేయవలసిన సహాయములేదు. వసారా కట్టించి యిచ్చితిరి. అదియే చాలును. ఇంకేమియువలదు.

ఇట్లు శిష్యులును జనులును మాటలాడుచుండగా నొండొరులు సైగలుచేసికొని గ్రామస్థులు కొందఱు బిరబిరబోయి, పాలును చక్కెరయు, పండ్లునుం గొనివచ్చి తీసుకొనుడని శిష్యునకివ్వవత్తురు. అతడు వానిని గైకొనక తమకు వలదని పట్టుదలతో వారిప్రార్థన నిరాకరించును. బలాత్కరించి బహువిధముల వేడుకొనినమీదట వారి మాటలను ద్రోయుటకు వలనుగాక తీసుకొనినవానివలె నటించి యయిష్టముగా పుచ్చుకొనును. అటుల యోగీశ్వరునకు పాలుపండ్లును యిచ్చి శిష్యులకు భోజనసామగ్రి సమృద్ధిగా తెచ్చియొసంగుదురు. యిపుడు శిష్యుడు మొదటచేసినంతటి బిగింపులేకనే తెచ్చిన వానిని పుచ్చుకొనును. అది మొదలు జనుల రాకపోక లధికమగును. గాని యోగి వారువచ్చినపుడు వసారాలోనే యుండును. వెలుపటముఖమైననుం జూపడు. ఇటుల రెండుమూడుదినములు జరిగినంతట శిష్యులతో గ్రామవాసులకు కొంచెము చనవు కలుగును. అపుడా సంసారులలో నొకడు శిష్యుని జూచి "అయ్యా! యోగీంద్రులవారికి మంత్రవిషయమును, వైద్యవిషయమునుకూడా తెలిసియే యుండునని తలంచెదను. నాయూహ సరియైనదేనా?" యనియడుగును.

శిష్యు:—ఓహో! ఇదియు నొకగొప్పవిషయమని యడుగవలయునా? ఈమహాత్మునకు తెలియనివిషయమొకటి లోకములో యుండునా? ఇప్పటికి పదేండ్లుగా నేను వీరికిశిష్యుఁడై చేరి పరిచర్య చేయుచున్నాను. తత్పూర్వముమాట నేనెఱుఁగను గాని, వీరియొద్ద నేనుచేరిన తరువాత-పిశాచబాధలు కలవారును వ్యాధిగ్రస్తులునువచ్చి యాశ్రయించి స్వస్థమయినంతట సంతోషించిపోయినవా రెందఱోగలరు. ఒకరా? యిరువురా? నూఱులు, వేలు, లెక్కయున్నగదా? అటుల క్షేమమొందినవారు సంతోషముతో నెంతోడబ్బునిచ్చినారు. నిరపేక్షామతులైన వీరి కేమిటికి? ఆడబ్బును పెట్టి యచ్చటచ్చట ధర్మసత్రములనుకట్టించినారు. ఈవైపుగా వీరువచ్చుటకిదియే మొదటిసారి యగుట వలన యీప్రాంతములలో వీరిమహత్త్వము నెవ్వరునెఱుఁగరు. వీర ద్విషీయులు.

గ్రామ—ఆహా! స్వామీ! అంతగొప్పవారా? యోగసిద్ధిగల వారుగదా వారి కేమి? తలంచినయెడల యెట్టికార్యమైనను జరుగుచుండును. అయ్యా! సరేగాని, ఈయోగీంద్రులవారికి పేరెయ్యది?

శిష్యు:—బ్రహ్మానందపరిపూర్ణులని వీరికినామము.

గ్రామ:—అబ్బా! చాలాగొప్పవారుగా యున్నారే!

శిష్యు:—ఔను, వీరిమహిమను తెలుసుకొనినవారే లేరు.

ఇట్లు వారుమాట్లాడుచుండగా గ్రామవాసి మఱియొకఁడు, శిష్యునింజూచి "స్వామీ! మాయింటనా సహోదరుఁడొకఁడు చాలాదినములనుండి యొకవ్యాధికలిగి బాధపడుచున్నాఁడు. పడకనుండి లేచుటయే లేదు. వానిని యోగీంద్రులవారికిచూపినయెడల బాగాయుండునని తోఁచుచున్నది. తోడ్కొనివత్తునా?" యనియడుగును. ఆమాటవిని వెఱగుపడినట్లునటించి శిష్యుఁడతనికిట్లనును.

శిష్యు:—వారెప్పుడును యోగనిష్ఠతో యుండెదరని ముందే చెప్పితినిగదా! వారికిటువంటిపనులకుపూనుకొనుటకు సమయమెప్పుడు? ఎపుడో యొకసమయమున దినమున నొక గంటకాలము నిష్ఠచాలించి యుండుదురు. అంతే! అపుడును మాటలాడరు మౌనముగానే యుండెదరు. ఇట్లువారువ్రతమును పూనియున్నారు. సరిగాపగలు రెండుజాముల కేదైనా దొరికినయెడల పండును పాలును పుచ్చుకొందురు, దొరకని

ర్శించుటకునున్నైదినేదినేవచ్చెడి జనసంఖ్యయధికమగుచుండెను, శిష్యు
లుక్రమక్రమముగా తమకువంట చేసుకొనుటకు పాత్రములు లేవనియు
వస్తువులు లేవనియు నదికావలెననియు, యిదికావలయుననియు, నిట్లే యొ
క్కొక్కరినడిగియొక్కొక్కటి తెప్పించి సమస్తపదార్థములను సేకరించి
యావసారాలో దాచిపెట్టుచుండుదురు జనులుపోయినంతట తమయి
ష్టమువచ్చినట్లు వలయుపదార్థములను వంటఁజేసికొని మువ్వురును సం
తుష్టిగా భోజనము చేయుచు మిక్కిలి యుల్లాసముతో యుండుదురు.
యోగినిచూడవలయునని వచ్చినవారి కతనిదర్శనమేకలుగదు. వసారా
లోనికెవ్వరునుపోరాదు. అతఁడు వెలపటికిరానేరాఁడు. ఇంకచేయు
టయెట్లు? కొలదిదినములైనతరువాత తమయోగ్యతకుఁ దగినట్లుగా,
గుడిసెవేటుముండలస్నేహముసంపాదించిరహస్యముగా రాత్రులువారల
తోగూడి యానందమనుభవించుచుండుదురు. ఈప్రకారముగా రెండు
మూడునెలలుజరిగినంత "యోగవ్రతము సంపూర్ణమగుటకింకమూడు
దినములుమాత్రమే కొఱవయున్న"దని శిష్యుఁడు గ్రామస్థులతో చెప్పె
ను. రేపటిదినము కడపటినిష్ఠాపూర్తికాలమని శిష్యుఁడు జనులనుపిలిచి
"ఈకార్యము నెఱవేరుటకు కొంచెము డబ్బు కావలసియున్నది. యోగీ
శ్వరుల వారెప్పుడును నిష్ఠతోనే యుంటున్నారు. అందుచే శలవులకు
యిబ్బంది కలుగునట్లున్నది. వారు సాధారణమైనస్థితిలోయుంటే యేభ
యమును లేదు. ఒక కాలణాగాని, యర్ధణాగాని బంగారుచేసియిచ్చియుం
దురు. అదిపెట్టుకొని మేము సులభముగా పనులను నెరవేర్చుచుండుదు
ము. ఏమితలంచిరోగాని యెదియుం జెప్పకనే యున్నారు. ఎట్లుజరుగవల
యునో తోఁచలేదు మీరాలోచింపక యీకార్యశలవునకుగా నన్నా
ఱుహాయములివ్వండి. వ్రతముసంపూర్ణమై వారునిష్ఠవిడువగానే, మీ
రొద్ద మేముతీసికొని కార్యముజరిగించుటకుచెప్పి మీడబ్బుమాకిప్పిం
చెదము. వారుతలంచిరేని యైదునిముషములలో మీరిచ్చినదానికిబ్బడి
గామీకొసంగుదురు. భయములేదు వారెత్తింగినపిమ్మట నిమిషమైనను
నిలువరు. ఈవిషయము మేము తెలియజేయునంతవరకును యోగీశ్వరుల
వారికిగాని యితరజనులకుగాని తెలియకూడదు. రహస్యముగా నుంచ
వలయును" అని యుక్తియుక్తముగా తగినవారితో పలుకుదురు. వారి
మాటలువిని యాగ్రామవాసులలో ధనవంతులైనవారు "ఇంత మహ

మంచి కాలమువచ్చినది. ఎట్లయినను వీరిదయను సంపాదించుటమంచి ది" యని యొకరొకరు తెలిపోసుకొని శిష్యులతో "సరే! అలాగేయిచ్చెదము. మీరు కార్యమును జరిగించండి" యనిచెప్పి, యున్నవాడింటనుండియు లేనివాడు మఱియొకనియొద్ద పత్రమువ్రాసియిచ్చి యప్పుతీసుకొనియు భాగములప్రకారం వారుకోరిన వొప్పున నాలుగునాలుగు రూపాయలును మొదటినాటిసాయంత్రము తెచ్చిసమర్పింపుదురు శిష్యులంతటితో విడనరు. ఒకరికి తెలియక మఱియొకరిని రహస్యముగాయడిగి వారివారియొద్ద దొరకినవరకును గుంజుకొందురు. సుమారు నేయిరూపాయలవరకును యిట్లువసూలుచేసి మఱుదినము కార్యము ప్రారంభింపఁబడుననియు, వారందఱునువచ్చి మండటయుండి జరిగించవలయునని యుంజెప్పి శిష్యులువారినిసంతోషపెట్టుదురు. బుద్ధిహీనులైన యాగ్రామవాసులామాటలు సత్యమనినమ్మిపోవుదురు. ఆశాపిశాచపీడితులైన కొందఱుమూఢులు గుంపుచేరి. "మనమీ యోగీశ్వరునిదయనుసంపాదించి బంగారుచేయు విద్యను గ్రహింపవలయును. అయిదారేండ్లకు ముందొకయోగి ప్రక్కగ్రామములో నిరుపేద భాగ్యవంతుఁడుగాయుండెనట రాజమువాకిటికివచ్చి కూర్చున్నాడఁట. అతఁడాయోగికి యెక్కడనో కొంచెము పాలును చక్కెరయుం దెచ్చి యిచ్చినాఁడఁట. యోగి యతనిపుచ్చుకొని సంతోషించి, యేదో యుపదేశంచేసిపోయినాఁడఁట. అదిమొదలు నట రాజముగొప్పమాంత్రికుఁడై నాఁడు. వైద్యముకూడా చేయడం ప్రారంభించినాఁడు నానాటికి మంచిపేరునుచెంది బాగాసంపాదించి పూరియిండ్లుపడగొట్టి మిద్దెటిల్లుకట్టించినాఁడు పదిపుట్లధాన్యం పండేమాగాణి భూములను, తోఁట దొడ్డి గొడ్డుగోదలు సంపాదించినాఁడు. రొక్కముకూడా పదివేలకుపైగానే యుండునని చెప్పుకొంటారు. ఇపుడిదేనాభూలోకం అని యిడిగేస్తితిలోయున్నాఁడు. ఇదియంతయు యోగియనుగ్రహంవలన కలిగిన దేకాని వేఱువిధముగా వచ్చినదికాదు. కాఁబట్టి యోగులు, గోసాయీలు మొదలయినవారియొద్ద మంచిమహిమ కలిగియుంటుంది. ఈయోగీశ్వరుండును గొప్పప్రభావం కలిగినవాఁడుగాయున్నాఁడు. మనమీయనను విడువకూడదు. మనలో యెవఁడోయొకఁడు గ్రహించినచాలును. పిమ్మట నొకరికొకరువదేశం చేసుకొనవచ్చు"నని యోజనచేయుచుందురు. శిష్యులనుకూలురై

యుండినచో తమకోరిక కొనసాగుననెడి తలంపుతో వారుచెప్పినట్లెల్లం జేయుచుండుదురు. శిష్యులు గురునితో చెప్పి యుపదేశముం జేయింతురని యీమూఢులు నమ్మికను కాఁబట్టి తాముతాము డబ్బుతెచ్చుటయు నిచ్చుటయు నొకరివిషయము మఱియొకరికి తెలియకుండు లాగున చేయుచుండుదురు. వ్రతారంభదినము రేపనగానే మొదటినాఁటిరాత్రి యే శిష్యులు చేయవలసిన తమకార్యములన్నియు తయారుచేయుదురు. చీకటిపడిజనులందఱునుం బోయినతరువాత సమస్తసామగ్రులును, పాత్రములును, డబ్బును, మూటలుగట్టుకొని యితరులకు తెలియకుండా యీ గురుశిష్యులు పరారిచిత్తగింపుదురు. మఱునాఁటి యుదయమున గ్రామవాసులువచ్చిచూచి, తాముకట్టించిన వసారాతప్ప మఱియేవస్తువయు లేకుండుటయు, యీమోసగాండ్రు కనఁబడకపోవుటయుంజూచి వారు చేసిన యద్భుతమాయాతంత్రమును తెలుసుకొని వెలవెలబోయిన ముఖములతో యొకరినొకరుచూచుకొనుచు, తాము మోసపోయి డబ్బును పోఁగొట్టుకొనుటకలంచి చింతకాయలుదినినకోతులచందమున పండ్లిగిలించి మొగముచచ్చిన ముండలవలె యేడ్చుచు, తమదుఃఖమును పట్టజాలక యీవృత్తాంతమొరులతోచెప్పి యుంగలార్తురు. గాని యీవిన్నరివారిగతియు నటులనేయైయున్నందున వారలు తమలో "వీరునుమనవలెనేడబ్బుఁ బోగొట్టుకొని మనలోచేరినారుగదా! ఇదికొంతమే"లని సంతసించిచెప్పిన వారికేదియో సమాధానమును పలుకుదురు. పూర్వపుణ్యవశమున నెవ్వఁడైనను నొకఁడు డబ్బునివ్వక తప్పించుకొనియుండినచో వాఁడు పోఁగొట్టుకొనిన వారలంగని "సత్కార్యమునుచేసి చింతిల్లెదరేమిటికి? యోగీశ్వరులవారి యోగము మీరిచ్చినడబ్బుతో తుదముట్టినది. వారు సంతోషముగా శరీరముతోస్వర్గమునకరిగిరి. ఇంక పగవబనితే"దని పరిహాసించి నవ్వుచుండును. ఇట్టి బుద్ధిహీనులు కష్టపడి సంపాదించినడబ్బును తామనుభవింపకయు, నితరులకివ్వకయు, సత్కార్యములకు వినియోగింపకయు చాచిదాచి తంత్రగాండ్రవలలో దగులుకొని మోసపోయి యత్యాశచే యున్నవిత్తమునుపోఁగొట్టుకొని కడపట నిరాశజెంది దుఃఖింపుదురు

ఈప్రకారముగా యెన్నిచోటులనో, యెన్నిసారులో మోసగాండ్రు మాయావేషములతో జనుల నేమరించుటయు డబ్బు సంగ్రహించు

కొని పోవుటయు, చూచుచుండియు, వినుచుండియు, బుద్ధిలేనివారై తాము మిక్కిలి వివేకముగలవారుగా నెంచుకొనుచుండు ప్రజలు జాలగాండ్ర మాయోపాయములను తెలిసికొనజాలక యున్నమట్టుకుఁ బోగొట్టుకొని దుఃఖించుచుందురు. కాఁబట్టి జనులారా! ఇటులనచ్చు మాయవేషగాండ్రనుచూచి భ్రమించి వారిమాటలనునమ్మి నష్టపడక జాగరూకతతో మెలంగుట శ్రేయస్కరము.

గీ. కపట సన్యాసులెందఱో కలరువారు
జనులఁ గడునేర్పుతోడ మోసంబొనర్చి,
ధనముఁగొనిపోవఁ జూతురా తంత్రములను
గాంచి నమ్మినవారికిఁ గలుగుచేటు.

# పగటివేషగాండ్ర మోసము.

పెద్దపట్టణములయందును, పల్లెటూళ్లయందును, పగటివేషములు వేయువారలు మహాడంబరముతో తిరుగుచుందురు. వీరి వేషములును నాట్యమును వర్ణించుట కెంతటివారికిని సాధ్యముకాదు. ఈవేషగాండ్రెవరు? కొజ్జారండలును పనిచేయుటకు కొఱగాని దేబెకుంకలును, తలమాసిన మొగముండలును కూడుకొని యిటుల వేషములు వేసి యాటలాడి సంపాదించి జీవించుచుండు భ్రష్టులుగాని, మఱియెవ్వరును గారు. వీరొకజాతికి చేరినవారని పలుకుటకు వలనుగాదు. వేణుగోపాలశతకములోని "దూదేకులవాఁసేను దొమ్మరికొండడు, వ్రటమంగఁడు, గాండ్లబాలిగాఁడు" అనే పద్యములో చెప్పఁబడిన మహానుభావులందఱును వీరిలోనివారే! యనవలయును. వీరు గ్రామబహిఃప్రదేశములలో చేరి, పానికచెక్కలలో యుద్దవుముక్కల తిలకించి రంగుపూసిన హారములు, కిరీటములు, కడియములు, కమ్మలు, తలసొమ్ములు, భుజకీర్తులు, మఱియుం బలువిధముల భూషణములుం దగిలించుకొని, చెమట దుర్వాసనతో కూడిన మలినవస్త్రములు ధరించి, పగలు రెండుజాములకు మీఁదట యెండవేడిమికొంచెము తగ్గిన పిమ్మట నాటకముపన్ ప్రారంభముఁ జేయుదురు. వీరు నేర్చుకొనియుండెడి చిత్రాం

గినాటకము, ఎఱుకలవేషకథ, గొల్లవేషపుకథ, జలక్రీడలు, నలనాటకము, హరిశ్చంద్ర నాటకము, సుందరకాండకథ, మొదలగువానిలో నేదియో యొకటి మొదలిడి మద్దెల తాళములు గొట్టుదురు. పాటస్వర స్వరూపమునిదని చెప్పశక్యముగాదు. వేషగాని పాటకును శ్రుతికిని సంబంధముండదు. గాలికొప్పురముమీఁదికొంతకి క్రిందనుండి కొబ్బరకాయ విసరివేసినట్లుండును. వేషగాఁడు కర్ణకఠోరరాగము నెత్తఁగానే స్వజాతిజంతువే మోహని భ్రమించి చుట్టుప్రక్కలఁ దిరుగుచుండెడి గాడిద లోండ్ర పెట్టఁదొడంగును. అయ్యో! ఆపాటల లిత్యము నేమనిచెప్పవచ్చును? వాయురోగముచే నరములు లాగుకొనువానివలె నిటునటు వంగి నీల్గుచు, చెవియొకచేతితో మూసికొని పిశాచమువలె నోరుదెరచి భయంకర స్వరముతో "అమ్మలారా! తాళజాలనే! అక్కలారా! సైఁపనేరనే!" యని పాడుటకు మొదలు పెట్టును. స్త్రీపురుష వేషములు మోహాతిశయమున నొకరినొకరు వేడుకొనుటయు, సమ్మతింపక పోవుటయు విరహవ్యథచే చింతించుటయు ముఖ్యముగా నాటకములోని యంశములై యుండును మధ్యమధ్య హాస్యగాఁడు వినోదముగా చెప్పెడిమాటలను చూడవచ్చినవారువిని యానందపరవశులగుచుందురు. ఈ యుపలక్షణనాటకమును చూచుటకై రూకపాతిక చేతఁబట్టుకొని, హద్దుమీరిప్రవర్తించు మదించిన వయసుగత్తెలును, రంకులాడిమాయముండలును, తాన్పెదుగత్తెల బోధనలలో చిగురుకొని కోడెగాండ్రకై వెదకులాడుకులుకులాడులును, ఇంటిలో పనిపాటలులేక కూర్చుండి యుండెడి ముసలి విధవలును, ఈయిటుకులాడలం జూచుటకును, తమ వలలో వేసుకొనుటకునునై కోడెకాండ్రును గుంపులు గుంపులుగా తమపనులను శీఘ్రముగా తీర్చుకొని యత్యాతురముతో వచ్చి యాటగాండ్రకుచుట్టును వలయాకారముగా నిలిచియుం గూర్చుండియు సంతోషముతో చూచుచుందురు. ఈకోడెకాండ్రను వయసుకత్తెలనుం జూచినతోడనే వేషగాఁడు మోహానంబంధమైన పట్టును మిగుల నెక్కువగా పాడుచుండును. ఇది విని దృష్టికుండలవలెనుండు తలల నాడించుచు సంతోషించుచుండెడి యగుమూడిముండలనడిగియొక్కంత పొకచెక్కయు నగమాకును పొగాకుచెక్కయుం బెట్టించుకొని గొఱ్ఱెలు నెమరువేయునట్లు నములుచు, కొందఱు రంకులాడులు తమకుదాపున

నుండెడి విటకాండ్ర నోరకంటఁ జూచుచు కిలకిలనవ్వుచుండుదురు. వేష
గాండ్రు వారివారినడిగి, యాకువక్క పోగాకుఁ బెట్టించుకొని నమలుచు
పాడునప్పుడు తమ్మరసము నోటికొలంకులనుండి జాఱుచుండుటను చూ
డగా యాగానరసమటుల స్రవించుచున్నదేమోయని తోఁచును. వేష
ముయొక్క యందమునకును, పాటయొక్క మాధుర్యమునకును మెచ్చు
కొని జాణలైనకొందఱు తాంబూలములలోనను, ఫలములలోనను,
రూకలో, పావలాలో, ఉంగరపాయలోయుంచి వారికి యినామొసం
గుదురు. ఆకిటుకు నెఱింగియున్న వేషగాఁడు వానిని జాగ్రత్తా బెట్టుకొ
నును. తమకు లేకపోయినను నెట్లయినను కష్టపడి నాలుగు వస్తువులు
సంపాదించి వంటచేసి యన్నము, కూరలు, మాంసము మొదలైనవా
నిని తెచ్చి రహస్యముగా వేషగాండ్ర కారగింపఁజేసి మదించిన రం
డలునుం గొందఱు గలరు. తమకు సుపట్టలేక వారిని మోహించి కొందఱు
స్త్రీలు తమ యింటికిరమ్మని రహస్యముగా చెప్పిపుచ్చి సంకేతస్థల
ములో వారినిగూడి ముచ్చటదీర్చుకొనుట కలదు. కొందఱా యాట
గాండ్రమీఁది వలపు నడంచుకొనజాలక సమయముచూచి చేతికిదొ
రికిన సొత్తులనుగొని వారితోఁగూడి పరారి చిత్తగింపుదురు. ఎందఱో
స్త్రీలు ఆవగటి వేషములవారి మూలమున భ్రష్టలైపోదురు. కొం
దఱు వీరికి తమమీఁద ప్రేమకలుగుటకుగా కావలసినవరకును, కల్లు
ను, సారాయియుం బోయింపుదురు. ఈయాట లాడెడివారి దుర్నడత
నెఱింగిన బుద్ధిమంతులైన కొందఱు గ్రామవాసులు వీరిని తమగ్రామ
ములో నడుగుబెట్టనీయక తరిమి వేయుదురు. అయినను, తమకు గౌర
వహానియు నపకీర్తియుం గలుగునని కాఁబోలు. కొందఱు వీరి నాద
రించుచుండెదరు. వీధిభాగవతులవలె వీరు గ్రామస్థులను ప్రార్థించి యా
టకు తాంబూలమును పుచ్చుకొనుటయు, నాడుటయు లేదు. తమకు
తామే గ్రామములోని బహిరంగస్థలములలో ప్రారంభించి చూడవచ్చిన
వారలు తమ కొసంగెడి బహుమానమును గైకొనిపోవుదురు. వీరొక్క
గ్రామములో నెలయు, రెండునెలలును వసించి ప్రతిదినము నాటసాగిం
చుచుండుట గలదు. "పిల్లికడుపు నిండినను, బాసలో తలఁబెట్టుట మా
నదనిన సామెతగా" స్త్రీలు తమ భర్తలయెడల నెంతయనురాగము
కలిగినవారుగా యుండినను, చపలచిత్తలగుటచే వేఱుక వెదకుచుం

జరుగును. అటువంటివారంతే వేషగాండ్రవలెనోదగుల్కొని భ్రష్టులగుట సంభవించును ఓ నాటకప్రియులారా! జాగ్రత! ఆటపాటలలో మోహితులరై చెడిపోవక కన్నుగలిగి శాంతులనేమరక సుఖింపుఁడు.

ఆ. పగటివేషగాండ్ర పాటలు, నాటలు
వినియుఁగనియు మెచ్చి వెఱ్ఱులకట!
వారివలలఁ జిక్కి వడిపోయెదరుగాన
నట్టిచోట్లకువిడఁజె లరుగఁదగదు.

---

## కొళాయీలయొద్దచేయు మోసము.

ఈకొళాయీలయొద్ద జరుగు మోసములు పట్టణములయందు మాత్రమేజరుగుచుండును. పల్లెటూళ్ళలో కొళాయీలుండవు. కావున నిట్టి యుపద్రవ మచ్చటయుండదు. ఉన్నచోట నెట్లు జరుగుననగా చిన్నవాండ్రైన బాలికలుగాని, బాలురుగాని, యేదైన నొకపాత్రమును గొనివచ్చి కొళాయియొద్ద నీళ్లుపట్టుకొనుచుండినయెడల కేపుమారివాఁడుచూచి తాను నొక చిన్నపాత్రమును చేఁగొని నీటికై వచ్చినవానివలె వచ్చి కొంచెము నిలిచి నీరుపట్టుచున్న యాబాలికనో బాలకునినో చూచి "అదిగో! ఆప్రక్కయంగడికిపోయి కాలణాకు బీడీలుతీసుకొని యొకకాలణా నీవు తీసుకొనుము నీవు వచ్చేలోపల నీబిందెకు నేను నీళ్లుపట్టిపెట్టెద శీఘ్రముగాపోయిర" యన్ని నెమ్మదిగాచెప్పి రెండు కాణీలు చేతబెట్టును. ఆబాలికయో, బాలుఁడో, నిమిషములో తనకు కాలణావచ్చునని, నేదైనను తీసుకొనవచ్చునని యాసచెంది యుగ్గణా తీసుకొని యంగడికి పరుగెత్తి పోవును. వెంటనే యామోసగాఁడాపాత్రములోనినీరుఁ బారబోసి, బిందెనుగొని యతివేగముగా పాఱిపోవును. అంగడికిపోయి బీడీలు తెచ్చినచిన్నవాండ్రు, కొళాయియొద్ద తమపాత్రమును గాని మనుష్యునిగాని కానక యలునిటుంజూచి యేడ్చుచు తమయింటికిపోయి తాముచేసిన నేరమునకై యింట పెద్దవారిచే దెబ్బలువుచ్చుకొందురు. కాలణాలాభమునకుపోయి పదిరూపాయల సొత్తును పోఁగొట్టు

కొనవలసివచ్చినదిగదా! చూచితిరా! మోసము. గొప్పపట్టణములలో యిట్టిపనులు ప్రతిదినము నెచ్చటనో యొకచోట నెన్నియో జరుగుచునే యుండును. పాపాత్ములైన ఈమోసగాండ్రు సర్కారువారిచే పట్టుబడి దండన ననుభవించుచుండినను వీరికి బుద్ధిరాకయుండుట మిక్కిలి వింతగా యున్నది.

ఆ. నీకుబట్టుచున్న నీ వారలగిడీల
కనిచి వారిపాత్ర నీ మనహరించి
పాఱిపోవుదురు కపటపు దుర్మార్గులు
హెచ్చరికను మెలఁగు నీ డిదియెఱింగి.

---

## బావిలో సొమ్ముపడినట్లు చేయు మోసము.

పట్టణములకు వెలుపటనుండు దారిలో నెచ్చటనైనా యొక బావియొద్ద దొంగమోసగాఁడు తన యిలాకాలో మోసపద్ధతిను చక్కగా నేర్పిన సుమారు 7-8 యేండ్ల వయసుగల పిల్లవానికి మంచి చొక్కాయుఁ దొడగి దట్టిచుట్టి చేయువలసిన పద్ధతినిచెప్పి నిలిపి తాను దూరమున మరుగుగా నిలిచియుండును. ఆబాలుఁడు బావియొద్దనిలుచుకొనియుండి యెవఁడైనా యీదారిలో వచ్చుచున్న సమయమున మాటిమాటికిని బావిలో తొంగిచూచుచు వెక్కి వెక్కి యేడ్చుచుండును. ఒంటిగా నిలిచి యటుల రోదనము చేయుచున్న బాలుని జూచి యాదారిని పోవుచున్న మనుష్యుఁడు చాల జాలిపడి కొంచెము దగ్గరకుఁబోయి “అబ్బాయీ! ఒంటరిగా నీబావియొద్దను నిలిచి యేడ్చుచుండెదవేల? కారణమేమి?” యని విచారించును అపుడావిన్నవాఁడు మఱియు నేడ్చుచు, ఆమనుష్యుని చూచి యిట్లుచెప్పును. “అయ్యా! నేనును యింక నలుగురు పిల్లవాండ్రును వేడుకగా నాటలాడుటకై యిచ్చటికి వచ్చినాము. ఆడుచుండునపుడొకసారి మేమీబావిలో తొంగి నీడలుచూచుచుంటిమి. అపుడు నేనుకొంచెమధికముగా వంగినాను తటాలున నామెడలో యుండిన బంగారపుగొలుసు బావిలో పడిపోయినది. అంతట నేను యేడువనారంభింపగా యానేరము తమమీఁ

దికి వచ్చునని భయపడి యాపిల్లవాండ్రు నన్నువిడిచి పాఱిపోయినారు. గొలుసు పోఁగొట్టుకొని యింటికి పోయినయెడల మావాళ్లు నన్నుకొట్టుదురు. నాకు భయముగాయున్నది" యనిచెప్పి మఱియు వెక్కి వెక్కి యేడ్చును. ఆబాలుని మాటలు వినగానే యామనుష్యునకు దురాశ జనించి తనలో "ఈప్రాంతములను నెవ్వరునుమనుష్యులు లేకున్నారు. కావున బట్టి నేను శీఘ్రముగా బావిలోదిగి గొలుసును వెదకి యది దొరకగా పిలి యొడిలో దాచుకొని కనుపడలేదని పిల్లవానితో చెప్పి సంగ్రహించుకొని పోయెదను. వీనుచెప్పెడిమాటలనుబట్టి యోజింపగా పడిసంగము గొలుసు కనీసము పదిసవరములయినను నుండకపోదని తోఁచుచుంత్రికుల ఈదినము నేను నిద్రలేచినవేళ మంచిది. ఎవరిముఖమును చూచితినో గాని మంచి యదృష్టము కలుగునట్లున్నది. తడవుచేయకూడదు" యని తలంచి బాలునిఁజూచి "నాయనా! భయపడకుము. యేడువకు. పాపము కా నీకు సహాయముచేసెద-నేను బావిలో దిగి వెదకి నీబంగారుగొలుసును తెచ్చియిచ్చి పోయెదను. ఇవిగో! నాబట్టలునుచొక్కాయయు గొడుగును నిచటబెట్టి బావిలో దిగెదను వీనిని జాగ్రతగా చూచుచుండుము నేను దిగెద" ననిచెప్పును. బాలుఁడు సంతోషముతో "అయ్యా! ఆలాగే కనిపెట్టుకొని యుంటా" ననును. వచ్చిన మనుష్యుఁడు చిన్నగుడ్డను మొలకు చుట్టుకొని తన వస్త్రములును, కొంచెము డబ్బు జేబులోగల చొక్కాయయు, గొడుగును నచట పిల్లవాని చెంతనునిచి బిరబిరయత్యాతురముతో బావిలోదిగును. వాఁడు నీళ్లలోదిగగానే, వాఁడుంచి పోయిన గుడ్డలును గొడుగునుం గైకొని యాబాలుఁడు బహువేగముగా వరుగెత్తి తనవానితో చేరుకొని యవి వానిచేయొసంగును. అంతట యిరువురును నిమిషములో జాడతెలియకుండా మాయమగుదురు. బావిలోదిగినవాఁడందు గొలుసును వెదకివెదకి కానక విసుగుజెంది తన కష్టము వృథయగుటకు చింతింపుచు నిరాశచేసుకొని యెక్కివచ్చి యొడ్డున తాను పెట్టిన గుడ్డలుగాని, బాలుఁడుగాని కనబడక పోవుటయు, వెలవెలబోయి దిగులొంది నలువంకలంజూచి కానక "అయ్యో! పరునిసొత్తు నపహరింపవలయుననెడి దురాశచే నావస్తువులనే పోగొట్టుకొంటినే! ఆహా! పదేండ్లపిల్లవానిచే మోసపోయినానుగదా! వానిచమత్కార మేమని చెప్పవచ్చును?" అని తలంచుకొని కట్టుకొనుటకు

కుండ పెట్టా? ఏదో తగినదానినొకటిచేసి దొంగను కనిపెట్టవలయును. దీని కెన్నో సాధనములైన పనులున్నవి. లేకపోయినచో? కుండమంత్రమో, మొరటిమంత్రమో, తంగేళమంత్రమో, యేదో యొకటి చేసినయెడల నిజము తెలిసికొనవచ్చును. అటులగాక దొంగను స్పష్టముగా తెలుసుకొనుటకు మంచి యుపాయము మన్నిటికంటె మేలైన దొకటి గలదు. అంజనము వేయించుటయే యాయుపాయము. మంచి వానినిగా పిలిపించి యావనిని జేయించితిమేని తప్పక దొంగయు పోయినసొమ్మునుగానిపెట్టుట నిశ్చయము'' అని యోజనజేయుచుండగా, వారిప్రసంగమునువినుచు చెంత నిలిచియున్నవారిలో మాయలాడియు, మాంత్రికులకుచే దోడుగవర్తించుచు, నెచ్చటనైన నేదేనిసందర్భము కలుగునాయని యరయుచుండునదియు నైన తంత్రగత్తెయొకతె, వారిమాటలలో ప్రవేశమును గలిగించుకొని "ఔనౌను? అమ్మా! అదినిజమే! కాటుక వేసిచూచినయెడల సొత్తును, దానిగొనిపోయిన వానిని స్పష్టముగా తెలుసుకొనవచ్చును. దొంగతనమును కనిపట్టుటకు దీనినిమించినది మఱియొకటి లేదు. మీరు యోజించినది బాగానేయున్నది. కాని, యంజనము వేయువాడు నేర్పుగలవాడై యుండవలెను. ఎందఱెందఱో తాము కాటుకవేసి చూచెదమనెదరు. అందఱిని నమ్మరాదు. సామర్థ్యముగలవాడు నూటికొక్కడేయుండును. తక్కినవారు చెప్పడమేగాని ప్రయోజనము కనబడదు. వ్యర్థముగా ప్రయాసపడి ఫలితము లేకమానుకొని పోయినవారిని నేనెందఱినో చూచియున్నాను. అటువంటివారు కూడదు. గట్టివాడుగా యుండవలయును. అటువంటివాడైనయెడల మీసొమ్ము చిక్కినట్టే! దొంగయు దొరకినవాడే! ఎఱిగినవానిని యోగ్యతగలవానిని పిలిపించుటమంచిది. ఈవిషయమున మిక్కిలిప్రసిద్ధి జెందినవా డొకడున్నాడు అతడైనచో యీపనిని సాధింపగలడు. సందేహించవలసినది లేదు. చాలాగట్టివాడు. నాకు తెలిసినంతవరకును పలుచోట్లచూచినాడు. ఒకచోటనైనను వృథాకాలేదు అదేమిమహిమయోగాని కండ్లతో తానుచూచినట్లే చెప్పి సొత్తుతో దొంగనుపట్టియిచ్చును. మీరువిన్నారో లేదోగాని, వారమురోజులక్రిందట వింతయైన దొంగతనమొకటిజరిగినది. రైస్ మిల్లు నాదముని సెట్టిగారి యింట్లో యందఱుచూచుండగనే రవలదుద్దిగపోయినది. వారు తమవలననైనంతవరకును

దానికొఱకై ప్రయత్నించి తుదకు నిరాశ చేసుకొన్నారు. దానివెల వేయి రూపాయలట. కడపట నెవరో చెప్పగా నీ యంజనగాని బిలిపించినారు. నిమిషములో పట్టియిచ్చినాఁడు. వారింటపనిచేయుచున్న యొకదాసుని పిల్లయే దొంగిలించినది. సొత్తుదొరికినంతట సెట్టిగారు సంతోషించి గొప్పబహుమానముఁజేసి మెచ్చుకొనిపంపినారు. అదిపోనీగాని మొన్నటిమాట జెప్పెదను? ఏమైనది? సాధు రామమేస్త్రీవీధిలో, బాలకృష్ణనాయుఁడు గారి గృహమున బంగారపు టొడ్డాణము, కాసులదండ, రవలకమ్మలు, మఱియు నేమేమో చిన్న చేపెట్టిలో పెట్టి దానిని యినుపపెట్టిలో పెట్టుటకు మఱచినారఁట. అది వెలుపల నేయుండినది. నగలతోఁ గూడా యా పెట్టిమాయమైపోయినది. పోలీసులకు తెలిపినారు. అనుమానముగల చోట్ల సోదా వేయించినారు. ఏమిచేసినను లాభముకలుగలేదు. కడపట యీ కాటుకవేయు మాంత్రికుని పిలిపించినారు. అప్పటిసొత్తుబోయి నెలదినములైనవఁట. అతఁడువచ్చి యంజనము వేసిచూచి, వారి యింటి నౌకరుగానుండువాఁడా పెట్టెనుకొనిపోయి యూరివెలుపట మామిడితోటలో పూడ్చియుండుటను తెలుసుకొని యింటివారలను, పోలీసువారిని వెంటబెట్టుకొనిపోయి తానుచూచిన గుఱుతుల ప్రకారం ఆస్థలములో త్రవ్వించగా నగలతోఁగూడా పెట్టిదొరికినది. పిమ్మట నౌకరును వారేమిచేసినారో తెలియదు. అంజనగానిని పోలీసువారుకూడా చాలా మెచ్చుకొన్నారు. నాకు తెలిసినంతవరకును కాటుకవేసిచూచి దొంగసొత్తును తెలుసుకొనుటలో వానివంటి సమర్థుఁడు లేడు చాలా గట్టివాఁడు. మంత్రశాస్త్రమున నారితేఱినవారికేగాని యితరులకా విద్యలభింపదు. నేనుచెప్పినవాఁడన్ననో, అన్నిటియందును సంపూర్ణమైన శక్తిగల మొనగాఁడు. అతఁడు పిలువగానే తటాలున వచ్చెడువాఁడు కాఁడు. ఎవరైన బాగా యెఱిఁగినవారుపోయి ప్రార్థించిపిలుచుకొనిరావలయును. ఔను! సామర్థ్యముగలవాఁడు యితరులను లక్ష్యపెట్టునా? వానికేమి? మనవంటివారిందఱోగదా! ఎట్లయినను మీరతనిఁబిలుచుకొనివచ్చితిరేని మీసొమ్ముఁ గొనిపోయినదొంగను కనిపట్టియిచ్చును. నేనుదృఢముగా చెప్పగలను" అని చెప్పెను. ఇంటిలోనియాడంగులా మాయలాడి మాటలువిని, యీమంత్రగాని నెవ్విధముననైనను పిలిపించవలయునని తలంపుగొని, [illegible]

యుంగలార్చి "యంజనగానిఁ బిలిపించి యంజనము వేయించవలసిన" దని ముష్కరముగాఁ బట్టుపట్టి "అయ్యో! బిడ్డపోయినను పురిటికంపుపోవలే" దన్నచందముగా, సొమ్ముపోయి యదియింక దొరకదని నిశ్చయించి కొనినంతట నయితము మీకీదురాశ యింకనుమాన లేదా? ఛీ! ఆయంజనములు గింజనములు శుద్ధమోసము, నాకునమ్మతము లే" దని యెంతచెప్పినను వినక బాధింపుదురు. తుదకతఁడు "మీయిష్టప్రకారము చేసికొనుండు. నేను ప్రవేశించను అంతయుం జూచుచుండెద" నని యాబాధ్యతను వారిమీఁద నే వేసి, వారివలన బాధతప్పిన దే చాలునని యూరకుండును. అంతట నింటిలోని స్త్రీలు తమతోడ నంజనగాని విషయమును చెప్పినపోలమ్మనుపిలిచి "ఓయమ్మా! నీకుపుణ్యముకలుగును మాకుకొంచె ముపకారము చేయుము. కాటుకవేసిచూచెడి యామంత్రగానిని నీవు బాగా యెఱుంగి యున్నట్లు నీమాటలనుబట్టి గ్రహించితిమి. కావున నీవుశీఘ్రముగాపోయి యెవ్విధముననయినను నతనిని పిలుచుకొనిరావలసినది. మాసొత్తులు దేవునిదయవలన దొరికెనేని మేమునీవు జేసిన మేలునుమరువము. గొప్పబహుమానము చేసెదము అడ్డుమాటలు చెప్పక త్వరితముగా పోయిర"మ్మనిపోవుటకును వచ్చుటకును బండిచార్జిలును చేతిఖర్చులకును బెట్టుకొనుమని, కర్పు పెట్టుటకు గణాధిపతిపూజగా నొకటియో రెండో రూపాయలు చేతనొసంగి ప్రయాణము జేయుదురు. అయినను, తనయింటవంటగానందున భోజనము చేయలేదనిచెప్పి, యాతరగరి మోసగత్తె యచ్చట నేయున్నమఁ దిని యాకులువక్కలుందీసికొని పయినమైపోవును. అంజనము వేసెడివాఁడు వచ్చుననియు, తమసొత్తులు చిక్కుననియు, నింటిస్త్రీలు మిక్కిలియాశతో యిరుగుపొరుగుల యమ్మలక్కలతో తద్విషయమై ప్రస్తాపించి గుసగుసలాడుచు మంత్రగాని రాకకునిరీక్షించుచుందురు. తరగిరియాఁడుది తనకు తెలిసియున్న వాడు కదాయనియొద్దకుఁబోయి వర్తమానమును చెప్పి, మఱియుం గొన్ని రహస్యము లెఱింగించి "మంచిచోటు యుక్తిగా నెంతడబ్బును లాగినను లాగుకొనవచ్చును. ఈవిషయములో నీచాతుర్యమంతయుం గనుపరచవలయు"ననిన వాఁడుదానితో "నీవామాట చెప్పవలసినదియే లేదు. యేచోట నెట్లుచేయవలయునో యటుల చేసి వారికినమ్మకము బుట్టింపగలను. నీవు క్రొత్తదానివలె నాశక్తి తెలిసియుండియుం జెప్పెదవేల? యెట్లు

ను చూచుటయే లేదు. నాయొద్దకే కావలసినవారు వచ్చి నామా
టలువిని పోవుచుండుదురు. వచ్చినవారెవ్వరును నష్టముచెందినది
లేదు. ఎవరైనను విడువక చాలా బలాత్కారించినపుడు విధిలేక వారి
మాట నిరాకరింపకూడదని యాస్థలమునకుమాత్రమే పోవుదును. అది
యు నూటికి యొకటో రెండో చోట్లు మాత్రమే! ఇపుడన్ననో యీ
యమ్మగారు చేసిన తొందరనుబట్టి రావలసివచ్చినది. సరే! ఎట్లో
యొకలాగున వచ్చినాను. వృత్తాంతమును చెప్పినారు గదా! చూడవ
చ్చును లెండు." అని కడుశాంతముగా చెప్పెను. ఇంటివారతఁడు
"చూడవచ్చును చూడవచ్చు"నని యెప్పుడో చూచుదమన్నట్లు చెప్పుచుండుట
విని "అయ్యా! అట్లుగాదు. మీరు దయయుంచి నేఁడే చూడవల
యును. ఆలస్యము చేయుట యెందుకు? కొంచెము శ్రద్ధవహించండి"
అని తొందరపెట్టి ప్రార్థనఁ జేయుదురు. వాఁడు కొంచెము ఆలోచించి
వారిని చూచి "ఈదినము చూచుటకు వీలుకాదు. క్రొత్తపేటలో యొ
కరి యింట నిన్న దొంగతనము జరిగి చాలా సొమ్ముపోయినది వారు
వచ్చి చాలా ప్రార్థించినారు. గొప్పవారగుటవలన యీదినము వచ్చు
నట్లు మాటయిచ్చినాను. యిపుడుకూడా యిద్దరుమనుష్యులు వచ్చి
మాయింటియొద్ద నున్నారు. ఈమెచేసిన తొందరవలన యిచటికివచ్చి
మీతో మాట్లాడి పోవచ్చునని యామనుష్యుల నచటనే యుండవలసి
నట్లుచెప్పివచ్చినాను. వారిని యీమెయుచూచివచ్చినది. కాఁబట్టి నేఁడు
నేనచ్చటికి పోయితీరవలయును. ఇచ్చటికి రేపటిదినము వచ్చెద ఆలస్య
మగుచున్నదని మీరు భయపడవలదు. మించిపోయిన దేమియు లేదు.
పాతాళలోకములో యున్నను మీ సొత్తును కనిపట్టగలను. ధైర్యము
గాయుండుఁడు. సరే గాని" యని పలికి మరల కొంచెము ఆలోచించి
"దొంగతన మెచటజరిగినది? ఆస్థలమెక్కడ?" అని యడుగగను ఇంటి
వారలలో, నొకస్త్రీ "అదిగో! ఆయఱలో నే! నగలు చిన్నపెట్టియలో
పెట్టి యాబీరువా నడిమియఱలో యుంచినాను. తలుపు మూసి బీగము
వేసినాను. ఏదో తొందరపని వలన బీగములను తీసుకొనక యాబీ
రువాలో నట్లే తగిల్చియుంచి వెళ్లినాను. మరల యాజ్ఞాపకమే లేదు. నేను
యఱలోవచ్చి చూడను లేదు. సాయంత్రము ప్రక్కయింటికిపోయినాను.
అపుడు యింట నెవ్వరును లేరు. వాకిటి తలుపునకు బీగము వేయకుండా

సూర్యోదయకాలమునకు మాంత్రికుఁడు చెప్పినమాటప్రకారమువచ్చి తన
కు విజనముగా నింటఁ బ్రత్యేకపుటఱ యొకటిశుద్ధిచేయించి సిద్ధపరుపఁబడిన
వస్తువులన్నియు నందుఁ బెట్టించి, యందఱును తాను పిలుచునంతవరకు లో
పలరాకూడదని చెప్పి తలుపుమూసుకొని లోపలఁజేరి పూజ జరిగించుచు
న్నవానివలె నటించుచు, తనకు కావలసినవరకు నచటనుంచు భక్ష్య
ములను పండ్లును తృప్తిగా భక్షించి, పిమ్మట నొకకలశముఁ బెట్టి, మిగి
లిన భక్ష్యములు, ఫలములు దానికి ముందువైపున నునిచి, తానుతిని
నట్లు తెలియకుండుటకై వానిమీఁద పూవులు పోసి, కొన్నిపూవులతో
నాకలశము నలంకరించి కర్పూరము వెలిగించి, తలుపుఁ దెఱచి జను
లు లోపలవచ్చి కూర్చుండవచ్చునని చెప్పును. అతఁడు చేయువనులును,
సొమ్ము కనిపెట్టు సామర్థ్యమును చూచుటకై యింటివారేగాక వారికి
ముఖ్యులుగా యుండెడి యిరుగుపొరుగువారునువచ్చి యఱలోఁ కూర్చుం
డుదురు. అంతట వాఁడు తనరొండినిదోపుకొనియున్న చిన్నడబ్బి నొక
దానినితీసి యందుండి నల్లనికాటుకను గురిగింజప్రమాణముగొని దాని
నొక తమలపాకుపై చుక్కగా బెట్టి, యాతమలపాకునకు ధూపదీపనై
వేద్యము లొనరించి యచ్చటనుండిన చిన్నబాలురలో నెవనినైన నొక
నిం బిలిచి కూర్చుండఁబెట్టి, వానిముఖమున గోరెడు విభూతిరాచి తల
పై నాలుగు అక్షింతలువేసి, మంత్రించువానివలె యొకనిమిషకాలము
పెదవులు గదల్చుచుండి పిమ్మట "అబ్బాయీ! ఇదిగో! ఈయాకు
పైఁబెట్టిన కాటుకచుక్కమీఁద దృష్టి నిలిపిచూడుము. చూచి నీకేమి
కనుపడునో చెప్పుము" అని యాకు వాని యరచేతఁ బెట్టును. ఆబా
లుఁడు దృష్టించి 5-6 నిమిషములట్లైచూచి "నాకేమియుం దెలియలే"
దనును. మంత్రగాఁడు "సరి! వీనికి కాటుకశక్తి యంటలేదు. వీనివ
లన ప్రయోజనము లే"దనిమఱియొక పిల్లవానిని పిలిచిచూడుమనును.
వాఁడును మొదటివానివలె చెప్పును. వరుసగా నలుగురైదుగురు పిల్ల
వాండ్రచేత నిచ్చిచూడుమనును. అందఱును మొదటివానివలెనే చెప్పు
దురు. తరువాత మంత్రగాడు యింటివానినిజూచి "వీరెవ్వరునుంజూచు
టకుపయోగించువారుగా నుండలేదు. వీధిలో నెవ్వరైననుండిన యొక
బాలుని దోడ్కొనిరండి" యని చెప్పును. వారు బిరబిరబోయి యిద్దరు
ముగ్గురిని పిలుచుకొనివచ్చి విడుతురు. వారిచేతయిచ్చినను మాకేమియుం

యిరువదియైదురూపాయలైనపుడు కట్నమేమడుగునో తెలిసినదికాదు. ఇప్పటికే పూజసామానులకుగా యేబదిరూపాయలకు పైగానేయైనది. ఎట్లు? దక్షిణపెట్టకున్నచో యంజనము చూడననుచున్నాఁడు. చేయుచున్నకార్యమును తటాలునఁ బాఁపివేయుట యోగ్యముకాదుగదా! ఈ యల్పమునకు మనమాలోచించితిమేని పనిచెడిపోవును. మొదటనేమన మాలోచనచేయక కర్చుపెట్టినాము. ఇపుడు చింతించిన లాభమేమి? ఏమైననగును. చేయుచున్నపనిని నడుమ నిలుపరాదు. ఇచ్చితీఱవలసినదియే!" యని యాలోచించి దమ్మిడియైనను తక్కువలేకుండా వాఁడు కోరినప్రకారముగా తెచ్చి దక్షిణపెట్టుదురు. అంతటమంత్రగాడు మరల జపముప్రారంభించి బాలునిఁజూచి "అబ్బాయీ! చూడు! ఇపుడునీకేమికనబడుచున్నది? చెప్పుము?" అని యడుగును. ఆపిల్లవాఁ డేమియుం దెలియలేదనును. కాటుకవేయువాఁ డొక నిమ్మపండును కోసి యాబాలునికి దిగదుడిచి కొంచెము విభూతి మీఁదజల్లి "భయపడవలదు. యిపుడు దృష్టినిలిపి చూడు"మని చెప్పును. ఆచిన్నవాఁడు కొంచెము తడవుచూచి "ఓయబ్బో! అదేమిరూపము? ఎంతపెద్దనోరు? ఎంతపొడుగుకోఱలు. ఓయమ్మయ్యో! అప్పటికప్పటికిపెరిగి పెద్దదగుచున్నది. తాఁటిచెట్టుపొడుగైనది. నిప్పులురాలుకన్నులతో నన్నుచూచి పండ్లిగిలించి గ్రుడ్లు గిరగిరఁద్రిప్పుచున్నది. అయ్యయ్యో! వచ్చెనువచ్చెను. ఆభూతము నామీఁదికిదూఁకుచున్నది. చాలా భయముగానున్న"దని కూతలుబెట్టి గజగజవడంకుచు "ఈభూతము నన్నుమ్రింగివేయుట నిశ్చయము. ఇంక నేను చూడఁజాలను నేనువెళ్లెద. నావలనగా"దని లేవఁబోవును. అంజనగాఁడు వానినిపట్టుకొని "అబ్బీ! కదలకుము. నీకేమియుభయములేదు. అది నిన్నేమియుం జేయదు అటులకనుపించునేగాని మఱేమియుదుడుకుతనముఁజేయునదికాదు. ఎవరనుకొంటివి? భేతాళుఁడునుమా! ధైర్యముతోదండముఁబెట్టి దొంగిలించుకొనిపోఁబడినసొమ్మును చూపుమనియడుగుము. అంతట యాభయంకరరూపముమాని నీకు కనుపడి యంతయుం జెప్పును" అని బోధించును. ఆపిల్లవాఁడు కొన్నినిమిషములట్టేజూచుచుండి "ఓయిభేతాళుఁడా! ఓయయ్యా! నన్నేమియుం జేయకుము. కరుణించి దొంగలెత్తుకొనిపోయినసొమ్ములను దొంగనుంజూపుము. కోపముమాను" మని వేడుకొనును. అందఱును నాశ్చర్యముతో

బాలుఁడు చెప్పెడిమాటలను వినుచుండుదురు. మంత్రగాఁడు పిల్లవానిని జూచి "ఏ గ్రామమఁ డిప్పుడెట్లున్నాఁడు? ఏమిచెప్పుచున్నాఁడు?" అని యడుగును. బాలుఁడు పదినిమిషము లేమియుఁబలుకక యూరకుండి, "ఆభవనమొక్కరగ్రామము మాయమైనది. పెద్దశోభితోట యొకటి కనఁబడుచున్నది. యీవెలుతురులో నదిగో! శివుఁడిగుడి కనపడుచున్నది. గుడి మీఁద బంగారునీరుపోసిన శిఖరమున్నది. వాకిట బంగారునీరు ధ్వజస్తంభమున్నది. గంటలు గణగణ గాలికి మ్రోగుచున్నవి. గుడి కెదురుగా పెద్దవీధి యున్నది. ఆవీధిలో కొంచెముదూరము పోయినంతట యుత్తరపువైపున సందువీధి యొకటి కనఁబడుచున్నది. అయిదారుయిండ్లు దాటినంతట పెద్ద మిద్దెటిల్లున్నది. దానికి తూర్పువాకిలి. ఆయింటిలో కూటమునకు దక్షిణభాగమున నర యొకటికలదు. అందు పెద్దబీరువా యున్నది. బీరువామూసి తాళముల గుత్తియుం చే తగిల్చియున్నది. బీరువాతాళము దానియందుమార్చబడి తక్కినభాగములు వ్రేలాడుచున్నవి. బీరువాతలుపుపై అ. క మ. యని యొకవైపునను, ధనలక్ష్మియని యొకవైపునను వ్రాయఁబడియున్నది" యని చెప్పుచుండగా విని యింటిలోని మతిలేనియూహునా [illegible]ని యొక్క మహాదాశ్చర్యముతో "ఔరా! విన్నారటనమ్మా! ఎచ్చటో వీధిలో యాడుకొనుచున్నపిల్లవాఁడు ఎప్పుడును వచ్చిచూచియున్నవాఁడు గాఁడుగదా! వీనికి మన యింటిలోనివిషయము లెట్లు తెలియును? పుట్టుపూర్వోత్తరములు పండు నొలిచి చేతఁబెట్టినట్లు చెప్పుచున్నాఁడు. మనయింటిలోనిగుట్టుముట్టును, జరిగిన సందర్భములను నేఁడెఱుంగునా? భేతాళుఁ డీవియున్నియుం జాపుచున్నాఁడు కాఁబోలు. మంత్రగాఁడు చాలాగట్టివాఁడుగాయున్నాఁడు. ఇతఁడు నిస్సంశయముగా దొంగను పట్టియివ్వఁగలఁడనితోఁచుచున్నది" యని రహస్యముగా మాటలాడుకొని యంజనము వేయువానిమహిమకు మెచ్చుకొని వానిని కొనియాడుచుందురు. కడపట వాఁడు తమనోట మట్టిగొట్టిపోవునని పాపము వారెఱుంగరు. ఎట్లు తెలియును?

మంత్రగాఁ డడుగుచుండగా యాబాలుఁడు మఱియునిట్లు చెప్పెను. "తాళములగుత్తి బీరువయందు వ్రేలాడుచున్నదేగాని యింటిలోనివారెవ్వరును కనఁబడలేదు." అని చెప్పుచుండ బాలుఁడు చెప్పిన ప్రతిమాటకును నంజనగాఁడు "ఆ! సరే! ఊ! పిమ్మట? ఏమికనబడుచున్నది? బాగాజూచి

చెప్పు''మని యూఁకొట్టుచు హెచ్చరించుచుండును. ఆపనివాఁడు "వాకిటి తలుపు దగ్గఱకు మూసియున్నది. ఆడుమనిషి యొకతె వచ్చి కడపలో నిలిచి యటునిటుంజూచి తలుపు తెఱచి లోపలికి వచ్చినది బిరబిర బీరువా యుండెడి యఱలోనికరిగి, బీగముతో తలుపులు తెఱచి బీరువాలో చూచుచున్నది మూరెడు పొడుగు, జానెడు వెడల్పుగల నల్లరంగుపూసిన చిన్న పెట్టె నెత్తుకొని సంకఁబెట్టుకొని మరల బీరువా మూసి వడివడిగా వాకిటి తలుపు వేసి వీధిలో ప్రవేశించి వేగముగా యుత్తరపు దిశగా పోవుచున్నది. సూర్యాస్తమానమైనది. ఆయాడుమనిషి యూరుదాటినది. అచటనుండు చెట్లగుంపులో మఱియొకతె యాడుమనిషియు మగవాఁడొకఁడును నిలిచియున్నారు. పెట్టెఁగొనిపోయినమనిషి వారియొద్దకుచేరి, యేమో చెప్పి యాపెట్టెను పురుషునిచేత యిచ్చినది. చీకటిపడి మనుష్యులు జాడగా కనబడుచున్నారు. వారుముగ్గురునుగూడి యెక్కడికో పోవుచున్నారు. మొదటియాడుదానిని యెచ్చటనో చూచినట్లున్నది కాని తక్కిన స్త్రీపురుషులు గుఱుతు తెలియుటలేదు. వారు చాలాదూరముపోయినారు. రైలురోడ్డు కనబడుచున్నది. దానిని దాటినారు." అనిచెప్పగానే యింటిలోనివారు రహస్యముగా తమలో నొకరికొకరు "ఆహా! విన్నారా! బట్టబయలైనది. మనకెచ్చట సందేహముగలదో యదేవచ్చినది. ఆముండయే! మొదటనుండియు నాకుదానిమీఁదనే సందేహము. మీరునమ్మరైతిరిగదా! ఇపుడేమిచెప్పెదరు?" అని యొకర్తయును "ఔనే! దొంగముండలశక్తి యెవరికి తెలియును? అది యింత గొప్పపని చేయునా? యని యెంచినాము. ఆహా! ఎంతద్రోహమునకు పాలుపడినది. మఱియొకతె దానిచెల్లెలై యుండును. అదిమగనివిడిచి యూరూరదిరిగియున్ని విద్యలయందును వారితేఱిన జాణకత్తె అమగవాఁడు దానివిటకాఁడుకాఁబోలు. బాగా తెలిసికొనినపిమ్మట గదా? వారికి దుర్గతికలుగుట. కానీ తెలియునిందు. వారినిపట్టి తెప్పించి కత్తికి కండగా కోయించక విడిచెదమా?" యని వదరుగొనుచు పిల్లవాని మాటలు వినుచుండురు. అంజనగాఁడు బాలుసింగని "నాయనా! బాగుగా జూడుము? వారు రైలురోడ్డుదాఁటి యెట్లుబోయిరి?" యని యడుగును. వాఁడు అదిగో! రోడ్డుకు కొంచెముదూరములో మామిడితోఁట యున్నది. వారాతోఁటలో ప్రవేశించినారు. లోపల నంధకారమయముగాయున్నది. చెట్లు

మిక్కిలి భయముగాయున్నది. మీరు నన్ను చంపినను నేనుచూడను” అని వైద్యునిపట్టు వదలించుకొని తటాలున పాఱిపోవును. ఈచిన్నవాఁడౌనేఁడా? ఆయంజనము వేయువానికి సంబంధించినవాఁడే కాని యన్యుడు కాఁడు. వానిని యిటువంటిపనులలో ప్రవర్తింపవలసినరీతిని నేర్పి మంత్రగాఁడు తానుపోయినచోట వెలుపట నాట్లాడుచున్నవానివలె నుండునట్లుచేసి వానిని పిలుచుకొనివచ్చునట్లు యుక్తిగావించి తత్పూర్వముగానే తానునేర్పియున్నమాటలు వానిచే చెప్పించి యింటివారిని భ్రమింపఁజేయుచుండును. అంజనగాఁడు పోలమ్మవలనను ఇంటివారివలనను వృత్తాంతమును తెలుసుకొనిపోయి యాపిల్లవానికి చెప్పవలసిన రీతినంతయుం జెప్పి వీధియందాడుచుండునట్లుచేసి, తానేమియుం నెఱుంగనివానివలె తనకును పిల్లవానికిని సంబంధము కలిగియుండుట తెలియనీయక యుపాయముగా వానిని పిలుచుకొనివచ్చునట్లుచేసి పయిన తెలిపిన విధముగా వానిచేచెప్పించెను. వాడుకపడియున్నయాపిల్లవాఁడు నేర్పినట్లు జరిగించి విషయము పూర్ణముగా చెప్పక పూర్వమే వాడుక ప్రకారము లేచి పాఱిపోయెను. ఈ మహాతంత్రము తెలుసుకొనుట యెట్లు? ఇంకగతియేమి? పిమ్మట యంజనము వేయువాఁడు వెలవెలబోయినట్లభినయించి కొంచె మాలోజించి “ఓరిపాపాత్ముఁడా! ఇంక పదినిమిషములు చూడక పాడుచేసితి వేమిరా! ఇంతలోనే దుర్బుద్ధిపుట్టినదా? అయ్యో! చేసినపని యంతయు వ్యర్థము గావించినావు.” అని కోపముతో యాపిల్లవానిని దూషించి యింటివారినిచూచి “ఇంకేమి చేయవచ్చును? దుష్టుఁడైన యీముండాకొడుకు తుట్టతుదకు పాడుగావించి వెళ్లినాఁడు. పదినిమిషములుండక భయపడి పరుగెత్తిపోయెను. ఈదినము పనిచెడిపోయినది. ఇంక చూడకూడదు. శుక్రవారమునాఁడు మరల కాటుకవేసి చూచెదను. ఇప్పటివలెనే పూజకు సర్వమును సిద్ధముచేసి యుంచండి. నేను వచ్చిచూచి మీసొత్తుఁ గొనిపోయినవారిని, ఆసొమ్ము లుండుచోటునుం దెలిసికొని స్పష్టముగా చెప్పెదను. ఇపుడు మూఁడుపాళ్లు తెలిసికొంటిమి. ఇంక కొనిపోయినమనుష్యులను, సొత్తులుండు స్థలమును మాత్రమే మనము తెలిసికొనవలయును. ఇదియంతగా ప్రయాసలోనిది కాదు. కష్టమంతయు మొదటనే యుండెను. అది గడచిపోయినది. ఇంక సులభముగా తెలుసుకొనవచ్చును. ఈచూచినపిల్లవా

వారికి కనుపించనే కనుపించదు. అంతటితో నిరాశచేసుకొని తమయవివేకమును గురించి దుఃఖమునొంది చేయునదిలేక యిన్నకుండుదురు. పోలమ్మ యంజనగానిని సాంకేతిక స్థలమున సంధించి తనకు రావలసిన కమిషన్ పుచ్చుకొని సంతసముతో పోవును. ఈదురాత్మురాలు ఇట్టి యచ్చటచ్చటం దిరుగుచు, నేదైన సంశయము కలిగినయెడల మంత్రగానిని పిలుచునట్లు నచ్చఁజెప్పి పురికొల్పి యీయంజనగానిని పిలుచుకొనివచ్చి వయిన చెప్పినట్లు తంత్రము చేయుటకు తాను తెలుసుకొనిన విషయములన్నియుం దెలిపి యెఱుంగనట్లుండును. అంజనగాఁడు పోలమ్మవలన వృత్తాంతమంతయుం దెలిసికొని యుండుటచే సమయానుగుణ్యముగా నటించి డబ్బులాగుకొనిపోయి పోలమ్మకు కమిషన్ యిచ్చి పంపుచుండును వీరికిదియే వృత్తి యిరువురికినియిల్లువాకిలిభూమి పుట్ర యేమియును నుండదు. కాఁబట్టి వారినికనుఁగొనుట కష్టము. జనులారా! ఇట్టి మోసగాండ్రు తరగరులమూలమున నచ్చటచ్చటజరుగు విషయములు తెలుసుకొని, దీనికొఱకై తమయొద్ద నుంచుకొనియున్న పిల్లవాండ్రకు చెప్పవలసిన విధమును బోధించి, తాముపోయెడి సమీపమున నాట్లాడుకొనుచుండునట్లుచేసి, యింటివారిద్వారా వానిని పిలిపించి, తమకు కావలసిన మాటలు చెప్పింతురు. వారికిఁగల సంబంధమును, తంత్రమును నెఱుంగక నిజమనినమ్మి జనులు మోసపోవుదురు.

అంజనముచూచి దొంగలనుకనిపట్టుట మహామోసముగాని నిజములేశమైనను లేదు. అదియే నిజమైనయెడల గవర్నమెంటువారు కోట్లకొలది ద్రవ్యమును కర్చుపెట్టి పోలీసు డిపార్టుమెంటును పెట్టుకొననేమిటికి? వీరికే గొప్పజీతములనిచ్చి పెట్టుకొందురుగదా! ప్రపంచమున జరుగుచుండు దొంగతనములను సులభముగా తెలుసుకొనుచుందురు కదా! అది సర్కారువారి కెంతయో లాభకరముగా నుండునుగదా! ఇటువంటి మోసగాండ్రు చెప్పెడిమాటలునమ్మి లోబడి జనులుతాము కష్టపడి సంపాదించిన డబ్బును దారబోసి, కడపట తమ యవివేకమును గురించి పశ్చాత్తాపమునొంది దుఃఖపడుచుందురు. ఆహా! ఇదియెంతటి యన్యాయ మనవలయును? ఎంతటి మోసము? ఈమాయకాండ్రు చెప్పెడి మాటలునమ్మక వీరిని చెంత చేర్పకుండుట శ్రేయము. లేదా? నష్టకష్టముల పాలగుదురు.

గీ. దొంగ కొనిపోయినట్టిసొత్తును నెఱింగి
యంజనముఁజూచి చెప్పెద నే ననుచువచ్చి
కల్లమాటలు వలికిరొక్కంబుఁ గొనెడి
తంత్రగాండ్రను నమ్మఁగా దగదు జనులు.

---

## బ్రాహ్మణులు జీవించు మోసము.

సాధారణముగా బ్రాహ్మణులమనియు, తమకంటె జాతిలో నెక్కువ వారు లేరనియు గర్వముతో డంబముగా బలుకుచు తిరుగుచుండు వారల నెందఱినో చూచుచున్నాము కాని వారు తమజాతికి సంబంధించిన సదాచార సంపదమాత్ర మెఱుంగరని చెప్పవచ్చును. తమకంటె తక్కువ వర్ణములవారని యెవరిని చెప్పెదరో యటువంటి క్రిందితరగతులలోని వారు సయితము చేయ సాహసింపలేని నీచకార్యములను ఈయుత్తముల మనెడి బ్రాహ్మణులు చేయుటకు వెనుదీయరు. వర్ణాచార, వంశాచార, ధర్మములకన్నను, ధనార్జనాచారము వీరికి ముఖ్యము. స్నానము, సంధ్య, జపము, తపము, ననుట యెట్టిదో వీరిలో మూడువంతులవారికి తెలియనే తెలియదు. తాము బ్రాహ్మణులనిపించుకొనుటకు కాఁబోలు మురికిబట్టి చెమటలోనాని, నల్లగా తోలువారు వలె నుండెడి జందెమును మాత్రము విడువక తగిలించుకొని యుందురు. వీరిముఖములలో ప్రేతకళ తాండవమాడుచుండును. ఆచార విషయమున నూటికి కోటికి నెవఁడైన నొకఁడుండునేమో గాని, తక్కినవారు తమ జాతి యెట్టిదియో, తమశీల మెటుల నుండ దగినదియో తలంపనైన తలంపరు ఏనూటికి పదిమందియో లౌక్యవృత్తిన వలంబించి కొంచెము విలక్షణముగా కనుపడినను, తక్కిన వారికి వైదిక వృత్తియే ముఖ్యమైన జీవనము. ఈవైదిక వృత్తిగల వారిని పగటివేషగాండ్రని చెప్పినను చెప్పవచ్చును. వేషము మాత్రము వేసినను, దురాచారమంతయు వీరియందే నెలకొని యుండును. యీ రకములో చేరినవారిలో కొందఱుచేయునదేమనగ, ప్రొద్దుననే నిద్రలేచి ముఖము కడుగుకొని విభూతి రేఖలుదీర్చి గందవు బొట్లు పెట్టుకొని బిళ్లగోచులతో ధావతులు గట్టి, మొదటిరాత్రి పుల్లనీళ్లలో వేసిన యన్నమో

లేక పులిసిన దోసెయో, యిడ్డనయో తినిగాని, లేక కాఫీహోటలు నకు పోయిగాని కడుపు నింపుకొని నోట నేమియు వేయనివారివలె నా లుగు వీధులుందిరిగి, యే యింటిలో శ్రార్ధమో, యెవరి కొంపలో క ర్మాంతరమో, యెవని గృహమున పెండ్లియో, పుణ్యాహమో, లేక యెక్కడ సమారాధనయో, ఎక్కడ నవగ్రహదానము నిచ్చెదరో యని విచారించుచుండుదురు. కొందఱు యేగుంట గట్టుననో, యే రావి చెట్టు దగ్గఱనో, యేగుడిముందటనో చేరి యొకరితో నొకరు "ఆయింట నొక ముసలివాఁడు చచ్చినాఁడు. ఆనాయుఁడు కొంచెము కలిగిన వాఁడే! అతనియింట నేఁడుతిథి అదిగో! ఆపెద్దగృహమున కర్మ జరుగు చున్నది. బ్రాహ్మణులకు భూరియివ్వఁదలంచియున్నాఁడఁట" యని యిట్లు తెలియఁబలుకుకొని, ఎచ్చటనైనను నేదేని విశేషకార్యము జరుగుచున్న యెడల నతఁడేజాతికిచేరినవాఁడై యున్ననుసరే! పిలిచినవారివలెపోయి తత్పూర్వమే యచటికివచ్చియున్న బ్రాహ్మణులతో (వారును వీరివలె వచ్చినవారే!) చేరికూర్చుండి, "ఎపుడు దక్షిణ నొసంగుదురా, దాన మొసఁగుదురా" యని నోళ్లుతెఱచుకొని, తమకు బియ్యమో, వస్త్ర మో, గొడుగో, చెంబో, మఱియేదియో యొకటి దొరకక పోదనెడి యాశతో, తమకు బొత్తుగా యేమంత్రమునుం దెలియక పోయినను, తెలిసినవారివలె నభినయింపుచు, మంత్రములు పలుకుచున్న వారితో చేరి పెదవులు గదల్చుచు గొణుగుచుండుదురు. తమచేత యక్షతలివ్వక పోయినను ఎపుడును తమయొద్ద పొట్లము గట్టిపెట్టుకొని యుండుదురు గాన వానిలో నాలుగుగింజలుతీసి తాముగానే యజమానునిపై విసరి వేసి, తక్కినమంత్రము నంతయు విడిచి కడపటనందుకొని గట్టిగా "శత మానంభవతి, శతాయుఃపురుషః, ఆయుష్యేవేంద్రియ,ప్రతితిష్ఠతి.చిరం జీవి చిరంజీవి, సుఖీభవ సుఖీభవ. అష్టైశ్వర్యాభి వృద్ధిరస్తు" అని చెప్పి యాశీర్వదింపుదురు. యజమానుఁడు తనశక్తికొలఁదిఁ దోఁచినది రూకయో, పావలయో, యొసంగినయెడల తీసుకొని సంతోషింపరు. కుమారునకు వివాహమనియు, కాశియాత్రకుపోవుచున్నాననియు, భగ వత్కైంకర్యమనియు, సంతర్పణయనియు, చెప్పి మీరు గొప్పవారును, ధర్మచింతగల దాతలునని వినివచ్చినాను. తగినసహాయము జేయవలయు

పివేయుదురు. ఇట్లే కొంతకాలమునకుపూర్వ మొకబ్రాహ్మణుఁడు బాగుగాచదువుకొనినవాఁడే. యొక పేదబ్రాహ్మణపిల్లవానిని వెంటగొని చెన్నపట్టణములో గొప్పధనికుఁడైన యొకసెట్టిగారియొద్ద కరిగి “అయ్యా! వీనితండ్రి చనిపోయినాఁడు. నిరుపేద. కర్మ జరుగవలసియున్నది. యేమియు గతిలేదు. అయ్యో! పాపము! బ్రాహ్మణచిన్నవాఁడే! కర్మచేయకుండిన జాతిభ్రష్టునిఁజేయుదురే! యని ధర్మచింతతో ఇతనికిని నాకును సంబంధమేమియు లేకపోయినను, మీవంటి గొప్పవారిని యాచించి యీకార్యమును నెరవేర్చి బ్రాహ్మణులలో కలుపనెంచినాను. ఇదియే నేనుచేయుగల సహాయము. కొందఱు పెద్దమనుష్యులు కొంతవరకు సహాయముచేసినారు. తామును ఈపుణ్యకార్యమునకు సహాయముచేయవలయు”నని యడిగెను. ఆసెట్టిగారు చాలామంచివారును, ధర్మగుణముగలవారును నగుటవలన, యాకార్యమునకు యిరువదిరూపాయల నివ్వఁదలంచి లోపలనుండి తెప్పించెను. ఇంతలో యాబాలుని నెఱింగినవాఁడును, సెట్టిగారి కాశ్రితుఁడును నైన బ్రాహ్మణుఁడొకఁ డచ్చటికివచ్చి పిల్లవానిఁజూచి “ఓరే! ఇదేమిరా! ఇచ్చట వచ్చియున్నావు. నినుగానక నీతండ్రియు, నీతల్లియు వీధివీధియుందిరిగి వెదకుచున్నారు. శీఘ్రముగాపోరా! పో!” యని చెప్పెను. వానిని పిలుచుకొనివచ్చిన మహానుభావునితలపై పిడుగుపడినట్లైనది. సెట్టిగారి కాశ్చర్యముకలిగినది. అతఁడా యాశ్రితునిఁజూచి “ఏమీ? ఈచిన్నవానితండ్రి యున్నాఁడా ? చనిపోయినాడనియు కర్మజరుగుటకు గతిలేదనియు, నేమైనను సహాయము చేయవలసినదనియు, ఈశాస్త్రిగారు తోడ్కొనివచ్చినారే! ఏదినిజము?” అనియడిగెను. ఆబ్రాహ్మణుఁడు, శాస్త్రివంకచూచెను. శాస్త్రి వెలవెలబోయి పలుకఁజాలకుండెను. వచ్చినబ్రాహ్మణుఁడు నవ్వెను. సెట్టిగారు శాస్త్రిచేసినతంత్రమును గ్రహించెను. అటుమీఁద జరిగినదియుం జెప్పవలయునా? మఱేమియు విశేషములేదుగాని, సెట్టిగారు మహాకోపమునుచెంది, “చీ! చీ! లేచిపో”మ్మని నవుకరువంకచూచెను. వాఁడు బిరబిర నర్ధచంద్రప్రయోగముఁ జేసి శాస్త్రిగారిని వీధికిఁ జేర్చెను. ఆవిషయము విన్నవారందఱును చీవాట్లుపెట్టిరి. శాస్త్రి మునుకు వేసుకొని తటాలున నొకసందుఁజొచ్చి మాయమయ్యెను. ఈవిధము

గానే కొడుకు పెండ్లియనియు, కుమార్తె సీమంతమనియు, భార్య కానుప నియు, నింకను నెన్నియో కారణములు చెప్పి దయచేసి "మీరు మీకు మీకు తోఁచినసహాయము చేయుఁ" డని యాచించి దొరకినవరకును గుంజుకొందురు. సామాన్యమైన యుద్యోగములోనుండువారైనను, తాము కచ్చేరికిపోవుచుండగా దారిలో నెక్కడైనను సంతర్పణజరుగు చున్నయెడల పోవుచున్నపనినిమాని తటాలున చొక్కాయతీసి ప్రక్క యింటనునిచి విభూతినడిగి పూసుకొని కొళాయిలో నయిగుడ్డతడిపి తల పై వేసికొని శుచిగా స్నానముఁజేసివచ్చుచున్నవానివలెపోయికూర్చుండి సంపూర్ణముగా భుజించివచ్చి పిమ్మట తన యాఫీసుకుచని పైయధికారు లింతయాలస్యముగా వచ్చితి వేల? యనియడిగిన, తేలుకుట్టినదనియో, జ్వరమువచ్చినదనియో సమాధానముచెప్పుదురు. ఎవఁడైనా సదాచార సంపన్నుండైన బ్రాహ్మణుఁడు శ్రద్ధగా తనతండ్రి తిథిచేయువాఁడై యిటు వంటివారిని బ్రాహ్మణార్థము నియమించినయెడల, సూర్యోదయము కాగానే కాఫీహోటలుకుపోయి కావలసినంతవరకును నిడ్డలి కాఫీ పుచ్చుకొని నోట గంగబోయనివారివలె బొట్లు గోచులు పెట్టి వస్త్రములు ధరించి వచ్చి కూర్చుండుదురు. ఒకటియో, రెండో రూపాయ లిచ్చు నట్లు మొదటనే యేర్పాటు చేసుకొనక కాని నిమంత్రణ మొప్పుకొనరు. ఎంత శ్రద్ధగలవాఁడై యున్నను శ్రాద్ధము చేయువాఁడు వారడిగిన దక్షి ణనిచ్చుటకు శక్తిలేని పేదవాఁడై యుండినచో, వానిగతి యధోగతయే! తిథి విడువవలసినదే! ససేమిరా; యని నిరాకరించిపోవుదురు. భార్య మెడలోని తాలియైన నమ్మి వారికి సమర్పించిననే యాతిథి నెరవేరును. ఎవఁడైనా వారు బ్రాహ్మణార్థము నియమింపఁబడియుండుట నెఱిగి యుండి కాఫీహోటలులో ఫలహారము చేయుటను జూచి "ఏమండీ; మీరు నేఁడు నిమంత్రణ మొప్పుకొంటిరని వింటినే; కాని, యిడ్డలి పుచ్చుకొని పోవచ్చునా?" యనిన ఓహో; నీకెఱింగిన దింతమాత్రమేనా? "ఆత్మా రాముని నలయించ కూడదు. ఎండఁకొనియుండి బ్రాహ్మణార్థముచని కూర్చుండినచో భోజనమే యిష్టపడదు. తుష్టిగా భుజింపనియెడల కర్త యొక్క పితరులు తృప్తినొందరు కావుననే మేమిట్లు చేసెదము. కడు పులో కొంచెము చల్లగాయున్న యెడల సంతుష్టిగా భోజనము చేయవ చ్చును" అని వలుకుదురు. అటువంటివారిని విడిచి మఱియొకని నిర్ణయిం

చుటకు వలనుగాదు. ఎందువలన ననగా, సామాన్యముగా యీవైదీకవృత్తిలో తిరుగువారందఱును నొకవిద్య చదివినవారేగాని వీరిలో యుత్తముఁ డనదగినవాఁ డొకఁడును లేఁడు. ఒకవేళ నూటి కొకఁడుండిన యతఁడు రానొల్లఁడు ఇంక నేమిచేయవలయును? "గతిలేనివానికి గంజియే పానక" మన్నట్లు వీరిని పట్టుకొని యుల్లాడవలసినదియే; ఇటువంటివారికి దండము బెట్టుటవలన నేమిలాభము? నమస్కారముచేసిన యెడల బదులుగా తమచేయి బొమ్మవరకు నెత్తుదురు. అదియేమనగా, తమచేత నెపుడును నగ్నిహోత్రుఁడు వసించునఁట, కాఁబట్టి చేయెత్తి బదులునమస్కారము చేసినచో యెదటివాఁడు దగ్ధమగునఁట, దానికా వారటుల చేసెదరఁట, ఇది వారుచెప్పెడిసమాధానము. ఈధర్మవేత్తలొకదినముననే నాలుగైదుచోటులలో బ్రాహ్మణార్థముచేసి యచ్చటచ్చటను వచ్చుదక్షిణనను కొంగునముడుచుకొని పోవుచుందురు. ఇటులసంపాదించి చీకటిపడగానే మిఠాయిపొట్లములు, ఫలములు, పూలదండలుం దీసికొని, యేవేశ్యయింటికో యేబజారు రంకులాడియింటికో పోయి, తాము కొనిపోయినవస్తువులును డబ్బును సమర్పించి యచట గాలక్షేపముగావించి చెవులుజాడించుకొని, ముసుకు వేసుకొని, ప్రాఁడు ప్రెంచిన క్రొత్తముండలవలె యిల్లుచేరుచుందురు. అయ్యో; వీరెక్కడిబ్రాహ్మణులు? వీరికి యుత్తమత్వ మెటులసిద్ధించును? ఈ యనాచారప్రవర్తకులు చేయుదుష్కార్యములును, వీరి నడవడియుం జెప్పవలయునవిన యెంతయోగలదు ఇటువంటివారు యోగ్యులనినమ్మి వీరికి దానములు ధర్మములు చేయుటవలన లేశమైనను ఫలముగలుగదు. వీరికిచ్చుటకన్న కూడు గుడ్డయులేక వీధులలోబడి యల్లాడుచుండు పేదలకొసంగినచో యెంతయో పుణ్యముకలుగును. ఓధర్మకరులారా; ఈబ్రాహ్మణనామధారులగు మోసగాండ్రను నమ్మకుఁడు.

గీ. "అధికులము మేము జాతుల । యందు" దటంచు
మిగులగొప్పగతము దామె । పొగడుకొనుచు
చేయఁగూడని పనులను । చేయుచుండు
వాని సద్బ్రాహ్మణుండని । పలుకఁదగునె?

# దేవాలయములలో బ్రాహ్మణుల మోసము.

దేవళములలో పూజ చేయుటయే పనిగాయుండెడి యర్చకులుగాక వంట చేయుటకును, పరిచారమునకును నై కొందఱు బ్రాహ్మణులు నియమింపఁబడియుందురు. గుడిలోనుండెడివారి కందఱికంటెను వంటసాల యందుండువానిపని జయముగా జరుగును. దేవుని కే పదార్థము లేకపోయినను వంటలవానికొకటియైనను తక్కువయుండదు. ప్రతిదినమును నెవరోయొకరు దేవునకు తళిహ వేయించుటకై సకలవస్తువులుం దెచ్చియిచ్చుచుందురు. ఎవ్వరును యివ్వనినాఁడుమాత్రము దేవాలయపు సొమ్ము నందుకొని తళిహ వేయుదురు. కాని యది చాలాయరుదుగా యెపుడో యొకపు డొకనాఁడు తటస్థించును. కొంచెము పేరుప్రఖ్యాతిగల గుడులయందే పరిచారక బ్రాహ్మ లుండెదరు. గాన, నటువంటియాలయములలో సదా యెవ్వరోయొకరువచ్చి యర్చన చేయించువారై నైవేద్యమునకు వలయు వస్తుసామగ్రిం దెచ్చి యొసంగుదురు. అటులనిచ్చిన ప్రతివస్తువునందును నర్థభాగము పాచకున కర్పణముకావలసినదే! మిగిలినదానిని యజమానుని యిష్టానుసారముగా పులిహోగిరమో, దధ్యోదనమో, ఉప్పుపొంగలియో, చక్కెరపొంగలియో, యొకటిచేసి వడలు పాయసము, మొదలగునవి తయారుగావించి ప్రతిదానియందును నైవేద్యముకాకపూర్వమే మూఁడింటనొకభాగము వేఱుపాత్రములలో నుంచుకొని శేషమును నివేదనకు తెచ్చిపెట్టును. అర్చనచేయించువాఁడు తానొసంగినదంతయు పచనముఁజేసినాఁడని తలంచునుగాని వంటవాఁడు చేసెడిమోసము తెలుసుకొనజాలఁడు. ఇంక పూజారియన్ననో అభిషేకముచేయుటకై యెళనీరు, టెంకాయలు, కస్తూరి, కుంకుమపూవు, పచ్చకర్పూరము, మొదలగునవియు. పంచామృతస్నానమునకని పెరుగు, పాలు, నేయి, తేనె, చక్కెర, ఫలములు మొదలగునవియు. దీపశెలవు పుష్పములు, పరిచారక కట్నము, తళిహకట్నము, చందనముతీసిన కూలి యిటువంటివన్నియు పదిరూపాయ లగునట్లు పట్టీవ్రాసి తమలపాకులు, వక్కలు, కర్పూరము, దక్షిణ యివి 4 రూపాయలగునని చెప్పును. "తమలపాకులు, కర్పూరము నింతయగునా?" యని యడిగిన "మీరు గొప్పవారు భక్తితో దేవున కర్చనచేయించుటకు

వచ్చినపుడు పదిమంది బ్రాహ్మణులకు పదితాంబూలములున్నూ వైదీలాలు దక్షిణయునిచ్చిన నెంతయో శ్రేయస్కరముగానుంటు నీశ్వరాభిషేకమపుడు మంత్రములు చెప్పెడివారికిని, పూజకు నామములు చదువువారికిని దక్షిణయివ్వకున్ననెట్లు? మొన్న చొక్కలింగసెట్టిగారువచ్చి యర్చనచేయించినారు. వారికి పట్టి తయారుచేయగా యేబదిరూపాయలైనవి. నేను మీకు వస్తువులన్నియు తగ్గించియే వ్రాసినాను. ఇంకను తగ్గించుటకు వలనుకాదు" అని చెప్పెను. వచ్చినవాఁడా పట్టీప్రకారము సకలమును తెచ్చియిచ్చెను. వానిలో సగము తీసి గర్భగృహములో నొకమూలదాచి, తక్కినవి యుపయోగించును అభిషేకమునకు తెచ్చిన టెంకాయలందు రెంటికెక్కుడుపయోగింపఁడు. కాయలు కొట్టియిచ్చుటకై యతనికిసంబంధించినవాఁడొకఁడు లోపల నొకవైపునుండి కత్తితో యొళనీరుకాయలనుచెక్కి యవి యచ్చటనే పెట్టి, అభిషేకము చేసి నీరైపోయినబుఱ్ఱను తనవైపుగా నర్చకుఁడు వేయగానే యచట గిన్నెలో చాటుగావించుకొనియున్న కొళాయినీరు నాబుఱ్ఱలో సగమునకుముంచి మరల నందిచ్చుచుండును ఎన్నికాయలు తేబడియుండునో యన్నిసారు లటులచేయుదురు. అర్చనచేయించువాఁ డెదుటనుండిచూచుచు కాయలు లెక్కపెట్టుచుండునేకాని యొక యుళనీరుకాయయే యన్నిమారులు నీళ్ళలో మునిఁగివచ్చుచున్నదని తెలుసుకొనజాలడు. నీళ్లులేనికాయలను మూలబడవేయుచున్నారని తలంచును ఇంక పుష్పములకన్ననో ముందుదిన మెవ్వరోవచ్చి యర్చనచేయించి నపుడు వేసిన దండ లన్నితీసియుంచియుండి, వానిని మొదటనలంకరించి పైపైనపుడుతెచ్చినదండలలో నొకటిరెండో కర్తకు తెలియకుండులాగున నలంకారముచేయును. అభిషేకముచేయునపుడు మంత్రములుచెప్పెడి బ్రాహ్మణులు తమకు మంత్రములు తెలియకపోయినను తెలిసినవారివలె నఱచి యేవో తమనోటికివచ్చినట్లుచెప్పుదురు. పూజనారంభించినపుడు నామములుచెప్పెడివాఁడు పుస్తకమునుచూచి, నూటికేబది విడిచి చెప్పి రైదునిమిషములలో సహస్రనామములును ముగించును. నైవేద్యముకాగానే కర్పూరమువెలిగించి కర్తయొద్దకు తెచ్చి విభూతియు, పత్రియు, సగముటెంకాయయు, రెండు నలిగిపోయినయరటిపండ్లును, దేవుని ప్రసాదమనియిచ్చి "ఇంకనా యర్చనచేసినదక్షిణ యొకటికాఱ

వయున్నది. అది మీకెంతయు యిష్టమో, యంతయివ్వవచ్చును. ఇంత మాత్రమివ్వండియని నేను మిమ్ము నడుగుటలేదు" అనిచెప్పును. అర్చనచేయింపవచ్చినవాఁడదివిని "ఓహో! అన్ని శెలవులనుచేర్చి పట్టీవ్రాసి పుచ్చుకొని యితఁడు మరల తనకు దక్షిణనిమ్మనుచున్నాఁడే! ఇంటికి పోవుటకులోపల వీరు దేవుని గనపఱచునట్లున్నదే! సరిసరి! బాగానే యున్నది. వచ్చినవానినిపట్టి సత్తువలేకుండా పీల్చెడి గుడి దయ్యముల వలెనున్నారు" అని తనలో సణుగుచు, నచటికివచ్చియున్న యితర పెద్ద మనుష్యులలో వెలితిగానుండుననెడితలంపుతో మారుపలుకక యొక రూపాయ తట్టలోవేసి దేవునిచూచి, "స్వామీ! బుద్ధివచ్చినది శీఘ్రముగా వీరిబారినుండి నన్ను తప్పింపు"మని చెంపలుకొట్టుకొనును. ఇంతలో పరిచారక బ్రాహ్మణుఁడు, చేసినతళిహాలో యర్చకునిభాగముతమ భాగము మొదటతీసిపెట్టుకొని అడుగుమాడినపదార్థము లోకగిన్నెలో పెట్టుకొని పైనాకుమూసుకొనిపోయి కర్తయింటిలో యిచ్చివచ్చును. అతఁడింటికిపోయి ప్రసాదముఁదినుటకు తెమ్మనినపుడు బ్రాహ్మణులుచేసిన కుట్రను తెలిసికొని దొంగకు తేలుకుట్టినట్లుండును. వంటవాఁడు కొనిపోయినవస్తువులను యథేచ్ఛగా తనయింట వంటజేయించి గుడినుండి తెచ్చిన ప్రసాదమును పెట్టుకొని భుజించి హాయిగాయుండును. అర్చకుఁడన్ననో తాను మిగిలించుకొనినవానిలో సగము తనయింటికిచేర్చి మిగతను నాఁటిరాత్రికి వేశ్యామందిరమునకు కొనిపోయి, దేవునియందు భక్తిలేకపోయినను, దానికి భక్తితోసమర్పించి యానందముఁజెందును. దేవాలయములలోనుండు బ్రాహ్మణులలో కొందఱు తాము తిని మిగిలిన యేపులిహోరయో, యేదధ్యోదనమో కొంచె యొక యాకులో పొట్లముగాఁజుట్టి, పాసిపోయినయరటిపండొకటియు, రెండు కమలాకిచ్చిలిదబ్బలను, కొంచెము యెండినప్రతి..., విభూతియుంగొని యేరెడ్డిగారియొద్దకో, యేసెట్టిగారియొద్దకో, యేపిళ్లగారియొద్దకో పోయి "ఏమండీ! మీకు దేవుని ప్రసాదము తెచ్చి యిచ్చిపోవలయునని చాలాసారులు ప్రయత్నించినాను గాని తీఱుబడిలేకపోయినది. ఏమి చేయువచ్చును? నాకొలువు యెటువంటిదో మీకు తెలిసినదేకదా! నిన్న గొప్పయర్చనజరిగినది. పులుసన్నము తళిహవేయించినారు. ఆప్రసాదము మీకు యివ్వవలయునని కొంచెముతీసిపెట్టినాను. చాలాప్రొద్దు

పోయినందున, నేనపుడువచ్చినయెడల మీరు నిదురించుచుండుదురని యెంచి యట్లే పెట్టియుండి యిపుడు తెచ్చినాను. ఇదిగో! పుచ్చుకొనుండు. మీరు నిండాదైవభక్తిగలవారని నేనెఱుంగుదును. దేవుని కార్యమనినను, దేవునిప్రసాదమనినను మీకు ప్రియమధికము. కావుననే మీకుగా నేను శ్రద్ధతో ముందుగా కొంచెము ప్రసాదమునుతీసి వేఱుగాయుంచి తక్కినది వినియోగముచేసినాను. రేపటిదినము కృత్తిక, శుక్రవారము, గొప్పమంచిదినము. రేపు మీరొకయర్చనజరిగించండి. ఈనెలలో చేయించెడియర్చన చాలా విశేషమైనది. సమస్తమైన పీడలునుతొలంగి మీకు దేహారోగ్యము కలిగియుండును. రేపటిదిన మర్చనచేయించవలయునని యెండఱో యత్నించుచున్నారు. మీకుప్రయత్నము చేసేయెడల వారినినిలిపిమీయర్చనయే జరుగునట్లు చేసెదను.'' అని చెప్పుదురు. సమయోచితముగా చెప్పిన వారిమాటలకు లోఁబడి యర్చనయు నభిషేకమునుచేయించుటకు సమ్మతించి "అలాగే! రేఁపటిదినము మనయర్చయే జరిగింపుఁ''డని కావలసినసామానులుతీసి యిచ్చెనేని యిక నతనిప్రాణములు తీసుకమానరు. అదికావలయునిది కావలయు నని చెప్పి తెప్పించుకొని తమయింటవేసికొని, మఱియెవఁడైన నర్చనచేయించుచుండిన నదియే యర్చనయనిచెప్పి యాప్రసాదములో నొకింతప్రసాదమును, కొంచెము కుంకుమ, విభూతి, రెండు దళములుఁవత్తి,యొకగొబ్బెరతునుక ,యరటిపండు చేతఁబెట్టి టోపీ వేసి పంపుదురు. ఆహా! వీరుచేయుచుండెడి యక్రమములను లెక్కింపసాధ్యమేకాదు. ఈబ్రాహ్మణు లిట్లు దుష్ప్రవర్తన కలిగియుండినను, దేవుడు వారియెడల నించుకైనను కోపముబూనక సయిచి యట్లేచూచుచుండుటచిత్రము. వారికేదైనఁ గీడుగలిగించినచో,తనకుగావించెడియాయుల్పపూజయుగూడా చేయక మానివేయుదురేమోయని వెఱచియుండునుకాఁబోలు.

ఓబ్రాహ్మణులారా! దైవభక్తిగలవారై డబ్బుకర్చుపెట్టి దేవునర్చింపుఁడని కోరినవారిని మోసముఁజేసి వారిచ్చినపదార్థములను గొనిపోయి మీరు హాయిగాభుజించి త్రేచుచుండుట ధర్మమగునా? ఇందువలన మీకు వంశాభివృద్ధియగునా? దైవము సహాయముచేయునా? ఇదియెల్లకాలనంతోషమనుట నాలోజించుఁడు.

ఆ. దేవపూజకొఱకు దెచ్చియిచ్చినవస్తు
తతినిసంగ్రహించి తప్పుమాట
లాడినమ్మఁబలికి యన్యులఁగికరింతు
రకట! గుళ్లలోని యవనిసురులు.

---

# కాఫి హోటలు మోసము.

మన దేశమున నాగరికాభివృద్ధియగుకొలఁదిని కొంచెము పెద్దది
గాయుండెడి యేయూరియందుచూచినను కాఫిహోటళ్లు మితిమీఱిపో
యినవి. కాలమహిమ యెట్టిదో కాని పూర్వము గంజిత్రాగి కష్టపడి ప
నిచేసి కూటికిసంపాదించుకొనుటయే యసాధ్యముగా యల్లాడుచుండిన
నిరుపేదలునయితే మిపుడు యెట్లో యొకవిధమున వెతలొంది డబ్బు
సంపాదించి సూర్యోదయముకాగానే కాఫిహోటలుకుపోయి, తనయిం
టిలో యీపూటకు గతిలేక యున్నను తాను సంపాదించిన డబ్బును
హోటలువానికియిచ్చి, యొకకప్పు కాఫి, రెండుయిడ్డెనలుం బుచ్చుకొన
కుండిన బ్రతుకలేని స్థితియేర్పడినది. ఈమూలముగా పేదవారలు డబ్బు
పోఁగొట్టుకొని, భార్యలను, బిడ్డలను, కూడులేక తల్లడిల్లఁజేయుట నె
క్కుడచూచినను చూడవచ్చును. దినేదినే యీహోటలులసంఖ్య ప్రతి
స్థలమునను నెక్కుడగుచున్నవే కాని తగ్గుట లేదు అన్నిస్థలములకంటెను
చెన్నపట్టణము నివి మఱియునధికము. ఏవీధియందుచూచినను, పెద్ద
పెద్దబోర్డులు వేయబడిన వసగున కొకటియుండును. వీనిలో కొన్నిటికి
రెస్టారెంట్లనియు, కొన్నిటికి భవనములనియు, కొన్నిటికి విలాసములని
యు పేరులుండును. హోటల్ పేరులతో నుండునవియుం గొన్నికలవు.
ప్రతిహోటలువాకిటను తమలపాకులు, వక్కలపొడి, బీడీలు, సిగరెట్లు,
సోడావాటరుదినుసులుఁ గల యొకయంగడి తప్పకయుండును. కొంద
ఱు ధనికులు కాఫిహోటలులకనియే ప్లానువేసి యిండ్లుకట్టించి బాడుగ
కొసంగియుండుదురు. ఆయిండ్లుకట్టునపుడే తమలపాకుల యంగడికి
నయితము ప్లానువేయుదురుకాఁబోలు. కాఫిహోటలు దేవాలయమున
యంగడులు విఘ్నేశ్వరునిగుడులని చెప్పవచ్చును. హోటలు పెట్టుకొన
దలంచినవాఁడు వాకిట తమలపాకులయంగడి పెట్టుటకు వసతియు

న్నదా లేదా యనుట మొదట చూచుకొనిననేగాని చేరఁడు. ఒక్కొక హోటలువాకిటను, "తంజావూరుహోటల్, కుంభకోణంహోటల్, కోయంబుత్తూరుహోటల్, మాయవరంహోటల్, బాంబే రెస్టారెంటు, మోహనభవనము. సుందరభవనము" అని పెద్దయక్షరములతో, గొప్పబోర్డులను వ్రేలాడగట్టుదురు. ఉండూరువాఁడైనను యీపేరులలో నేదో యొకటి పెట్టుకొనునేగాని తనయూరుపేరు పెట్టుకొననొల్లఁడు. దీనినిపట్టిచూడగా, బ్రహ్మసృష్టి చేయునపుడు పయినచెప్పఁబడినపేరులు గల పట్టణవాసులను, కాఫిహోటళ్లు పెట్టుటకుగానే సృజించినాఁడేమో యనితోఁచును. ఆగౌరవము వారికిమాత్రమే కలిగియుండునుకాఁబోలు. ఇంక యీహోటళ్లలో చేయు వస్తువులన్నో కొన్ని పేరులు మనమువిని యుండునవియైనను కావు. సాధారణముగా మసాలువడలు, పాగోడీలు, కారపుబూంది, పెరుగువడలు, లడ్డు, జిలేబి, యివి యందఱునెఱింగినవే! కాని, బోండాలు, బజ్జీలు, ఉప్పేరి, జాంగిరి, పాల్కోవా, పాలపోళీలు, ఫ్రూట్ సాలడ్, కేసరి, సేమ్యా, సేమ్యాపాయసం, మఱియు లెక్కలేనిపేరులతో నెన్నియో కలవు. ఇవియన్నియు పల్లెటూళ్లవారిలో మూడుపాళ్లజనులకు తెలియవు. హోటలువారి కేటలాగ్ చూచినయెడల వస్తువులపేరులుగలపుస్తకము రెండుఫారములకు తక్కువయుండదు. ఇడ్డెలి, దోసె, ఉప్పుమావు, (ఇవియొక్కొకటి పలుదినుసులు) కాఫి, టీ, కోకో, సర్బతుదినుసులు. వానిగుణమును, రుచియు, పారిశుద్ధ్యమును నెట్లుండినను కొలతలేక పేరులుమాత్రము గంభీరముగా యుండును. శీకాయవిత్తనములు మూడుపాళ్లును కాఫిగింజ లొకపాలునుకలిపి వేయించి పొడిచేసి యాపొడరు వేసి కాఫి తయారుచేయుదురు. అర్ధభాగము నీళ్లును, సగభాగము పాలునుచేర్చి దానిలో నొకవిధమైన పౌడరు వేసి యందరికిని కనుపడుచోట పెద్దబొగ్గులకుంపటి పైగిన్నెలోపోసి కాగబెట్టియుందురు. పయినచెప్పినపొడివేసి వడియగట్టినకషాయ మొకపాత్రము (కిట్టిల్)లో పోసియుంచుదురు. వచ్చినవానికాకషాయమును కప్పులో కొంతవిడిచి కుంపటిమీఁద తెర్లుచున్న పాలను గరిటెతో నొత్తి యందుపోసి, యావిద్యలో యారితేరియుండు నౌకరులు (బ్రాహ్మణయువకులు) పొడుగుగా నొత్తి యొకకప్పులోనుండి మఱియొకకప్పులోపోసి తెచ్చిపెట్టుదురు. శీకాయగింజలపొడి

యగుటచే నురుగుగలిగి, పొడరుపాఁగుటవలన చిక్కనదైయుండుటను చూచి మంచిపాలు పేయుటవలన నట్లున్నదని తీసుకొనువాఁడు తలంచును ఆకాఫీ త్రాగిన కొన్నినిమిషములకే కడుపులో వికారము ప్రారంభమగును. అటుల కషాయము వడియకట్టుకొనిన పిమ్మట యాకాఫీపొడి పిప్పిని యెండబెట్టి క్రొత్తగింజల పొడితోఁ జేర్చి మరల కషాయముఁ జేయుదురు. టీమాట చెప్పవలసినదియే లేదు ఏవేవో యాకులఁ గలిపి కషాయము చేసియిచ్చి ప్రజలయారోగ్యమును చెడగొట్టుదురు. కల్లును, సారాయియుఁ ద్రాగుటయే దురాచారముగాఁ దలంచెదరు. కాని వాని కంటె యీకాఫీ త్రాగుట మఱియు ననాచారమని చెప్పవచ్చు. ఆచారముమాట యట్లుండగా, సాధారణము జనులకు కలుగుచున్నరోగములలో మూఁడుపాళ్లు కాఫిహోటలులవలననే కలుగుచున్నవనఁదగును. ఆచారవంతులమని నీల్గుచుండువారునయితము దురాచారముల కునికిపట్టగు కాఫిహోటలులలోఁబోయి యచట నందఱితోడఁ గలిసి కాఫిపుచ్చుకొని వచ్చుచుండుదురు కాఫిహోటలులలో జాతిభేదము లేనే లేదు. అటుల భేదమునెంచువారచటికి పోవుట కర్హులుగారు. పోనివానికి మరియాదసుఖునతయుం గక్కఱ. కావున నెచ్చట నెట్లుండినను కాఫిహోటలుకు పోయినపుడచటి యేర్పాటులకు బద్ధుఁడు కాకతప్పదు. స్వరాజ్య సంఘనాయకులు జాతిభేదము కూడదనుచున్నందున ఈకాఫిహోటళ్ల వారు వారియాజ్ఞానుసారముగా నందఱును నొకటిగాఁ జేయుచున్నారు కాఁబోలు. అయ్యో! అచటజరుగుచుండు ఘోరము చెప్పనవచ్చునా? హోటలులలో పనిచేయుచుండువారిని చూచినచో, తత్పూర్వ మూఁడు దినములనాఁడు తినినతిండియయితేము వాంతియగును. 12 మొదలు 25 సంవత్సరములవరకును వయసుగలిగిన బ్రాహ్మణయువకులును, అంతవంటివయసుగలవారే మళయాళపుశూద్రులును, నొక్కొక్క హోటలులోను పెక్కండ్రుండుదురు చెమటబట్టిన దేహములును, మురికిచే నల్లబడి మేని చెమ్మవలన నానిన జంజములును, నూనెమరకలతోనుండు చెడమాసిన మొలగుడ్డలునుగలిగి యాబ్రాహ్మణయువకులు ఫలహారములు కాఫి తెచ్చినపుడు చూచిన మొదల పేగులు వెడలివచ్చునట్లు డోకరింతకలుగును, వారిలో కొంచెము పెద్దవాఁడుగాయుండు ప్రతివానికిని వృక్కోట పొగాకుతప్పయుండితీఱును. వాఁడు పనితొందఱలో యారసము నుమ్మి

వేయుటకుతీరక నోటనేయుంచుకొని యేదయినా మాటలాడవలసినపుడా సారము క్రిందబడకుండ కాంబోలు తల మీఁదికెత్తి మాటలాడును. కాఫి డికాక్షను కుంభవృష్టిగా నొక్కొకపుడా తమ్మరసము నాలుగు బొట్లు కప్పులోపడుటయు కలదు. గాని అయ్యరుగారి యా పావనమైన యెంగిలి దొరకుటయే పావనమని కాంబోలు దాని నెవ్వరును గమనింపరు. ఇడ్డెనకును, దోసెకును పిండిరుబ్బువానిని చూచినయెడల యాదుఃఖము చెప్పితీరునదికాదు. దేహమునుండి కాఱుచున్న చెమట మోచేయి ద్వారా పిండిలో బొట్లుబొట్లుగాపడుచుండును. పొడుముపీల్చు ముక్కునుండి చీమిడి కాఱి పడుచుండును. నడుమనడుమ ముక్కుచీది చేయి కడుగనైనకడుగక యట్లే రుబ్బుచుండును. తమలపాకులు, పొగాకు నములుచుండుటచే కలిగిన పావన వేదసారము నప్పుడప్పుడు నుమియుటలో కొంత యాపిండిలో పడుచుండును. కాఫిహోటళ్లకు పోవుజనులకు తాముతినెడి వస్తువులవలన జబ్బుకలుగకుండుటకై దేవుఁడయ్యరుగారిచీమిడియు, చెమటయు, యెంగిలియు సిద్ధౌషధక్రియలుగా నుండునట్లు నిర్ణయించెనేమో, లేక యాదోసెలు, యిడ్డెనయుం దినిన పాపపరిహారమగునేమో నిశ్చయింప వలనుగాదు. మఱియొకఘోరమును చెప్ప మఱచినాను ఇడ్డెనకును దోసెకును రుబ్బి పయినచెప్పినప్రకారముగా తయారుచేసినపిండి పెద్దపెద్దకుండలలో వేసి యొకమూల బెట్టియుందురు. రేపటికి కావలసిన పిండి యీదినమే తయారుచేసి పులియబెట్టినగాని బాగాయుండదట. అటుల పెట్టినపిండి కుండలమీఁద మూతవేయుట వారెఱుఁగనేయెఱుంగరు. కావున నందు ఈగలు, పరటలు, చీమలు, బల్లులు, యెలుకపిల్లలు పడి చచ్చియుండును. మఱునాఁటియుదయమున వానినన్నిటిం దీసివైచి ఇడ్డెనయు, దోసెలును తయారుచేయుదురు. తీసివేయుటలో తప్పిదారిపోయిన చీమలు మొదలైన చిన్నజంతువులట్లేయుండుటగలదు. వానితోడనే పిండి నుపయోగింపుదురు. ఆయిడ్డెనలు దోసెలు తినెడి నవనాగరికు వానినినములి నోటిలో కరకరలాడినపుడు, అయ్యరుగారందువేసిన పచ్చిమిరపకాయతునుకలని తలంచి కడుప్రియముతోడ నారగింతురు. ఈకర్మమున కేమనవలయును? మొదటినాఁడుచేసిన మసాలువడలుగాని, పొంగడాలుగాని కర్చుపడక మిగిలిన యెడల వానిని రాత్రి నీళ్లలోవేసి నానబెట్టి మఱునాడు మరల రుబ్బి

కొంచెము క్రొత్తపిండిని చేర్చి పిసికి మరల కాల్చి తాము చేసిన కృత్రిమ మితరులకు తెలియకుండుటకై పెరుగులో వేసి, వానిని పెరుగువడలుగా నుపయోగింతురు. ఉప్పుపిండి, కేసరి, రవపొంగలి మొదలగువానికి చౌకగావచ్చు మక్కినరవ నంగడినుండి తెచ్చి జల్లెడపట్టియైన వేయక యట్లే పోసి చేయుదురు. కావున నందు చిన్నచిన్న తెల్లని పురుగులు చచ్చి నీల్గుకొనియుండును. అటుల చేయనియెడల రుచి తగ్గిపోవును కాంబోలు బోర్డులో "పరిశుద్ధమైన నేతితో తయారుచేయఁబడిన పదార్థములు దొరుకు"నని యుండును. అదిచూచి యెవఁడైనను వాస్తవముగానే యుండునని లోపలికిపోయి కూర్చుండి యేదైన నొకవస్తువును తెప్పించి నోట వేసికొనిన శుద్ధమోసము. నూనెతప్ప వేఱుకాదు. ఆనూనెయైనను శ్రేష్ఠమైనది కానేకాదు. వేరుశెనగలు, నూవులు, గొబ్బెరలవలన తీయఁబడిన తైలత్రయసమ్మేళనము. వచ్చినవాఁడవి నూనెపదార్థములని తెలిసికొనినను, ఏమైనను నడిగిన తనగౌరవము కొంతయగునని మిన్నక కావలసినవరకుందిని మిగతవిడిచి అయ్యరుగారి కానుక చెల్లించిపోవును. ఇది యెంతటియక్రమము? ఒకపడిపాలతో ముందు చెప్పియున్న ప్రకారముచేసి యేబదికప్పుల కాఫీ కుపయోగింతురు. ఇటువంటి కాఫిహోటళ్లకు ప్రతిదినమును పోవుట గౌరవమని తలంచి పోవువారు పెక్కండ్రుకలరు. ఇంచు రెండుపూటలును పోయెడివారికి మరియాద మఱియునధికము. కొందఱు గౌరవార్థముగా తమమిత్రులను సయితము పిలుచుకొనిపోయి వారికయ్యెడి సెలవు తామే పెట్టుకొందురు. "సర్వం జగన్నాథం" అనుటకు సరిగాయుండెడి యిట్టి పుణ్యక్షేత్రమైన హోటలులకు పోయినయెడల పెద్దహాలులో వరుసలువరుసలుగా రాళ్ల(మార్బిల్ స్టోన్) బెంచీలును, కురిచీలును నుంచబడియుండును, పోయి మహాస్వాతంత్ర్యముగా నచట కూర్చుండగానే, అయ్యరులు టమ్లరులతో మంచినీళ్లు తెచ్చిపెట్టి "ఎన్నా వేణుంగో!" యని యడుగుదురు. పోయినవాఁడేదైన నొకవస్తువు నడిగినయెడల యడుగకనే యేబదివస్తువుల పేరుచెప్పి యొకటి తెమ్మనిన నదిదినుసులు తెచ్చిపెట్టి "ఇన్నివస్తువు లావశ్యకము లే"దనిన "ఎన్నాంగో! వుదుసాగ ప్రపేర్ చేయ్దా యిరుక్కురోం, ఇదు రెంబనల్లాయిరుక్కుం, చుడచుడ కొంచెం సాపిటుపారింగళ్ తెరియుం" అని సోక్ మాటలుచెప్పి యవి యామనుష్యుఁడు తీసుకొనునట్లు చేయుదురు.

ఒక్కదినుసును వేఱువేఱు ప్లేటు (తట్టల)లో తెచ్చిపెట్టుదురు. జీతము నిచ్చి యుంచుకొనిన సేవకునికన్న నధికవినయముతో "ఇన్నుం యెన్నా వేణుం? ఫ్రూట్ సాలాడ్ చూడాయిరుక్కు, జాంగిరి రెండుతట్టుమా? మయసూరుపాగ్ రెంబా నల్లాయిరుక్కుం సేమ్యాయిడ్డలి, రవకేసరి కొండువరట్టుమా? సాపుటుంగో సార్ ఒంగళుక్కాహ వేదానే తయారుపణ్ణియిరుక్కోం" యని మాటిమాటికిని బలాత్కరించుచు ప్రక్కనెయుండిన నేదేనియడిగినచో యావస్తువును వీనికిని యడుగకనే యొక ప్లేటు (తట్టు)లో తెచ్చియుంచిపోవును. కావలసినవారు పుచ్చుకొనికాగానే, ఎంగిలిపాత్రములు కడుగుటకుగానే మలయాళ రాజ్యమునజన్మించి చెన్నపట్టణపు కాఫిహోటళ్లలో వచ్చియుండు మొక్కల వంటియుపకులా యెంగిలిప్లేటులను కప్పులనుకొనిపోయి వానినికడుగుటకుగా నీళ్లుపోసిపెట్టియున్న తొట్టిలోనుంచి తెచ్చిపెట్టుదురు. ఉదయమునపోసిననీళ్లే యాతొట్టిలో సాయంకాలమువరకును నుండునుగాని, కాఫి త్రాగవచ్చినవారికి పుణ్యలోకముకలుగదని కాంబోలు. యొడతెగక కొళాయినీరు వచ్చుచుండినను, తొట్టినినీరు పారబోసి మంచినీళ్లునందుబోయరు. ఆపావనతొట్టి తీర్థములోనే పాత్రములు ముంచి తెచ్చిపెట్టుదురు. సమ్మర్ద మధికమయినపుడు తొందరలో యొకొక్కకసమయమున యాతొట్టిలో కప్పులను ముంచుటనయితము మాని యట్లే తెచ్చిపెట్టుదురు. ఒకడుతిని యెంగిలిపదార్థములు పడియున్న టేబిలును గుడ్డతో సగముయెంగిలివస్తువులుపోకనే తుడిచివేయుదురు. అల్యూమినియమునుననో, యిత్తడియందో నాలుగు లేక నయిదౌన్సుల కెక్కుడుపట్టకుండా యుండునటుల కాఫికప్పులును, వానికితగిన ప్లేటులును హెచ్చుతక్కువలు లేక తయారుచేయించి పెట్టియుందురు. ఆగిన్నెలలో వారు నాలుగైదుసారులు కాఫిమీదికెత్తిపోసి తెచ్చిపెట్టుదురుగాన నురుగువలన గిన్నెకునిండుగా నుండునట్లుతోచును. ఆనురుగడంగినంతట గిన్నెకుసగమునకు మాత్రమేయుండును. వారుచేయు తంత్రములలో యిదియొకతంత్రము. ఏకకాలమున నూఱుగురువచ్చి కూర్చున్నను, ఎందఱి కెన్నివస్తువులనిచ్చినను, దమ్మిడియైనను లెక్క తప్పిపోవక వస్తువుల నిచ్చువారు నిమిషములో ఇంతమాత్రమనిచెప్పి హోటలుయజమానునికి తెలియుటకై గట్టిగా "ఆఱణా, రెండుపేర్,

ఒంబదణా మూన్రుపేర్" యనిపలుకుదురు. యమునిద్రాయనగాఁడొక
వేళ లెక్క తప్పిపోయినను పోవచ్చునుగాని కాఫిహోటలయ్యగకుత
ప్పదు. యజమానుఁడు డ్రాయర్ టేబిలుముందు కుర్చీవేసికొని తమల
పాకులనమలుచు వాకిటియొరఁ గూర్చుండియుండును. హోటలులో
భక్షణములు, కాఫిపుచ్చుకొనినవారు, మేనేజరుగారియొద్ద లెక్కప్రకా
రము డబ్బుచెల్లగట్టి వాకిలిదాఁటవలసియుండును. సర్కారువారికిపన్ను
చెల్లించుటకైనను కొంతకడవు కలిగియుండునుగాని కాఫిహోటలులో
తక్షణమే చెల్లింపకతప్పదు. కొందఱు విలాసపురుషులు తమయొద్ద డ
బ్బులేకపోయినను, చెంబో, తపిలయో, మఱియేదో యొకటి మార్వా
డీలయొద్దనో, మఱియెచ్చటనో యొకచోట కుదువయుంచి, యొకటో
రెండో రూపాయలు తీసుకొని కడుడంబముగా తమదుస్థితి యెట్లుండి
నను, కొందఱుస్నేహితులను వెంటఁబెట్టుకొనిపోయి యచ్చట చేతగల
రూకలుదారబోసి, కడపటమిగిలినయణానో, యర్ధణానో, వాకిటనుం
డెడి వక్కాకులయంగడి గణపతికిసమర్పించి చెవులుఁజాడించుకొనిపోవు
దురు. ఈహోటలులలో సమర్పించుటకు డబ్బులేకపోవుటచేత దొంగ
తనములు చాలామెండగుచున్నవి. మఱికొన్నిసామాన్యమైన హోటలు
లలో, టేబిలులు, కురిచీలును నుండవు. ఇట్టివానిలో కొన్నిటియందు
సన్నపలకలకు కాళ్లువేసి కూర్చుండుటకై పెట్టియుందురు. కొన్నిటి
యందు క్రిందనేకూర్చుండవలయును పెద్దహోటళ్లలోవలెయిచ్చటప్లే
ట్లును, స్పూనులునునుండవు. ఆకులలో తెచ్చిపెట్టుదురు. యిల్లంతయు
కరిధూపముక్రమ్మి నేలధూళినిండి యసహ్యముగాయుండును. పోయిన
వానిదొముడలుగాని, గుడ్డలుగాని, తప్పిదారి గోడలకు కూచములకుఁదగి
లెనా? యాకరిధూపము మసి లక్కవలె యంటుకొని మరలవిడువదు.
నడుమనొకచింపి యీతాకులచాపయో, గోతపుపట్టయో, వెదురుతడి
కయో, యడ్డముపెట్టి, యామరుగున పదార్థములుతయారుచేయుదురు.
అచటికి పోయినవారు తమదేహమును గుడ్డలును జాగ్రతగా చూచు
కొని కూర్చుండనియెడల వెలుపటికివచ్చినపుడు పిశాచములవలెమారు
రూపముతో రావలసియుండును. నేలతేమయు నచ్చటచ్చట బిస్తలు
వేసిన యెంగిలిమెతుకులును పడియుండును. లోపలనుండివెలుపటికి నీళ్లు
పోయెడి తూముకాలువలో రుబ్బుచున్నపుడు పడినపిండి పడినిండి కడు

గకున్నకారణమునమురిగి పురుగులుపట్టి చూచుటకసహ్యమై దుర్గంధభ [illegible]ను. అంతటిరోతగాయుండినను వారాకాలువ కడుగుటగాని యిల్లుశుభ్రముగా చిమ్ముటగాని లేనేలేదు తోళ్ళవలెనుండు జందెములతో, చినిగినమురికి కన్నులవు తుండుగుడ్డలను మొలకుచుట్టుకొని పొయ్యిసెగలోనుండి చెమటలుగారుచుండగా, దేహముకలబందగబ్బుగొట్టుచుండగా, అయ్యరుగారు దోసెయో, యిడ్డెనయో, యుప్పుపిండియో, యొకయాకులోపెట్టుకొని, యెనిమిదిదినముల కొకతేసారిగా నూరి యొకమట్టిపాత్రలో మురగవేసియుంచు చట్నీ (పచ్చడి)లోకొంచముయెత్తి నీళ్లుపోసికలిపి కొంచెము వానిపై వేసుకుని తినుటకై నోరు తెరచుకొని ముందువైపున కూర్చున్నవారికి ప్రత్యక్షమగును. ఆసమయమున నయ్యరుగారి యాకారసౌష్టవము, చేసినవస్తువుల పరిశుద్ధత చూడగానే కడుపునిండును. "ఓ దేవుఁడా! మానుదుట నిట్టిదుస్థితిని చెందునట్లు వ్రాసితివిగదా!"యని యేడ్చుచున్నారో యని తోఁచులాగున, ఉప్పుపులుసు మృగ్యమైన కటికమిరపకాయ చట్నీ తినడమువలన వచ్చినవారు కండ్లనీళ్లు కారముచే కారుచుండగా విధిలేక తిని యడిగిన డబ్బుసమర్పించి పోవుచుందురు. వీరుపాత్రములు సయితము తోమరు నూనె జిడ్డును పిండియునంటి పేరుకొనియుండును పాత్రముపోయినను పోవునుగాని యంటుకొనిన పిండివిడువదు. ఈరకములో చేరినవారు ఉప్పుపిండి, యిడ్డెన, దోసె, యిటువంటి యల్పవస్తువులు మాత్రమే చేయుదురు. ఎవరైనను "ఏమండీ! మరి యెవ్వియునులేవా?" యని యడిగినచో, అరవముననో, లేక "మేము పుదుశాహ హోటల్ ఓపన్ సేసినోమ్? ఇప్పుడుదా ప్రారంభము. క్రమమాగ యెల్లాం తయారుసేస్తాము."అని వచ్చిరాని తెలుగులోనో, తమ హీనదశ తెలియకుండునట్లు డంబముగాపలుకుదురు. ఏదైనా యిడ్డెనలుగాని, దోసెలుగాని మొదటిదినము కర్చుపడక నిలువయుండినచో, వానినిపొడిపొడిగా చేసి, పచ్చిమిరపకాయలు, కరేపాకు, మినపబేడలు, ఆవాలుబాణలిలో వేసి నూనెకొంచెముపోసి తిరుగబోసి ఉప్పుపిండివలె చేసుకొని భక్షింపుదురు. ఆదినము వారికుటుంబమునకంతయు నదియేభోజనము. మసాలావడలు మిగిలినయెడల మజ్జిగపులుసులోవేసి, యామవడలపేరుతో, వచ్చినవారికిచ్చి సొమ్ముచేయుదురు. ఇంక కాఫీయున్ననో, చక్కెరమాట

తలంపవలసినదియే లేదు. కాఁటిబెల్లముగాని, ఈతబెల్లముగాని తెచ్చి పెద్దకుండలో నీళ్లునిండుగా తెరలబెట్టి యందులోవేసి శీకాయవిత్తుల పొడి కొంచెముకలిపి వడియగట్టి పొయ్యిమీఁద బెట్టియుందురు. ఆపానకషాయమును గిన్నెలో పోసుకొని ఖిల్లిగెరిజెనీళ్లుగలిసినపాలనందుగలిపితెచ్చి వేఁడి వేఁడిగాముందుపెట్టుదురు. అదిచూచుటకు కషాయమువలె నల్లగాయుండును. కొంచెముచల్లారెనా? త్రాగుటకేయింపితముకాదు అప్రపంచితము వాసనగొట్టుచుండును. మొదటచెప్పిన పెద్దపెద్దహోటలులలో చేయువానికన్నను వీనిచేయు దోసెలయందును, ఇడ్డెనయందును, చచ్చినయీఁగలు, చీమలు, చిమటలు, నధికముగానుండును. అవియెంతయధికముగానుండిన యంతయధికముగా తాము చేసినవస్తువులు రుచికలిగియుండునని వీరి యభిప్రాయము కాఁబోలు. ఇంకనేవేవియోపురుగులు, చిన్నరాళ్లు, బొగ్గుతునుకలు, వెంట్రుకలు, సమృద్ధిగానుండుగాని యేదియుండదక్కువకలుగదు. ఇటువంటి కన్నులపు హోటళ్లకుపోయి యీవస్తువులనుతినిన వారికి వ్యాధులు రాకపోవునెట్లు? కాఫిహోటలులు లోకమునకు మేలుచేయునవిగా యెవరైనను దలంతురేమోకాని, యటులతలంచుట చాలపొరబాటును, నవివేకమునునగునని చెప్పకతప్పదు. అవిజనులకు మహోపద్రవకారులుకాని, లాభదాయకములుకావు ఆరోగ్యము చెరుచునట్టియు, దేహమునకుజబ్బుతటస్థించునట్లు చేయునట్టియు నగు వానిలో కాఫిహోటలగ్రస్థానమును పొందినదని చెప్పవచ్చును. ఆవస్తువులు దినువారు రోగదేవతను ప్రార్థించి యింటికి తోడ్కొనివచ్చినట్లే తలంపవలయును. క్రమక్రమముగా కాఫిత్రాగెడివారిసంఖ్య యెక్కుడగుచుండుటవలన హోటళ్ల సంఖ్యయునధికమగుచున్నది పూర్వము కాఫివేరైనవిని యెఱుంగనివారునయితము ప్రస్తుతకాలమున సూర్యోదయమగుటయే తడవుగా కాఫి పుచ్చుకొనకున్న నిర్వహింపలేనిస్థితికివచ్చినది. వేళకుపుచ్చుకొనకున్న తలనొప్పి కలుగుననియు, కడుపులోసంకటముగా నుండుననియు, యేపనిచేయుటకును తోఁచదనియు, నుత్సాహము లేకుండుననియు సాకులుచెప్పి యేకష్టమయినను చేసి డబ్బుసంపాదించి దానికొఱకు వ్యయముచేసెదరు. కాని యదిదురభ్యాసమనియు, తమకుకలిగెడి జబ్బులన్నియు, కాఫిత్రాగుటవలన వచ్చినవేయనియు కొంచెమైన నాలోచిం

వరు. కాలమహిమగదా! ఇది. పోకిలాలు కొంతవేళలను, కాఫీహో టలుకుపోయి వస్తుచెల్లించి రాకున్నయెడల తమప్రతిష్ఠకు లోపముకలుగునని యెంచి తల్లిమెడతడవియో, భార్యతాళి నూడబెరుకుకొనియో, వారిచ్చుకున్నకొట్టి యెట్లయినంగొని వానినమ్మి తాముతమస్నేహితులును పిలాసముగాపోయి కుర్చీలమీఁదకూర్చుండి "స్వామీ! ఎన్నాంగో! అయ్యర్‌వాళ్ - శీఘ్రమాగ రెండ్ యిడ్లలి, సాంబార్ పోటుకొండు వారింగళ్, చుడచుడదోసై, ఉర్లకయన్‌గు పోటుకొండువారింగళ్. ఉప్పుమావ్ కుడుంగళ్" అని మఱియు తమకేయేవస్తువు కావలయునో యవి యడుగుదురు అయ్యరుగారుతెచ్చి టేబిలులపై నుంచగానే, ఒకవేళనతఁడుమఱచి యివ్వకున్నచో కోపముతో "ఎన్నాంగో! స్పూన్ యెంగే?" యని యొకఁడును. "ఏమండీ! ఆకులో యిచ్చినారు, ప్లేటు లేదా? నాటుపురమువాళ్లమని తలంచినారా? కొంచెమైనను మీకుమనుష్యుల మరియాద తెలియదు. గణపతియయ్యరుగారులేరా? నటేశయ్యరుగా రెక్కడపోయినారు? వారున్నచో యిటులజరుగదు. ఎవరెవరికెటుల యివ్వవలయునో వారెఱుంగుదురు. సరే! ప్లేటుకొనిరండి, స్పూను తెండి, కాఫి, కాఫి, అయ్యర్‌గారూ! కాఫీయివ్వండి! స్ట్రాంగు డికాక్షను వేసి యివ్వండి, చక్కెరయింకకొంచెం వేయండి, స్పెషలువంగా యందోసె లేదా?" యని తొందఱపెట్టి యడిగిపుచ్చుకొని ఇంగిలీషు వారివలె స్పూనులతో యెత్తి నోటబెట్టుకొందురు. కావలసినవరకును నైనంతట వాకిటియొద్ద లెక్కప్రకారము రూకలను మేనేజరుగారికిచెల్లించి వెలుపలవచ్చి తమలపాకుల యంగడిలో ఆకులు, వక్కపొడి, వాసన పొగాకు, సిగరెట్లు, బీడీలుతీసుకొని శేషించియున్న కాసులువదలించుకొని వేడుకగా మాట్లాడుచు పోవునపుడు "మున్నూరుహాపాయలు పోయి, మూతిమీసాలునుపోయిన" వనినట్లు చేతగలకాసులును, యింటలోనివస్తువులును, పోయినవనెడి దుఃఖముగాని, లజ్జగాని లేక గొప్పధనికులవలె గర్వముతో "ఏమిటోయ్, ఈహోటలంతగా మేలైనదికాదు. నేనుచూచినవానిలో యిదియూజ్‌లెస్. బాంబేరెస్టారెంటు ఫస్టు. ఆనందభవన్ సెకండు. కనరాహోటలుకూడా ఫస్టా లేదు. కుంభకోణం మణియయ్యర్ హోటలు బోగ్డలు, గిడ్డలు దడబుడలుమాత్రమే కాని యంతగా మేలయినదికాదు." అని తమకంటె కాఫీహోటలుల

యందలి యాధిక్యతాల్పత్వములు తెలిసినవారు లేనట్లు నలుగురికిఁ దోఁచులాగు వర్ణింపుదురు. కల్లంగడుల సంఖ్యకన్నను కాఫీహోటలుల సంఖ్య యధికమగుచుండుటయు వాని మూలమున ధననష్టమును, వ్యాధుల ననుభవించుటయుం జూచుచు, ఇవి జనుల కహితకారులగుట యెఱింగియు, మద్యము, కల్లుఁ ద్రాగకూడదని నిషేధించుచున్న గాంధి మహాత్ముఁడు మొదలగు వారలీ కాఫీ త్రాగుడును మాన్ప ప్రయత్నింప నుపేక్షించియుండుట కడువిచిత్రము. కారణము తెలిసినదికాదు. మూడుపాళ్లు కాఫీహోటళ్లు బ్రాహ్మణులవేయైనను, ఇతరులవి లేకపోలేదు. శూద్రులు, మహమ్మదీయులు నయితము కాఫీహోటళ్లు పెట్టుకొనియే యున్నారు. బల్ తమాష్, వెల్ కమ్" అని వ్రాయబడినపటములు వాకిటఁగట్టియు షోకుగా బొమ్మలు నిలిపియు, గ్రామోఫోను పెట్టలు పెట్టి ప్లేట్లు మార్చిమార్చి వేసి యింపుపాటవినిపించియు,వీధిలోఁబోయెడి వారిమనంబులు తమవంక కాకర్షింపుదురు. ఇతరులు మాతురసుశంకచే తలలపై ముసుగు వేసుకొని, జందెములు కనబడకుండునట్లు చేసుకొని లోపల ప్రవేసించి భుజించిపోయెదరు. సదాచారసంపన్నులారా! అందఱికంటెను మేమేయధికులమని డంభములు పలుకుచు సకలనీచకృత్యములు నొనరించుటకు వెనుదీయని యుత్తములారా! రండి!" యనిపిలుచుచున్నవో యనునట్లాగానమాధుర్వాత చవులసోఁకుచుండును. అటువంటి హోటళ్లలో మూడినట్టియు, కుళ్లిచెడినట్టియు, సరిగాయుడకనట్టియు మత్స్యమాంసములను మహాప్రియముతో నారగించిపోవుదురు. ఈవివేకదూరులు "తమగతియెట్లుండునో, తమమాంసమునే,కుక్కయో,నక్కయో,కాకియో, గద్దయో, పెఱికితినునుగదా!" యనుటందలపక యితరజంతుమాంసము నధికాపేక్షతో భుజించెదరు. ఇదికడుశోచనీయాంశము. అచటతయారుచేయు కూరలపేరులు మాత్రము మహాగౌరవముగా యుండును. ఆదుఃఖమునెంతచెప్పినను తీఱదు. అయ్యో! లెక్కలేనిపురువులు, నీఁగలు, నందుకలిసియుండును. చేయునపుడన్ననో ఆపనివాని దేహమునుండి జాఱుచెమ్మటయు, ముక్కునుండికాఱుచీమిడియు, నందుపడుచుండును. ఆసమయమున చూచినయెడల తత్పూర్వమూడుదినములకుముందుతినినపదార్థములునయితము పేగులతో కూడా వెలికివచ్చును. అందుకొన్నిటికిచాప్ కూరలనియు,కొన్నిటికికలగలుపుకూరలనియు పేరు

ముకూరలనియు,మఱి సెన్నో పేరులుండును. ఆచెమటయుంజీమిడియు వాని లోకలియుకున్న రుచి ఫ్పుట లేదు కాఁబోలు. చూచుటకుమాత్రము వా గుగ దోఁచుచుండును వీనిగొందలిదోషములు తెలుసుకొనలేక వివేకర హితులైన జనులు కమలుమెచ్చుచు తృప్తిగా యారగించిపోయెదరు. భగవంతుఁడా? వీనికి మెట్టిదియో నీవే యెఱుంగవలయును. జను లారా! ఈయన్యాయపు కాఫిహోటళ్లయనహ్యాత నింకనైనఁ దెలిసి కొని వానిఁజేరకుందురుగాక.

ఆ. తెల్లవారగానె ॥ దినకృత్యముగ కాఫి
త్రాగకున్నయెడల ॥ తల్లడిల్లు
పుణ్యపురుషులార! ॥ పూర్వస్థితినిమీరు
మదిఁదలంచిపాని ॥ వదలరాదె?

---

# మందుల నమ్మెడివార మోసము.

కొందఱు మోసగాండ్రు, (వీరిలో స్త్రీలునయితముఁ గొప్పగొప్ప సంచులను భుజములకు దగిలించుకొని, కావివస్త్రమును, కావిచొక్కాయయు, కావితలపాగయు, స్త్రీలైనచో కావిచీరయు) ధరించి ముఖముల యందు విభూతి రేఖలును, సింధూరపుబొట్లునుం బెట్టుకొని గొప్పపట్టణ ములలోను, పెద్దపెద్దయూళ్లయందునుం జేరి జనులు విశేషముగా వచ్చుచుంబోవు మండెడి వీధులలో యొక్కొక రొక్కొకచోట నొక మోర తమమందులయంగడి బెట్టుటకు కూర్చుండుదురు. ఇటువంటివారు చెన్నపట్టణములో మిక్కుటముగా ప్రతిదినమును కానవచ్చుచుండెదరు. వీరు కొన్నిసమయములలో జతలుజతలుగా యుండుటయుం గలదు. తాము కూర్చుండినచోట నొకజముకాణాగాని, మఱియేదైనవట్టను గాని, వస్త్రముగాని, విశాలముగా ముందుపఱచుకొని తమయెదుటనుండు పెద్దసంచినివిప్పి యందుసంగ్రహించి తయారుచేసి పెట్టుకొనియున్న పలు రంగుల చూర్ణములుగలకాకితపు పెద్దపెద్దపొట్లములును, చిన్నవియు పెద్ద వియునైన సీసాలును,కొన్ని చెక్కలును, వేళ్లును, పేరునూరులేని యనేక వర్ణముల గింజలును, యెండిన బహువిధముల కాయలునుతీసి యాపట్ట

మీఁద వరుసగాఁ బెట్టుదురు. పొట్లముగాని, మఱే దేనినిఁగాని యొక్కొక్కటి నెత్తియుంచునపుడును, బిగ్గఱగా దారినిపోవువారికందఱకు వినునట్లుగా "ఓ! వాతపునొప్పులకు, ఓ! కడుపులోనిమంటకు, ఓ! అజీర్ణరోగాలకు, ఓ! మేహవ్రణాలకు, ఓ! రక్తపుష్టిగలుగుటకు, ఓ! ఆకలిగలిగించుటకు, ఓ! ఉబ్బసమునమానుటకు, ఓ! పైత్యవ్యాధులకు, ఓ! శిరోభారములకు, ఓ! మలబద్ధకానకు" ననియఱచి చెప్పుచు బెట్టుచుండును. వానియఱపులువినియు, వాఁడచట బెట్టుచున్న వివిధములైనచూర్ణములు, మాత్రలు, వేళ్లు, గింజలుంజూచియు వచ్చుచుంబోవుచుండు వారువారు బైరాగులుగాన పరమహంసక్రియులు వారియొద్దనుండున నెడిభ్రమతో యచటికివచ్చి గుంపుగాఁజేరి చూచుచుందురు. వాఁడటుల చెప్పిచెప్పి యొక్కొకటిగా పరచియున్నవస్త్రముకడకును సందులేకయుంచును. అయినను వానిసంచిలో నుండువానిలో నచట బెట్టినవి నూటిలోనొకభాగముమాత్రమే! మునిసిపాలిటీవారి యాక్షేపణయు జనుల రాకపోకలయాటంకమును లేనిచో యాసిద్ధులిరువురుచేరిరేని వారియొద్దనుండు మందులతో యొకవీధియంతయు నింపుదురుకాబోలు. ఇటులవాఁ డఱచియఱచి రోగముల పేరులు చెప్పి దానిదానికి తగినమందుఁదీసిపెట్టుచుండగా, యట చేరిన మనుష్యులలో నొకరితోనొకరు. ఔనయ్యా! మనడాక్టరులు మోటారులపైవచ్చి యేదోయొక రబ్బరుగొట్టమును చెవిలోపెట్టుకొని దాని మఱియొక భాగమును రోగిరొమ్మునసుంచియు నచ్చటచ్చట దేహముపైనుంచియు చూచి, తానేమో వ్యాధిలక్షణమును గ్రహించినట్లు తలయూఁచి యింటివారితో, "సరి! మీరుచాలా డిలై చేసినార్ సార్ మొదటనే నాయొద్దకు వచ్చియుండవలసినది. థిస్ యీజ్ వెరి సీరియస్ కేస్ చాలా లంగ్స్ చెడిపోయినది. హార్టు మిక్కిలివీక్ నెస్ లోయున్నది. దేహంలో బ్లెడ్ లేదు. అయినను భయపడవలదు. నేనుస్మిత్ అండ్ కంపెనీకి యొకచీటివ్రాసియిచ్చెదను. మీరుపోయి యందువ్రాసినమందు తెచ్చియివ్వండి బెటరవుంది ఫరవాలేదు" అనిచెప్పి యొకమందువ్రాసియిచ్చి తానువచ్చినందుకుగా నాలుగో, ఐదోరూపాయలు దక్షిణపుచ్చుకొనిపోవును. ఆకంపెనీకిపోయి చీటిచూపించినయెడల దానిక్రయం 10 రూపాయలని వారుచెప్పుదురు. వ్యాధివచ్చినవాఁడు వెఱ్ఱివాఁడునొకటి, యన్నట్లు వారడిగినంతయునిచ్చి యామందు తెచ్చియిచ్చినయెడల నిష్ప్రయోజనము. వృథాగా నష్టము

చెందుటతప్ప వేరులాభము లేదు. ఇటువంటివిషయములు ప్రతిదినమును చూచుచుండియు, మనము వారిమాటలునమ్మి వారికేడబ్బుదారబోయుచున్నాముగాని,యిటులవీథులలోగూర్చుండి రూకకో,పాతికకో,జీవనార్థముగానౌషధములనమ్ముకొనుచుండెడి వీరిమాటలనుగాని,వీరిమందులనుగాని మనమునమ్మజాలము. కాలమిట్లైపోయినది. పూర్వమీ యాసుపత్రులును మందులషాపులును నెక్కడయుండినవి? ఇపుడుగదా యివి యన్నియు యింగ్లీషురాజ్యములలో ప్రబలినవి. వారుపోసెడినీళ్లుదివ్యౌషధములనినమ్మి యితరములైనవ్యాధికి తగినమందులు పుచ్చుకొనక, యీ పాడునీళ్లేత్రాగి గుణములేక రోగమెక్కుడై తుదకు ప్రాణములు పోగొట్టుకొనుచున్నారు. ఈయాసుపత్రులు ప్రబలినపిమ్మటనే మన దేశములో జననష్టమెక్కుడైనది. ముందు మనపెద్దలందఱును, నిటువంటివారియొద్దనల్పక్రయమునిచ్చి మందుగొనివాడుచు,కొన్నిసమయములలో తామేయేదోమందుచేసిపుచ్చుకొనియు,నిరోగులై చాలా కాలము జీవించుచుండినారు. ఇపుడుకాలమహిమ యిట్లేర్పడినది.ఈమాటలువిన్నచో నవనాగరికులు పరిహాసము చేసెదరు. వారిజోలిమనకెందుకు? గాని, నాకుమాత్రము వీరిమందులయందు నమ్మక మధికముగాఁ గలదు. నాతమ్ముఁడు వానిని నీవునుచూచియేయుండుదువు. ఆక్రాపుచేసుకొన్నవాఁడు యెఱ్ఱగాయుంటాడు .కొంచెము సన్నని మనిషి వాఁడుసార్. కష్టంసు ఆఫీసులో యుండినవాఁడు వానిస్థితియేమనుకున్నారు? ఉన్నట్టుండి వానికొకజబ్బుకలిగినది. ఇంకడాక్టరులు,ఆసుపత్రులు మందులు చెప్పవలసినది లేదు రూపాయలుమాత్రము మూడువందలు సెలవు.ఆమందువలన సుగుణమునకుమాఱుగా దుర్గుణము లెక్కుడైనవి.అన్నివిడచిపెట్టినాము.ఇట్లే యొకబైరాగి యమ్ముచుండగా, ధైర్యముఁజేసి నాలుగణాల కొకచూర్ణమును కొనిపోయియిచ్చినాను. ఏమిచెప్పేదిసార్.ఆవిచిత్రము మూడేపూటలు. నేనిచ్చినది అంతే!ఆజబ్బుగిబ్బు యెట్లుపోయినదో!తగినయౌషధము దినినంత యదియేలయుండును?మాయము. అదిమొదలు నేను వీరిమందులను మిక్కిలినమ్ముచుందును. "ఇవి యల్పక్రయమునకిచ్చెదరు. ఏమో! యిందుగుణము కలుగబోవునా?" యని తలంచెదరు. కాని యదిపొరబాటు. తప్పక గుణముకలుగునని నేనుదృఢముగా చెప్పగలనని దీర్ఘోపన్యాసములు గావించుచు నిలిచియుండుదురు. అపుడు

కొంచెము మంచిచొక్కాయియు వస్త్రములును ధరించియున్నవాఁడొ కఁడు గుంపుజొచ్చి మెల్లగా తప్పించుకొని ముందువచ్చి బైరాగినిఁజూచి, ఏమయ్యా! మరలవచ్చునట్లుచెప్పి రానే లేదు. మూడుదినములనుండి మిమ్ము నాల్గువక్కలను వెదకుచున్నాను. నీవు మా పాలిటికి దేవుఁడవు గాని యనన్యుఁడవుగావు. పోనుండినప్రాణము నీవలన దక్కినది. ఇంక పదిపూటలకు కామందు పుచ్చుకోవలయునని మాకోరిక. ఇదిగో! మందు క్రయంపుచ్చుకొని యౌషధము నిమ్ము" అని చొక్కాజేబీనుండి రెండురూపాయలు తీసి వానిచేత బెట్టును. వాఁడాడబ్బు పుచ్చుకొని యొకకాకితములో నాలుగైదువర్ణముల చూర్ణము కొంచెముకొంచెము వేసికలిపి, మడిచియిచ్చి, ఇపుడింకొకమందు కలిపియున్నాను. ఇదిరక్తముకలిగి బలమువచ్చుటకుగా చేర్చినాను. దీనితో సంపూర్ణారోగ్యముకలుగుతుంది. ముందుచెప్పినదే పత్యము. ఆవ, యుపిసి, గుమ్మడి, నూనె మాత్రము పనికిరావు. తక్కినవన్నియు తినవచ్చు"నని చెప్పును. అదిచూచియు, యీ మాటలువినియు, నచట నుపన్యసించుచుండినవారిలో నొకడు తక్కినవారింజూచి «ఇదిగో! చూచినారా! నేను చెప్పినమాట సరిపోయినది గదా? ఎక్కడినుండియో వెదకుకొనివచ్చి మందుఁదీసుకొని పోవుచున్నాఁడు. ఈపట్టణములో వైద్యులు లేకనా? యితనియొద్దకువచ్చినాఁడు విచారించండి! మీకితఁడేమిచెప్పునో తెలియును" అని తానే మందుకొన్నవానితో "ఈమందులు మంచివేనా? గుణమొసంగునా?" యని యడుగును.

మందు పుచ్చుకొన్నవాఁడు:— ఈమందులా? నేను చెప్పడమువలన నేమిప్రయోజనము? మీరునమ్మెదరా? వారివారి నమ్మకము గదా? నమ్మకము గలిగినయెడల నన్నియుమంచివే! గుణము న్నూకలుగును.

అడిగినవాఁడు:—అదేనయ్యా! నమ్మకపుమాటయే! ఒకసారితీసి వాడియో, లేక యెవరైనంగొని యుపయోగించిరో తెలిసియున్నగదా! నమ్మకము కలుగును. నీమాటలనుబట్టి యింతకుమున్న పుచ్చుకున్నట్లుతోచినది. గుణమేనా?

మందుపుచ్చుకొన్నవాఁడు:—దివ్యౌషధములండీ! ఇవిమనము తెలివిలేక వృథాగా డాక్టరులకు డబ్బు దారబోయుచుండుదుము గాని ప్ర

యోజనము లేదు. ఈమందులు క్రయముతక్కువ. ఇదియొకసుఖ
ము. తప్పక గుణముకలిగితీఱును. ఇది నాయనుభవము.

అడిగినవాఁడు:—ఏవ్యాధికిగా యీమందును తీసుకొంటివి? ఇదివరకు
నీవు తీసుకొనినయౌషధమునయిత మిదియేనా?

మందుపుచ్చుకొన్నవాఁడు:—ఔను! ఆమందేయిది. కీళ్ళుకీళ్ళుఁజట్టు
కొనిపోయినవి. మాతల్లికండీ! నేను చేయించని వైద్యమే
లేదనవలెను. ఎన్నోమందులైనవి. ఎందఱో డాక్టరులు చూచి
నారు. డబ్బు పోవడమేకాని యుపయోగము లేకపోయినది.
తుదకీ మహానుభావుఁడు దేవుఁడివలె కనఁబడి చూర్ణము నిచ్చి
నాఁడు దానికిగా క్రయం మూఁడురూపాయలు యిచ్చితిని. ఆ
మూఁడురూపాయలతో మాయమ్మప్రాణములు దక్కినవి. ఆమె
జీవించునని యెవరును దలంపలేదు ఇపుడు ముందు మందుని
చ్చినవైద్యులుచూచి తలవంచుకొన్నారు. వారిమొగం వారి
కేమియు తెలియదు. పట్టి డంబాచారివేషములుమాత్రమే! ఇం
కాపదిపూటలీమందేవాడుట మంచిదని తీసుకొనిపోవుచున్నాను.

వానినడిగినవాఁ డచటివారిని చూచి "ఏమయ్యా! సరేనా?
ఈపెద్దమనిషిచెప్పినమాటలు. నేనుచెప్పినదానికి సరిపోయినవా? ఇది
యంతయు నమ్మకముమీఁద నిలిచియున్నది ఏపుట్టలో యేపాము
గలదో తెలిసికొనుటకష్టము. చూచుట కివి యేవో రంగుచూర్ణములు
గాఁతోచును. అనుభవముమీఁదగాని వీనిగుణము తెలియదు. నాకు
మూఁడునెలలనుండి జీర్ణశక్తి చాలాతగ్గిపోయినది. ఇతనియొద్ద దానికిగా తీసు
కొనఁదలఁచినాను" అని ముందుకుపోయి "బాబూ! మాపిన్నవానికి
సరిగా యాకలిలేదు. ఇంతకుమున్ను మీవాఁడే యొకఁడు చూర్ణమిచ్చి
నాఁడు. నాలుగుపూటలకు చాలా గుణముకలిగినది. ఆట్లాటపిల్లవాఁడు
గాన వాఁడుసరిగాతీసుకొనలేదు. ఆడవాండ్రు పొరబాటున మందుపాఁ
గొట్టినారు. ఇప్పుడు దానికిగా యిచ్చెదవా?" యని యడుగును. మందు
లవాఁడు "పుచ్చుకో! బాబూ! ఇదిగో! మందు. అయిదుపూటలు
వాడిచూడండి. దీనిగుణం తెలుస్తుంది. ఇవ్వమనెదరా? యనును. ఆమను
ష్యుఁడిమ్మనును. మందులవాఁడొక నల్లనిచూర్ణముఁగల పొట్లమునువిప్పి
కాకితపు తునుకలలో నొక్కొక చిటికెడు వేసి, చిన్నచిన్నవిగా పదిపొ

ట్లములుమడిచి యామనుష్యునిచే నిచ్చి "క్రమముగా తేనెలో కలిపి యివ్వండి. దినమునకు రెండుసారులు ఉదయంసాయంత్రం పథ్యము లేదు." అనిచెప్పును. మందుతీసుకొనినవాఁడు దానిక్రయము మొదట నడుగకుండియు నొకరూపాయిని వానిచేతఁబెట్టును. వాఁడు చిన్న బోయి "బాబూ! ఏమియిచ్చినారు? తెలిసినవారు మీరు యిట్లుచేయ వచ్చునా? యనిన, "కానిమ్ము! మఱియొకసమయం మందు కావలసి యున్నది. మాయిల్లు చూచియున్నావుగదా! పదిదినములు నిదానించుము. ఇపుడు డబ్బులేదు. ఇంతేయుండినది. నేనీరూపాయి వేరేకర్చుకు తెచ్చినాను. నిన్ను చూచినంతట మందుతీసుకొనుటకు బుద్ధిపుట్టి పుచ్చుకొన్నాను. ఇప్పటికిసంతోషించుమనిచెప్పి యాపొట్లములు జేబిలో పెట్టుకొని వెడలిపోవును. అదిచూచి యచట కూడినవారు తామెక్కువగా డబ్బునిచ్చి డాక్టరులయొద్ద మందుపుచ్చుకొన శక్తిలేనివారగుటచే, తమకుతమకు గలిగిన రోగములుచెప్పి, యొకటి, యర, కాలు యిచ్చి, యతనియొద్ద వాఁడిచ్చిన దేదో యొకటిపుచ్చుకొనిపోవుదురు. వాఁడు సాయంత్రమునకులోపల యిట్లే ప్రతిదినమును కనీస మయిదారురూపాయలు సంపాదించి, చీకటిపడగానే కుటుంబసహితముగా మాయాందేవీ నివాసమైన కల్లంగడికిపోయి కానుకచెల్లించి తృప్తిగా త్రాగి, యేసత్రపువాకిటనో, యే ముసాఫరు ఖానాముందో, యేచావడిలోననో పరుండి మహదానందసాగరంబులో మునిఁగియుండును. పాఠకులీ మందులు మంచివిగానేయుండుననియు, మొదటను, రెండవసారి మందులు పుచ్చుకొని పోయినవారా యౌషధములుకొని వాడి గుణముఁ గనుఁగొనియున్నవారేననియు దలంతురుకాఁబోలు. అదియంతయు కేవల జగజ్జాలముగాని వేఱుకాదు మెత్తగాపొడిచేసి తాల్చి, వస్త్రకాళితముఁజేసిన నామముగడ్డ, విభూతి, బొగ్గు, ఇటికరాళ్ళు, గుంటగలగర, మొదలైనవాని యెండినయాకులు, మొదలగువాని చూర్ణములేగాని యవి మఱి యొవ్వియుఁగావు. ఆపొడుల నొకదానితో నొకటి రంగుభేదము కలుగునట్లు కలిపి, కొన్నియు పొట్లములుగట్టియు, కొంతసీసాలలోఁబోసియు పెట్టుకొని యుండుదురు. మెత్తనిబంకమట్టి బాగుగా నలిపి మాత్రలుచేసి కొన్నిసీసాలలో బెట్టియుందురు. వేప, రావి, యత్తి, తుమ్మ, మొదలైనవాని చెక్కలు తెచ్చి పలురకములుగా రంగువేసి గు

లుతు తెలియకుండునట్లుచేసి యు, తమకుదొరికిన చిన్నకొట్ల వేళ్లును, పేరు పయిశము తెలియనివింతగా నుండువిత్తనములును సేకరించి యెండించి పెట్టుకొని యుందురు. అవియన్నియు జనుల భ్రమింపఁజేయుటకై పెట్టుకొనియున్నవే కాని, యిచ్చునవి చూర్ణములుమాత్రమే! మొదట మందుకొనిన యిరువురును వారిలోనివారే! అన్యులవలెవచ్చి యిట్టుల టక్కుమాటలాడి జనులకు నమ్మకము కలుగుటకై యిట్టుల నటించిన వారు. ఈమహామోసమును తెలియలేక వారిమాట లనుభవసిద్ధము లనినమ్మి జనులు తాముసుం దీసికొనిపోవుదురు. అవి యుపయోగించి గుణము లేక కనబడినపుడా మందులవాని నడిగినయెడల, మందుపుచ్చుకొన్నది చాలదనియో, యది యిచ్చినది తానుకాదనియో, సమయానుసారముగాచెప్పి తప్పించుకొనిపోవును. ఇటుల ప్రజలనేమరించి డబ్బు సంపాదించి దుర్వినియోగముఁ జేయువారిని ప్రభుత్వముచేయు ధర్మప్రభువులు, శరీరకష్టము జేసి యేదో యొకవృత్తినవలంబించి సంపాదనముచేసి జీవించునటుల తగిన కట్టుబాటు లొనరింపఁబూనక యుపేక్షించియుండుట మన దురదృష్టముగదా! జనులారా! ఇట్టివారినినమ్మి మందులు కొనక మీరెఱింగిన యోగ్యుడైన వైద్యుని యొద్దనే యౌషధములు పుచ్చుకొనుట శ్రేయస్కరమని తలంపుఁడు.

ఆ. రంగు లెసఁగుచుండు । గాలు అప్పలు దెచ్చి
పొడులు జేసి పెద్ద । పొట్లములను
గట్టిమందులనుచు । కడునమ్మఁగాఁబల్కు
యమ్ముచుండువారి । నమ్మరాదు.



# భోజనహోటలులలో చేయుమోసము

ఏగొప్పపట్టణమందు చూచినను కాఫిహోటళ్లవలెనే, వీధివీధిలోనను నొకటియో రెండో భోజనపుహోటళ్లును ఉండితీరును. ఇవి యా యాపట్టణములలోని పుణ్యస్థలములు కాఁబోలు. ఎచ్చటెచ్చటనుండియో యాత్రార్థులై వచ్చినవారందఱును సదావీనిలోనికరిగి తీర్థప్రసాదములు స్వీకరించి కానుకచెల్లించి జన్మపావనము జేసికొని పోవుచుందురు. ఈమహాస్థలములలో హోటలు యజమానుఁడే దేవుడు. ఈదేవుని యనుగ్రహము కలిగినవారికిమాత్రమే కొంచెము మంచి ప్రసాదము లభించును లేనివారికి కానుకచెల్లించినను, సాధారణముగా "నలుగురితోఁబాటు గోవిందా!"యని పోవలసినదే! ఇతర గొప్పపట్టణములపేరులును, క్రొత్తక్రొత్త వింతపేరులు వ్రాయించిన నిడివియు వెడల్పునుంగల పలకలను వాకిట వ్రేలఁగట్టుదురు. చెన్నపురిలో యిట్టివి యేవీధియందు కోరినను చూడవచ్చును. "తంజావూరు నీలకంఠయ్యర్ సాపాడుహోటల్, మైసూరుకిష్టప్ప భోజనహోటల్, మలబారు నారాయణసామయ్యర్ మీల్సుహోట"లనియు, "మహారాజాహోటల్, మనోరంజనీహోటల్, గణపతిహోటల్, శారదావిలాసం హోటల్" అనియు వానికి వివిధములైనపేరులు వ్రాయబడియుండును. ఈహోటళ్లుపెట్టెడి సత్పురుషులు, ప్రాతగిలినవియు, సగము సిథిలమైనవియు, నేకారణముచేతనైనను కాపురముచేయుటకు యెవరికిని యిష్టములేకపోవుటచే పాడుపడియుండునవియునైన యిండ్లుచూచి నయముగా బాడుగమాట్లాడుకొని వానిలో చేరుదురు. మొట్టమొదట వాకిలివైపు కొంచెము బాగుఁజేయించి బోర్డు వ్రేలగట్టి వాకిటి కొకవైపున వెలుపల తమలపాకుల యంగడి నేర్పాటుజేయుదురు. వక్కాకుల యంగడిపెట్టినచో విఘ్నేశ్వరపూజఁజేసినట్లు వారియభిప్రాయము కాఁబోలు. తరువాత చిల్లులుపడినవియు, సొట్టలు పోయినవియునైన ప్రాతపాత్రములు కొన్నియు కుండలు కొన్నియు దెచ్చుకొని తమయుద్యోగమునకు ప్రారంభింతురు. క్రొత్తగా ప్రారంభించినపుడు కొందఱు తమభోజనముయొక్క పరిశుద్ధతనుగురించియు, పదార్థవిశేషములను గురించియు బహాడంబరముగావర్ణించివ్రాసి యచ్చువేయించిన పత్రికలు నాలుగువైపులను జను

లకు విరివిగాయొసంగి తమప్రసిద్ధి వెల్లడిచేయుదురు. ఈయాడంబర మును, దడబుకలునుంజూచి యన్యస్థలంబులనుండి కార్యార్థులై వచ్చిన జనులు, మంచిభోజనము దొరకునని తలంచి యచటికిపోవుదురు. అయ్యో! ఆ ఘోరదుఃఖము పోయిచూచిన వానికేయెఱుక. లోపలికి పోయి యేవైపుగాచూచినను, సిథిలమై నగముకూలియున్న యింటి గోయ్యలును, పెంకుగుట్టలును, పందికొక్కులుతోడినమట్టిరాసులును జలదారికాలువల దుర్వాసనయు, జుమ్ముమని ముసరియుండెడి యీగలును, సాలెపురుగులగూండ్లును, కరిఘూపపుధూళియు కనుపించును. అవిచూడగానే కన్నులుచల్లబడి కడుపునిండిపోవును. ఆమధ్యనే నాలుగు ప్రాతవెదురు తడికలుగాని, చినిగిన గోనెపట్టలుగాని యడ్డముకట్టి వాని వెనుక వంటకేర్పాటు చేసికొనియుందురు. తత్పూర్వమువచ్చి, భోజనముం జేసిపోయినవారి యాకులలోనుండి చిందినవియు, తమబిడ్డలుతినుచుండినపుడు చిందినమజ్జిగపులుసుతో కలిసినవియునైన మెతుకులంతటను నశ్చేపడియుండును. ఎవండైనవచ్చి "ఏమండీ! అన్నముపెట్టెదరా ఉన్నదా? అయిపోయినదా!"యని యడిగినయెడల "ఓహో! లేకపోవడమెందువలన? మాహోటలులో యేగంటకువచ్చినను యన్నిపదార్థములును సిద్ధముగాయుండును అన్నియునున్నవిగాని యీదినము మనుష్యులధికముగా వచ్చుటచే యాకులై పోయినవి. రెండునిముషములు కూర్చుండుడు. మనిషినిపంపి తెప్పించెదనని యొకరోటి జాజిచెక్కలపెట్టెమీద కూర్చుండబెట్టి యొకపిల్లవానిబిలిచి "కృష్ణా! పోపో! నేనుపోయి యొకేసాగిగా నాలుగుకట్టలుతీసికొని వచ్చెదనుగాని ప్రస్తుతము నీవు మంచివిగా యొకయర్ధణాకు విస్తళ్లు తీసికొనిపరుగునరమ్ము" అని వానిచే యర్ధణానిచ్చి పంపివేయును. అప్పుడు వచ్చియున్నవాండుగాక తత్పూర్వ మచటికి భోజనమునకువచ్చి తినిపోయినవా రొకరిద్దరికంటె యధికముగానుండరు. అయినను హోటలువాండు పూటకునూర్గురో, మఱియునెక్కుడుగనో వచ్చుచున్నట్లు ప్రగల్భములుచెప్పును. అన్నిపదార్థములును, యథేష్టముగా సమృద్ధిగయున్నవని వచ్చినవానిని కూర్చుండబెట్టుటయేకాని యొకటియునుండదు. అతండు వచ్చినతరువాత తాము వెలతక్కువగా తెచ్చిపెట్టుకొనియున్నదియు, తవుడు, మట్టి, రాళ్లు, సమృద్ధిగా కలిసియుండునదియునైన బియ్యము నళ్లకొలిచి

నీళ్లలోఁబోసి పొయిమీఁద బెట్టును. వచ్చినవాఁడు "ఏమండీ! ఆలస్యముగాయున్నదే! నేను శీఘ్రముగా పోవలయును. అన్నము త్వరగా పెట్టండి" యని తొందర చేసిన "ఇదిగో! విస్తళ్లు రావడమే యాలస్యము. సిద్ధముగాయున్నాను. రాగానే వడ్డించెదను ఆరాస్కేల్, యేపనికి పంపినను యిటే చేస్తూ ఉంటాడు. పనితొందఱ వాఁడు యోజించఁడు. వచ్చుచుండును. ఇంక నొకనిమిష మోర్చుకొనుఁ"డని సమాధానము చెప్పి "అయ్యా! నాయొద్ద చిల్లర లేదు. అన్నియు కాగితములుగా యున్నవి. అవసరముగా కాలసియున్నది నాలుగణాలు మీయొద్దనుంటె యివ్వండి చిల్లర లేక రూపాయిగాయుండినను యివ్వండి మార్చి తెప్పించెదను" అని యుపాయముగా, వాఁడొకవేళ వెళ్లునేమో యనుతలంపున ముందుగానే డబ్బునాడదీయును. "ఎప్పుడైన నివ్వవలసినదేకదా!" యని యామనుష్యుఁ డిచ్చివేయును. ఇంతలో పొయిపై పెట్టినదానిని మఱియొకఁడు ఉడికియు నుడుకక వార్చి దించి పెట్టును. వంటయగువరకును రావలదని చెప్పియున్నందున, విస్తళ్లకై పోయినపిల్లవాఁడు తనకు చెప్పినగంటదనుక నెక్కడనోయుండి, కుట్టినవారు, గుమ్మడికాయ దూరకుంటేచాలు"ననెడి సామెతకు సరిగాయుండెడి పులెలు నాలుగైదుతీసికొని యాచిన్నవాఁడువచ్చును. ఆలస్యముగా వచ్చినందుకై వానిపై కోపపడిన ట్లభినయించి, అయ్యరుగారు వానినితిట్టి యచ్చట నుండు మెతుకులనైన యూడువక యొకమూర విస్తరివేసి, యామనుష్యునిఁ గూర్చుండఁబెట్టి పాచిబట్టిన కొయ్యతొట్టిలో బోసియున్న నీళ్లు తెచ్చి త్రాగుటకొకపాత్రములోయుంచును. అంతట లోపల వడ్డనచే యుచున్న యుత్తమబ్రాహ్మణుఁడు గుడ్డతోపట్టుకొని యన్నపుతట్టను తెచ్చి యూడుకుకూడును విస్తరిలో కొంత గరిటతోతోసిపోవును, ఆయన్నపుటావిరి ముఖమునకు తగులగానే గచ్చుగబ్బుగొట్టును. కొందఱు నబ్బునీళ్లు చల్లినయన్నముఁ బెట్టుటయుంగలదు. ఎందుకనగా, ఆయన్నము తినుటవలన నెక్కుడుగా తినుటకు హితవుగాకపోవునఁట. అట్టి యుడుకుబెడుకుకూడు విస్తరిలోబోసి పోయి శలవైపోగా మిగిలియున్న పులుసుయొక్కయడుగుమడ్డిలో కొంచెము నీళ్లుపోసి పొయిమీఁద బెట్టియుండి వేఁడివేఁడిగా తెచ్చి సంగటివలె కొంతయు, నుడికియు నుడకక కొంతయునుగా యుండెడి యాయన్నములో, సాంబారని చెప్ప

గరిటెతో నెత్తిపోయును. అన్నమునుచల్లార్చుటకే కష్టమైయుండగా దానిలో నుడుకుచున్నపులుసునీళ్లు పోయగానే మఱియు వేఁడి యెక్కుడగును. ఆసాంబారుతో ప్రయాసపడి యన్నముకలిపి నోటఁబెట్టుకొన్ననో, శుద్ధముగాచప్పిడి. దానిలో ఉప్పు పులుసు కారము యెక్కడినుండి వచ్చును? నీళ్లుపోసి కాచిన యుడుకునీళ్లేగదా యువి యింకొకరసము (చారు) దీనికబ్బగానేయుండును. దానిరుచి భుజించువానికి పిమ్మటగదా తెలియును. భోక్త యన్నమును గలుపుకొని కనిపెట్టుకొని కూర్చుండియుండగా అయ్యరుగారు తాజాగాపాతికగంటకు నెయ్యి తెచ్చి నిట్టనిలువుగా నిలిచి, గంటెను నేతిలోముంచి రెండుమూడుసారులు వేయును. అతఁడు వేసిన నేయియంతయు లోకపిల్లిగరిటెకులోపుగానేయుండును. ఆయన్నమును చల్లార్చుకొనుటకంతె తడవుపట్టునని తెలిసియున్నందున కాఁబోలు నయ్యరుగారంత యాలస్యముగా నేయి తెచ్చుటయని యెంచవలసియుండును ఆయన సగము మీఁదఁబడునట్లుగా వేసిన యానేతిపరిమళము చెప్పనలవిగాదు కడుపులోనిపేగు లపుడే వెలికివచ్చునేమో యనితోఁచును. ఆయన్నము కడుపులోనికిపోగానే యెన్నిసంకటములు చేయువలయునో యన్నియుంజేయును. ఆవికారము భోజనముజేసియనుభవించినవానికే యెఱుకగాని యన్యులు తెలిసికొనఁజాలరు.

"ఇంక కూర, కూటు, చట్నీ, పెరుగుపచ్చడి, మొదలైనవన్నో యన్నియుంజప్పిడివే! నోటఁబెట్టుకొనినచో, మేము లోపలికిఁబోఁజాలము. వెలుపలికేవచ్చెద"మని వచ్చునట్లుండును. మనుష్యులెక్కుడుగా వచ్చినకొలఁదిని పులుసులోను, చారులోను, ఉష్ణోదక మెక్కుడుగాచేరుచుండును. ఒకవస్తువుంగలుపుకొని తినినంతట యాచేయి యుట్లేయెండిపోవువరకును మఱియొక పదార్థమురాదు కాచియుండవలసినదే! నిట్టనిలువుగానుండి పోయినపుడు కాలుచున్న యాపులుసు కాళ్లమీఁదను, చేతులమీఁదనుచింది బొబ్బలుతేచును. కావున నటువంటివి వడ్డించు సమయమున భుజించువాఁడు జాగ్రతగాయుండి కొంచెము వెనుకకుజరుగకతప్పదు. అటులజరిగి అయ్యరుగారు పోయినంతట విస్తరిదగ్గఱకు మరల జరుగుటకులోపల, యాకులోనుండు కూడునుంగూరలుంగొట్టుకొనిపోయి భూమిపాలగును. అంతట తేరులుచుండే రసమువచ్చును. దీనిరుచి వర్ణనాతీతము. వ్యాధిగ్రస్తునకుగాపెట్టి యొసంగు కషాయ

మనియే చెప్పఁదగును. ఇదివిస్తరిలోపడగానే మహాకోపముతో యిటు నటుం బరువుఁబవాఱును నట్టివిలువుపట యసాధ్యమైనపని ఈగండము లన్నిటిని తప్పించుకొన్నంతట, కడపట తక్రదేవుఁడు ప్రవేశించును. ఆయుత్తమఁడైన దేవుడు తన మొదటిరూపమును మార్చుకొని వేరే యాకారమును దాల్చియుండును. వడిపెరుగులో కుండెడునీళ్ళుపోసిన యెట్లుండును? వాడిన కిచ్చిలికాయలు, కుళ్ళిన మామిడికాయలు తరిగి యుప్పులోవేసిపెట్టిన తునుకలునాలుగు నంచుకొనుటకు వేయుదురు. ఏపదార్థమైనను మరల కావలయునని యడిగితిమేని, విసుగుతో తెచ్చి వడ వేయుదురు. లేదా? కొనివచ్చుటకులోపల భోజనమైపోవును. వీరు తెచ్చి వంటచేయు కాయలు, గడ్డలు, కూరలు, కుళ్ళిచెడి పాసికాలంగా, నాలుగుదిన్ములీలు వెలగలిగినవిగా యుండునేకాని మంచి దొకటియును గాదు వెనకవెదకి యట్టివానినే నయముగాఁ గొనివత్తురు. ఏయేయంగడిలో కాయగూరలు విశేషముగాచెడిపోయి యుండునటయు నెఱుంగవలెననిసచో భోజనహోటలువారినడిగిన స్పష్టముగా తెలుసుకొనవచ్చును. పూర్వజన్మమున ఘోరపాపములు చేసినవారును, వేఱువిధముగా గతిలేనివారును, యీపూటకూళ్లు కుడువవలసి యుండునేమో తెలిసినదికాదు. వీరికి ధర్మచింతగాని,కనికరముగాని కోసిచూచినను కనుపడదు. వీరికి భోజనమునందలి మంచిచెడుగుల భేదమెక్కడిది? లోకోపకారులైన యీహోటళ్లు పుణ్యపురుషులు కొంచెము చక్కనివారుగా యుండుస్త్రీలను తమయొద్దనుంచుకొని వచ్చిన పోకిలాలతో బేరము సాగించి డబ్బు గుంజుకొనుటయుంగలదు. అయ్యో! భగవంతుఁడీ యన్న విక్రయము చేయుటకుపాల్పడి చేయరాని కపటతంత్రములు చేసివచ్చినవారియొద్ద నన్యాయముగా డబ్బులాగెడి పరమ పాపాత్ములైన హోటలులవారి కేగతి గలిగించునో, వీరలే నరకమున గూలునట్లుచేయునోగదా! వీరికి మేలుగలుగునా? అన్న విక్రయము, స్త్రీలమానవిక్రయము నొనరించువారికి సద్గతిప్రాప్తించునా? ఈఖలులకుడబ్బు గడించుటలోఁగల యాస న్యాయము నందుజనింపదు. ఇది వీరికర్మమును, వీరియన్నముఁ దినెడివారి కర్మమునుం గాఁబోలు.

ఆ. అన్నవిక్రయమునకనర్థంబుగడనజే,యంగబూని చేయుకొన్ని సపట్టు
దుష్టియులనొనర్చు కదురితాత్మకులు రెట్టు, కాదుపాపికాదుకొకుడువరాదు.

# రోతయైన కల్లంగడులలో చేయు మోసము.

కల్లంగడులవలన దేశమునకు వాటిల్లుచున్న యనర్థము లిన్ని యని తెలుపుటకు సాధ్యముకాదు. దీనినిగురించి చక్కగా దూరాలోచనమొనరించి గాంధిమహాత్ముఁడు ముఖ్యముగా మన దేశములో త్రాగుడును మాన్పవలయునని సిద్ధాంతీకరించెను. సాధారణముగా పర్యాలోచనఁ జేసినపుడే త్రాగుబోతుతనము జనులకు కలిగించు కష్టనష్టము లిట్టివని ప్రతిమనుష్యునకుం దోఁచుచుండును. పేదలను కూడు నుగుడ్డయు లేక యల్లాడునట్లు చేయునదియు, బుద్ధివిమార్చి దుర్భరస్థితికిఁ దెచ్చునదియు, దొంగతనము,కొల మొదలైనదుష్కార్యములుచేయుటకు వలయు ధైర్యసాహసములు కలిగించునదియు, మఱియు నెన్నియో కష్టములును, దుఃఖములును, గలిగించునదియు, మన భరత దేశమును దారిద్రస్థితికిఁ దెచ్చుచున్నదియు, త్రాగుబోతు తనము నెడి చెడునడత తప్ప వేఱొక్కటియుంగాదు. మధువనగా తేనెకును, సారాయమునకునుం బేరులుచెల్లును, సురయన్ననో, యట్టేవేల్పునకును, కల్లునకును పేరగును. కావున కల్లుద్రాగినచో దేవతలసేవించినట్లగునని యీత్రాగుబోతుల తలంపు గాఁబోలు. ఆ యానందము త్రాగియంగడి వెంబడిఁబడి పొరలెడివాఁడే యెఱుంగును. ఏదిగాని మితిమీఱిన చేటుదేక మానదు. అధికమైనపు డమృతమైనను, విషముగా పరిణమించును. "పట్టపగలు వచ్చేవానికి, తట్టగంపచాటు" అన్నట్లు మొగములు వస్త్రములతో మాటుచేసుకొనియు, తలపైఁబెట్టుకొని పోవుచున్న బళువుమూటను వాకిటఁ బడవైచియు, "జాతిలో సెట్టియారు కుడిచేది మాల కూడు" అన్నట్లు మేము జాతిలో నెక్కుడు గౌరవము కలవారమని డంబముగా పలుకుకొనుచు యేడ్చెడి మహానుభావులును ప్రవేసించి సేవించిపోవుదురు మాలలు, మాదిగలు, దాసరులు, జంగాలు, జోగులు మంగలులు, చాకలులు, బోయలు, సాలెలు, సెట్లు, మొదలుగాఁగల జాతుల వారలును, నిద్రనుండి తెల్లవాఱి లేవగనే కండువలుపుకొని, మద్యదేవతా ధ్యానమును చేయుటవాడుకయైనది. ఇటువంటి జనులపై భగవంతుఁడు కరుణాదృష్టులు ప్రసరింపఁజేయునా? ఈత్రాగుబోతులు మెండైన దేశము, సుభిక్షముగా యుండునా? కల్లుపొంగు

విధముగా, త్రాగుడుగాండ్ర యాలుబిడ్డలు కూడుగుడ్డలులేక యల్లాడు టచే వారిదుఃఖము సయితము పొంగుచుండును. అయ్యో! పాపము! వారేమి చేయుదురు? త్రాగి నాతనికి పొట్టనిండినట్లాగున నంగడివానికి డబ్బుగో పెట్టెనిండుచుండును. ఆహా! దానిమహిమ కేమనవలయును? భరత దేశవాసులను గంజిత్రాగుటకైన గతిలేనివారినిగా జేయుచున్నదియు, నన్యదేశవాసులను, కోట్లకొలది ద్రవ్యముతో మహానందము నొందఁజేయుచుండునదియు, కల్లు పీపాయీలును, సారాయిసీసాలునే యని యెఱుంగవలయును. ఇట్లు మన దేశమునుండి యనంతమైనధనము నిర్విఘ్నముగా గడించికొని పోవుచున్న యితరదేశస్థులు నిర్దోషులుగానే యెన్నబడుచున్నారు. వారియందు తప్పెట్లు చెప్పుట కేయాధారమున్నది? ఒకవేళ యెవఁడైన నెవనినైన నడిగినచో, "త్రాగుఁడని బలాత్కరించినామా?" యనియందురు. దానికిబదులుమాటయున్నదా? దినేదినే యంగళ్లు వృద్ధియగుచున్నవే కాని తగ్గుట లేదు. వానికిగల శోభ మఱిదేనికిని యుండదు. కడుశుభ్రముగాను, చూచుట కింపుగా యుండులాగున నలంకారయుక్తముగాను, గంభీరముగాను యీయంగడులు కనుపట్టుచు, జనుల హృదయములను తమ వంకకాకర్షించుచుండును. డబ్బువేయు పెట్టెకు పసుపుకుంకుమ గంధములతో యలంకరించి, కొంచెముగా పట్టుటకై లోపలమైనమో, లక్కయో యతికించిన కొలతపాత్రములు వరుసగా దానిపై పెట్టి యంగడివాఁడు కడుడంబముగా కూర్చుండియుండును. లోపలికి పోయినంతట బ్రాహ్మణులు, మొదలియార్లు, సెట్లు, యితరజాతులకు చేరినవారును, కూర్చుండుటకు వెనుకతడికలతో కట్టిన యరలుండును. గుఱుతు తెలియుటకై వానివానికి వ్రాతపలకలు తగిలించి యుండుదురు. వచ్చినవాఁడుతన కెంతకావలయునో దానిక్రయము చెల్లించినంతట యంగడివాఁడా మోసపు కొలతపాత్రములలో క్రమముగా క్రయమునకుతగినట్లు దానినితీసికొని, జాడీ బిరడాతీసి మధ్యమో కల్లో దానిలో బోయును. అపుడా పొంగువలన పాత్రమునిండి మీఁదికి వచ్చినట్లుండును. అని పుచ్చుకొన్నవాఁడా పొంగుతగ్గినంతట పాత్రములో నాలుగవ వంతున నున్నదానిఁజూచి "ఏమయ్యా! ఇంతతక్కువగా యిచ్చినారే! గొంతుకడకైనను జాఱునట్లుండలేదే!" యని యడిగిన. "ఓహో! పొంగు లేకుంటే, రంగుబుట్టదు.

నీవు చూచుచుండగా నేకదా! పోసినాను. పాంగుతో పోసినది ఘాటు యెక్కువ అందుచేతని యుమ్మైబోయుదునని తలంచితివి కాఁబోలు. మాకు ప్రియముగా నుండువారికి మాత్రమే! సుమా!" యని సమాధానముఁ జెప్పి సంతోషపఱచును. కొన్ని సమయములలో యజమానునకుబదులు గుమస్తా కొలిచియిచ్చును. యజమానుని కొలతకును, వాని కొలఁతకును నెంతయో భేదముండును. గుమస్తా యజమానుఁడే మేలనిపించును ఎవఁడైన నొకఁడు యీదినమునే నొకప్రొద్దు కావున గొంచెము మేలైనదిగా మంచి పాత్రములో బోసి యివ్వవలసిన"దని యడిగినచో తలయూఁచి తాను త్రాగినదో తత్పూర్వము నీచులు త్రాగిపెట్టియున్నదో యొక యెంగిలి పాత్రమును కడుగక తీసుకొని దానిలో బోసి యిచ్చును. త్రాగుడుగాఁడు తనకతఁడు పరిశుద్ధపాత్రములో యిచ్చినట్లుతలంచును. ఇటుల త్రాగినపాత్రములన్నియు శుద్ధిచేయుట కాదు మనిషి యొకతెయుండును. అది మాలదియో, మాదిగదిగానో యుండును. ఆస్త్రీ యన్ని పాత్రములు నొకటిగా నేకలిపి, ప్రక్కనయుండు మురికినీళ్లగుంటకుగొనిపోయి యందు ముంచి తెచ్చిపెట్టును. ఆపాత్రములలో యడుగునపేరుకొనిన మట్టిమస్తు అట్లేయుండును ఏపాత్రమును చూచినను దుర్వాసన కొట్టుచుండును. బుద్ధిహీనులైన త్రాగుబోతులది తెలిసికొనుటయున్నదా? అదియెక్కడిది? రామరామ. ఆవిషయమును గూర్చి వారాలోచింపనే యాలోచింపరు. ఆస్వర్గ మందిరమునకుఁ బోయినపుడచ్చటి మహదానందమున వారికేదియుం దెలియదు. పేరుకుమాత్రము వేఱువేఱు చోటులేగాని యంతయు నేకముగానే యుండును. భేదమేపాటింపరు. కల్లులో, చీమలు, పురుగులు, పడియుండియవి తమకండ్ల యెత్తివేయుటను చూచుచుండియు, నసహ్యమొందక, మహాప్రియముతో త్రాగుదురు. త్రాగుబోతు లధికముగానచ్చిపనితొందఱగా యున్నపుడంగడివాఁడా పురుగులను తీసివేయకయట్లేపోసినను త్రాగుదురుగాని వానిని దామైనం దీసివేయనొల్లరు ఇది త్రాగుమవలననో డబెఱుంగ బోవుటచేతనో, ప్రియాధిక్యతచేతనో, ఆతురముచేతనో, వారి తలవ్రాతచేతనో, యేమనవలయునో, తెలియరాదు "ఓ మహాత్ములరైన త్రాగుబోతులారా! ఒకవేళ మీరుత్రాగుటసందలి యానందమునెంత యెఱింగియున్నవారైనను, దానియందును కొంచెమయినను

శుభ్రతయు నాచారమునునుండవలదా? ఇట్టి యనవ్యాపునడపడి మీకు యుక్తముగానే తోఁచుచున్నదా? ఇది మీపురాకృత కర్మఫలముగాక మఱియేమగును. మీయిండ్లలో భార్యలుబిడ్డలు కూడు లేకతల్లడిల్లుచుండుట తలంపక సంపాదించినడబ్బును యీపాడుసారాయికిని కల్లునకును దారబోసి తప్పద్రాగి పోరలాడుచుండెడి మీయానంద మేమిపానందము " కాఫిహోటలులలో జరుగుచున్న యాచారమునుచూచి వీరును తమయంగడులలో యాపద్ధతి నవలంబించి, మాలమాదిగలు జోగిజంగములు, సెట్టినాయుఁడులు మొదలగువారి నందఱను భేదము లేకుండా "సర్వాంజగన్నాథం" అన్నట్లు యేకముఖమునకు త్రిప్పుటకు ప్రారంభించినారు. రానురాను జాతిభేదమనునదియే లేకపోవుచున్నది. పూర్వము త్రాగుబోతులకు నంజుకొనుటకు పచ్చిమిరపకాయలు, నిమ్మకాయలు మొదలయిన యూరుగాయలును పొగాకుచుట్టలు నిచ్చుచుండిరిగాని యిపుడవియన్నియు నిచ్చెడియాచారముపోయినది. సర్కారువారికొలత ప్రకారం యేర్పడియుండు కొలపాత్రములుపోయి సేరునకుమూడు పావుసేరులు పట్టుపాత్రము లేర్పడినవి. అడిగెడివారెవరు? కల్లంగడివానికియున్న పలుకుబడి మఱియెవ్వనికినిఁ గలుగదు. తాముకుమ్మరవానితో చెప్పి తమయిష్టానుసారముగా మట్టికొలతపాత్రములు చేయించుకొనెదరు. ఎవఁడైనను కొలత తక్కువయునిన తూనికవేసి తీసుకొనుమని మఱికొంతనీళ్లుచేర్చి యిచ్చెదరు. ముందువలె ముసిడికాయలు, ఉమ్మెతకాయలు, మొదలైనవానిని కొట్టితీసిన రసమును మైకమెక్కుడుగా కలిగియుండుటకై కలుపుచుండిరి. గాని దేవునిదయవలన నపుడాపద్ధతి మాని గంజిగాని,కూటినీళ్లుగాని చేర్చెదరు. ఇది కొంతవరకును పుణ్యకార్యమనియే చెప్పదగును. కల్లంగడులవాళ్లు యిపుడుపులిసిపోయిన కల్లును బాగుచేయుట కొకక్రొత్తపద్ధతిని తెలుసుకొని చేయుచున్నారు. ఏమనగా యూరపుదేశములో తయారుచేయబడివచ్చెడి 'చాక్రి'యనెడి పౌడర్ గోదుమగింజ ప్రమాణముతీసుకొని యొకపీపాయి పులిసినకల్లులోవేసినయెడల పదునైదు నిమిషములలో యాకల్లు క్రొత్తదానివలె తీపుగలదియగునఁట. ఇది యెంత విచిత్రమైనవిషయమో చూచితిరా? మనదేశములో తాఁటిచెట్లనుండియు, టెంకాయచెట్లనుండియు, ఈతచెట్లనుండియు కల్లుదింపుదురు. వీనిలో మొదటి రెండుజాతుల చెట్లకంటె

ఊత కొట్లలోనధికముగా యుత్పత్తియగును. వీనిని మిశ్రమముచేసి త్రాగినచో, వాంతులు, భేదులు, మొదలగు వ్యాధులకులోనుగాకతప్పదు. కల్లంగడుల వ్యాపారముఁ జేయుపుణ్యాత్ములకు గలిగిన మిక్కుటమైన ధనాశమూలమున దేశమున నిన్నియనర్థములు పుట్టుచున్నవి. కొందఱు అంగడివాండ్రు గుమాస్తాలమూలముగా వ్యాపారము జరిగించుట కలదు. ఈగుమాస్తాలుచేయు కుతంత్రములు చెప్పుటకు సాధ్యమే కాదు. వీరు యజమానుని యుత్తరువుప్రకారము కల్లు నిలువ లేకుండా విక్రయించవలయును. అయినను యెవరికైనా యప్పుగాపోసినపుడు దానిని లెక్కలో వ్రాయనే వ్రాయరు. చెట్లుగీచువానిజీతము, ఇంటిబాడుగ, పని చేయువారికూలి, పనివాండ్ర నెలబత్తెము, పెట్టుబడి మొత్తమువడ్డి, గుమాస్తాసంబళము, యజమానుడు తీసుకొనియున్న యప్పులకు నెల నెలకుచెల్లించవలసిన వాయిదారూకలు, మొదలయినవన్నియుంబోగా, శేషమును తెల్పి గుమాస్తా ముడుపుగట్టవలయును. ఇంక నడుమనడుమ యీగుమాస్తాలు సంపాదించులాభములో ధర్మకర్చులు, దీపము సెలవు, సిగరెట్లకర్చు. వీటికితోడు పోలీసుబంట్రోతుకట్నము, బిడ్డలకేదైనా శాను బందములు కొనుకర్చు యజమానునికి చేర్చి, యిట్టివన్నియుం బెట్టుకొనవలయును, ఏదైనా నగర్చుకుబట్టి కల్లుదింపునాటారు, భాగముపెట్టుకొనియో జీతము నేర్పాటు చేసుకొనియో, తానే యంగడి తీసికొనియో యెుక్కొక్కప్పు డంగడియజమానుఁడై వచ్చినను రావచ్చును. పూర్వము యజమానుఁడుగా యున్నవాఁడే పిమ్మట గుమాస్తాగా యగుట యుండగలదు. యజమానునకు భార్యలిరువురుండి రేని పిల్లలుముగ్గురుండుదురు గుమాస్తాకన్నానో, భార్యయొకతెయు నైదుగురు పిల్లలునుండుదు. వీరికందఱికిని సమస్తవిధములకర్చులును కల్లంగడినలన రాబడిలోనుండియే జరుగవలయును. అంగడియజమానుఁడు, మోటారో, కోచిబండియో, పెట్టుకొనిన, కూలికమ్మడి గుమాస్తా, వేలూరుజట్కా, రిక్షా, రేఖలా పెట్టుకొనియుండును. పయిని వేసుకొనునవియు, ధరించునవియు యజమానుని గుడ్డలకంటె వెలపొడుగైనవిగాయుండును. ఏవైనా పండుగపర్వములు వచ్చినపుడు కట్టుకొనునవి మఱియు శ్రేష్ఠములైనవి. పెండ్లివగైరాకార్యములు తటస్థించినకాలమున నెంతటికర్చునకుగాని వెనుదీయరు. జారీగా సెలవుఁ జేయుదురు. వారిదేమినష్టము? లోకులనావ్యా

యముఁజేసి సంపాదించినదియేకదా! అప్పులెక్కుడైనచో యిక్సాలవెక్సీ పిటిషన్ దాఖలుచేయుదురు. ఋణదాతలు వారియొద్ద సొత్తు దొరకక చెవులుజాడించుకొని పోవలసినదియే! ఏమిచేయుదురు? ఒకకాసైనను నుండదు. ఉన్నసొత్తులను ముందుచుండగానే విక్రయించి పిటిషన్ దాఖలుచేయుటకుపూర్వము డబ్బుమూటగట్టి దాచుకొనిపోయిగా కూర్చుండుదురు నాలుగైదు నెలలు జరిగినతరువాత తాముదాచుకొన్న డబ్బునుపెట్టి బావమరిదిపేరుననో, మామగారుపేరుననో, యల్లునిపేరుననో, మరలయంగడిప్రారంభింపుదురు. "మూకనాళ్లునవాబుసాహేబు ఆఖరునాళ్లుఫకీరుసాహేబు" అనుసామెత వీరియందుస్పష్టమగుచుండును. వీరి దుండగముల నట్టిమూచి యోజించి సర్కారువారు వీరికికలిగియున్న యంగడుల సంపూర్ణహక్కునుతొలంగించి తగినకట్టుబాటులతో అబ్కారిసిస్టం యేర్పాటుచేసినారు. అంతటితో వీరు ముసుకువేసుకొన్నారు. తదాదిగా,వీరు వేరువిధముగా బాధ్యతను సంపాదించినారు కొంత బుద్ధినరుకనియు,కొంతత్రాగుడు నరుకనియు,వీరు పెట్టుకొని, వాడుకదారులకును కొనితీసుకొనిపోయి యింటత్రాగువారికిని వారివారికి తగినట్టు నరకునమ్ముటకును, ప్రతిదినమునుం ద్రాగవచ్చువారికి తామేకొలిచి పోయుటకును వీరికి హక్కుగలిగియుండును. ఈకల్లంగడులవారు కొందఱికి బహుమానముచేయు వాడుకకలదు. దినముతప్పక త్రాగుటకు తమయంగడికేవచ్చుట, తనవెంటపానమునకు మఱికొందఱిని పిలుచుకొనివచ్చుట, ఇతరులకప్పుగా తీసియిచ్చి యావిక్రయమును తానుచెల్లించుట, ఇట్టిపనులుచేయుచుండెడివారికి యేడాదికొకసారి కనముపండగ నాఁడు క్రయము తీసుకొనక తృప్తిగాకల్లుబోసి, యొకకోడియు, నాలుగురూపాయలువెలచేయు పంచెయునిచ్చిమర్యాదచేయుదురు. ఆవాడుక వర్తమానకాలమున క్రమముగా తగ్గిపోవుచున్నది. ముందుత్రాగవచ్చువారి జాతులననుసరించి పాత్రములు వేఱువేఱుగా యుంచుచుండిరిగాని, యిపుడు నాగరికతయు నాణెమును హెచ్చుచేయుదియునుంబోయి, యంతయునొకటియేయైనది. ఇటుల సకలజాతులవారికి నైకత్యముచే కూర్చుచున్న వీరి నెంతపొగడినను పొగడఁదగును. అబ్కారిసిస్టంయేర్పడి తమవంశానుగతబాధ్యత తొలఁగుటవలనను, సర్కారువారికి ప్రతిమాసమును, వేలసంఖ్య పన్ను గట్టవలసియుండుటవలనను,

చెట్లను ముద్రవేయుటకు యెక్కుడుడబ్బు కర్చుపెట్టవలసి నష్టేర్పడుట వలననుకాంబోలు యీకల్లంగళ్ల సత్పురుషులు పూర్వము రెండణాల కమ్ముచున్న సేరుకల్లు యిప్పుడయిదణాలు, నాలణాలుచేసి, చిన్నవియుం పెద్దవియునుగా క్రయమునకు తగిన కొలపాత్రములఁ బెట్టుకొన్నారు. ముందు యేబది యఱువదియంగడులున్న జిల్లాలో యిపుడునూఱునూట యేబదియంగళ్లేర్పడినవి. త్రాగుబోతుల సంఖ్యయిప్పటికప్పటికి నెక్కుడగుచుండుటచే, నీరుకొలత తగ్గించుటయు వెలపొడిగించుటయు సంభవించినది. భగవంతుఁడా! ఈయంగడిదారుల యధికాశయు, త్రాగుబోతులకష్టమును తీరుటయెపుడో తెలిసినదికాదు. మత్తుపదార్థములైన కల్లు, సారాయము, గంజాయి, అభిని, యిట్టివి వాడు వాడుకనువిడిచి, మన దేశవాసులు పొరుగుదేశములలోనివారివలె నెన్నఁడువర్తింపుదురో యానాఁడుగాని భరతఖండమునకు మేలుగలుగనేరదు దేశక్షేమమును గోరి పాటుపడుచున్న పుణ్యాత్ములు పూర్వమునకంటె నెక్కుడు శ్రద్ధ వహించి సారాయి, కల్లుదుకాణములు బొత్తుగాలేకుండునట్లుచేసి, సర్కారువారికి యిందుమూలముగా వచ్చుచున్నలాభమును యితరవస్తువుల వ్యాపారమూలముగా పొందఁదగిన మార్గమును చూపినయెడల, ప్రజాక్షేమమును గోరుచుండు దయామయులైన గవర్నమెంటువారంగీకరింపకపోఁజాలరు. అటులచేసినచో యిచటనుండి మత్తుపదార్థములమూలముగా యితరదేశములకు కోట్లకొలదిపోవుచున్నధనము మనదేశముననే మారుచుండును. ఈయనర్థమైన పారంపర్యమా క్కు పోయినదనెడి వ్యసనమునువీడి కల్లంగడుల వ్యాపారముచేయు వారి సంతతివారును, వేఱొక తగినవృత్తి నవలంబించి గౌరవముతో సౌఖ్యమనుభవింపగలరు.

"ఓ దేశీయులారా! కల్లు, సారాయివలన మీకుకలుగుచున్న మహోపద్రవము నాలోచించి యాదుర్వాడుకను విడిచిపెట్టుఁడు. ఇందుచే యెన్నోకష్టనష్టములుకలుగుచున్నను కొంచెమైనజంకక మీరుత్రాగుబోతులగుచుండుట కాలమహిమయో, మద్యదేవతామాయమోహప్రభావమో తోఁచకున్నది. మహాపాపములలో నీత్రాగుబోతుతనమువలనగల్గెడి పాతకమెక్కుడైనదని తలంపుఁడు. ఓయంగడిధర్మకర్తలారా! ఇదిహీనవృత్తియని యెఱింగియునెఱుంగనట్లు ధనాశచే

యీ వ్యాపారముఁ జేయుటమాని వేఱొకవృత్తి నవలంబించితిరేని మీరు దేశమున కెంతయో మేలుచేసినవారలగుదురు. త్రాగుబోతులారా! కలిగిన యిల్లువాకిలినమ్ముకొని గతిలేక యల్లాడుచుండెడి వారినిచూచియు మీకుబుద్ధి లేదా? ఎందఱుబిచ్చగాండ్రైనారు? మీయాలుబిడ్డలు శపించుశాపఫల మెవరికి చెందును! ఆలోచించి దుర్నడతయు, దుర్వ్యాపారకయువిడిచి మీసంతతివారిని మేలొందఁజేయుఁడు. అపుడుగాని మీరుయోగ్యులరనెడి గౌరవమును పొందఁజాలరు.

ఆ. సకలదోషములకు సాధనమైహీన
దశయుఁ గష్టములును దనరఁజేసి,
యపయశంబుఁగూర్చు నట్టిసురాపాన
వృత్తిచేటుఁదెచ్చు విడువరేని

---

## బొల్లిభాగవతుల మోసము.

బొల్లియనఁగాటక్కు, కొందఱు రామానుజమతమునవలంబించి యున్నవారివలె కపటవేషములతో నటించి వైష్ణవమతప్రియులైన జనులమోసగించి పొట్టబోసుకొనుచుండుదురు. వీరి నడవడి వింతగా యుండును. ఈ మతావలంబులు తామొకరికంటె నొకరు, భక్తిపరులవలె నటించుచుండెదరు. ఒకని తత్త్వమును మఱియొకఁడు కనుగొనఁజాలఁడు. వారిలో వారేయొకరినొకరు రేమరించుచుండెదరు. ఈమహానుభావులు, కావలసిన మట్టుకును, మత్స్యమాంసములతో వేళకు సంతుష్టిగా భోజనముచేసి, వెలుపటికి వచ్చినపుడుమాత్రము కట్టుకొనుటకు (ఇంటిలో నున్నపుడు చింపినగుడ్డయే)గా పెట్టుకొనియుండు పట్టంచు ధోవతిని పట్కచ్చలతో ధరించి, తిరునాళ్లదినములలో యాళ్వారుల గుడిగోడకు తీర్చిన నామములవలె యొకనామము కోపునంతయుంగలిపి ముఖముననుఁ, దేహమునను పెద్దపెద్దనామములుదిద్ది నడుమపసుపుపచ్చనామముఁ బెట్టుకొని భుజములపై నొకశాలువ వేసుకొని కడుడంబముగా బయలువెడలుదురు. అపుడు చూచినవారికి విష్ణుమూర్తిసాక్షాత్కరించెనో యని సందేహము కలుగునట్లుండును. అటులవచ్చుసమయ

మున తమ కూటమునకు చేరినవాఁ డెవఁడైనం గనఁబడినయెడల, యట్టి కౌఁగిలింపుకొని పాదములపైఁబడి "ఆళ్వారునంబి, అడియేన్ దాసాన దాసన్" అనిపలుకును మొదటివాఁడు "రంగనాథన్, అడియేన్‌దాసానదాసన్" అని బదులు నమస్కారించును.

అళ్వారు:—పావనమాన పాదధూళి భాగ్యత్తైందేన్‌ధన్యనానేన్.

రంగ:—ఇదో! నంబ భవనం హేళుంగల్ హేళుంగళ్.

అళ్వారు:—మహాభాగ్యం ఇన్ఱైక్కు. శుభదివసం.

రంగ:—స్వామిఘళ్ యిందయానత్తిల్ హేళుంగళ్.

అని బహుమర్యాదతో తనయింటికి తోడ్కొనిపోయి కూర్చుండబెట్టును. అంతట వారిరువురు కుశలప్రశ్నమైనంతట ఇట్లుసంభాషింపుదురు.

అళ్వారు:—స్వామిఘళ్ శ్రీరంగత్తిరుక్కుచేన్ఱిరుందదాఘు కేళ్వి రంగనాథన్ సేవైకిడైత్తదన్ఱో, ఇంద యడియేన్ మహాపాపి, అవ్వళవు భాగ్యత్తుక్కు కొడుత్తువైక్కవిల్లై ఆయిలుందానం కొక్కరికురవైయుం యిల్లై. ఎన్న ఉంగళై సేవిప్పదేపోదుం.

అనిఅందరోం బెరుమానై సేవిత్తపడియే యాఘుం దాసనికింద భాగ్యం కిడైత్తదే సంతోషం. నాళైక్కి నాంచారుక్కు తిరుముడి కల్యాణం నడక్కపోగురుదు. స్వామిగళ్ యెయ్‌న్దరుళవేణ్డుం, ఇదుదాన్ దాసన్ ప్రార్థనై.

రంగ:—సరిసరి! నమ్మై యివ్వళవు ప్రార్థిక్కవేండియ యవశ్యమిల్లై. ఉంగళ్ యిష్టం పోలవే నడంతుకొళ్ళురేన్ ఆగట్టుం. నాంచారుకల్యాణత్తిల్ యేదావదు విశేషం ఉండో?

అళ్వారు:—ఇల్లావయెన్న; తంగళుక్కు సర్వముం తెరిందే యిరుక్కరదు నాళైక్కుం విశేషన్‌దాన్ తాంగళ్ నాళైక్కుం—

రంగ:—మహాభాగ్యం. వరిఘిరేన్ తదియారాధనై విశేషముండో?

అళ్వారు:—యథేష్టమాఉండు. వడై, దోసై, దధ్యోధనం, పులిహోరై, ఎల్లాం.

రంగ:—ఏదావదు కాలక్షేపం నడక్కరదు ముండా?

అళ్వారు:—ఆహా! వరదరాజ భాగవతర్ కాలక్షేపం. శ్రావ్యమాయిరుక్కుం.

రంగ:—సరి! ఆగట్టుం. అప్పడియే వరిషిరేన్.
అళవారు:—అడియేన్ నమస్కారం.
రంగ:—దాసన్ నమస్కారం.

అని యొకరితో నొకరు మాటలాడుకొని తమకుతృప్తిగా ప్రసాదములు దొరకుచోటు విచారించి తెలుసుకొని యీదొంగలైన వైష్ణవ మతావలంబకులు వేళకుసరిగా యాస్థలమునకు బోయిచేరి మహాభక్తులవలె విష్ణునామ సంకీర్తనమును భజనయుం జేయుదురు. అంతమాత్రమేకాదు. బృందావన విహారమని యొకయాట నాడుదురు. ఎట్లనగా వీరిలో కొందఱు గోపికల వేషములును, కొందఱు గోవుల వేషములును దాల్తురు. కొంచెము చాతుర్యముగలవాఁ డొకఁడు కృష్ణవేషముధరించును. ఇంక జెప్పవలసినదియే లేదు. వీరికుతూహలమును, కోలాహలమును హాలాహలముపుట్టినప్పటి సముద్రసంక్షోభమువలె యుండునన వచ్చును. యమునాతీరవిహారము, జలక్రీడలు, విరహవేదనాదోధూయమాన హృదయులై వ్రజాంగనలు కృష్ణునివెదకుట, కనుఁగొనుట మొదలగులీలలు ప్రదర్శించి రాసక్రీడకు ప్రారంభించికుప్పిగంతులువేయుచు; ఎగిరియెగిరి యాడియాడి కోలాటము వేయుచు పాటలుపాడుదురు. కొంతతడ [illegible]బులనాడిపాడి డైయెనంతట వారిలో కొంచెము పెత్తనము పేరుంగలవారు తెరకులోపలను, మిగత యుండువారు వెలుపలనుం గూర్చుండి, యాకంఠపూర్ణముగా ప్రసాదములుతిని, ఆయాసముమించి పొరలాడుచుండుదురు, 'రామాయణములో పిడకల వేట్లాట" యన్నట్లు, వీరిలో వీరికి సద్గోష్ఠి వేడుక పోట్లాటకలుగును. అది మొదట వేడుక యాటగాయుండి, క్రమముగా ముదిరి నిజమైన పోట్లాటగామారి కావలసినంతవరకును, చేసరములు జరుగును. ఈస్వాములు పగలంతయు ధర్మోపన్యాసములుచేయుచు, పాశురములు చదివి ప్రసంగించుచు, గడపి, చీకటిపడగానే మెడసన్నము గోవిందరాజు (సారాయిసీసా)ను సేవించి యేజాడ్యాలిదాని ప్రక్కనో పడియుండి యానందింపుదురు వీరిలో వైష్ణవము ముదిరిన కొందఱు భాగవతులు సదాశివదూషణయు శైవమత నిరాసమునుం జేయుచు, "పెత్తనమొసఁగిన వారెవ్వరనిన, మూలనుండగానే నేతెచ్చి తలపై వేసికొంటి"నినచందముగా దారినిపోవు వారితో లేనిపోని ప్రసంగములు పెట్టుకొనికలహములుపెంచి తలమీఁ

టికిఁ దెచ్చుకొనుచుండుదురు, వీరవైష్ణవులని పేరొందుటకుఁగాఁబోలు శైవులను పరిహాసించి జగడమును వెలయిచ్చికొన్నట్లు తెచ్చిపెట్టుకొందురు. ఈ వైష్ణవసాంప్రదాయమున, వడగల్ అనియు, తెంగల్ అనియు రెండువిధములవారుగలరు. ఎప్పుడును యీరెండుతెగలవారును నేదోయొకవిషయమునకలహించుచునేయుండెదరుగానియూరకుండువారుగారు. మేమేవిష్ణువునుండి యుట్టిపడినవారమని యొకగును, విష్ణుయూర్తియే మాసొమ్మని మఱియొకరును వాద ప్రతివాదములు జరిపి తుదకు జుట్టువందెముగా పరిణమించి కాళ్లుచేతులునువిఱుగఁగొట్టుకొని యల్లాడుదురు. పట్టసాదము, పుళిహోర, పొంగలి, మొదలగునవి మాకెక్కుడుగా రావలయుననియు మాకుముందుగా యివ్వవలయుననియు పోట్లాడుదురు. చిక్కఁగాచాది గొప్పగా నామములు వేసుకొనినచో యెక్కుడుగా ప్రసాదము లభించునని కాబోలు. యీమహోత్స్ములు చిఱుతానూరి యుత్సవములో యేనుగులకువేసిన లాగుల బారెడేసి నామములుదీర్చి ప్రసాదసమయమునకు హాజరరుగుదురు. మేము శ్రీవైష్ణవులమనియు, శ్రేష్ఠులమనియు డంబముగా యాత్మస్తుతిఁ జేసుకొనెడివారు. తమ లోపములను తామెఱుంగజాలక యితరులను, యితరమతములను దూషించుచుందురు. "ఓవైష్ణవ స్వాములారా! నిజముగా మీరు విష్ణుభక్తులై యీసాంప్రదాయధర్మరహస్యము లెఱింగినవారైయున్నయెడల హరకేశవులకభేదమునుటగుర్తెఱిఁగి యన్యమత దూషణము మానియుండిన మీరును గౌరవింపఁబడుదురు.

గీ. పింజధోవతులనుగట్టి పెద్దపెద్ద
నామములుదీర్చి శివదూష ణంబుఁజేసి
వీరవైష్ణవులమటంచు విఱ్ఱవీగు.
వారి దుశ్శీలమెన్నగా వశముగాదు.

# పెండ్లికిగాను తరగరిలుచేయు మోసము.

చెన్నపురి రాజధానియందు రాసురాసుర శుల్కములనిచ్చువివాహములును, వృద్ధప్రసుషవివాహములును, ఇతరమతములతోడ సంబంధముగల వివాహములు, ఇచ్ఛావివాహములును మెుక్కుడైనవి. ఈకడపటిపద్ధతి యొకవేళ యుక్తమైనదిగా యుండునేమో కాని, తక్కినవన్నియు కేవల మన్యాయపుపద్ధతులని దృఢముగా చెప్పవచ్చును. వీనిలో నొక్కొకదానియందొక్కొక గొప్పవిపత్తు కలుగుటకు కారణములున్నవి. ఇట్టిదుర్వివాహములు జరుగుటకును, జరిగించుటకును, తల్లిదండ్రులుమాత్రమేకాక వీనిని కుదుర్చుతరగరులు సయితము కారణమగుచున్నారు. ఈవృత్తిచే సంపాదించి జీవనముచేయు మహానుభావులు కొందఱుకలరు. వీరికి తాముచేయించు వివాహమున దంపతులకు కలుగబోవు హానివృద్ధులను గురించినవిచారము లేశముగాని యుండదు. పెండ్లికుమారుని వంకనో, లేక పెండ్లికుమార్తె వారివంకనో, లేక రెండువంకలను సయితమో తమకువచ్చెడి కమీషను లాభమును చూచుకొనుటయే వీరికి ముఖ్యము. పిమ్మట యావధూవరులు శపించు దూషణలకును, పాపమునకు తాము బాధ్యులగుట నించుకయుం దలంపరు. ఇటువంటివారికిగా తన లోకమున యమధర్మరాజు వేఱుగా నొకనరకమును సిద్ధముచేసి యుండునుకాంబోలు. ఈపాపమటువంటి నరకప్రాప్తిం గలిగించి వీరి నలంచక యూరకపోవునా?

వీరు చేయునదెట్లనగా—తాము నివసించుచున్న యూరియందును సాధారణముగా చుట్టుపట్ల చాలవరకును వీరు పరిచయముగలవారై తిరుగుచుందురు. కావున వీరినందఱు నెఱింగినవారుగా నేయుందురు. వీరు దడబుడలుగా వేషముధరించి తిరుగుచుండుట చూచినపుడు లక్షాధిపతివలె కనుపట్టుదురు. బహు చాతుర్యముగా సమయానుకూలముగా ప్రసంగింపుదురు. ఇట్టివారికొక తనగ్రామముననో, పొరుగూరునందో, యేయింటగాని కొంచె మించుమించుగా వివాహము చేయదగిన వయస్సుగల బాలిక యున్నయెడల, యేమోపనిగలిగి యాయూరికి వచ్చిపోవుచున్నట్లును, చూచిపోవుటకై గుర్తెఱింగియున్న కతమున నచ్చటికి వచ్చినట్లును తోఁచులాగున నటింపుచు యచటికిపోయి యింటియజమానుఁడు చెప్పుటకుపూర్వమే సర్వస్వాతంత్ర్యములుం గలవానివలె వారియింటిలో కుర్చీమీఁదనో, బెంచీమీఁదనో, లేక మంచముమీఁదనో కూర్చుండి క్షేమలాభములను విచారించును. కుశల

ప్రశ్నానంతరం లోకాభిరామాయణమును ప్రసంగించుచు, "వారటుల చేసినారు, వీరిటుల చేసినారు, నేనట్లు చేసితి నిట్లు చేసితి"నని యేవేవియో యడుగనివియు, ననావశ్యకములైనవియు నైన విషయములను గూర్చి మాటలాడుచు మెల్లగా తన ప్రసంగమును వివాహవిషయముల లోనికిఁదెచ్చి యాయింటి యజమానునిఁజూచి "ఏమండీ! ఊరకున్నారు? మీబిడ్డకు వివాహప్రయత్నము చేయుదలంచలేదా? యుక్తవయస్సుగా నేయున్నదే! నవనాగరికులవలె మీరును రజస్వలావివాహమును చేయబోయెదరా? మీపుణ్యము. ఇంకనుకొన్నినాళ్లు మనపూర్వాచారమును విడువకండి! వారు చేయునది కేవలము మొట్టాళ్ పని. కాదందురా? మనపూర్వికుల యేర్పాటులే సరియైనవి. ఇపుడు చేయబడుచున్నవివాహములు కేవలము ధర్మవిరుద్ధములైనవి. మీరటుల చేయుటకు యత్నించబోయెదరుసుమా! మహాపాతకము త్వరితముగా, యేదో యుక్తమైన చోటుగాచూచి, యన్నవస్త్రములకుగల సత్కుటుంబజాతుఁడైన యొకపిన్నవానికొనంగుడు. శాస్త్రవిధి ననుసరించి కన్యాదానము చేయుఁడు. అదిమహాపరసాధకమైనపుణ్యకార్యము. ఇంకమీరు కాలయాపనము చేయుట బాగుగానుండదు. ఇదిమంచిసమయము యత్నము చేయుండి"యని కడునిపుణతతో మాటలాడును. అదివిని,

యజమానుఁడు—ఔను! సరే! నిజమే! ఏమిచేయమంటారండి ఈయాడుపిల్లలుకలిగితే వీరికి పెండ్లి చేయుడం యీనాదినాలలో చాలాకష్టముగా యేర్పడినది. కాలమహిమ యిట్లైనది. నేనున్నూయీవిషయమునుగూర్చి యోజించుచునేయున్నాను. ఎక్కడ విచారించినను తగినచోటుగా కనుపడలేదు. ఒకవేళ నెచ్చటనైననునొక పిల్లవాఁడు తగినవాఁడుగా యుండినయెడల వానికి పైపైఁబడి వేయిమంది తమకన్యలనిచ్చెదమనియు, నాలుగువేలు, నైదువేలు వరకట్నం సమర్పించి నడుచుమర్యాదలు సరిగా జరిగిస్తామనియు, పెండ్లికయ్యేకర్చులు మేమే పెట్టుకొంటా మనియుం జెప్పెదరు. ఇంక వారు మనబిడ్డను తీసుకొనుటకు సమ్మతింతురా? మనము సామాన్యులము. అంతగొప్పకట్నములనిచ్చుటకు మనకు శక్తిలేదుకదా! ఇదే గొప్పసంకటము. ఇంక త్వరలో చేయుదమనఁగా యెట్లు?

తరగరి:—ఏమండీ! ఇట్లు చెప్పెదరు? లోకము గొడ్డుపడినదని తలంచినారా? మీరు కొంచెము ప్రయాసపడి నాలుగుచోట్లకుపోయి విచారించినయెడల యెచ్చటనో యొకచోట కుదురును. ఎందరో బుద్ధిమంతులైన చిన్నవాండ్రున్నారు. దొరకక పోవుటకేమిట్టిది? ఇంట కూర్చుండి యెక్కడను మనువు దొరకలేదనుచుండిన యీదినముల వారుగావచ్చి యడుగుదురనుట యున్నదా? శ్రద్ధ పుచ్చుకొంటిరేని కార్యము కాగలదు. ఏదీ? ప్రయత్నింపుడు? ఏలకాదో చూతము.

యజమానుఁడు—అందులకు మీ యిటుల చెప్పెడివారేగాని యొకరును సహాయముఁజేయరు. నేను యత్నింపకున్నానని మీయభిప్రాయము కాఁబోలు. నావలననైనంతవరకును విచారించుచునే యున్నాను. అనుకూలపడకున్నది. మీరు పదిచోటులఁ దిరిగే వారును, పదుగురిమంచిచెడుగులు నెఱింగినవారుగదా! ఎచ్చటనైన నొకమంచి సంబంధమును కుదుర్చుఁడు. మీకు పుణ్యముంటుంది. ఈవిషయములో కొంచెం శ్రద్ధపుచ్చుకొని ప్రయాసపడి యీశుభకార్యమును నెరవేర్చుఁడి. మీప్రయాసము వృథగాదులెండు. నేనుదానికితగినట్టుమీకు బహుమా—

తరగరి:—దానికేమిలెండి! మీరు యివ్వగనెడి తలంపుతో యోచించుచున్నానని మీయభిప్రాయము కాఁబోలు. కార్యము కావలయునుగాని కష్టమునకు తగినట్లు సమ్మానముఁ జేయుదురనుటనే నెఱుంగుదును.

యజమానుఁడు—సరేగదా! ప్రయత్నము చేయండి! వంశమునుమంచిదిగా యుండవలెను. అల్లుఁడుగాఁబోవు చిన్నవాఁడు కొంచెమువిద్యగలవాఁడుగా యుండవలయును. ఇంకొకమాట; వరదక్షిణ విషయంలో.

తరగరి:—ఆవిషయమంతయు మీరు చెప్పవలసినదిలేదు. నాసామర్థ్యమంతయు వినియోగించెదను. సరే! కానిండు. తగినచోటువిచారించి తెలుసుకొని శీఘ్రముగా వివాహం జరిగే యుపాయం చూచెదను. నేను మరలవచ్చి మీతో మాటలాడు వరకును, తొందరపడి మీరు యెచ్చటను యీవిషయమునుగూర్చిప్రస్తా

తరగరి:—అన్ని విషయములు బాగా విచారించి తెలుసుకొనకయున్నా
నని మీయభిప్రాయమా? నేనన్నియు నెఱుంగుదును. ఎన్నోగొ
ప్పగొప్ప సంబంధములువచ్చినవి. ఇపుడునువచ్చుచున్నవి. నా
రాయణమూర్తిగారు ఏదైనా గొప్పసంబంధము చేయవలయు
నని యపేక్షగలిగియున్నారు. కాని, వారిభార్యసమ్మతించకున్నది.
ఏలననగా నవనీతముచాలావివేకి, వరదక్షిణకై తానితరుల కమ్ము
డుబోవుట యతనికిష్టములేదు. సుగుణవతిగాయుండుకన్యను పెం
డ్లాడుటవలన సుఖముగలదని యతనితలంపు తన యభిప్రాయ
మును తల్లికి దృఢముగా తెలియజేసినాడు. ఆమెకు కుమా
రుని మతమునకువిరోధముగా చేయుటకు యిష్టములేదు. ఏకపు
త్రుండగుటచే నతనిపై ప్రియమామెకు కుమారునిమిక్కుటము.
మాటయునామెమాటయు నొక్కటియే! అందువలన మూర్తి
గారి బాణముపాఱలేదు.

యజమానుడు:—భార్యాపుత్త్రుల యిష్టానుసారముగా నారాయణ
మూర్తిగారు చేయగలరని మీకు దృఢమైన నమ్మకమున్నదా?

తరగరి:—ఆహా, లేకేమి? కుమారునిపెండ్లి విషయములో యతనిపె
త్తన మేమియును లేదు. భార్యయిష్టము కొడుకుయిష్టము ఆయన
జోక్యము కలిగించుకొనుటకు మానుకొన్నాడు ఇదిదృఢమే!

యజమానుడు:—ఆమెసమ్మతించినదా? పెండ్లిచేసుకొనెడివాడొప్పు
కొనవలయునుగదా! ఇదిమొదటిమాట అతఁడేమనునో;

తరగరి:—మీయదృష్టమండీ! ఆచిక్కును తీఱిపోయినది. కాలమును
కూలించినపుడన్నియు సరిగానే కూడివచ్చును. నేను పోయినపు
డు వారికుమారుఁడు కూడా చూపో శలవులని వచ్చియుండినా
డు. నేను అతనియభిప్రాయము సయితము గట్టిగాతెలుసుకొం
టిని మీతోసంబంధము చేయడము వారికి మిక్కిలిసంతుష్టిగా
యున్నది. ఇందు మఱియొకచిత్రము విన్నారా?

యజమానుడు:—ఏమివిశేషము విరుద్ధమేమియు గాదుగదా!

తరగరి:—విరుద్ధమా? అదేమిటండి? అటువంటివేవియును లేవు. ఇంక
చిత్రమేది? యనగా, ఈవిషయంలో నారాయణమూర్తిగారుసైత
ము సమ్మతించినారు. మీవంశముచాలామంచిదనియు, పరంపరగా

సౌభాగ్యమైన కుటుంబమనియు, బహుశః శ్లాఘించినారు. నేను ప్రత్యేకముగా వారియభిప్రాయము తెలుసుకొనవలయునని మాట్లాడినాను. తనకుకూడా యీసంబంధము చేయుడము సమ్మతమే యున్నారుగాని—అయితే—

యజమానుఁడు:—ఇందులో 'అయితే' పెట్టినారే! అది దేనికొఱకు? మఱియేమైయునను చెప్పినారా? ఏమన్నారు?

తరగరి:—అనడమేమియుగాదు. గాని ఈకాలములో కేవలము వరదక్షిణ లేకుండా పెండ్లిచేసుకొనుట నలుగురిలో వెలితిగా యుంటుందని తమయభిప్రాయమును సూచించినారు. ఆమాటయే చెప్పవలదని నేను చాలాదూరము వాదించినాను. పదిమంది బంధువులను, "మూడు, నాలుగు వేలు వరదక్షిణయిచ్చి నడుచు మర్యాదలన్నియు తామేభరించుకొని కన్యకనిచ్చి పెండ్లిచేసెదమని వచ్చిన సంబంధములన్నియు విడిచి, తుదకేమియును లేకనే యొచ్చటనోపోయి పెండ్లిజరిగించినాఁడు. ఇతనికి నాగరికతయు, మరియాదయుం గొంచెమైనం దెలియదు. వట్టిమూఁఢు" డనినిందించెదరనిసందేహించుచున్నాఁడు. ఇదియొకటే కష్టము.

యజమానుఁడు:—మీరేమిచెప్పినారు? ఆయనకోరునదెంత?

తరగరి:—ఏమియు నివ్వఁజాలమనియే నావాదము. నేనుమీతో మాట్లాడక త్వరపడి యేమైనా చెప్పివచ్చియుండు ననుకొంటిరా? వేయిన్నీ యైదువందలడిగినాఁడు. ఈమాట కుమారుఁడుకూడా విన్నాఁడు. అడ్డము చెప్పలేక మొగము ముడుచుకొని కూర్చున్నాఁడు. అతనికిష్టములేదు. అయినను తండ్రిగదా?

యజమానుఁడు:—సరే! తీర్మానమేమి? నీయిష్టమెట్లున్నది?

తరగరి:—అన్నియు ననుకూలమే కాని, ఇదినడుమ నొకటివచ్చి యడ్డుపడినది. మంచిసంబంధమనియు, చిన్నవాఁడు బుద్ధిమంతుఁడనియు విడవకూడదనియు, నావలననైనంతవరకుం జెప్పిచూచినాను, వరదక్షిణ లేకుంటే తనకవమానము కలుగునఁట. నలుగురును పరిహాసింతురఁట.

యజమానుఁడు:—ఔను కాలమిట్లున్నది. ఏమియు నివ్వకుండిన యెందఱో వేలసంఖ్యగా యిచ్చెదమని వచ్చుచుండగా యావియన్ని

యువిడిచి మనబిడ్డనుతీసుకొనుట కొప్పుకొందురా? వరుఁడుగా బోవువతనికెంత యిష్టములేకున్నను తండ్రిమాట విరాకరించుట౯ష్టమే! ఇంక నేమియుపాయము?

తరగరి:—ఏదేనండీ! వచ్చినగొడవ పెండ్లాడువాని మాటయే నైన యెడల యెట్లైనఁదంటాలుపడవచ్చును కన్యకవిషయంలోకుమారుని యిష్టమైనను, దక్షిణవిషయంలోతండ్రిపట్టుపట్టియున్నాడు.

యాజమానుడు:—దీనికేమి చేయుదమో నీవే చెప్పుము.

తరగరి:—చెప్పడమేమిటి? ఏదోయొకవిధముగా యివ్వక తీరదు. ఏమైననగునుగాని యీసంబంధము విడువకూడదు. ఇటువంటిమంచి వరుడింక మీకు దొరుకుట దుర్లభము. ఎట్లో బిడ్డచేసుకొనిన పుణ్యమువలన తటస్థించినది.

యజమానుఁడు:—సరే! ఏమి యివ్వమనెదరో చెప్పండి, నాశక్తిమీకు చెప్పియున్నానుగదా! ఎక్కువగా తూగవలెననినసాధ్యము కాదు.

తరగరి:—అదియంతయు నే నెఱుంగుదునండీ! కావుననే యోజనచేయుచున్నాను. నాయభిప్రాయ మేమనగా వారడిగినదానిలో సగమైనా—

యజమానుఁడు:—అబ్బా! సగమా? ఏడువందలా యాబైగదా? అంత పెద్దమొత్తము నిచ్చుటయెట్లు? నేను. అయిదువందలయినయెడల నేదో యొకవిధముగా తంటాలుపడుతాను. అధికమివ్వఁజాలను.

తరగరి:—కాదండీ! మీకు తెలియదు. సగమైనా యివ్వకున్న వారు సమ్మతింపరు. ఏదైనా భూమియో, సొమ్మో యడమించియైనా యిచ్చి యీపని జరిగించవలయును. దీనికికూడా నేను చాలకష్టపడవలసియున్నది. వారిని సమ్మతింపచేయవలయునుగదా! ఏమియు యోజింపక యొప్పుకొనండి. ఇపుడు కష్టముగా తోఁచినను, ఇందువలనగలుగుసుఖము పిమ్మట తెలియును.

యజమానుఁడు:—సరే! దేవుఁడున్నాఁడు చూతము. సగముకెక్కుడైన నేనివ్వజాలను. ఆలాగేచెప్పి తీర్మానించుకొని రండు. ముహూర్తముకూడినంత శీఘ్రములో యేర్పాటు చేయించండి. ఆలస్యముచేయకూడదు.

తరగరి:—ఔనండీ! నాయభిప్రాయమున్నూ యిదియే! తటాలున జరిగించవలయును. కాలము జరిగితే యభిప్రాయము లెట్లుండునో, మనవలెనే యెందఱు వచ్చెదరో, యెట్లుమాఱునో వారములోపలకావలెను.

యజమానుఁడు:—మీకు తెలియునిది లేదు. సర్వమును మీయిష్టమే!

తరగరి:—మంచిదికాని యొక చిన్నమాట.

యజమానుఁడు:—చెప్పండి. రహస్యమా?

తరగరి:—రహస్యమే! నూఱురూపాయలు కావలయును. నేనొకపెద్దమనిషికి నేఁడు సాయంత్రమునకు యిచ్చునట్లు వాయిదా చెప్పినాను. నాకురావలసినచోటకిపోయి తెచ్చియిచ్చుటకు వీలులేక నేనీ కార్యము నెట్లైనను సాధించవలయుననెడి పట్టుదలతో ఈపనికిగాతిరుగుచున్నాను. ఇదియు ననుకూలించినదిగదా! మాటతప్పుట నాకు చాలాకష్టము. రేపు మీరు యివ్వబోయెడి వరదక్షిణ మొత్తంలోకి జమపెట్టుమన్నాను. భయపడవలసినది లేదు. దొరుకునా? నూఱురూపాయలు చాలును.

యజమానుఁడు:—నూఱురూపాయలు మాత్రమే నాయొద్ద నిప్పుడున్నవి, ఇచ్చెదను పుచ్చుకొనుఁడు. ఈరూపాయలు వరదక్షిణ మొత్తములో చేర్చుటకు మీరివ్వ నక్కఱలేదు. ఇవి మీరుపడినకష్టమునకుగా—

తరగ:—ఆమాట యిపుడేలనండీ! చూచుకొందము పిమ్మట. యత్నించిన కార్యమును ముందుజరుగనిండు. అదిగదా ముఖ్యము.

యజమానుఁడు:—మీరు యత్నించినపని కాకపోదని నే నెఱుంగుదును. కాని ఈరూపాయలు మీరు పెట్టుకొనుఁడు. ఇంతేయని తలపవలదు. పెండ్లియైనంతట నాశక్త్యనుసారముగా—

తరగరి:—అబ్బే! అదేమి మాటండీ! మీస్వభావము నేనెఱుంగనివాఁడనా? సరే! మీయిష్టప్రకారమే కానిండు. నేనుపోయి నిశ్చయము చేసుకొని వచ్చెద!

ఇట్లుచెప్పి యాతరగరి మోసగాఁడు నూఱు రూపాయలుం దీసుకొనిపోయి పెండ్లి చేసుకొనెడి చిన్నవానితల్లిదండ్రులతో మాటలాడి, వారిని సిద్ధపఱచి, యెవనికో నాలుగణాలుయిచ్చి యేదోయొకముహూ

ర్తము నేర్పాటుచేసి పత్రిక వ్రాయించి పట్టుకొని మఱి మైదానుదిన ములకు మరలవచ్చును. కన్యతండ్రి మరియాదచేసి కూర్చుండ బెట్టినంతట శుభపత్రిక నొసంగును. తత్పూర్వమే యతఁడు పెండ్లిపనులుచేయించు చుండను. చెప్పవలసిన మాటలన్నియుం జెప్పి "పెండ్లివారు యొక్క డాడంబర మేమియు లేక, సామాన్యముగానే రాఁగలరు. వారిపద్ధతి యంతయు చాలచుట్టముగా యుండును. మీరును నెక్కుడుడంబ ముగా నేమియుం జేయవలదు. వారికితగినట్లు నటించుట యే మంచిది. నారాయణమూర్తి మహా సూక్ష్మబుద్ధిగలవాఁడు. మనమేమైన నధిక మైన యాడంబరముఁ జేసినచో "లోనలొటారు, బయలుబటారు." అనినట్లు వీరు వట్టి డంబాలకోరులుగా యున్నారు" అని తలంచును. అది మనకును మంచిదియే! కార్యము కావలసినది ముఖ్యముగాని వృథా సెలవులు పెట్టుకొనుటవలన ప్రయోజనము లేదు. ఈవిషయమున జాగ్రతగా మెలంగవలయును అని దిట్టముచేసి, "నేను పెండ్లివారితో కూడావచ్చెద. సిద్ధముగానుండి రాఁబట్టుకొనుఁ"డని చెప్పి పోవును. కన్యకగలవారు సకల కార్యములును సిద్ధముచేసి పెండ్లివారిరాక కెదు రుచూచు చుండుదురు. రావలసినకాలమునకు వారురాక దీనవదనుఁడై తరగరిమాత్రము ప్రత్యక్షమగును. అతని ముఖలక్షణములుచూడగానే యాయింటి యజమానునికి సందేహము కలిగి "ఏమీ? పెండ్లివారేల రాలేదు?" అనియడుగును గాని తరగరి యేమియుంబలుకక మౌనముగా నుండును. అపుడేదో యడ్డముకలిగినదనియెంచి యజమానుఁడు మరల మరల గ్రుచ్చిగ్రుచ్చి యడుగును. తరగరి విధిలేక చెప్పవలసినవానివలె నిట్టూర్పువుచ్చి "చాలా మోసముజరిగినదినుమీ!" అనును.

యజమానుఁడు:—ఏమీ? మోసమా? మానుకొనినారా?

తరగరి:—పూర్ణముగా, లేదు—కాని—అర్థమే మో, యదియే!

యజమానుఁడు: —ఎందువలన? కట్నము నొప్పుకొంటిమిగదా!

తరగరి:—ఆవిషయముననే వచ్చినది గొడవ. చాలదఁట.

యజమానుఁడు:—వారడిగిన మొత్తములో సగమునకు సమ్మతించి నారని చెప్పితివిగదా? మరల దీనికై గొడవయేమి?

తరగరి:—కలిగినసంకటమదికాదు. వరుఁడు చాలా యోగ్యుఁడనియు, చదువరియనియు, చూపరియనియుం జెప్పినానుకదా! కాఁ

బట్టి యతనికి కన్యనిచ్చుట కెందఱో వచ్చుచుండిరి. ఆచిన్నవాఁడు వరదక్షిణ తీసుకొని పెండ్లిచేసుకొనుటకు సమ్మతించకయు, ధనికుల బిడ్డలకు వివాహము చేసికొననొల్లనని పట్టుపట్టియుండుటచే తనకు యింతకాలము పెండ్లికాకనిలిచియుండినది. ఇపుడు మనయొద్ద వరదక్షిణతో వివాహము చేసికొనబోవుచున్నారని యెట్లో తెలిసికొని, మిరాదారుఁడగు గోపాలరావుగారు తన కుమార్తె నొసంగి పదివేలు కట్నము నిచ్చునట్లు స్వయముగావచ్చి చెప్పినారు. తీసుకొనుటకు పూనుకొన్నపుడు తక్కువతీసుకొనవలసినదేమి? యని నారాయణరావుగారు మిక్కిలి యాశపోతగుటచే సమ్మతించినాఁడు. మనకు హస్తోదక మిచ్చినట్లే!

యజమానుఁడు:—ధనికుల బిడ్డను పెండ్లాడుటకు వరుఁడు సమ్మతింపలేదంటివిగదా! అతఁడిపుడు మాత్ర మేలాగున నొప్పుకొనెను? వింతగా యున్నది.

తెరగరి:—ఏమివింత? మొండిపట్టుపట్టి యెట్లోనారాయణరావు దురాశతో కుమారుని మెడవిరిచి సమ్మతింపఁజేసినాఁడు.

యజమానుఁడు:—అయ్యో! ఎంతయో కర్చుచేసి పదార్థములన్నియు సిద్ధపఱచి, సర్వసన్నాహములును గావించితిమి. నలుగురిలో పరిహాసపాత్రులముగావలసివచ్చినది. ఇంత ప్రయత్నము నొనరించియు వ్యర్థమైనది. ఏమిగతి? ఎంతనష్టము? ఇంక కర్తవ్యమేమి? దృఢముగా ముగిసినట్లేనా?

తెరగరి:—సందేహముకూడానా? నేనెన్నియో చెప్పి చూచినాను. కడపట వారు తొలుత యడిగిన మొత్తమునంతయునుసయితము యిప్పించెదనన్నాను. పదివేలు వచ్చుచుండగా వారికి మనమిచ్చినది యెక్కుడుగా తోఁచునా? "ఆమాటలెవ్వియునింక చెప్పవలదు. మఱియొకచోటు చూచుకొనుండని ఖండితముగా చెప్పినాఁడు—అయ్యో! పాపము! మీరు నామాటలునమ్మి చాలా కర్చుపెట్టుకున్నారు. ఇదేనాకుచింతగాని, కొంచెమూలస్యమైనచో యెవఁడో యొకఁడు చిక్కనేచిక్కును. కులముగొడ్డుపడినదా? పిరేగతియా? ఇటువంటి భ్రాంతియులెందఱోయున్నారు. జరుగనే జరుగుతుంది.

యజమానుఁడు:—పాపము! నీవేమిచేసెదవయ్యా! సాధ్యమైనంతవరకును ప్రయాసపడినావు. ధనాశచే యీమోసగాండ్రిటుల చేయుదురని నీవెఱుంగుదువా? ఇందు నీదోషమేమి? ఇదియంతయు మాదురదృష్టమే కాని వేఱుగాదు. సరే! మించిపోయిన దానినిగూర్చి ప్రయోజనము లేదు. నేనొకమాట చెప్పెదను.

తరగరి:—మీరెన్ని మాటలు చెప్పుచున్నను, నాకు మిక్కిలి మనోవ్యాకూలము కలిగి బాధించుచున్నది. "ఓరా! పాపాత్ముఁడా! ఘోరి యాశపోతువాఁడా! ఎంత మోసము చేసినావురా! సమ్మతింపకున్న కుమారుని సయితము సమ్మతింపఁజేసినావు నీప్రజ్ఞ" ఏమండీ! వానిమాటలు తలంచిన హృదయము రగులుకొనిపోవుచున్నది. ఇటువంటిపనిని యోగ్యుడైనవాఁ డెవఁడు చేయును. మీబిడ్డను నేఁడుగాకున్న మఱియొకనాఁడు మఱియొకని కొసంగి వివాహమును జరిగించెదరు. ఇపుడదిగాదు నాదుఃఖము. పసుగురును నన్నుచూచి నవ్వునట్లు చేసినాఁడుగదా! ఇదివర కెవ్వఁడును నేనుచేసిన కార్యములలో నిటుల మోసగించి యెఱుంగను. ఏకార్యమునైనను నేను పూనినయెడల తప్పక జరుగునని యందఱును నన్నే ప్రార్థించుచుండుదురు. ఇపుడిది జరుగకపోయినచో, నాకెంత యవమానమో, యోచన చేయండి. భేష్ భేష్ మంచిపని చేసినాడు. కానిందు మించిపోలేదు. వానికి తగిన ప్రాయశ్చిత్తము వెదకెదను.

యజమానుఁడు:—ఆవిషయము వెనుక యాలోచింతురుగాని, ప్రస్తుత స్థితిని గురించి నేను చెప్పెడి దేమనగా:—విన్నారా?

తరగరి:—చెప్పండి చెప్పండి! వినుచున్నాను. ఆనారాయణరావుగాఁడు పడబోవుపాట్లు వేఱేయున్నవి. మీరు చెప్పండి.

యజమానుఁడు:—ఏమనగా, చాలాకర్చుపెట్టి పదార్థములన్నియు తయారుచేయించినాను, బంధుమిత్రులకు శుభలేఖలు పంపినాను. ఇపుడు తటాలున యీకార్యము నిలిచిపోయినచో మిక్కిలి యవమానము కలుగును. నలుగురును పరిహాసముజేసి చేతులుతట్టి నవ్వుదురు. కాఁబట్టి మీరు ప్రయాసపుచ్చుకొని యీముహూర్తముకే జరుగునటుల మఱియొకనినెవరినైనను కుదుర్చవలయును.

నేను మీ కష్టమునుంచుకొనను. ఇదిగో! ఇప్పుడీ యేబదిరూపాయలు తీసుకొనండి. ఎట్లైనను యీ ముహూర్తము జరిగితీఱవలయును. నిలువకూడదు.

తరగరి:—ఔనండీ! నేనదియే యోజించుచున్నాను. వారికండ్లుపొడిచినట్లు యీముహూర్తము జరిగించవలయుననియే నాకోరిక, మఱియొకచిన్నవాడున్నాడు. కాని, సామాన్యుడు. అయినను చాలాబుద్ధిమంతుడు. నేనుచెప్పినచో నామాటను వారు త్రోయజాలరు. ఈతొందరకు జరుగవలయుననిన, వాడు తప్పమఱియెవ్వరును లేరు. అయినను, కాలమునుబట్టి వారుసయితము—

యజమానుడు:—వరకట్నమా? సామాన్యుడుకూడా, కోరునా?

తరగరి:—ఈదినములలో సామాన్యమెక్కడిది? అదేయుండేనందేహము. దానినిగూర్చియే, యెట్లా, యని యాలోజన జేయుచున్నాను. ఇవ్వకతీఱదని తోచుచున్నది.

యజమానుడు:—సరే! విధిలేనపుడు యివ్వవలసినదేకదా! వారికిచ్చునట్లు నిర్ణయించుకొన్నమొత్తము నొసంగెదమని చెప్పి యొప్పించి రేపటిముహూర్తమున బయలుదేరి వచ్చునట్లుచేయుడు. వ్యర్థముగా యోజింపుచు కాలము జరుపుటవలన ప్రయోజనము లేదు పోయిరండు. వారిస్థితియెట్టిదో, యేమనెదరో, అదియు చూతము.

తరగరి:—చూడకమేమిటిది? నిరభ్యంతరమే! తప్పకజరుగును.

యజమానుడు:—మంచిది యేర్పాటుచేయండి తడవులేదు.

ఇట్లు యజమానునిమాటలీసుకొని యాతరగరిపోయి, యెవడో, వీధులతిరుగుచు, కనిదానములు పుచ్చుకొనుచుండెడి యప్రయోజకు నొకని నలంకారముచేసి, యాతనితల్లిదండ్రుల కేదోకొంచెమాశ కలిగించి ప్రయాణముచేసి ముహూర్తమునకు పిలుచుకొనివచ్చి, విడిది చూపి, కన్యగలవానియొద్దకువచ్చి "వరకట్నమును ముందుగానే కోరుచున్నారు. ఎపుడైనా యివ్వవలసినదేకదా! యితరులకు తెలియకుండా యిచ్చివేయుడు. అటులచేసినచో కట్నమివ్వకనే మనము పెండ్లిజరిగించినామని నలుగురుందలంతురు. ఆగౌరవమైనను దక్కును" అని యుక్తియుక్తముగాచెప్పి యామొత్తమును వారికిచెల్లించుటకై తానేతీసు

కొనిపోయియు యేబదియో నూఱో వారిచేతఁబెట్టి తక్కిన మొత్తమును తానుదాచుకొని దాఁట్లుమాంట్లుచేసి ముహూర్తమును జరిగించును. పెండ్లికివచ్చినబంధువులు పెండ్లికుమారునిఁజూచి తమలో "అయ్యో! బంగారువంటి బిడ్డను యీముండ జేదకిచ్చుచున్నాఁడే! కట్నము లేదని సంతోషించినాఁడు. కాఁబోలు" నని నవ్వుకొనుచుందురు. తరగరిమాత్రము వరుని శుభలక్షణంబులును, గుణాతిశయంబులును నెక్కుడుగా వర్ణించుచుండును. కన్యాదాత యెవరేమిచెప్పినను చెవినిడక, తాను పడినకష్టనష్టములకు లోలోనకుందుచు, విధిలేక తానుచేసినపనిని గూర్చి చింతించుటవలన లాభములేదని నిశ్చయించి యూరకుండును గాని తరగరి తనకుబహుమానపుకొఱవరావలసిన విషయముమాత్రము మఱచిపోక, సందర్భానుసారముగా ప్రస్తావించి తాను మహాకార్యమును కష్టపడి నెరవేర్చినట్లు డంబములు పలుకుచుండును. ఆహా! ఈపాపాత్ములైన తరగరులుచేయుమోసము నేమనిచెప్పవచ్చును? ఇట్లు వీరెందఱినో మోసగించుచుందురు. ధనాశాపిశాచమావహించినవాఁడే దుష్కార్యముఁ జేయుటకువెఱచును? అయ్యో! వీరిమాటలునమ్మి లోకమున నెందఱో చక్కని తమబిడ్డల నప్రయోజకులపాలుచేసి పిమ్మట నలమటించెదరు. ఇవ్విధముగా జరుపఁబడిన వివాహములలో వధూవరుల కనుకూలము లేశమైననుండదు. అయ్యయొకదారియు, నమ్మయొకత్రోవయునగుదురు. దీనివలన నెన్నోయనర్థములు కలుగుచుండును. ఓజనులారా! మీరు స్వయముగాచూచి యేర్పాటు చేసుకొని మీకుమార్తెల యుత్తరకాలక్షేమమును యోజించి బుద్ధిమంతుఁడయిన వరునకొసఁగి పెండ్లిచేయుట మంచిదిగాని, దురాత్ములైన తరగతులమూలముగా ప్రయత్నించుట హానికరమైనవిషయము. ధర్మచింతాదూరులైన ఈతరగరులు తంత్రముచేసి, ఇతరజాతుల కన్యకలకును, యువకులకు ముడిపెట్టి కమీషను పొందుటయుఁగలదు. ఈదురాచారము బ్రాహ్మణులలో నచ్చటచ్చటవిశేషముగా జరుగుచున్నది. 5-6 సంవత్సరములకుపూర్వము నెల్లూరిలో యొకబ్రాహ్మణయువకు, దక్షిణదేశపుబ్రాహ్మణుఁడొకఁడొక కన్యకనుదోడ్కొనివచ్చితనకుమార్తెయని చెప్పి ఆయువకునొద్దకొంతధనమునుపుచ్చుకొని వివాహముజరిగించియాకన్యనుభర్తయొద్దనేవిడిచిపోయెను, కొన్నాళ్లకుకన్యప్రౌఢయై

పునస్సంధానము జరుగుటప్రయత్నించుచుండెను. ఆయువకుఁడు శ్రీశంక రాచార్యస్వామిమఠములో నుండువాఁడు. అచటికా కన్యక నెఱింగిన వాఁడు బ్రాహ్మణుఁడొకఁడువచ్చుట తటస్థించెను. బ్రాహ్మణులయింట నభేదముగాయున్న యాచిన్నదాని నతఁడుచూచిగుర్తించి "అయ్యో! ఇదిశూద్రజాతిచిన్నది మాగ్రామమునబుట్టినదే! తల్లిదండ్రులు లేరు. మేనత్తయొద్ద పెరుగుచుండెను. ఎవఁడో మోసగాఁడామెకు కొంతడబ్బు నిచ్చియీచిన్నదానిందోడ్కొనివచ్చి యిచ్చుటబ్రాహ్మణకన్యయనిచెప్పి పెండ్లిజరిగించి యెక్కువ మొత్తముఁ దీసుకొనిపోయినాఁ"డని దృఢము గాచెప్పెను. మోసముబయలయినది. అంతటనచ్చటిబ్రాహ్మణులాయువ కుని బహిష్కృతుఁగావించిరి కాని తాముతనికూడి యచ్చటచ్చటనపు డపుడుభుజించినందువలన గలిగినదోషపరిహారార్థముగా ధర్మశాస్త్ర విధులనువెదకి ప్రాయశ్చిత్తములుచేసికొని పునీతులైరి. పాపము! ఆయు వకున కేశాస్త్రమందును నవ్వాడువారికిప్రాయశ్చిత్తము కనుపడకపోయి నది. పిమ్మటనందఱుంగూడి యోజించినన్నూఱో, యేనూఱో, రూప్యము లతనిచే పరివత్తునబెట్టించి సమారాధనఁజేయించి యాకంఠపూర్తిగా భుజించి యాడబ్బును భాగములువంచుకొని యుతనిని "నీవు మరలబ్రా హ్మణుఁడవైతి" వని యనుగ్రహించి త్రిశంకుస్వర్గములో నిలిపినారు. వధువును వేఱుయింటనునిచ్చి, యాయువకుఁడు సంరక్షించుటకు తీర్మా నించుకొనెను. ఎచ్చటవిచారించినను, కన్యనుతెచ్చి పెండ్లిచేసినవాని జాడగాని, నివాసస్థలముగాని, యాకన్యమేనత్తగాని నేటివరకుం దెలియ నేలేదు. మోటాపుబండ్లకువలె నిమిషములో యెటులత్రిప్పితే యటు లతిరుగులాగున, సృష్టికర్త బ్రాహ్మణులకు శాస్త్రములుధర్మములును గల్పించి యిచ్చినాడుకాఁబోలు. వారు తలంచరా? నల్లకుక్కను తెల్ల కుక్కగాను, గంగగోవుగానుఁ జేయగలరు. ఇటువంటిసంకటములు తర గరులవలన జరుగుచుండుట నెన్నియోచూచియు, వినియు నెఱింగియు న్నారము. కావున పరులనునమ్మి కష్టనష్టములపాలగుటకంటె మొద టనే జాగరూకతగలిగియుండుటశ్రేయస్కరము.

క. వరులకు తగుకన్యకలన్, వరులను కన్యలకు గూర్చువర్తకులైదు
శ్చరితులుతరగరులెపుడున్, దిరుగుదురదిజాలమనుచుఁదెలియుఁడుజనుల్.

---

# మఠసన్న్యాసులుచేయు మోసము.

కష్టమునకోర్చి యేదైన నొకపనిచేసి సంపాదించి పొట్టపోసుకొనుటకు వగలేని పనికిమాలిన సోమరిపోతులు మాయవేషములువేసి, బిచ్చమెత్తుకొనెడి యుద్యోగములో ప్రవేశింతురు. వీరుమధ్యాహ్నమువరకును, నటనిటందిరిగి బిచ్చమెత్తుకొని యదిమొదలు చావళ్లలోననో, చెట్లనీడలలోననో, హాయిగాకూర్చుండి పులిజూదము, దాయాలు నాడుచు కాలముగడుపుచుండుదురు. ఈతరగతిలోచేరినవారుకొందఱు చేయుపనియేమనగా, ఇరువురు జతకూడి ప్రాతగుడ్డలన్నియుంగూర్చి పాదములవరకునుజాఱునట్లు కుట్టబడి యెఱ్ఱమట్టినీటిలోతడిపిన యంగరకాలు తగిలించుకొని, ముఖములకు దట్టముగా విభూతినిపూసి కనుబొమల నడుమ కుంకుమరేఖ నదిద్దుకొందురు. దారములతో కట్టబడిన చొంబొక్కొకటి యొకొక్కడును భుజములకుతగిలించుకొనియుండును. వీరు స్త్రీలవలె తలయంతయు వెండ్రుకలు పెంచి సిగముడి వేసి దానికిరాగితాయెతులుకట్టుకొని యుండుదురు. చెవులలో రుద్రాక్షములనుకూర్చిన రాగి నాగపడిగలువ్రేలాడుచుండును. మెడలలో రుద్రాక్షపుదండలు ధరించి, కొన్నికంకణములవలె చేతులకుగట్టుకొందురు. ఒకొక్కడొకొక్కచిన్నగంటను తుండుగుడ్డకొనకుగట్టి చేతబట్టుకొని వాయించుచుండును. ఇట్లువేషముధరించి సూర్యోదయమునపూర్వమేగంజిత్రాగి బ్రహ్మంగారి మఠస్థులమని పేరుపెట్టుకొని గ్రామములలోనికి ప్రవేసింతురు. ఒకొక్కసమయములో ముగ్గురు, నలుగురు జతగూడి వచ్చుట యుంగలదు. వారిలో యొకఁడు వీరబ్రహ్మంగారుచెప్పిన కాలజ్ఞాన వాక్యములలో యెచ్చటనో నాలుగుపదములునేర్చుకొని తనకవిత్వమును కొంతకలిపి, యాబ్రహ్మంగారిగౌరవమునైనను తలంపక, తమవెఱ్ఱికూతల నాయనచెప్పినవాక్యములని, యొకొక్కవాక్యమును రాగముతోచెప్పును. తక్కినవారు ఆవాక్యపుతుదనందుకొని కొఱవనుచెప్పి "హరహరా! మహాదేవలింగా!"యని ముగించుచుండుదురు. వారుచెప్పెడివాక్యములు క్రిందవివరించినలాగున నుండును.

→ బ్రహ్మంగారి వాక్యములు. ←

మొదటివాక్యము:—సత్యంబురా! గురుఁడ! సత్యంబురా! సత్యమైన మాట, నిత్యంబుబ్రహ్మం.

తక్కినవారు:—సత్యమేనిత్యంబు శూన్యంబు నిత్యమావస్తువు. నీవేను
బ్రహ్మం హరహరా! మహాదేవలింగా!

మొదటివాఁడు:—ఆయువుండేవరకు నందఱునుమనవారు మాయదే
హంబు నమ్మగరాదు బ్రహ్మం.

తక్కినవారు:—మాయదేహమునమ్మి మట్టిలోకలిసేరు. కాయంబు
సుస్థిరముగాదురా! బ్రహ్మం. హరహరా! మహాదేవలింగా!

మొదటివారు:—పోతులూరయ్య సద్బుద్ధిమాటలువిన్న- ఖ్యాతిగామా
నవుఁడు కడతేఱు బ్రహ్మం.

తక్కినవారు:—కడతేరగాదారిగనలేకభూజనులు- వడరానివెతలొంద-
పా యిరిబ్రహ్మం హరహరా! మహాదేవలింగా!

మొదటివాఁడు:—కాలమంతయు వేఱుగామాఱిపోఁగలదు. చాలచి
త్రంబులు జరుగవలె బ్రహ్మం.

తక్కినవారు:—చిత్రముల్జరుగునీ-క్షితినిధర్మంబుయే- మాత్రమునుగల్గ
దిక మఱుగానుబ్రహ్మం హరహరా! మహాదేవలింగా!

మొదటివాఁడు—కడుకష్టములపాలు-గాగలరుమానవులు-కడలేని దుః
ఖముల్ కాంచెదరుబ్రహ్మం.

తక్కినవారు:—కాంచెదరుదుఃఖముల్-మించుశక్తులబాధ- సంచలించు
నుభూమి-సత్యమిదిబ్రహ్మం-హరహరా! మహాదేవలింగా.

మొదటివాఁడు:—పట్టణములగు చిన్నపల్లెలద్భుతముగా- పట్టణంబులు
పాడుపాడగును బ్రహ్మం.

తక్కినవారు:—పాడగునుసర్వంబు- పాపమధికంబగును కీడొందిజన
ములల్లాడేరుబ్రహ్మం హరహరా! మహాదేవలింగా!

మొదటివాఁడు:—అడవియూరును, గ్రామ మడవియుంగానౌను కడ
నిలో దేశంబు గలియురా బ్రహ్మం.

తక్కినవారు:—దేశానదేశాధిరాజు, దేవుఁడొకటికొకండు. నైశాంతిలే
కుండునంకటనుబ్రహ్మం. హరహరా! మహాదేవలింగా!

మొదటివాఁడు:—గ్రామగ్రామమునకును కడుగొప్ప దొకప్ప-స్వామి
వలెబండిపై జనుదెంచుబ్రహ్మం.

తక్కినవారు:—చనుదెంచురోగాలు-సంభవంబయ్యాని- నినునమ్మిధన్యు
లై నిలిచేరుబ్రహ్మం. హరహరా! మహాదేవలింగా!

ఇట్లు పాటపాడుచు మెల్లగావీధులలోవచ్చుచుండుదురు. ఈమహాభక్తులు బ్రహ్మంగారి శిష్యకోటికిచేరినవారని మూఢులునమ్మి వీరికి బిచ్చమువేయుదురు. వీరుయింటింటికినివచ్చి బిచ్చమడుగరు. వీధిలోనికి కొనిపోయి వేయవలయును. అదియు, వడ్లు, తవిదలు, జొన్నలు మొదలగునవి వేయబోయినపుచ్చుకొనరు. పరిశుద్ధమైన బియ్యమును వేయవలెను. మతమువారని తెలియగానే వివేకములేని మనయిండ్లలోని యాడువారు దోసిళ్లతోబియ్యమునుగొని బిరబిరపోయి వారికిఁబెట్టుచుండుదురు. కొందఱు కానుకలునమర్పించుటయుంగలదు. ఇటుల రెండుజాములు ప్రొద్దెక్కువరకును దిరిగి, సులభముగా దినమునకు ఒకరూపాయకు తక్కువలేకసంపాదింపుదురు. అంతట నెచటనైనను సాయంకాలమువరకును నుండి, తాము తెచ్చినబియ్యములో యెనిమిదవవంతు కూటికై యుంచుకొని తక్కినబియ్యమును విక్రయించి యారూకలును, తమకుకానుకలుగావచ్చిన రూకలునుచేర్చి మూటగట్టి సూర్యుఁడస్తమించగానే కల్లంగడికిపోయి మునువుచెల్లించి, ఆకంఠపూర్తిగాత్రాగివచ్చి, బ్రహ్మంగారి పాటలుపాడుచు, బ్రహ్మానందము ననుభవించుచు పొరలుచుండుదురు. ఇటువంటి సోమరులయిన మోసగాండ్రకు బిచ్చముపెట్టుటకన్నను, దిక్కులేక కూటికినిగుడ్డకును గతిగానక రోడ్డులమీదగూర్చుండి యల్లాడుచుండెడి, కుంటి, గ్రుడ్డి వారలకు ధర్మముచేసినయెడల, యట్టిపుణ్యాత్ములకిహపరములయం దెంతయో సౌఖ్యముకలుగును? అయ్యో! మనదేశము నానాటికి బిచ్చగాండ్రచేనిండి బిచ్చపుదేశమగుచున్నది. ఈదురదృష్టము భరతఖండమున కెపుడుతొలంగునో, ప్రజలెపుడుసౌఖ్యవంతులగుదురో తెలిసినదికాదు.

క. పేరగు వీరబ్రహ్మము
గారి మతస్థులమటంచు కపటాత్మకులూ
రూరునకు బిచ్చమునకై
జేరుదురది నిజముగాదకే వడుగులువారల్.



# పాలను అమ్మెడివారి మోసము.

గొప్పపట్టణములలో, జనసమ్మర్దమును, కాఫిహోటళ్లును నానాటికి నెక్కుడగుచుండుటచే, పాలు విశేషముగా కావలసివచ్చుచున్నది. కాఁబట్టి పాలవ్యాపారము చేసెడివారిసంఖ్య యంతకంతకు మించినది. ఒకఁడొకఁడు నొకటియో రెండో యావులనుగొని, వానికి గానిగపిండియు, నులవపొట్టు మొదలయినవియుంబెట్టి ఈనినపిమ్మట ఆయావులను యింటింటికిం దోలికొనివచ్చి కొనెడివారికి తమసత్యము దెలియుటకై వారివాకిట నేపిండి యిచ్చుచుందురు. కాని, వీరుచేయుమోసము తక్కిన మోసములన్నిటికంటె నధికమైనది. వాకిటికి తామావునుతోలుకొనివచ్చునపు డిరువురుగావత్తురు. ఒకనిచేత నిడుపైన టిన్ రేకు పాత్రమొకటియు, రెండవవానిచేత, యట్టివే పాత్రములు రెండుమూడును నుండును. ఒంటిపాత్రమువాఁడు తన చేతనుండుదానిలో పాలుపితికి రెండవవానిచేత నుండువానిలో పోయును. ఆపాత్రములలో మూడవవంతు వరకును నీరుండును. నిడుపుగానుండు పాత్రములగుటవలనను, యవి చేత బట్టుకొనియున్న వానిచాతుర్యమువలనను, వానిలో నీరుండుట యితరులకు తెలియరాదు. పాలుతీసుకొనెడివాఁడు పిండుచున్నపాత్రములో నీరు చేర్చుచున్నాఁడా? యని తదేకదృష్టితో వానివంక చూచుచుండు నే కాని యితరునివంకఁ జూడఁడు. రెండవవాఁడు తన చేతనుండువాని యన్నిటిలోనను పాలుపోసినతరువాత, యంతయు నొకపాత్రములోననో, అధికమయినయెడల రెంటిలోననో పోసుకొనును. అటుల చేయువలసిన యగత్యమేమైయుండుననుట నయితము కొనెడివాఁడు యోజింపఁడు. ఆలాగున నావును తెచ్చి వాకిట పిండినపాలనిచ్చినచో వెలయధికము. అవి శ్రేష్ఠమైనపాలని చెప్పఁబడును. సేరు 1కి-అట్టిపాలు రు 0-6-0లకు తక్కువ లేదు. ఆపాలను తీసుకొనినయెడల మూడింట నొకభాగము నీళ్లు కలిసియుండును. తాము శ్రేష్ఠమైనపాలను తీసుకొన్నట్లుభావించి సంతోషింతురేగాని జనులీమోసమెఱుంగరు. ఇట్టి యెనుములను పెట్టుకొని వ్యాపారముఁ జేయువారునుం గలరు. కొన్నిసమయములలో ఎక్కువనీళ్లు చేర్చి చిక్కగా యుండుటకై దానిలో నొకవిధమైన పిండిగలిపి, మంచిపాలనిచెప్పి, యెక్కువధర కమ్ముదురు. ఈపాలవాండ్రయిండ్లకే

పోయి తీసుకొనువారు కొందఱుందురు. వారిస్థితి యెఱిఁగి యన్యాయము, నీళ్లుచేర్చకుండా యిచ్చునట్లు యేర్పాటుచేసుకొని యుందురు. అందువలన తామువచ్చినపుడే పాలుపితుకవలయునని చెప్పుదురు పాలవాఁడా యేర్పాటునకు సమ్మతించును. తీసుకొనెడివాఁడు రాగానే పాలవాఁడు వట్టిపాత్రము నొకదానిని తీసుకొని ప్రక్కదొడ్డిలో కట్టియుండెడి యావునో, లేక యెనుమునుండియో పాలుపితుకుటకువచ్చును. అపుడుకొనెడివాఁ డతనిచేతిలోనుండెడి వట్టిపాత్రమునుచూచినీళ్లులేకుండుటసంతుష్టినొందును. పాలవాఁడతనిజూచి పాలుపితుకుచోటునకు మీరురా కూడదు వాకిటనే యుండుఁడు. తెచ్చెద"నని చెప్పితలుపు తెఱచి లోనికరిగిమరలతలుపుమూసుకొనికొన్ని నిమిషములకు తానుకొనిపోయిన పాత్రమునిండుగా పాలుతెచ్చి యందలి నురుగుతోడనే కొలిచి వచ్చినవాని పాత్రములోపోసి పొమ్మనును. అతను యింటికిపోవుటకు లోపల యందలినురుగుపోగానే కొలత సగభాగముతగ్గిపోవును. కాచినచో సగమునీళ్లుకలిసిన పాలుగానుండును గాని, యదియాపశువుపాలయొక్క గుణమైయుండుననియు, తనయెదుటనే పాత్రముఁగొనిపోయినందున పాలవాఁడు నీళ్లుచేర్చి యుండడనియుతలంచును. గాని వాఁడు జేసినతంత్రమును తెలిసికొనఁజాలఁడు. వేకువఝామువనే వేఱుపాత్రములో నీళ్లుకొనిపోయి దొడ్డిలోమఱుగుననుంచి తలుపువేసుకొనివచ్చును. కొనెడివాఁడురాగానే, యపుడేనిద్రలేచినవానివలె కండ్లునలుపుకొనుచువచ్చి తలుపుతెఱచును వానిచేత వట్టిపాత్రమొకటితప్ప మఱియేమియునుండదు. దొడ్డిలోతొంగిచూచినను, నేమియుంగానరాదు. కనుక తీసుకొనువానికి పాలలో నీరుచేర్చలేదను నమ్మకముకలుగును. పాలవాఁడు లోపలికిపోయి తలుపువేసుకొని లోపలికరిగినతనచేతిపాత్రములో కొంచెము యెచ్చుతక్కువగా యర్ధభాగమునీళ్లుపోసుకొని దానిలోపాలుపితుకుకొనియానురుగుతోయట్లే తెచ్చికొలతపాత్రముతో కొలిచి వచ్చినవానికి పోయును. కొలతపాత్రము చూచుటకు పెద్దదిగానే యుండునుగాని లోపల సగభాగమునకే బిళ్లయదకబడి యుండును. దానితో చాతుర్యముగా కొలిచిపోయుచు, ఆపాల నింటికికొనిపోయి కొలిచినచో సేరునకు ఖండితముగా యర్ధసేరు లెక్కకువచ్చును. వాఁడు కొలిచి యిచ్చునపుడు తీసుకొనెడివాఁడు. "పాలు చాలానీళ్లు

గాయున్నదే!" యని యడిగిన, మొగము చిట్లించుకొని "ఏమండీ!
మీ యెదటనే గదా పితికినాను. నీరునిచ్చెడి యావులు కూడా యుండునా
ఇది న్యాయమునకు కాలము కాదు. ఎక్కువ వెల మీయొద్ద తీసుకొనిన
యెడల మంచిపాల నివ్వకుందుమా? మే మెంతగా సత్యమునకు కట్టుబడి
న్యాయముగా చేసినను మిమ్ము నమ్మనేనమ్మరు. ఇది పాడు వ్యాపా
రము. పెద్దవాళ్ళు చేయుచుండిన వాడుకను విడువరాదని చేయుడమేగాని
దీనివలన మాకు లాభము లేదు. కష్టము మాత్ర మధికము. మీకు యీ
యూరిలో యింతకంటె మంచిపాల నిచ్చువాఁడుండిన తీసుకొనుఁడు.
సగమునకు సగము నీరుచేర్చి యిచ్చెడివారే మీకు మంచివారు. ఒ
క్కొక పసరము పా లొక్కొక విధముగా నుండును. కొన్ని యావుల పాలు
మఱియుం బలచగా యుండును. అట్టివైనచో వట్టినీళ్లే యని చెప్పెడివాఁ
డవే! ఇష్టమున్న తీసుకొనుము. లేదా? మానివేయుము. ఇటుల చెప్ప
వలదు. మా సొమ్ము మంచిదిగా యుండినచో తీసుకొని పోవువారలెం
దఱో రానే వచ్చెదరు పోవయ్యా! పొమ్ము" అని దీర్ఘోపన్యాసముఁ
జేసి నోరెత్తకుండునటుల చేసిపంపును "సరే! పాల భేదము తెలియక
నిన్నడిగినాను. కోపము నొందకు" మని తీసుకొనువాఁడు మెల్లగా తప్పిం
చుకొనిపోవును. మఱి యెవఁడైనం గొనవచ్చి అబ్బా! వెలచాలా యె
క్కువగా యున్నదే! అందఱును సేరుపాల నాలుగణాల కిచ్చుచున్నారు.
నీవన్ననో యెనిమిదణాలు చెప్పుచున్నావు ఏమి కారణము? అని యడి
గిన యెడల "ఓహో! భేష్ భేష్. ఇవి యా పాలవంటివి గావు. కావల
సిన యెడల నటువంటివే నేను సేరు నాలుగణాల కేయిచ్చెదను. తీసు
కొనుము. ఆ తంత్రము మీకు తెలిసికొంటిరా? అందు మూడు
పాళ్లు నీళ్లును, నొక పాలుమాత్రము పాలును కావున వాఁడు రెండణా
లకు పోసినను వానికి నష్టము కలుగదు. మే మటుల చేయనొల్లము. మా
కు పెద్దమనుష్యుల యిండ్లయందును గొప్ప యుద్యోగస్థుల యిం
డ్లలోనను వాడుక యెక్కువ. వారికి పితికిన పాలు పితికినట్లే యివ్వవల
యును. లేకున్న యొకనాఁటికే మా పేరు చెడిపోవును. నాదముని పిళ్ళె
గారి పాలంటే యీ పట్టణములో యెక్కడ వినినను ప్రసిద్ధి యిందువల
ననే కలిగినది. ముఖ్యముగా నలుగురు గొప్పవారి పరిచయము కలుగు
టకే కాని యీ వ్యాపారము మేము లాభమునకై చేయుట లేదు. ఏదో

గొడ్లకు మేతకర్చులువచ్చిన చాలునని మేముతృప్తి నొందెడివారము. సేరు యెనిమిదణాలనగానే భయపడుచున్నావు. ఆపాలకు మేము పడు ప్రయాసము చూచినగదా తెలియవచ్చును మీరెఱుంగుదురు ఉదయము మొదలు సాయంకాలము వరకును వానిసేవచేసిననే యాబోటుజాలును. లేకున్న లేదు. అదియునుగాక, గడ్డియు, పిండియు. పొట్టును, పూర్వమునకంటె మూడురెట్లు వెలయెక్కువ. ఇవియన్నియునట్లుండ జీతగానికి నెలకు యిరువదిరూపాయలుయిచ్చి తీరవలయును. ఎన్నో సంకటములు. ఆకష్టము మాకుఁదెలియును. ఇట్లు సకలసంకటములును పొంది యొకసేరు పాలుపితుకుటగగనము. అదియెనిమిదణాలంటిమా? అబ్బో! అంటారు. ఏమిచేయవచ్చును. మాయొద్ద నంతపొల్లగా లేనే లేవు. మానాడుకలకే హానిహానిగాయుండును. నేఁటిదినము మావాడుకవారిలో నొక రెచ్చటికో పోయినారు. ఆపాలు మిగిలియున్నందున నిచ్చెదనన్నాను. వెలయెక్కువగా తోఁచినచో మీరు ఆఱు అణాలకు యిచ్చేవారియొద్దనే తీసుకొనుఁడు. ఆవెలకు మాపాలు యివ్వజాలము. మీకు సమ్మతమైన యెడల నీళ్లుచేర్చి యాధరకే యిచ్చెదనని చెప్పను. ఈయుపన్యాసమును విని వచ్చినవాఁడు వెలవెలబోయి "ఇతనిపాలు శ్రేష్ఠమైననిగానే యుండియుండును. కానిచో యింతదృఢముగా చెప్పివచ్చిన బేరమునుఁ పోఁగొట్టుకొనునా?" యని వాని మాటలునమ్మి చెప్పిన వెలయిచ్చి తీసుకొనిపోవును. అందునాలుగింటనొకభాగము మాత్రమే పాలుండును తక్కినవినీళ్లే! ఈప్రకారముగా లోకులను మోసగించి డబ్బుసంపాదించి యొకొక్కఁడును, పదియు, పంన్రెండు నిండ్లుకొని బాడుగులకొసంగియు, నగలు చేయించుకొనియు కడుడంబముగా తిరుగుచుండుదురు. ధనవంతుఁడని పేరొందినవాఁడు సయితము తానొకయిల్లు సంపాదించుటకు డబ్బులేక నానాకష్టము బొందుచుండును. వీరన్ననో, జానెడుభూమిగాని, మఱియేవిధమైన యాస్తిగాని లేకనే, రెండావులను పెట్టుకొన్నవాఁడు సులభముగా నైదాఱుయిండ్లు సంపాదించును. ఇదియంతయు నన్యాయార్జితమైనడబ్బును పెట్టినదేకాని వేఱుకాదు. వీరికిపాపభీతి లేశమైనను లేదు. తాముకొనిన యావులనుండియు, బఱ్ఱెలనుండియు, నవి యీనసదశలోయుండి పాలిచ్చుచున్నవరకును తీసుకొని, వాని మూలమున నెంతయో సంపా

దించి యవి ముసలిపై యెత్తుబడినంతట యేదో యొకవెల కుదుర్చుకొని, వానిని కసాయివాని కమ్మివేయుదురు. ఉద్యోగస్థులుగా యుండెడివారు సూర్యోదయమునకు ముందుగానే పాలు కావలయుననినచో, మొ టిరాత్రి పితికి అమ్మగా మిగిలియున్న పాలను పెచ్చబెట్టి యుంచియుండి, దానిలో తగినంత నీళ్లుకలిపి తెచ్చిపోయుదురు. తీసుకొనెడివారు వాడప్పుడే పితికి తెచ్చిన పాలుగా నెంచును. ఆపాలు త్రాగిన యెడల దేహమునకు జబ్బుగాకతప్పదు. ఎవఁడైనను "అప్పుడే పితికి తెచ్చితివా? నిన్నటివి కాఁబోలు" ననినచో, "రామరామ! అట్లుసెలవియ్యకఁడి. మేము మా పశువులను రెండవపూటలు పితికెడి వాడుకయే లేదు అవి యటుల నివ్వనేయివ్వవు. మీవిషయములో యటుల చేయుదుమా? ఉన్నమట్టుకు పరువుగా మీబోంట్లకిచ్చిన చాలును. మోసముచేసి యెక్కువగా సంపాదించెడియాశ మాకులేదు. యిప్పుడే మీకొఱకు పిండి తెచ్చుచున్నా" వేయిసత్యములుచేయును. లోకులను మోసముచేసి యిట్లు డబ్బుసంపాదించి విఱ్ఱవీగుచుండెడి పరమపాపాత్ములైనయీపాలవ్యాపారము చేయువారికి దేవుఁడు యేమిగతి గలిగించునో తెలిసినదికాదు ఈయన్యాయఫలమువలననే గాబోలు. వీరుయెక్కువగా వర్ధిల్లుటలేదు కొందఱు యీవర్తకము చేయుచున్నవారు మొదటమొదట చాలా విఱ్ఱవీగుచుండి నానాఁటికి తగ్గునలకువచ్చి తుదకుకూడుగుడ్డలేక వీధులలో యేల్లాడుచుండిరుగుచుండువారును, నేఁ పట్టినసిల్లును, పోయిన్నపట్టున బూడిదయులేక పోయినవా రెందఱో కలరు. అయ్యో! పాడుకాఫి మనదేశములో నధికమగుటచే, పాలవాళ్ళపంట పండినది. డబ్బుతీసుకొని వాచలిచ్చెడి కొళాయినీరే గతిగాయేర్పడినది. ఈయన్యాయమునుగూర్చి యొకరైనను యోజించుటయే లేకున్నది. ఓకాఫీమహాశక్తీ! నీమూలముగా దేశమున నెన్నియోరోగములు ప్రబలి జనులునానాకష్టములు ననుభవించుచున్నారు. నీవీదేశమును విడిచి పోయినచో పాలగిరాకితగ్గి మంచిపాలు దొరకుట సంభవించును. అప్పుడెల్లవారును, నారోగ్యవంతులైయుండగలరు. శీఘ్రముగానుమఱియెచ్చటికైనను బోవలయునని వేడుచున్నాను.

ఆ. పాలలోనసగముపాలునీరునుఁజేర్చి,మంచివగునటంచుమాయఁజేసి
యక్రమంబటనకవిక్రయించెడివారి,యొద్దపాలుగొనుటయురవుగాదు.

# చిల్లరవస్తువుల నమ్మెడివారి మోసము.

చెన్నపట్టణములో నేవీధియందుచూచినను చిల్లరసామానుల విక్రయించెడి మళిగలొకటియో, రెండో, అధికముగనోయుండును. ఒక్కొకయంగడివాకిటను, "మహాలక్ష్మీస్టోరు. వేంకటేశ్వరవిలాసస్టోరు కరారుధరలయంగడి"యని యెన్నోపేరులతో వ్రాయబడినపలకలు వ్రేలఁగట్టియుండుదురు. ఆపేరులుచూచి భ్రమనొందికొనుటకుపోయినయెడల, మక్కిపోయినవియు, పుచ్చినవియు, బూజుబట్టినవియు, మిక్కిలి ప్రాతగిలినవియు నైనసరకులను క్రొత్తగోతములతో వరుసలువరుసలుగా పెట్టియుండుదురు. నడుమ నినుపత్రాసును ముందువైపున వ్రేలగట్టుకొని యమ్మకముఁజేయువాఁడు యెత్తుపీటపై కూర్చుండియుండును. యజమానుఁడు కుర్చీపై టేబిలు ముందుకూర్చుండి. సామానులు కొనవచ్చిన వారడిగెడివస్తువులు వ్రాసుకొని వెలవేసి చీటియొసంగును దానికి కరారుధరలయంగడియనిపేరైనను, యితరులయంగడులకంటె రు1కి 0-2-0 వెల యెక్కువగాయుండును. ఆచీటిని త్రాసుదగ్గఱకూర్చున్నవానిచేత యిచ్చినచో, అందు వ్రాసియున్నప్రకారము వాఁడు తూచి కాకితముల లో పొట్లములు కట్టియిచ్చును. వస్తువులఁదెచ్చియిచ్చుటకు మఱియొకఁడుండును. తూనికవేయువాఁడా సామానుల్లో దేదయినా వస్తువు తెచ్చినపుడు "చీ! అదికాదు, అదిగో! ఆమూలనుండు గోతములోని మొదటిరకమును తీసుకొనిరా! ఎవరికేయుల నివ్వవలయునో నీకు తెలియదు" అనికసరిచెప్పుచుండును. ఆసాంకేతికమెఱింగియున్న యామనుష్యుఁడు తెచ్చినవస్తువును గోతములోవేసి మఱియొక గోతములోనుండుదానిని తెచ్చియిచ్చును. తీసుకొనెడివాఁడు తనమరియాదనెఱింగి మంచివస్తువును తెప్పించి యిచ్చినాఁడనితలంచునుగాని, యదిమొదటతెచ్చినదానికి రెండవరకముగానేయుండును. యజమానుఁడు చీటివ్రాసియిచ్చునపుడే క్రయము మొత్తముచేసి తీసుకొనియుండునుగాన, యావస్తువులు మంచివికావని మఱియొకచోటికిపోవుటకు వలనుగాదు. ఎవఁడైనఁ "రూకలిచ్చివేయుదు నేనువేఱుచోటునకుఁ బోయెద" ననెనేని యజమానుఁడు "ఆయాచార మిచ్చుటనిదివరకును లే"దనిచెప్పును. వస్తువులు మంచివిగాయుండలేదే!" యనినచో, "వీనికంటెమంచివస్తువులునీవీపట్టణములో నెచ్చట

నై నందెచ్చితివేని మేమువీని క్రయముపుచ్చుకొనక యుచితముగా నిచ్చెద''మని వాదింపుదురు. మనకు కావలసినవస్తువు దొరకుటయే దుర్లభము. వాకిటికిపోగానే, ''రండిరండి! కూర్చుండండి! ఏమికావలయును?'' అనిమర్యాదచేసి యడుగుదురు. ''అస్కాచక్కెరయున్నదా?'' యనియడిగిన ''అదిలేదు ఇంకను తేలేదు బూరాయున్నది. చాలాశ్రేష్ఠమైనది. అస్కాచక్కెరకంటె శుభ్రముగాయుండును. అస్కాచక్కెరయని యనడమేకాని దానినిపుడెవరును నంతగాతీయడమే లేదు. అందఱును ఈతెల్లబూరానేకొంటారు అస్కాచక్కెర లేకపోయినను మాకుభరవాలేదు. కాని యీతెల్లబూరా లేనియెడల నిండాయిబ్బందిగాయుంటుంది. మీరొకరడుగుచున్నారుగాని వచ్చినవారందఱును తెల్లబూరానే యడిగెదరు ఇదిక్రొత్తగా వచ్చినరకమండీ! చాలాబాగాయుండును. ఒకసారికొనిపోయి వాడుకొంటిరేని మరల వేరేరకముకోరజాలరు ఆపాడుచక్కెరవలదు. దీనినేయివ్వవలసినదని కోరుదురు. ఇదిపరిశుద్ధముగాయుండడమేకాదు. తీపుకూడా యెక్కువయే! ఎంతకావలయును? రెండువీసెలు కట్టమనెదరా?'' యని యడుగుటకుపూర్వమే కాకితము పొట్లములోనొకటో రెండో వీసెలుతూచికట్టును. ఇంతదూరము వర్ణించియు, దానినిచూచుటకునగా తెడవులేనట్లు తూచికట్టి ముందుబెట్టి ''ఇంకేమికావలయును?'' అనిత్వరచేయుదురు. ''క్రొత్తచింతపండు కావలయును. ఉన్నదా?'' యనియడిగినఅబ్బే! అదియెందుకండీ! పాడుపండు పట్టి విత్తనములు, నీనెలుతప్పమఱియేమియునుండదు దానినితెచ్చినయెడల మాకుకర్చులేదు. మేముతెప్పించనే తెప్పించము. ఏమిచేయుటకు? మట్టిలోవేయవలసినదే! మాయొద్దనుండేపండు చిత్తగించండి, యొకవిత్తనముగాని యుట్టిగానియుండిన వాపసుచేసి డబ్బుతీసుకొనండి. మైనమువలె నిగనిగలాడుచుండును. రేకుపండు మేమిచ్చేవస్తువులుకొనిపోయి మీరు వాడిచూడండి మీకే తెలియవచ్చును. మాయొద్దనుండేవస్తువులు చాలామేలని మేముపొగడుకొనుటలో ప్రయోజనములేదు. ఇక్కడను మొదటిరకం వస్తువులేకాని, డామేజావస్తువులు తెప్పించము. మంచివస్తువులు దొరకుననియే మీవంటి గొప్పవాళ్లుమాయంగడికే వచ్చుచుందురు. ఎంతచింతపండు రెండువీసెలు చాలునా?'' యనివస్తువుల నందిచ్చువానితో ''ఓరే! క్రొత్తగానిన్నవచ్చినదే! ఆపండు రెండువీసెలుతీసుకొనిరా?''

యనిచెప్పి "అయ్యా! ఇది బంగారువంటి సరకండీ! ఇదిమాయొద్దమా త్రమేయున్నది మంచికంపుగలది. ఇది కర్చుపడినయెడల యింక నిలువం టిసరుకేచిక్కదు. పిమ్మట వచ్చునది మీబోటివారికినమ్మకముగాచెప్పి యివ్వదగినదిగా యుండదు" అని మాటలాడుచునే చూపనైనచూపక తూచి కాకితములో చుట్టిపెట్టును. ఇంక మిరపకాయలనిన, నన్నియుం దొల్లలే! విత్తనములును తొడిమలు నుండనేయుండవు. "ఏమి? యీ కాయలు తొల్లలుగాయున్నవే!" అనిన నవ్వుచు "ఓహో! మీరుక్రొ త్తమాటలు పలుకుచున్నారే! కొనిపోయెడివారు, విత్తనములుంటే పైత్య మెక్కుడగుననియు నవితీసివేయుటకు తమ యిండ్లలోనిస్త్రీలకు, మెక్కువ కష్టముగానుండుననియు, తొడిమలును విత్తనములులేనికా యలనే కోరుదురు. ఈ యుపద్రవమువలన మేము మాయొద్ద నుండు కాయల కన్నిటికిని కూలిమనిషినిపట్టి గింజలు తొడిమలు తీయించిపె ట్టినాము. రుచి విత్తనములులేని కాయలలో యెక్కువ అది యట్లుం డగా యింటిలోని యాడువారి కెంతయో సులభము. అట్టికాయ్పండి వీనిని చక్కబరచుకొనెడి కష్టము లేదు. ఇట్టే వాడుకొనవచ్చును. రెండువీసెలు కట్టుదునా?" యనియడుగును. ఇంక నెయ్యి,నూనె వీనిని గురించి చెప్పవలసినదిలేదు "అయ్యా! నీకరమైన నూవులనూనె కావ లయునా? లేక శనగనూనె కలపటము కావలయునా! కలపటములేని నూనె వెలయధికము వీసె రూపాయనాలుగణాలు.ఏదికావలసియుంటే యడిగీసుకొనుడు. నేయి నిన్న సాయంత్రముననే డబ్బాలు వచ్చినవి. మంచిసరుకు, ఇంతవరకును ప్యాకింగ్ పగులగొట్టనేలేదని, అతికియుం డిన డబ్బాలు చూపించును. తత్పూర్వముననే, పిసికిన యరటిపండ్లును, ఉప్పును తెల్లనికాల్చిన బూడిదయు నేతిలోకలిపి డబ్బీలలోపోసి ప్యాకి చేసి పెట్టియుందురు. మాదిరికిగా వేరేయొకపాత్రములోమంచినేయి కొంచెము పెట్టుకొనియుండి నేయికోరినవారికి దానినేయిని పుడకముం చి తెచ్చిచూపుదురు.అదిమంచివాసన కలిగియుండుటచే తీసుకొనువా డు వారొసంగిననేయి యంతయునటులనే యుండునని తలంచును. అది కొనిపోయి భోజనసమయమున చేతిలో వేసుకొనినచో దుర్గంధము గు ప్పున మొగమునకుకొట్టి పేగులతోనయితము పెళ్లగించుకొని వాంతికి వచ్చును. నూనెయందునుమడ్డియు,శనగకాయలనూనెయు,బూడిదయుం

గలిపి నికరమైనపూవులకూనె యని నమ్మకముగాచెప్పి తగులగట్టుదురు. పెసలు, మినుములు, కందులు, శెనగలు, నీళ్లలో నానబోసి తీసియెండించి పప్పుచేయుదురు. ఆపప్పుదినుసులు చూచుటకు ఘనముగను, నాణెముగను నుండును కాని రుచియేయుండదు ఒకసేరుపప్పునుపొయిమీఁదపెట్టి యుడికింపబూనినచో ఒకగుండుకట్టెలు కావలసియుండును. అంతయుడికినను పప్పుమెత్తబడదు. "మీరిచ్చినపప్పు చక్కగానుడుకలే"దని యడిగిన,యది నీళ్లదోషమునియో, కట్టెలదోషమనియో, పొయ్యిదోషమునియో, వంటచేయువారి తెలివితక్కువవలననని యో, తినెడివారి కర్మమనియో సమయానుకూల్యముగా సమాధానము చెప్పిపంపుదురు. పప్పులు రుచిగాయుండవని ముడివిగానే తీసుకొనిపోయి తాము పప్పులు తయారుచేసుకొననెంచి యెవరైనను కొనిపోయి చేయబూనినచో, సేరునకు పావుసేరుగింజలు నిలుచుటేకష్టము, రాళ్లును, యిసుకయు, తరకలును, పుచ్చినబుడ్డలును. మూడుపావుసేరులు గట్టిగాయుండును. "మీయొద్ద వస్తువులన్నియు నుండినట్లు కనుపడలేదే!" యనిన "జావండీ! ఎట్లుమరి; స్టోరు క్రొత్తగా యేర్పాటుచేసినాము. కూర్చుండిగదా పండుకొనవలయును. క్రమముగా చేర్చుకొనవలయునుగాని, తొందఱపడవచ్చునా? అదియునుగాక తక్కినవారివలె డామేజానరుకులు తెచ్చిపెట్టునట్లైన యెంతసరుకునో తేవచ్చును. మేమటుల చేయము. మేలైనవస్తువులుగాని కొనివచ్చిపెట్టము. మాకుగలదంతయు, సుద్యోగస్థులు సంపన్నులునైనవారితో వ్యాపారము. అడవసరుకు తెచ్చియిచ్చితిమేని మాపేరు చెడిపోవును. గౌరవము దక్కదు. మఱియొకసారి మీరు మాస్టోరునకువచ్చితిరేని యపుడు మీకు తెలియుగల"దని సమాధానముఁ జెప్పుదురు. వెలయందుగాని,సరుకు నాణెమునందుగాని కొంచెమైనను, ఈస్టోరులు మొదలైన చిల్లరసామానులనమ్మెడిచోటులలో లాభ మించుకైనను కనుపించదు. కాయ్యధాన్యములు కొలుచుటలో సేరుకు నవటాకు తక్కువయుండును. తూనికయున్ననో, వస్తువును తటాలున త్రాసులో పడవేయుదురు. ఆయురువడికి త్రాసుకట్ట క్రిందికి మ్రొగ్గును. అది పైకిలేచుటకుముందె యందలివస్తువును తీసి కాకితములో పెట్టుదురు. తీసుకొనువాఁడు తనయందు గౌరవమునుంచి చాలామ్రొగ్గుగా తూచియిచ్చినారని తలంచును. గాని యింటికికొనిపోయి తూచి

నచో వీసెకు ముప్పాతికవీసె గట్టిగాయుంచును. ఎవడైన కొంచెము యెక్కుడుగా సామానులను తీయుటకు వచ్చినయెడల పట్టీప్రకారం అన్నియు పొట్లములుకట్టి యేదో యొకవస్తువును యివ్వక ముగించి బహుచాతుర్యముగా వస్తువులసంఖ్య సరిపోవునట్లు లెక్కించి తీసుకొనువానిబుట్టలో పొట్లములువేసి సరిపెట్టుదురు. అపుడు తెలుసుకొనలేక యింటికిపోయినతరువాత యొకవస్తువు నివ్వలేదనియెఱింగి మరలవచ్చి యడిగినయెడల "ఏమండీ! ఇటువంటిన్యాయముకూడా యుండునా? మీ కంట్లయెదటనేకదా పొట్లములు లెక్కపెట్టివేసితిని మీరుచూచుచుండియు, మరలవచ్చి యడుగుచున్నారే! ఏమనవచ్చును. దారిలో నెక్కడనోపడవైచియుందురు. అంతేగాని మేము లెక్కప్రకారముగా నన్నియు నిచ్చినా"మని జవాబుచెప్పుదురు. కొలతయందును, తూనికయందును, వెలయందును, పనికిమాలినవస్తువులను మంచివనినమ్మించి యిచ్చుటయందును చిల్లరసామానుస్టోరులందును, చిన్నయంగళ్లయందును, వారుచేయుమోస మనంతమైనదై యుండును. వీరితంత్రములును మాయలునుం దెలిసికొనుటకు సృష్టికర్తకునయితము సాధ్యముకాదు. ప్రజల నివ్విధముగా మోసముచేసి డబ్బుసంపాదించి మిద్దెలుమేడలు గట్టుకొని తమకంటె లేరని విఱ్ఱవీగుచుండెడి ఈమహాపాతకులు యేనరకము ననుభవింపదగినవారో, వీరిగతి యెట్లగునో తెలియదు. వీరెంత నమ్రతగా మాటలాడుదురో, యంత కపుడుగలవాడై యుండుదురు. కావుననే "నమ్మకుమంగడివానిని" యని సుమతిశతకకర్త చెప్పినాఁడు. జనులారా! మీరు సరకులుకొనుటకు పోయినపుడు బహుజాగ్రతగా యుండవలయునుసుండీ! లేనియెడల వీరిచే టోపీవేయించుకొని రాకతప్పదు. పాపభీతిలేని యీకపటాత్ములమాటలను నమ్మినచో తప్పకనష్టముసంభవించును. ఎచ్చరికగలవాని కెప్పటికిని చేటుకలుగదు.

ఆ. చెడినసరుకులెల్లఁ జెప్పియంగడిఁబెట్టి
మంచివనుచు జనుల మాయఁజేసి
తగుటగట్టివారని ధనముగడింతురు
వస్తుచయము విఱచు వారలెపుడు.



# యాత్రాస్థలవాసులు చేయు మోసము.

తిరుపతి, చిదంబరము, రామేశ్వరము మొదలుగాగల మహాస్థలములలో కొందఱు బ్రాహ్మణులు ఎట్లో రెండుమూడు యిండ్లొకఁడో కఁడను సంపాదించియు కొన్నియిండ్లు పదిపండ్రెండు సంవత్సరములకు మొత్తము చౌకబాడుగకు తీసిపెట్టుకొనియు నుందురు. వీరియొద్ద గుమాస్తాలు కొందఱుందురు. ఈగుమాస్తాలలో యొక్కొకనియొద్ద యొక్కొక పెద్దపుస్తకముండును. అందు తత్పూర్వమా క్షేత్రమునకు యాత్రకై వచ్చి తమయిండ్లలో బసచేసి పోయినవారుండు జిల్లా, తాలూకా, గ్రామము, వారియింటిపేరు, తాతపేరు, తండ్రిపేరు, అన్నదమ్ముల పేరులు, వచ్చినవానిపేరు, వృత్తి, వచ్చిన తారీఖు, పోయిన తేది, మఱియుం గుర్తింపదగినయంశములు వరుసగా వ్రాయబడియుండును. గుమాస్తా తెల్లవారగానే సంతుష్టిగా కాఫి, దోసె, యిడ్డలి, ఉప్పుపిండి, భుజించి, యజమానుఁడు తమకుతీసియిచ్చియుండెడి సీజన్ టిక్కట్లును, పుస్తకములుం దీసుకొని రైలునెక్కి, వాడుకయాత్రికులు వచ్చుచుండు దిశనుగూర్చి నలుబదియేబది మైళ్లవరకునుంబోయి, జంక్షనుగాయుండే స్టేషనులోదిగి యటునిటుందిరిగి యచ్చటికివచ్చి రైలుదిగుచున్నవారిని చూచి, వారియూరును, పోయెడిస్థలమును, విచారించుచుండుదురు. ఎవరైనను తిరుపతికో, రామేశ్వరమునకో పోవువారుగా తోఁచినయెడల, ఎక్కువపరిచయము కలవారివలె వారియొద్దకుపోయి, వారినివాసస్థలమును, పేరులును, ఇంటిపేరులను విచారించి వారుచెప్పిన తాలూకా, గ్రామము, పూర్వమాగ్రామమునుండి యెవరయినను యాత్ర వచ్చియుండినయెడల యామనుష్యులపేరులు తమపుస్తకములో వెదకి చూతురు. గ్రహచారముచాలక, తత్పూర్వమెవఁడయిననొకఁడు వారు చెప్పిన గ్రామమువాఁడును, వారిలోయొకరిదేదో యొకయింటిపేరుగల వాఁడును నుండినయెడల "ఓహో! మీరుజగన్నాథరావు నాయుఁడు గారి యిలాకావారా? సరే! అలాగైతేమీరువారే! మీమొనలికో ఆగ్రామము వారెవ్వరువచ్చినను వారుమాయొద్దకేవచ్చెదరు. జగన్నాథరావు నాయుడుగారితండ్రి వరదప్పనాయుఁడుగదా! వారుముగ్గు రన్నదమ్ములు. చాలాభూస్థితిగలవాఁడు. మంచివాఁడు, వారుమువ్వు

రుషు దైవభక్తిగలవారు. ఇచటికి యాత్రవచ్చి మాయిలాకాలో బస చేసి నెలదినములుండిపోయినాడు. వారి కేలాటిలోపమును కలుగకుండునట్లు మేము సప్లయిచేసి యినాములు సయితము పుచ్చుకొన్నాము. మీగ్రామమువారు విశేషముగా నెవ్వరునుయాత్రవచ్చుటలేదు. ఏమి? వారందఱును క్షేమముగాయున్నారా? నన్ను తమగ్రామమునకొకసారి రమ్మనిచెప్పిపోయినాఁడు. కాని, ఈయుద్యోగములోనుంచి తీఱుబడియే యుండదు దినదినము నెందఱోవచ్చుచుందురు. మాకుసంబంధించిన యిండ్లలో బసచేసినయెడల సౌఖ్యముగా నుండుననియు తీర్థస్నానములు, స్వామిదర్శనమును చక్కగానగుననియు, మాలిస్టులోనుండువారలుమాత్రమేకాక, వారివలన తెలిసికొని శిఫారసుజాబులతో యెందఱోక్రొత్తవారుసయితము వచ్చుచుందురు. ఇదిగో! పుస్తకమును చూడండి. మీజిల్లాలోని వారలపేరు లెన్నియున్నవో తెలియును. వీరందఱును మమ్మెఱింగి మాయొద్దకువచ్చినవారే!"యని గడగడమని నూరుగ్రామములును, నూఱుగురుగొప్పవారలుగా యుండువారిపేరులును, వారితాతలు, తండ్రుల పేరులును, నివసించుగ్రామముల పేరులును,చదువును. ఆయాత్రికులసంఘములో ముఖ్యుఁడుగా యుండెడివాఁడును, మఱికొందఱును బుక్కుసందలిలిస్టునుచూచి నివ్వెఱపోవుదురు. అపుడు ముఖ్యుఁడుగా యుండెడివాఁడా గుమాస్తానుచూచి "ఏమండీ! చాలా వివరంగావ్రాసియున్నారే! ఇందుమీరుచదివిచెప్పినవారందఱును,మా జిల్లాలోనివారలే! చాలాగొప్పవారు ఆలాగా? వారందఱును, బస చేయడము మీయిలాకాలోననేనా? మంచిదికాని, మీరెవరండీ! మీ పేరేమి? ఇదేయుద్యోగమా? మీకు" అనియడుగును. గుమాస్తాయతనితో "మేముగుమాస్తాలమండీ! యజమానుఁడువేరేయున్నాఁడు. ఆయనయూరువిడిచి వచ్చేవాఁడుకాఁడు. గొప్పధనికుఁడు. ఆయనకిదేవ్యాపారము. గుమాస్తాలమైన మేమే యన్నిపనులు చూచుచుందుము. యజమానుఁడు హాయిగాయింటనుండి మీవంటియాత్రికులు వచ్చినపుడు తగినబసలుచూపి, వారికికష్టముకలుగనీయక, స్వామిదర్శనము, తీర్థములుసేవించుట మొదలైనపనులు సుఖముగాజరుగునటుల తగినయేర్పాటులు చేయుచుండును. ఇటువంటి వ్యాపారముఁజేయువారు ఇంకను పెక్కండ్రు కలరు. ఒక్కొకరియొద్దను నలుగురు, నైదుగురు గుమా

స్తాలుండెదరు. వారునలువైపులకుంబోయివచ్చెడి యాత్రికులను కలుసుకొని తమలీస్టులో సంబంధించినవారిని స్వతంత్రముతోడను, లేక క్రొత్తవారుగాయుండినచో వారియిష్టముమీదను వెంటబెట్టుకొనివచ్చి తగినబసచూపి సహాయముచేసి వారిదయ సంపాదించి బహుమానములు పొందుచుండుదురు. యజమానులకు యాత్రికు లిచ్చునట్లు యేర్పాటు చేసికొనెడికట్నములో గుమాస్తాలకు దమ్మిడియైననులభింపదు. యాత్రికులయిష్టప్రకారముగా కూడాయుండి యాత్ర చక్కగాజరుగునట్లు చేసినచో కష్టపడినందుకుగా కనికరించి వారేదయినా యిచ్చునదే గుమాస్తాలకులాభము. లేకున్నచో యేమియును లేదు. యాత్రికులను తెలిసికొని తోడ్కొనిపోయి బసచూపినది మొదలుకొని వారలను తమస్థానమునకు ప్రయాణమై రైలునెక్కువర్యంతము, వారితోకూడా యుండి వారికి కావలసినవన్నియు జాగ్రతగా సహాయముచేయవలసినభారమంతయు గుమాస్తాల తలమీదనేయుండును వారికేమిలోపము కలిగినను యజమానుడు జీతములో జరిమానాక్రింద కొంతపట్టుకొనుటయో, లేక యజాగ్రతమనిషియని యటువంటిగుమాస్తాను తొలగించుటయో, యేదో యొకటిచేయును. కాబట్టి కడుజాగ్రతగా మెలంగవలసియుండును. ఇటువంటిగుమాస్తాలు తక్కినవారి యందఱియొద్దనుండు. వారికంటె మాయజమానునియొద్దనధికము. పదిమందిగుమాస్తాలమున్నారము. మంచిపేరుపొందినాము. కావున మాయజమానునియొద్దకు సంఘ మెక్కుడుగాచేరును. మాక్షేత్రములో యుండెడివారిలో, ఆయనకుగల మరియాద మఱియెవ్వరికిని లేదు" అనిచెప్పెను.

ముఖ్యుడు:—మీరుగుమాస్తాగారా? మీకుజీతమునిచ్చెదరా?

గుమాస్తా:—ఔను జీతమే! నేనువారిగుమాస్తానే!

ముఖ్యు:— ఎంతజీతము నిచ్చెదరు?

గుమా:—నెలకుముప్పదియిచ్చెదరు. చాలాతక్కువ. మేముపదెకి ప్రయాణకు నూఱురూపాయలివ్వవచ్చును. గాని, యిదియిచ్చుటకే వారికి యధికముగాతోచుచున్నది. అడిగితే యాత్రికులు మీకు బహుమానమిచ్చుచుండలేదా? అంటారు. ఏమిజేయవచ్చును? ఈపనిని మానుకొనవలయునన్న మాదిపెద్దకుటుంబము. జరుగుబాటుతక్కువ. అదియునుగాక యెవడైన నొకగుమాస్తా యే

కారణముచేతనయినను, నిలిచిపోవునట్లుండిన నూఱుగురుకనిపెట్టుకొనియుందురు. కాఁబట్టి మా స్థితి చౌకలోనికివచ్చినది. అజీతము మాట యెట్లుండినను, మంచివాఁడగుటబట్టి మేమాయనను విడువజాలకున్నాము. చాలా కాలమునుండి యిట్లే కాలము గడచుచున్నది.

ముఖ్యుడు:—మీరుమాకు దర్శనము చేయించడము మొదలైన పనులు శ్రద్ధగా జరిగించెదరా? కూడా నేకడాయుంటారు నమ్మకమేనా?

గుమాస్తా:—ఏమండీ? ఈలాగుననడుగుచున్నారు. మా యుద్యోగమే యనిదైయుండగా, మాకు వేఱుపని యేమియున్నది. ఏమియు లోపముకలుగదు.

ముఖ్యుడు:—సరే! కాని మీయజమానుడిగారియింట బసచేయుటకు మంచివసతి కలిగియుండునా? మాకు స్థలము విశాలముగా యుండవలెను.

గుమాస్తా:—దివ్యభవనములండీ! మీవంటి గొప్ప వారునివసించుటకు తగియుండులాగున యెంతో డబ్బు వెచ్చపెట్టి వేఱువేఱుగా కట్టించియున్నాడు. హాయిగాయుండవచ్చును. నీటికొళాయిలు, విశాలములైనదొడ్లు సకలమును కొఱవలేకయుండును. మీస్వంతమైనయింటిలోవలె నుండవచ్చును.

ముఖ్య:—ఆయనకిండ్లు యెన్నియున్నవి?

గుమా:—వారునివసించునదిగాక యిరువదియున్నవి. అన్నియు నిర్మలముగానుండును. చూచి మీకెందునమ్మతమో యందుండవచ్చును.

ముఖ్య:—ఆయన కివ్వవలసినకట్న మెంతమాత్రముగానుండునో.

గుమా:—దానిని మేముచెప్పడమునకు సాధ్యముకాదు. మీయిష్టము. వారియిష్టము. ఎంతయిచ్చినను యివ్వవచ్చును. మహాక్షేత్రమునకు యాత్రవచ్చినవారి నింతమాత్రమివ్వవలసినదని వారడుగనేయడుగరు. వచ్చినవారే తమ శాయనచేయు మరియాదను చూచి సంతోషించి నూఱో యిన్నూఱో యిచ్చిపోవుచుందురుగాని వారుగాయేమియునడుగరు. పేదవారైనచో దానికితగినట్టు—

ముఖ్యుడు:—మంచిదిగాని మీయజమానుల వారిపేరేమి?

గుమా:—వారిపేరు భేతాళభట్టు దీక్షితశాస్త్రిగారు ఈయిండియాదేశములో వీరిపేరు యెక్కడను ప్రసిద్ధియే! అందఱు నెఱిగినదే యుండుదురు మహాయోగ్యులు.

ముఖ్య:—అట్లా! గొప్పపేరుగలవారే! ఇంటిపేరో?

గుమా:—పాతాళభేదివారు. మాపట్టణములో యీపేరుగలవారు వీరొక్కరే! కావున సుళభముగా తెలిసికొనవచ్చును.

ముఖ్య:—మీ యింటిపేరును తమపేరునేమండీ!

గుమా:—నాపేరు బొంకయ్యయంటారు. పుట్టినబిడ్డలు బ్రతుకకపోవుచున్నందున తల్లిదండ్రుల యీపేరు బెట్టినారట. మాయింటిపేరు మాయలవారు.

ముఖ్య:—ఓహో! మాయలబొంకయ్యగారా? సరే! కాని—

గుమా:—రైలునకు టయుంఅయినది. ఇంక ఆలస్యము చేయకూడదు. టిక్కట్లు తెమ్మనెదరా?

ముఖ్య:—ఎన్నిగంటలకు చేరుదుము? చీకటిపడునా?

గుమా:— ఇంక మీకావిచారమేల? ఏకష్టమును కలుగనీయక మిమ్ము తోడ్కొనిపోవలసిన బాధ్యత నాయందున్నది.

ముఖ్య:—మంచిది. యిపుడు యేమిచేయమనెదరు?

గుమా:—చేయుడమేమిటిది. టిక్కట్లకు చార్జియివ్వండి తెచ్చెదను. అన్నిపనులును నేను చూచుకుంటాను. మీకేదియునక్కఱలేదు. డబ్బును కావలసినపుడు యిచ్చుచుండిన చాలును

ఇట్లు కడుచాతుర్యముతో తనయందు నమ్మకముకలుగునట్లును, కనికరము పుట్టునట్లును,సమయోచితముగా మాటలాడి వారిజట్టీ నంతయును,తనమాటప్రకారంవచ్చునట్లు చేసుకొనును. యాత్రికులు 20,40 మందియో యుండుదురు, స్త్రీలు పురుషులు బాలురు బాలికలు, లెక్క చేసి, తనతోకూడా ఇరువదియో ముప్పదియోనూపాయలు మొత్తము కావలయుననియు, "టిక్కెట్లుయిచ్చేవానిచేత నేదైనా కొంచెముపెట్టని యెడల సంఘమునకంతయు నొకటేప్యాసు యివ్వడు. వేఱువేఱుగా తీయవలెనంటే యాలస్యమగును. బండ్లలో జనమెక్కుడగుటచే స్థలము లేకుండును. మూటలు ముల్లెలుంబెట్టుకొని యక్కడక్కడ నొక్కొకరు

కూర్చుండుటకు వలనుగాదు. అందఱు నొకబండిలోనే కూర్చుండవలయును. ఇదిగాక టిక్కెట్లు పరీక్షించువానికిని, గార్డునకును, కొంచెము చేతబెట్టవలయును. దానికి సందేహించితిమా? యెన్నోచిక్కులుపెట్టుదురు. చిన్నచిన్నమూటలకును పెట్టెలకును సయితము చార్జికట్టవలయుననియు పాలుత్రాగెడిబిడ్డలకుకూడా అర్ధటిక్కెట్లు తీసుకొనవలయుననియు తొందఱపెట్టుదురు. తటాలున మూటలు క్రిందవేసి మనుష్యులను దింపివేయుదురు. దుర్మార్గులండీ! మీావైపునజరిగినట్లు యిచ్చటజరుగదు. వీరు గొప్పలంచగొండీలు. ఇదిగాక పోర్టరులయుపద్రవ మొకటియున్నది. మూటలు బండ్లలోపెట్టుటయు, గార్డుమాటప్రకారం మనకుగా నొకబండి జనులులేకుండచేసి కూర్చుండబెట్టుటయు వారిపని. యేదోకొంచెము వారికిన్ని చెప్పవలయును. అంతమట్టుకునుమేలనండి! మేము వాడుకగా వచ్చుచుంబోవుచుయెఱిగియున్నవారముగుటచే ఒకమాదిరిగాపోతుంది. మీారేమైనచో యెంతోడబ్బు నూడబెఱుకుదురు. రైల్వేయుద్యోగస్థులకు ధర్మచింతయు పాపభీతియులేదు"అనిచెప్పి ఆకెలవులకుగా రెండోమూడోరూపాయలున్నూ టిక్కెట్లుమొత్తమున్నూ తీసుకొని, ఆమొత్తములో రహస్యముగామాటలాడి గార్డునకురెండురూపాయలును, టిక్కెటు పరీక్షించువానికొకరూపాయయునిచ్చి, ఏయిరువురుకూలివాండ్రకో నాలుగణాలిచ్చునట్లు మాట్లాడి యేదోయొకబండిచూచి యందు మూటలువేయించి యొకరిమీాదనొకరుగా యుండఱు అదేబండిలోన తొందఱపెట్టి టిక్కెట్లులేకనేయెక్కించి మహాప్రయాసబడినవానివలె నిట్టూర్పులువుచ్చుచు, వారిచ్చినరూపాయలన్నియు మూటగట్టుకొని తానును యెక్కెను. తత్పూర్వమే యాబండిలో మనుష్యు లెక్కుడుగా కూర్చుండుటకు స్థలములేక గీ!గా! యనియఱచి, యొకరితోనొకరు పోట్లాడుటకారంభముచేయుదురు. గుమాస్తాగారు సమాధానముచెప్పి మెల్లమెల్లగా నొక్కొకరినిగా మనుష్యులసందున నిరికించుచుండును. యాత్రికులా మహానుభావునిచూచి "ఏమండీ! మీారడిగినప్రకారము డబ్బునిచ్చితిమిగదా! ఈపాడుబండిలో యెక్కించినారే! ఇచటనిలుచుటకు సయితము చోటులేకున్నది. బండి కాళీచేసి యెక్కించెదరనిగదా చెప్పితిరి. ఏదీమఱి, కూర్చుండడమెక్కడ?"యని యడిగినయెడల "వారు మాత్రము యేమిచేయుదురండీ! పాపము! నేండేమో ప్రయాణికులసం

ఖ్యయెక్కువయినది. యీపాడుబండిలో యొక్కొకనాఁడిట్లే తటస్తించును. ఇంతమట్టుకును మనకుదొరికినదానికే సంతోషింపవలయును. లేనియెడల రేపటివరకు నిచ్చటపడియుండవలసినదే! మనకుగా గార్డును, టిక్కెట్టుకలెక్టరును చాలాప్రయాసపడి చాలామంది టిక్కెట్లు తీసుకొన్నవారినినయితము నిలిపి మనలనెక్కించినారు. మనము తడవుచేయక ముందుగానే వచ్చియుండవలసినది. నేనెంతత్వరపెట్టినను మీరు కదలరయితిరి. మనకంటె ముందువచ్చి టిక్కెట్లుతీసుకొని వీరందఱును వచ్చి కూర్చుండిరి. ఇటువంటివారిని దింపుటకు సాధ్యమగునా? సరే! కొంచెముతడవుకష్టపడితిమే పోయిచేరెదము. కానిండు. ఏమిచేయుదము? ఈ నడుమ నొకనాఁడును నిట్లేజరిగినది. పాపము విశాఖపట్టణం జిల్లావారు చాలాధనికులు వచ్చినారు. ఆదినమును, నేనే వారిని పిలుచుకొనిపోవుచుంటిని ఈరీతిగానే బహుసమ్మర్దము నిలుచుటకయిన నిపుడొకింత వీలున్నది. నాఁడుదానికినయితము కష్టమయినది. కొంచెమస్థలముచూపినచో నెంతడబ్బునడిగినను యిచ్చెదమని నాచేతనేపదిరూపాయలిచ్చి గార్డుమొదలయినవారిని మంచిచేసుకొనుమని చెప్పినారు. ఆపదిరూపాయలును కర్చుపెట్టినాను. దానితునకు ప్రయోజనము కలుగనే లేదు. కడవరకును పాపము! నిలిచియేయుండిరి. ఇబ్బందిసమయములలో యా యుద్యోగస్థులకును సాధ్యముకాకపోవును. ఇప్పటికిది. మేలని యెంచుచున్నా"నని సమాధానము చెప్పును. డబ్బు బోఁగొట్టుకొని కూర్చుండుటకుతావులేక వారునానాకష్టములననుభవింపుదురు. తాముదిగవలసిన స్టేషనునకు యీవలనుండెడి చిన్నస్టేషనులో నెందయినా యేదోపని యున్నవానివలె గుమాస్తాదిగి, యందలిమేష్టరునకు యెనిమిదణాలులంచమునిచ్చి యచ్చటనుండి చిన్నవాళ్లకు లేకుండా, పెద్దవారలకుమాత్రము యేదో పదిటిక్కెట్లు రహస్యముగాతీసుకొని జేబులో పెట్టుకొనివచ్చి కూర్చుండును. అక్కడ బండి యెక్కువకాల మాగనిచో నైనను డబ్బు తీసుకొనియున్నగార్డుగారు టిక్కెట్టు గుమాస్తా తీసుకొనియెక్కువరకును నిలువఁజేయును. ఆలాగు జరిగినతరువాత బండికదలిపోయి దిగవలసిన స్టేషనుచేరును. గుమాస్తా ముందుగానేదిగి తమకువాడుకగా పనిచేయు కూలివానినిపిలిచి మూటలు దింపుమని యాత్రికులను దిగుమని చెప్పి, శీఘ్రముగాటిక్కెట్లుతీసుకొనెడివానిచే తాను తెచ్చినపదిటిక్కెట్లును రహ

స్యముగా నాలుగణాలునుం బెట్టి వారినందఱిని గేటువెలుపటికితోడ్కొని వచ్చును. కూలివాండ్రిద్దరో ముగ్గురో మూటలు పెట్టలుకొనివచ్చి వెలుపటబండ్లదొడ్డియొద్దదించి తమకుకూలియడుగుదురు. యాత్రికులలోను ఖుర్సుఁదైనవాఁడు. "కూలివానికెంతయివ్వవలయు" నని గుమాస్తా నడిగినచో "అదినేనుచెప్పకూడదు మేమందఱము నొకయూరిలోని వారమగుటచే మోమోటపడవలసివచ్చును. నేనివ్వఁబోయినయెడల యెక్కువయుఁగును. కనుక, అదిమీరే యేదోయొకలాగున నిచ్చిపంపివేయు" డని యటువైపుతిరిగి తా నెఱిఁగినమఱియెవరితోనో మాట్లాడుట కారంభించును. కూలివాఁడు తొందఱచేయుచుండుటచే యాత్రికుఁడు "ఏమబ్బా! ఎంతయివ్వమనియెదవు? చెప్పుము?" అనియడుగగా వాడుకపడియున్నకూలీలు "ఏమిసామీ! మీకుచెప్పవలయునా? కష్టము చూచియివ్వండి. మఱి యెవ్వరియొద్దనయినా యెక్కువతీసుకొందుము గాని, అయ్యగారు పిలుచుకొనివచ్చినవారగుటచే మిమ్ము మేమధికము గానడుగఁజాలము. వారు మాపై కోపగించుకొందురు. ముగ్గురమనుష్యులము తెచ్చినాము. ఒకటిన్నరరూపాయలివ్వండి. అంతకెక్కుడు కోరము" అనిచెప్పుదురు. "ఇదేమి? అన్యాయముగాయున్నదే! పగటిమోసగాండ్రుగా కనుపట్టుచున్నారు. రెండణాలుయిచ్చిన తీసుకొనివచ్చెడి యీమూటలకు రూపాయిన్నర కూలియా? బేష్, బాగానే యున్నది. మేమంతయివ్వము. నాలుగణాలు, లేక అయిదణాలకంటె యెక్కువయిచ్చుటలేదు. తీసికొని పోం"డని చెప్పిన, వారొప్పుకొనక తగవులాడుట కారంభింతురు. అపుడు గుమాస్తా కూలివాండ్రతో "ఏమిరా! పోరు. మీకెప్పుడును దురాశయధికము. సమయము గుర్తెఱుంగరు. మనుష్యుల నాణెమును తెలుసుకొనరు. ఎప్పుడును పెనగులాడుచుండెదరు. ఏదోయొకయణా యెక్కువయో తక్కువయో, తీసుకొనిపొం"డని పలుకును. వారు మేము యెక్కువగాయడుగలేదు సామీ! మిమ్ము చూచినంతట యేటుల నడుగుదుము? ముగ్గురకు రూపాయన్నర యివ్వమంటిమి. అంతే! అదికూడా యివ్వనంటారు. మాకుయిచ్చే కూలిలోనా? అన్యాయము చేయడము. ఎంతోకర్చు పెట్టుకొనివచ్చి మానోట మట్టివేయుడమా? మొన్ననొకలంజకొడుకు యాత్రకనివచ్చి మమ్మన్యాయము చేసిపోయినాఁడు. వాఁడు మట్టిలోకలిసి పోతాఁడు.

పేదవారమైన మమ్మన్యాయము చేసినవాఁడు బాగుపడునా? వీరినిచూడగానే సంతోషమైనది. యీమహారాజు లిట్లు చెప్పుచున్నా"రని వానిమీఁదను, వీనిమీఁదనుంబెట్టి నానావిధములైన తిట్లుం దిట్టుదురు. గుమాస్తా మధ్యస్థముగా మాటలాడి యొకరూపాయ నిచ్చి పంపుడని తీర్మానించును. విధిలేక యాత్రికుఁడు మహాక్షేత్రమున నడుగుబెట్టగానే డబ్బుఖర్చుపెట్టుటకు విఘ్నేశ్వరప్రార్థనచేసినలాగున వారికి రూపాయ సమర్పించును. అంతట, బండ్లవాండ్లు ఒకరిమీఁద నొకరుపడి వచ్చి "ఏమండీ! సామానులు బండిలో పెట్టమనెదరా?" యని యడుగ నారంభింతురు. గుమాస్తా కనుసంజ్ఞచేసి యాత్రికుల నాయకునిం జూపి యెడముగా తొలఁగి యితరులతో సంభాషించుచుండును. యాత్రికుఁడు బండివానిని "బాడుగయెంత?" యని యడిగినచో "ఎక్కడికి పోవుటకండీ, సత్రముదగ్గరకా? మఱి యేయయ్యగారియింటికైననా? చిటికెలో తీసుకొనిపోయెదను. క్రొత్తగాకొన్నయెద్దు గుఱ్ఱమువలె పరుగెత్తును. బండిచూడండి" యనును. యాత్రికుఁడు. అన్నియును బాగుగనే యున్నవి కాని బాడుగ మాటయేమి? యని యడుగును. బండివాఁడు, "పోవలసిన స్థలమునుచెప్పినగదా! బాడుగమాట. యెక్కడదిగెదరు? మీరీయయ్యగారియిలాకావారా?" అనియడుగును.

యాత్రికుఁడు:—ఔను, భేతాళభట్టు దీక్షిత శాస్త్రిగారి యింటికిపోవలెను.

బండివాఁడు:—సరే! అలాగైతే మామూలుయేర్పడియేయున్నది. ఇంక చెప్పవలసినదియేలేదు. ఆమామూలు ప్రకారమే యివ్వండి.

యాత్రికుఁడు:—మామూలెంత? మాకు నాలుగుబండ్లు కావలెను?

బండివాఁడు:—పదిబండ్లు తెమ్మనినను తెచ్చెదము. మాకు యిచ్చేమామూలు అయ్యగారికి తెలియదా? వారినడగండి!

యాత్రికుఁడు:—నీవు చెప్పవోయి, వారి నడుగమనెదవేల?

బండివాఁడు:—ఈయయ్యగారియిలాకా చాలాతక్కువబాడుగ. చాలాదూరము బండికొకరూపాయ యివ్వవలెను.

యాత్రికుఁడు:—ఓయి బాబూ! అంతబాడుగా? దగ్గఱనేకదా?

బండివాఁడు:—ఎక్కడదగ్గఱండీ! ఒకటిన్నరమైలు పోవలయును?

యాత్రికుఁడు:—బండియొకటింటి కర్ధరూపాయ యిచ్చెదము.

బండివాఁడు:—ఓహో? అలాగా! మేమురాఁజాలము పొండు.

ఇట్లు మాటలాడుచుండగా గుమాస్తా వారియొద్దకువచ్చి యుభయుల మాటలునువిని యాత్రికులకు తానే మోసహాయము చేయువానివలె బండ్లవాండ్లనుకసరి తగవులాడువానివలె నభినయించి కోపముతో "ఓరే! అత్యాశవలన లాభములేదు బండికి ముక్కాలురూపాయయిప్పించెదను. యిష్టమున్నయెడల నాలుగుబండ్లు కట్టండి. లేదో పొండు. నేను ఊరిలోనికిపోయి వేరేబండ్లు కట్టించుకొని వచ్చెద"నని బహుఖండితముగా చెప్పును. "ఏమిసామీ! మమ్ము మీరిట్లు అన్యాయముచేసెదరు. ఏమిబాడుగండీ! ఈబాడుగలు తీసుకొని మేము జీవించడమేలాగునండీ!" యని యిక్కిలి వేసటతో బండ్లుకట్టుదురు. గుమాస్తా వారలను బండ్లపై మూటలతోకూడా యెక్కించి, తానుముందుగా యజమానునియొద్దకుపోవును. అతడు గుమాస్తానుచూచి ఈదినము వలలో మృగము లేవై నంజిక్కుకొనినవా? నిష్ఫలమేనా? అనును.

గుమాస్తా:—బయలు దేరిపోయినవేళ మంచిది. పెద్దజట్టిచిక్కినది.

యజమానుడు:—కొంచెము రక్తముగలజంతువులేనా! బక్కటిల్లినవా!

గుమాస్తా:—అధికమునుగాదు. తక్కువయునుగాదు. మధ్యము అయినను ఫరవాలేదు. వారిని పూర్ణముగా లోబఱచుకొన్నాను. మన మాడించినట్లెల్ల నాడులాగు చేసినాను. వచ్చుచున్నారు. ఇంక మీఁద మీయిష్టము. వారియొద్ద డబ్బు యెక్కువగాయున్నట్లే తోఁచుచున్నది. బహుచమత్కారముగా లాగవలయును. అది మీపని.

యజమాఁడు:—అంతమాత్రము తెలిపిన చాలును. నాకు నేర్పవలయునా? ఎందఱో యిటువంటిరెండాయులు మనచేతులలోచిక్కి హాజామత్ చేయించుకొనిపోయినారు వీరొక లెక్కయా? ఏరీవారు.

గుమాస్తా:—పాపము! ఆబండ్లవాండ్లకు నాలుగురూపాయలు చిక్కునట్లు చేసినాను. వారటునిటుంద్రిప్పి తీసుకొనిరాగలరు. వచ్చుసమయమే.

ఇట్లు యజమానుఁడును గుమాస్తాయును మాటలాడుచుండగా, రైలుస్టేషనునకును, వారియింటికిని ఫర్లాంగు దూరమునకు తక్కువగానేయున్నను బండ్లవాఁడ్లు క్రొత్తవారైన యాత్రికుల నటునిటు రెం

డు వంకరటింకరవీధులుత్రిప్పి యీశాస్త్రులవారి వాకిటికివచ్చి బండ్లునిలు పుదురు శాస్త్రులువాకిట నరుగుపై చిటిచాపవేయించియొకగుడిండున కానుకొని కూర్చుండి తమలపాకులకట్ట ముందుబెట్టుకొని వక్కాకులు నములుచుండును. యాత్రికులు బండ్లలోనుండిదిగుదురు. బండ్లవాండ్రు వారిమూటలు మొదలగు సామానులనుదింపి బాడుగకై నిలిచి యుందురు. ఇంతలో గుమాస్తా యాత్రికుల ముఖ్యునియొద్దకువచ్చి రహస్యముగా "అదుగో! ఆయనయే యజమానుఁడుపోయిమాటలాడండ"ని చెప్పును. అతఁడును మఱికొందఱునుంబోయి శాస్త్రులవారికి దండములు బెట్టుదురు. వారుబిగ్గఱగా "ఓరిరామా! మెట్టాళ్. ఎక్కడరా పోయి నావు. శీఘ్రముగా నాలుగుచాపలు తీసుకొనిరా!" యని చెప్పును. లోపలనుండి వడివడిగా సేవకుఁడొకఁడు చాపలుతెచ్చివేయును. శాస్త్రులవారు వారినికూర్చుండ నియోగించి, క్షేమలాభములును, వారికి సంబంధించిన బంధువులు మొదలైనవారు తత్పూర్వము యాత్రకువచ్చిపోయిన విషయములును, కొంతతడవుసంభాషించును. అతనిప్రసంగమంతయు బహుగంభీరముగను, శ్లాఘనీయముగనునుండును. తరువాత యాత్రికులలో ముఖ్యుఁడైనవానితో "ఏమండీ! మాగుమాస్తాను వెంటబెట్టుకొనిపోయి మాయింట్లలో మీకెచటనుండుటకు నమ్మతమోచూడండి సామానులచ్చటికి చేర్పించెదము. ఒకటేసారి చెప్పుచున్నాను మీ కేమికావలసియుండినను, మాగుమాస్తాతో చెప్పిన చాలును మీరేలాటికష్టమును పొందవలసినదిలేదు. అన్నియునతఁడు మీకు తెచ్చియిప్పించుచుండును. ఇచట మీస్వగృహములలో యున్నట్లే యుండవచ్చును. తక్కినవారివలె మేమువచ్చిన యాత్రికులకేలాటియిబ్బందియుం గలిగించెడి వారముకాము అన్నియుం జక్కగా యేర్పాటుచేసియున్నాము. ఏకొఱంతయునుండదు. మీకు దేవుని దర్శనముగాని, తీర్థస్నానములుగాని చక్కగాజరుగులాగునచేసెదము. ఎంతయోద్రవ్యమునుశలవుచేసుకొని ఈమహాస్థలమునకువచ్చినారు బాగుగా యాత్రజరిగించుకొనిపొండు" అనిచెప్పి బండ్లవాండ్రనుచూచి, "ఒరే! బాలయ్యా! రేపటినుండి వీరుమరల తమయూరునకుప్రయాణమైపోవు వరకును నాలుగుబండ్లు రోజున్నూ కావలసియుండును. కంట్రాక్టుగాచెప్పండి రోజునకుబండియొకటింటికి యేమిబాడుగనడిగెదరు?" అనియడు

గుసువారు "సామీ చాలా కష్టమండి! తీర్థములకు పోవడమంటె చాలా దూరము. ఏమయినను మీమున్న మేమెక్కువగా యడుగజాలము. రోజుకుబండి యొకటింటికి నాలుగురూపాయ లిప్పించవలయును. ఇదిచాలా తక్కువబాడుగ. మీమాటకుకట్టుబడి యొప్పుకొనెద"మని కడుదైన్యముగా చెప్పుదురు యాత్రికులు వారిమాటలువిని "ఓయిబాబో! నాలుగు బండ్లకును దినమునకుపదునాఱురూపాయలు. మనముపదునైదురోజులుంటిమేని యిన్నూటఋలుబదిరూపాయలగును. బండ్లబాడుగయేయింతయౌత్తమైనయెడల తక్కినవ్యయమెంతయగును? దేవుఁడపుడేమనకు దర్శనమిచ్చుచున్నట్లున్నదే! ఇంతబాడుగ నెవ్వరివ్వగలరు?" అని తమలోగుసగుసలాడుచుండుదురు. శాస్త్రిగారుబండ్లవాండ్లనుచూచి "ఒరే! వృథా మాటలతో ప్రయోజనములేదు. నాలుగుబండ్లకును రోజునకుఆఱు రూపాయలుచొప్పున నిప్పించెదను. మీకునమ్మకమైనచో రేపుసూర్యోదయమునకుమునుపేబండ్లుకట్టుకొనిరండు. లేదా? నేను వేఱేబండ్లరప్పించెద" నని గట్టిగాచెప్పును. వారుతుదకు రెండేసిరూపాయలయినయిప్పించుడని కొంతతడవు పెనగులాడినట్లభినయించి తుదకు వారిమోమోటముచే విధిలేకయొప్పుకొన్నవారివలె తలలు వ్రేలవేయుదురు శాస్త్రిగారు యాత్రికులముఖ్యునిచూచి వీరికిపదిరూపాయలడ్వాన్సయివ్వండి. లేనిచో మఱియెవ్వరయినను నాలుగణాలుయెక్కువయిచ్చెదమనినచో వారియొద్దకుపోవుదురు. వీరినినమ్మకూడదు అడ్వానసుతీసుకొని రాకపోయిరేని వీరిప్రాణములు తీసివేయుదును" అనిచెప్పి అడ్వానసురూపాయలుపదియు, రైలుదగ్గఱనుండి తోడ్కొనివచ్చినబాడుగయు యిప్పించిపంపివేయును. అంతటగుమాస్తా వారికివారు యిష్టపడినయింటిలో సామానులుచేర్పించి యందుచేర్చి, ఏమేమికావలయునో యడిగి, అపుడపుడు కావలసినవస్తువులు తెచ్చియిచ్చుచుండుటకై, పిమ్మటలెక్కచెప్పెడి చేర్పాటుతో యిరువదియో ముప్పదియో రూపాయలు తీసుకొనిపోవును. రాత్రిభోజనానంతరము శాస్త్రిగారు యాత్రికులముఖ్యునిరావించి మర్యాదచేసికూర్చుండబెట్టి "మీరు రేపటియుదయముననే లేచి, సనత్కుమారతీర్థమునకుగానికపిలతీర్థమునకుగానిపోయిస్నానమునుజేసి ముందుగా యిచ్చటనుండు దేవాలయములకుపోయి స్వామిదర్శనముఁజేసుకొని రావలయును. రేపటిదినమంతయు నిచ్చటనే సరిపోవును.

మొల్లుండీ యుదకోదవసమున స్నానముఁజేసి కొండయెక్కవలయును. మీవెంటమాగుమాస్తాయుండి మీకుదర్శనమునకై రావనులుజరిగించుచుండును. ఆపనులన్నియుం జక్కగానే జరుగునుగాని యింక మాకట్నము మాటయొకటి తీర్మానము కావలసియున్నది. ఇదివరకును నేనిటులనడిగెకి యాచారమే లేదు. వచ్చినయాత్రికులు తాముగానే యేదోయొకవిధముగా గౌరవముగానే మాకుకట్నమునిచ్చిపోవుచుండిరి. ఇటీవలయిద్దరుముగ్గురువచ్చిపోయెడిపడియైనను మాకు తెలియకనే వెళ్ళిపోయినారు. యాత్రకువచ్చి వారుచేసిపోయినపనివిన్నారా? "ఓహో! ఇది వారితప్పుగాదు. మొదటనే యేర్పాటుచేసుకొనని తప్పుమనదే కదా!" యనియెంచి యది మొదలుగా రెండుమూడు మాసములుగా యీయేర్పాటు పెట్టుకొన్నాను ఇట్లుచెప్పడములో మీకున్నూ వారివలనే చేసెదరనిచెప్పడము కాదు జరిగినదనిచెప్పినాను. "ఆమాటను మనము నిశ్చయము చేసుకొనడము ఉభయులకును మంచిదై యుండును" అనిచెప్పెను. యాత్రికుల ముఖ్యుఁడు సరే! అలాగే! చెప్పండి! దీనియందేమియు తప్పులేదు. "మేమిదివరకును వచ్చినవారము కాము. ఎక్కువధనికులమున్నూ కాము. ఏదో యోజించి సెలవివ్వండి. మీపరిచయము కావలయును కాని మేమిచ్చునది మీకు లెక్కలోనిది కాదు. ఎందఱో మీకు ఇచ్చనేయిచ్చుచుందురు" అనెను. శాస్త్రిగారు చిఱునగవుతో "చాలాబుద్ధిమంతుఁడవును, గౌరవాగౌరవములెఱింగి మాటలాడువాడవునై కనుపట్టుచున్నావు ఇటువంటి వారినిచూచిన నాకుమిక్కిలి సంతోషము. మీమంచిగుణములన్నియు మాగుమాస్తా చెప్పినాఁడు. కనుక నేనుమిమ్ము యెక్కువగా యిండని కోరఁదలంచ లేదు. నాలుగవందలరూపాయలు యివ్వండి. ఇదివరకును నే నెవ్వరియొద్దనుయిటు నల్పమొత్తమును తీసుకొనినదియే లేదు. చాలాతక్కువగా చెప్పినాను. ఇందు మాకు నాల్గవవంతుమిగులుటయే గగనము. మేమెందరికో యివ్వవలయును. మిమ్ముకష్టపెట్టి తీసి యితరులకు దారపోయెడమే కాని మిఱి యేమియును లేదు. ఆకష్టము మాకు తెలియును. పాపాత్ములు పెనుకుకొనితింటారు" అనిచెప్పెను. నాలుగువందలిమ్మనినమాట చెవినిఁబడగానే యాత్రికులముఖ్యునకు వేంకటేశ్వరుఁడు ప్రత్యక్షమైనట్లుతోఁచును. "ఓయబ్బా! యింతమొత్తమా? తెచ్చినదే యంతమాత్రముగాయున్నది ఉండిన మట్టుకును వీరికి సము

ర్పించినయెడల యింక మాగతియేమికావలయును? దీనికాకష్టములు పొంది యింతదూరము మేమువచ్చినది" యని తనలో యోజించుచుండును. శాస్త్రిగారతనినిజూచి "ఏమండీ! పలుకకున్నారే యేమియోచన" యనును.

ముఖ్య:—యోజన యేమియులేదు గాని మొత్తముచాలా—

శాస్త్రి:—దానినిగూర్చి మీరింక నేమియు మాట్లాడవలదు. మీస్థితి నిబట్టియే నేను మిక్కిలి తక్కువయడిగినాను. కానిచో, ఇందఱు యాత్రికులు వచ్చినపుడు, కనీస మాఱువందలైనను తీసుకొని యుందును.

ముఖ్య:—అంత మొత్త మిపుడు మాయొద్ద లేకున్నది. కొద్దిమొత్తము తెచ్చినాము. వీరిలో సగముమంది నిరుపేదలు, ఏమియిచ్చినను తక్కినవా రివ్వవలెను

శాస్త్రి:—మాకు మనుష్యుల లెక్కగాని, వారి స్థితిగతులుకావు మీయొద్ద తగినంత డబ్బులేదేని నేనొకయుపాయముచెప్పెదను అటుల చేయుడు. ఏకష్టము నుండదు.

ముఖ్య:—ఎట్లో చెప్పండి-ఏమి చేసినను మీరే చేయవలెను.

శాస్త్రి:—సరే! మీయొద్దనుండెడివానిలో యీమొత్తమునకుచాలిన దేదియో యొకనగనివ్వండి అది నేనెచ్చటనైన నంబెట్టి రూపాయలు తెప్పించెదను. మీరుమీయూరి కరిగినంతట రూపాయలుపంపుడు. వెంటనే ప్యాకీచేసి మీనగనుపంపెదను. మీసొమ్మున కేలాటి చెఱుపునుగలుగదు. మేము జబాబుదారులము.

ఇట్లుచెప్పినంతట మఱివేఱుగతిలేక యందఱునుగూడి యాలోజించి కష్టపడి యింతదూరమువచ్చినవారము మెట్లయినను యాత్రపూర్ణముగా జరిగింపక పోరాదనియెంచి తమయొద్దనుండెడి సొమ్ములలో గొప్పవిలువగలవి రెండు తెచ్చి శాస్త్రిగారి చేతనిచ్చి "స్వామీ! ఇందులో నొకటికుదువయుంచి మీకట్నమును తీసుకొనుఁడు. రెండవదానినియుంచి నాలుగువందలరూపాయలు మాకు తెచ్చియివ్వండి మేముమాగ్రామమునకుపోయి యెనిమిదివందలూనుపంపి తెప్పించుకొనెదము" అని చెప్పుదురు. అవితీసుకొనిపోయి శాస్త్రిగారు యేవర్తకునియొద్దనో నూటికిమూడో నాలుగో వడ్డియిచ్చునట్లుచెప్పి కుదువపెట్టి యెనిమిదివందల

రూపాయలు తెచ్చి తానునాలుగువందలుందీసుకొని నాలుగువందలు వారికిచ్చును. మఱునాఁడుగుమాస్తా వారినిపిలుచుకొనియుదయముననే తీర్థస్నానములకుబయలుదేరును. తత్పూర్వమే యేర్పాటుచేసిశాస్త్రిగారుతనయిలాకామనుష్యులను పంపియుండును. వారుపోయివీరిరాకకెదురుచూచుచుందురు. గుమాస్తాయాత్రికులఁబిలుకొనితమకుయేయేగుంటలలోనీళ్లుండునట్లు తెలిసియుండునో వానియొద్దకెల్లనుంబిలుచుకొనిపోయి వానికొక్కొక్కపేరుబెట్టి, 'ఇదిరామతీర్థము, కణ్వతీర్థము, దివ్యతీర్థము, సిద్ధతీర్థము' అనిచెప్పి వీనిలోస్నానముచేసిన వారికిమరలజన్మములేదు. ఇవి చాలాప్రసిద్ధమైనవి. ఇంతదూరము కష్టపడిపిలుచుకొనివచ్చి యితరులు యీతీర్థములలో స్నానమునుచేయింపనేచేయింపరు, మేమటుల కాదు మాయొద్దకువచ్చెడి యాత్రికులకు ఒకటియుంగొదువలేక శ్రద్ధతో యన్నితీర్థములకుం దోడ్కొనిపోవుదుము. మాపద్ధతియే వేరు. కానిండు ఇంకను నెన్నియోయున్నవి. శీఘ్రముగాసంకల్పముచెప్పుకొని స్నానముచేయుండి, నేఁడుకొఱవలేకుండా తీర్థములన్నియుం జూపవలయు''నని చెప్పును. శాస్త్రిగారిచేపంపబడినతీర్థవాసివలె వేషముధరించి కూర్చుండియున్నబ్రాహ్మణుఁడు 'అయ్యా! తలకొకయణా యివ్వవలయును. లేనియెడలయీతీర్థములోస్నానముచేయుకూడదుసంకల్పమునకుమనిషికిరెండేసియణాలు' అనిచెప్పును. తీర్థయాత్రికులు 'ఏమండీ! స్నానముచేసినందుకును, సంకల్పమునకును తలకుమూఁడణాలా? అన్యాయముగాయున్నదే అందఱికినిమొత్తముగా రెండురూపాయలు యిచ్చెదము సంకల్పము చెప్పండియనును. ఆతీర్థవాసి 'ఓహో! బాగానేయున్నది యీతీర్థము కంట్రాక్టుచేసి తలకు చేతులు తెచ్చుకొంటున్నాము. మాయొద్దవేయి రూపాయలు ముందుగానే యధికారులు వసూలుచేసుకొన్నారు. క్రిందటిసంవత్సరమీ తీర్థము యేనూఱురూపాయలకుకంట్రాక్టునయొత్తినారు. పోటీలవల్లయీయేఁడు వెయ్యిరూపాయలైనవి. ఇదిశ్రేష్ఠమైన ప్రసిద్ధతీర్థమగుటవలన పోటీయెక్కువ. మేమేమిచేయుదుము? యాత్రకువచ్చి యెంతోకర్చుపెట్టుకొని తీర్థములోస్నానముచేయుటలో తీర్థవాసికి యిచ్చెడిదుడ్డునకు బేరముచేసెదరు. ఇదికూరగాయలబేరముకాదు. ఇవి మాయేర్పాటు. మీరొకవేళ యధికముగాఇచ్చినను మేముపుచ్చుకొనము,'' అని దృఢముగాచెప్పును. యాత్రికులు గుమాస్తావంకచూచుచు

అతడుతలయూఁపించి 'ఇచ్చి వేయుఁడు ఇక్కడ శబేరమేమియును లేదు. ఇచ్చి యే కావలయును' అని చెప్పెను. ఇంక ఇవ్వకతీరునా? నలుబదిమందికిని మనిషికి మూఁడణాలచొప్పున రు 7-8-0లు చెల్లింపుదురు. అంతట తీర్థవాసి వేషగాఁడు చిన్నపుడు బడిలోచదివిన బాలరామాయణశ్లోకములును, యెక్కడనైనా విని యుండి జ్ఞప్తికి వచ్చిన రెండుతప్పుదారు మంత్రములును గలిపి క్రిందుమీఁదుచేసి స్థలము పేరు తీర్థముపేరును గట్టిగా చెప్పి సంకల్పమునుగించి పాచిపట్టిపురుగులతో నిండియున్న యాదుర్గంధపునీటిలో వారినిమునుంగుడనును. పాపము! తెలియనివారగుటవలన యాత్రికులా పాడుగుంటనీళ్లు "గొప్పతీర్థముగానేయుండును కాఁబోలు" ననివారి మాటలునమ్మి యెట్లో దుర్వాసనకు ముక్కుబట్టుకొని యందు మునుగుదురు. వారుస్నానముచేసి గట్టునకువచ్చినంతట యానీటిపాచియు బురదయునంటి వారి దేహములును, వస్త్రములును, క్రొత్తవన్నెదాల్చి, పిశాచరూపములతో గనుపట్టుదురు. ఈరీతిగా చేసినగాని వారికర్మము తొలంగదుకాఁబోలు 'ఏమండి! ఇంతప్రసిద్ధమైతీర్థమై నయుండియునిందలినీరుగబ్బుపట్టి, పాచితోడను; పురుగులతోడను, బురదతోడనునిండి యున్నదే! యేమికారణమండీ!' యనివారడిగిరేని తీర్థవాసి వేషగాఁడు నవ్వి ఆవిషయము మీకు తెలియదా? ఇందుస్నానముచేసినవారిపాపములు వీనినీటిలో కలియుచుండును. ఆపాపములు తొలఁగుటవలననే యీ నీళ్లు యిట్లుండును. ఏతీర్థమునందు పోనిపాపమైనను దీనిలో స్నానము చేసిరేని పురుగులుగానో, పాచిగానో, బురదగానో, వారిపాప మీనీటిలోకలిసిపోవును. ఆదోషములన్నియు జేరియుండుటచేతనే దుర్గంధముకూడా కలిగినది" అని సమాధానము తృప్తికరముగా చెప్పును. వారు నిజమేకాఁబోలు ననిసమ్ముదురు. ఈప్రకారముగా చుట్టుపట్ల రెండుమైళ్లవరకునుండు గుంటల కన్నిటికిని తీర్థముల నామకరణముచేసి గుమాస్తా వారిని వెంటఁబెట్టుకొనిపోయి, తమ యజమానునిచే పంపఁబడి యచ్చటచ్చటనుండు తీర్థవాసి వేషగాండ్ర మూలమున డబ్బువసూలుచేయించి మధ్యాహ్నము పరకును వారి నాగుంటలనీళ్లలో ముంచి రెండుజాముల వేళకు యిల్లుచేర్చును బండ్లవాండ్రు రోడ్డుదాఁటి యావల నొకయడుగైనను పోరు గనుక రాళ్లనుముండ్లనుండ్రొక్కి నడచి యాత్రికులు నానాకష్టములననుభవించి యెండవేడిమికి బడలి డబ్బుఁబోఁ

గొట్టుకొని, పీనుగ ముఖములలో "స్వామీ! ఎపుడెపుడు బసకు చేరెదు
మా!" యని యెట్లో ప్రాణములతో వచ్చి యింటఁ బ్రవేశింతురు. దేవుఁ
డపుడు వారికి ప్రత్యక్షమైన చందమున నంతవరకును నేమియు నాహార
ములేమిచే కండ్లుమిఱుమిట్లుగొలుపుచు భ్రమగలుగుచుండును. ఏలా
గునో వెతకోర్చి యింతయన్నము వండుకొని యుడుకుబెడుకుగాతిని
నీళ్లుత్రాగి విశ్రమింతురుగాని గుమాస్తామాత్రము వెంటనే దేవాలయము
లకుపోయి యర్చకులతో మాట్లాడి యజమానునియిష్టప్రకారము కమీ
షను కుదుర్చుకొని శీఘ్రముగావచ్చి భోజనముచేసి యాత్రికులయొద్దకు
వచ్చి "ఓహో! పడుకొన్నారే! బాగానే యున్నది. ఇటులనైనయెడల
యాత్రఫలము మీ కెట్లు కలుగును? రెండురెండు పోవలయును. ఎన్ని
గుడులకో పోయి సేవించిరావలసియున్నది. ఒకపూటకే మీరిట్లు డీలు
పడినయెట్లు? ఇకముందు పోవలసిన స్థలము లెన్నోయున్నవి. వచ్చిన
పుడు చక్కగా కొదువ లేకుండా యున్న చోట్లకునరిగిరావలయును. వారి
వీరివలె మాకుడబ్బు ముఖ్యముకాదు. వచ్చినవారి కన్నిస్థలములును
చూపి వారికి యాత్రాఫలము సిద్ధింపజేయవలయుననియే మాకోరిక.
డబ్బుదొకమాట కాదు. సంపాదించెదము. కర్చుపెట్టుదుము. వెధవడబ్బు
లెక్కయా? మంచిబిడ్డ యోచింపవలెను. రండిపోవుదము" అని త్వర
చేసి లేపివెంటఁబెట్టుకొని యంగడివీధికిపోయి తాంబూలములు, పూవు
లు పండ్లు కర్పూరము టెంకాయలు తీసియిచ్చి దేవాలయములకు పిలు
చుకొనిపోయి యచ్చట పెట్టియుండు ప్రతిశిలా విగ్రహమునకును నొ
క్కదేవుని నామకరణములు చేసి, తమ యిలాకా మనుష్యుల మూల
ముగా నచ్చటచ్చట అణా, అర్ధణా, కాలణా కానుకలు వసూలుచే
యించి పిమ్మట మూలస్థానమునకు పిలుచుకొనిపోయి యర్చకునితో,
"వీరుచాలాదూర దేశము వారు. కష్టపడి యాత్రవచ్చినారు. శ్రద్ధగామీ
రర్చన జరిగించవలయును" అనిచెప్పును. తత్పూర్వమే మాట్లాడి యేర్పా
టునంతయుం దెలిసికొనియున్న యర్చకుఁడు. "అర్చన మొత్తముగానా?
వేఱువేఱుగానా?" యని యడుగును. గుమాస్తా యాత్రికులతో రహ
స్యముగా, "మొత్తముగానంటే చాలా యెక్కువ కట్నము నడుగును.
ఎవరిమట్టుకు వారు వేఱుగా చేయించడమే మంచిది" యని చెప్పును.
ఆమాటనమ్మి వారు "సరే! అలాగే చేయుమని చెప్పండి" యని నమ్మ

లింపుదురు. గుమాస్తా వేఱువేఱుగానే చేయుకుని చెప్పును. అర్చకుఁడు "మంచిది తాంబూలమును పెట్టండి దక్షిణ మనిషియొకటింటికి 0-8-0లు యివ్వండి యనును" గుమాస్తా "ఏమండీ! ఎక్కువగా పోవు చున్నారే!" యనును. అర్చకుఁడు. లేదులేదు. మీరు వచ్చినప్పుడు మేము యెక్కువగా నడిగి బ్రతుకుటయుకూడాయుండునా? క్రమముగానే తీసుకొనుచున్నా"నని చెప్పును. గుమాస్తా యాత్రికులనుచూచి "మామూలేయిది. యధికము కాదు. యివ్వండి" యనును నలుబది మందికిని యర్చకుఁడు. యిరువదిరూపాయలు వసూలుచేసి యేవో మంత్రములని రెండుమాటలుచెప్పి కర్పూరము వెలిగించికరగోవముపెట్టి రెండు పూవులును, రెండు గొబ్బెరచిప్పలు నొసంగి "అర్చనపూర్ణమైనది. మీరుమహారాజులుగా యుండవలయును, చాలాదూరము గొప్ప క్షేత్రమునకు యాత్రవచ్చినారు. మాకేదైననుదక్షిణకొంచెముయివ్వవలయును. అర్చనకుగా యిచ్చినది దేవాలయాధికారులు తీసుకొంటారు. మీరేమైనను దయతలఁచి యిచ్చినదే మాకుదక్కును" అని చెప్పి యొకటో రెండో రూపాయ లూడదీయును. అచ్చటనుండి గుమాస్తా మఱియొక దేవళమునకు తోడ్కొనిపోవును. ఈప్రకారము నాడంతయు నెచ్చటగుడియుండునో, పాడుపడి యున్నదైననుసరే! అచ్చటికి తోడ్కొని పోయి పూజా నైవేద్యములు జరుగనిచోట్లలో తమ యిలాకామనుష్యులనుంచి, యటనట నమయాను గుణ్యముగా మాటలుచెప్పి డబ్బు లాగుకొనును. కనీసము సాయంత్రములోపల యేబది రూపాయలనైన కర్చుపెట్టింపక మానఁడు. ఎచ్చట నొకరాతిబొమ్మ యుండినను, దాని కాళ్వారనియో, మహాభక్తుఁడనియో, మహాముని యనియో, శక్తియనియో, పేరుబెట్టి వానియొద్ద నిలిపియున్న తమ మనుష్యులమూలముగా కానుకలర్పింప రెండణాలు నాలుగణాలు వసూలు చేయించును. తీర్థములస్నానము, సామాన్యమైన దేవాలయములకుపోయి వచ్చుటయీమాత్రమునకే వారిగుట్టు కూలిపోవును. "అప్పటికే చాలురా! అబ్బా! యీయాత్ర చాలు"నని వారికితోఁచును. గుమాస్తానుచూచినచో వారికి యమదూతను చూచినట్లుండును. "ఏవేళకువచ్చి మఱియెచ్చటెచ్చటత్రిప్పి యెంతకర్చు పెట్టించునో, వీనిచే బాగానే తగులుకొన్నామే!" యని డబ్బుఖర్చువడు దుఃఖమట్లుండఁగా వానితో కూడా

రాళ్లుముళ్లుంద్రొక్కుచు నడుచుటకు శక్తిలేనివారై భయమొందుచుం
డుదురు. నామకార్థము బండ్లే కాని వారుపోవుచోట్లకెల్లను కష్టపడి నడ
చియే కావలసియుండును. కన్నుమూసినపుడెల్లను వారికి గుమాస్తా క
నంబడినట్లు తోంచి గడగడ వణంకుచుండుదురు. పాపము! ఆక్రూరా
త్ముండు వారల విడుచునా? మఱునటి తెల్లవారి కొండకు ప్రయాణము
చేసి "మీలోవృద్ధగాత్రులుతప్ప తక్కిన వారును స్త్రీలును బిడ్డలునునె
క్కజాలరు. అటువంటివారు డోలీలు పెట్టుకొని పోవుట మంచిది" అని
చెప్పి డోలీకూలివాండ్రనుబిలిచి, రహస్యముగా కమీషను నేర్పా
టుచేసుకొని అయిదో ఆరో డోలీలు తెమ్మనును. వారు వచ్చినంతట
యాత్రికులు, కూలియెంత? యనియడిగిన "అదుగో! అయ్యగారినిఅడ
గండి. వారికి మామూలు తెలిసియేయున్నది. వారితోకూడా వచ్చిన
పుడు యెక్కువగా మేమడుగము. డోలియొకటింటికి యిరువురికంటె
యెక్కుటకు వీలుండదు ఒక్కొకదానికిని కూలి యాఱురూపాయలు
మామూలు. తరువాత కూకష్టము చూచి ఏదైనా మీదయ. డోలియొ
కటింటికి దినమునకు నాలుగురూపాయలు దేవస్థానమువారికి పన్నుగ
ట్టవలయును. ఒక్కొకనాడు యెవ్వరును యెక్కకుండిన మేము యింటి
నుండియైనం దెచ్చి కట్టితీఱవలయును. ఏమిబ్రతుకండీ మాబ్రతుకు, సా
యంకాలము వరకును యిట్లు కష్టపడిన యెడల యొకటో రెండోరూపా
యలు మిగులును. నాలుగురోజులు సంపాదించిన యెనిమిదిదినములు
దమ్మిడియైననుదొరకదు. రెండుమారులు యీ కొండనెక్కి దిగు
నప్పటికే పునర్జన్మమెత్తినట్లుండును" అనిచెప్పుదురు. కూలియెక్కువ
యని యాత్రికులు సంకోచించుచుండిన యెడల గుమాస్తా మధ్యవర్తితన
మునకుపూని యాడోలీవాళ్లను అదలించియు కసరియు వారిపై చాలా
కోపముం జెందినట్లునటించి "సరే! మీరుసమయాసమయములును, మ
నుష్యులగౌరవమును తెలియనిమూఢులు. ఈదినము డోలీలు చాలాత
క్కువగాయున్నవి. దానివలన మీరాడినదాటయైనది. ఎట్లయినను
మేము తీసుకొనిపోవుదుమని తెలుసుకొని యిట్లనుచున్నారు. ఈవిష
యమును నేనుమఱువను లేండి, ఏమనెదరు?" అని వేనటగాయడిగి న్యా
యమయినకూలి మూడురూపాయలైయున్నను, 'నేనొకమాటచెప్పె
దను, మీరుగునియకూడదు. డోలీయొకటింటికైదురూపాయలచొప్పు

న నిప్పించెదను. అంతకెక్కుడుకాను నడిగినను ఇవ్వము. ఇష్టముండిన రండు'' అనును. ఇంకనాలుగణాలైనను యిప్పించుడని వారలుకొంచె ము బతిమాలినట్లునటించి తుదకొవ్వకొందురు. గుమాస్తా యాత్రికుల తో, రహస్యముగా 'మంచి కాలము. ఈదిన మింతేమాత్ర మొప్పుకొని న దెంతయో మేలు. మొన్నమొన్నను మీరుచూచియుండిన భయము నొందుచురు డోలీ యొకటింటికి పదిరూపాయలు తీసుకొన్నారు. నేనేమా యొద్దకువచ్చిన వారికయిదుగురికి యేబదిరూపాయలు యిచ్చినాను. కూలి మొదటనేయిచ్చెడివాడుక. యిచ్చివేయండి'యని తొందరపెట్టి కూలీమొత్తం తానేతీసుకొని తనకమిషనుపోనుమిగత వారికిచ్చి డోలీ లలోయిక్కించును. అంతటకొంతసెక్కుటకు ప్రారంభింతురు. డోలీల వాండ్రు మూల్గుచు మూల్గుచు దేహములనుండి చెమటలుకాలువలుగడ గా మహాప్రయాసముతో యెక్కుటకుప్రారంభింతురు. వారియవస్థచూ చునపుడు యెక్కినవారికి ''అయ్యో! యెందుకెక్కినామా!'' యని తోచును. వారునిలిచినిలిచి 'పాపకూలి యొప్పుకొన్నాము. ఒక్కొకరు రెండుతూములధాన్యము బరువుగలిగియున్నారు. చింతమొక్కలవలె ను, గొప్పగుండ్రాళ్లవలెను ఉన్నారు. వృథాకష్టమైనది. మనయునురు వీరికి తగులకపోదు' అనిదూషించి గొణుగుకొనుచు, మిక్కిలివిసుగుతో పోవుచుందురు. అయినను గుమాస్తానహాయమువలన వారికికొంతయులు పుతీయుచుండును. అక్కడక్కడ నేరాతికినామములు పెట్టబడియుండునో, యెచ్చటనొకరాయినాటబడిఉండునో, యచ్చటనెల్లను డోలీనుదింపించి యాత్రికులతో 'ఈయనతొండరప్పొడియాళ్వారు, ఈయనగరుడాళ్వా రు, ఈయన పెరియయాళ్వారు, ఈయనఆంజనేయస్వామి'యనిచెప్పుచు, 'యాత్రికులు ముఖ్యముగా యీస్థలములలో కానుకలునమర్పించుట విధి లేనిచో వేంకటేశ్వరులదర్శనముచేయుటచే ఫలములే'దనియొక్కొ క్కరిచే, యరణా, కాలణా కానుకలువేయించును. అచ్చట యాధర్మ కానుకలకై కూర్చుండియుండెడి మనుష్యుడాకానుకలువసూలుచేసి పుచ్చుకొనుచుండును. ఆమనుష్యులెవరు? శాస్త్రులవారిచే పంపబడిన మహానుభావులే! ఆయాత్రికులకంటె ముందుగానేవచ్చి యచ్చటచ్చట సింధూరముపూసిన రాళ్లునాటియు, నామములుబెట్టియు, వానికాళ్వా రులనామధేయములుబెట్టి యచటకూర్చుండియుండి పయినచెప్పినట్లు

చేయుదురు. ఇట్లు యాత్రికు లాళ్వారుల సేవింపుచు దేవాలయము చెంత కరుగుదురు. వారిని డోలీలనుండి దింపుకొని, యచట తమయిలాకాలో కట్టబడియుండునింట నొకగదివారు బస చేయుటగా యేర్పాటు చేయును ఆయిల్లు తనది కానట్లును, నన్యునిదైనట్లును చెప్పి, యచట తమను [illegible]ని యింటియజమానునివలె నటింపుమని ఒకటికై దంతెలు బాడుగనిర్ణయించి యందువిడియుంచును. తరువాత, యాత్రికులతో "ఇంక మీరాలస్యము చేయకూడదు. ఇచ్చటకువచ్చినవారు ముందుగా తీర్థములకుపోయి స్నానముచేసి స్వామినిదర్శించవలయును. ఎండవడుచున్నది. రండిరండి! సామానులుగదిలోయుంచి తలుపుబీగము వేసుకొనిబయలు దేరండీ!" యని వేగిరపెట్టి వారిందోడ్కొని తీర్థములకై బయలు వెడలును. ఒక్కొక్కసమయములో, యాత్రికు లటులపోయిన తరువాత మారుబీగము వేసి యచ్చటనుండెడి కాస్త్రువారి మనుష్యులు, పెట్టెలలోనినగలు, డబ్బు, మంచివస్త్రములు సంగ్రహించుకొని యెరుగనట్లుండుటగలదు. సొత్తుపోగొట్టుకొన్నవారు వారినడిగినయెడల "అదేమో మాకు తెలియదు. మీరుబీగము వేసుకొని పోయినారుగదా? వేసినబీగము వేసినట్లేయుండగా, సొత్తెట్లుపోవును? అదిదేవునకేయెరుక. మీ సొత్తును మీరుజాగ్రతగాచూచుకొనవలయునుగాని, పూచీయెవ్వరు? మేమిచ్చటనెపుడును కనిపెట్టుకొనియుండుదుమా? మాకెన్నోపనులు గలవు. మేమేమియుజేయునది లేము. పోయినదినిజమేయైనచో దానికి మీయజాగ్రతయేకారణ"మనిచెప్ప ముగింతురు. దేవునిసన్నిధిలోనయితమిటువంటియక్రమములుచేయుటకు వెనుదీయువారుకారు. వారికిడబ్బే దేవుడు. దానికొఱకై యెన్నికష్టములైననొంది యెన్నితంత్రములైనంజేయుదురు. యాత్రికులంగొనిపోయిన గుమాస్తాగారాకొండపై తానెరిగినచోట్లనెక్కడెక్కడ చేరెడు నీళ్లుండునో వానికన్నిటికి నొక్కొక్క తీర్థముపేరుచెప్పి రాళ్లుముళ్లుకంపలు త్రొక్కించి యచటికికొనిపోయికానుకలు వసూలుచేయుట కారంభించును. అయ్యో! ఆహారములేక బాలురు, వృద్ధులు, ఎండలో కంపలు రాళ్లు త్రొక్కి నడిచి నానాకష్టములననుభవించి సొక్కిసోలి యడుగిడజాలక "ఓదేవుడా! మేమీగుమాస్తాగారినుండి తప్పించుకొని మరల నలుగురితో కలియబోయెడి చూపు కనుపడకున్నదే! మమ్ము విడుచునట్లుండలేదే!" యని మహాదుఃఖము

త్రో యతనిఁజూచి "స్వామీ! డబ్బంతయు నైపోయినది. ఇంక కానుకలిచ్చుటకు మాయొద్దనేమియును లేదు. ఇప్పటికి చూచినతీర్థములుచాలును. ఇంతటితో మమ్ము మన్నించి, యనలు దేవుని దర్శనమగునట్లుచేయండి. మే మింక నడుగైనం బెట్టజాల"మని మొండిపట్టుఁబట్టి కూర్చుండుదురు గుమాస్తావారిఁ జూచి "అవుడేనా? ఇంకను ముఖ్యముగాపోయిరావలసిన స్థలము లెన్నియో యున్నవి. ఇంతలోనే మీరు వెలవెలఁబోవుచున్నారు. ఇదియేమి యాత్రచేయడము? ఎంతదూరముననుండియో బోలెడుకర్చుపెట్టుకొని వచ్చినవారు. సాంతముగా నన్నియుసేవించక పోవచ్చునా? డబ్బులేదనడమేల? నేను మీకెంత కావలసియున్నను యిప్పించెద. నూటికి నాలుగురూపాయలచొప్పున వడ్డీకియెంతకావలెనన్నను దొరుకును. దీనికై భయపడవలసినది లేదు. మీకు యేయిబ్బదియుం గలుగకుండునట్లుచేసియు యాత్రయుం దేలోపమును లేకుండా జరుగునట్లు చేయుటకేగదా! నేను మీవెంటవచ్చినది. డబ్బులేకపోవుటచే కొన్నిస్థలములకు తోడ్కొని పోలేదనుటవినిరేని శాస్త్రులవారు నామీఁద మిక్కిలి కోపపడుదురు. నేను కార్యస్థుఁడననిన వారపమ్నకము. ఆమంచిపేరు పోగొట్టుకొనవలసివచ్చును. కనుకను నానొకరికే మోసమువచ్చును. సందేహించవలదు. అన్నిటికిని నేనున్నాను లెండి లెండియని త్వరపెట్టును. యాత్రికులా మాటలువిని "అయ్యో! దేవుఁడా! ఈయమదూత మమ్మింతటితో నైనను విడుచునట్లుండలేదే! డబ్బులేదన్నను తానేయిప్పించెదననుచున్నాఁడు నూటికినాలుగురూపాయలు వడ్డీయఁట. యెంతయైనను దొరుకునఁట గొప్పవిపత్తునందగులుకొంటిమి. ఇటుల మనలదోచుకొనుటకేకాఁబోలు యిరువదిమైళ్లుండగానే యెదురుగావచ్చి యీపాపాత్ముఁడు లేనిపోని మాటలుచెప్పి తోడ్కొనివచ్చి బాగా చిక్కించుకొన్నాడు. ఆశాస్త్రులపేరుఁ జెప్పుకొన్నవాఁడీ దొంగలకు నాయకుఁడుగా యున్నాఁడు. తెచ్చిన డబ్బంతయుబోయి నగలు కూడా చిక్కుకొన్నవి. యింకను వీరియొద్ద నప్పుతీసుకొనవలయునఁట. చాలుచాలు. యాత్రాఫల మిప్పటికింతమట్టుకులభించినది. ఓ వేంకటాచలపతీ! ఇంతడబ్బు కలవుచేసుకొని యిన్నికష్టములు నొందియు నింతవరకును నీదర్శనము కలుగకున్నది. మమ్మీ యమదూతచేతనుండితప్పింపుము"అని భయకంపిత గాత్రులై "అయ్యా! ఇంకరాఁజాలము. యా

త్రయింతమట్టుకుఁ జాలును. మీకు నమ్మతముగా యుండినచో దేవుని దర్శనముఁ జేయింపుము. లేదేని మీదర్శనముతోనే తృప్తినొంది మేమువెలుపటనుండియే స్వామికి దండముపెట్టి పోయెదము." అని ఖండితముగా పలుకుదురు. గుమాస్తావారినిచూచి మిక్కిలి విసుకుతో "సరే! నాకేమినష్టము? మీకొఱకయ్యే నేనింతకష్టపడినాను. యాత్రచక్కగా ప్రయాసపడి నెరవేర్చినయెడల సంతోషించి మీరేదైనా బహుమానము చేయుదురుగదా! యనెడి, యపేక్షతో నొకటియుం గొఱంతలేకుండునట్లు స్థలములు, గుహలు, తీర్థములు, మొదలైన వన్నియుందోడ్కొనిపోయి మీకుఁజూపుటకు తలంచినాను. అటుల మీకిష్టములేనిచో మరలి పోవుదము. రెండు" అని విధిలేక యొప్పుకొనును. వారు "అయ్యా! మాప్రాణములు పోవునట్లున్నవి. చూచినంతవరకునుం జాలును. పోవుదముపదండి" యని మరలి మెల్లమెల్లగా మహాకష్టముతో నడిచి పునర్జన్మమునెత్తినవారివలె దేవాలయమునొద్దకువచ్చి చేరుదురు. అపుడు గుమాస్తా "మీరు వంటప్రయత్న మేమియుం జేయవలసినదిలేదు. యిచ్చట మంచిప్రసాదము. కావలసినంత దొరుకును. నేనెఱింగినవారియొద్ద యిష్టమైనవానినిప్పించెద. ముందు స్వామిదర్శనము చేసుకొనుఁడు రండు" అని పిలుచుకొనిపోయి వేంకటేశ్వరునకు కర్పూరహారతికనియు, సహస్రనామార్చనకనియు, నర్చకుని కట్నమనియు, ద్వారమునసుండు జవాను కట్నమనియు, పరిచారకునిమామూలనియు, పూవులకనియు, పత్రికనియు, నేవేవియో చెప్పి కర్చులు మొత్తముజేసి వారియొద్ద నలువదియో యేబదియో రూపాయలు లాగుకొని, యిచ్చటి మామూలుప్రకారముగా నొకటియో రెండో రూపాయలు కట్టి మొత్తముగా, నొకేయర్చనకును, నొకహారతికిని రశీదుపుచ్చుకొనియాత్రికులతో "ఒకవిషయమును చెప్ప మఱచినాను. ఏమనగా, ఇచ్చట కొంచెము కర్చుపెట్టవలెను, ఆలాగైనచో మనకు ముందు దర్శనము లభించును. అర్చనయు, హారతియు, నెమ్మదిగా జరుగుతుంది లేనియెడల మంది యధికమగుటచే మనకు చాలాకష్టము కలుగును" అని చెప్పి యొకటో రెండో తీసుకొని, నేఁడు జనమధికము. నేనుముందు లోపలవెళ్లి యేర్పాటుచేసివచ్చి మిమ్ములతోడ్కొనిపోయెదనని యెట్లో తప్పించుకొని గేటుదాఁటి కొంతతడవా వెంబడి నెచ్చటనైనను సుఖ

గుసనుండి, స్వామి దర్శనార్థముగా జనులనందఱను మొత్తముగాలోపలికి విడుచునసమయమునవచ్చి "రండిరండి! ఆలస్యము చేయవలదు. కూట మెక్కుడగును. నేఁటిదినము సమూహము మెండు. అబ్బాచాలా ప్రయాసపడినా"నని చెప్పి వారిని వెంటఁగొనిపోయి తోఁద్రోపులు త్రొక్కుళ్ళుంబడి నలిగి మహాప్రయాసముతో గుడిలోనికిఁబోవును. అచ్చట వీరిపని "నలుగురితోఁబాటు గోవిందా!" యనవలసియుండునేగాని వీరు డబ్బు నిచ్చినందున గలిగినయాధిక్యత యేమియునుండదు. యెట్లో కష్టపడి భగవంతుని దర్శనముఁ జేసి, స్నానము చేసినట్లు దేహముల చెమటలుగారుచుండగా, యర్చనయు, హారతియుం జేయింతురు. అపుడర్చకుఁడు కట్నమడుగును. ముందే యన్నిటికిని లెక్కచేసి గుమాస్తాచే యిచ్చియున్నవారు కావున వారతనివంకఁజూతురు. అతఁడు ఔను మామూలుప్రకారముగా యివ్వకతప్పదు. యివ్వండి శీఘ్రముగానిందు లేనియెడల యర్చనయు, హారతియు జరిగింప"రని మరల వారిచేత నేదో కొంత యర్చకున కిప్పించును. అంతట యాత్రికులు స్వామిని సందర్శించి హారతిజరిగింపిమరల కష్టపడి వెలుపలికరుదెంతురు. ముందుగా గుమాస్తా బిరబిరవచ్చి, యచట దేశాంతరాగతులకు ధర్మముగాయిచ్చు ప్రసాదమునకుపోవక, అర్చకులు తమకువచ్చిన పులిహోగిరము, చక్కెరపొంగలి, దధ్యోన్నము, మనోహరము, కేసరి, దోసెలు, వడలు మొదలుగాగల పదార్థములు ముద్దలుచేసి విక్రయించుచున్నచోటికిపోయి వారితో గుసగుసమాట్లాడి కమీషన్ యేర్పాటుచేసుకొని యాత్రికులకెవరికే దేది యిష్టమో యదియంతయునిప్పించును. ధారాళముగా సొమ్ములనిప్పించిన ప్రసాదముధర్మముగా యివ్వబడినదనిరొంచి, వారుకావలసినవరకుందీసికొని భుజించి చేతులుకడుగుకొనగానే యిచ్చినవాడు వానిక్రయమునిమ్మనియడుగును. యాత్రికులు క్రయమనగానే నెవ్వెఱఁబోయి గుమాస్తావంకఁజూతురు. అతఁడువారితో లెక్క నేను క్రమముగాచూచుకొనుచుంటిని. నేనుండగా దగాచేసి దమ్మిడీయైనను పుచ్చుకొనుటకు సాధ్యము కానేరదు. సమూహమధికమగుటచే ఈదినముకొంచెము గిరాకియెక్కువగాయున్నది అయినను మేము వాడుకదారులము. మాతోవచ్చినవారియొద్ద యెక్కువతీసుకొనఁజాలరు. నాలెక్కప్రకారముగా నందఱికినిఁజేరి పండ్రెండున్నరరూపాయలైనవి. ఇచ్చివేయండి" యనును. అర్చకుఁడు

తనిపై కోపపడినట్లభినయించి 'ఏమయ్యా! అన్యాయముగాయున్నది. గిరాకిసమయములలోనయితేనిట్లుయివ్వడము మంచిదేనా! ఎప్పటికిని మీకొకరేటువెలకు దొరుకుననుకొంటిరా? జట్టుపెద్దదిగా యున్నదనియు నేదోమాకు కొంచెములాభముగానుండుననియు మీమాటలువినిమే లయినప్రసాదమునిచ్చినాను. యిటులచేయుట తెలిసియుండిన దానికితగినట్లు యిచ్చియుండుదు ఇంతతగ్గించియివ్వడము సరి కాదు, నాలెక్కప్రకారము పదునైదురూపాయలైనవి. రెండున్నర తగ్గించినాడు అని తకరారుచేయునుగాని గుమాస్తా యతనితో తగవుపెట్టుకొన్నట్లునటించి యాత్రికులనుచూచి 'ఏమీ? ఆరూపాయలిట్లునాచేతయివ్వండి. ఇతనుగాకుంటే మఱియొకఁడగునేమి? ఇతడేశాస్త్రమా? వాడుకగా యిచ్చుచున్నవాడుగదాయని యితనియొద్దకువచ్చినాను మోమోటము లేకమాట్లాడుచున్నాఁడు.' అనును. వారు ఇచ్చటప్రసాదమునుయాత్రికులకుధర్మముగా యిచ్చెదరని వినియున్నాము. ఇట్లుకొనడమెందుకు? అనినయెడల 'అయ్యో! అది మీరు తినగలరా? మంచిదంతయు విక్రయమునకుఁబెట్టుకొని యడుగుమాడుచెక్కలలో కొంచెము బెల్లము వేసి పిసికి యొక్కొకరికి నిమ్మకాయంతయిచ్చెదరు దానికైనను నెంతతడవోకనిపెట్టుకొనియుండవలయును. అటులనుండినను వచ్చినవారికందఱికి నిలభింపదు. అదిసమ్ముకొనినచో ప్రాణములుపోవలసినదే! ఎవరో, బైరాగులును, సంతకంటెవేఱుగతిలేనివారును దానికికాచుకొనియుండవలసినదే కాని సాధారణముగా నందఱును నిట్లే చేయుటవాడుక. అదియునుగాక మీకాప్రసాదమునిప్పించినది మాశాస్త్రులవారికి తెలిసినా? పిమ్మట చెప్పవలసిది లేదు. నామీఁదకోపమెందుదురు' అనిచెప్పివారియొద్ద క్రయమునుపుచ్చుకొని యర్చకుని చేతిలో పడవైచి "ఇదిగో! తీసుకొనుము. యింతకెక్కువగాయివ్వము, అటుమీఁద నీయిష్టము వచ్చినట్లుచేసుకొనుము. ఆత్రగాఁడవుగాయున్నా"వని మహాకోపముగలవానివలె వారినచటనుండి పిలుచుకొనిపోయి బసఁజేర్చి మరలవచ్చి తనకమీషన్ తీసుకొనిపోవును. క్రమమైనవెల యతఁడిచ్చినప్రసాదమునకు నాలుగురూపాయల కెక్కుడుండదు. అంతటగుమాస్తా యాత్రికులయొద్దకుపోయి, యాస్థలములో జరుగునట్టి యుత్సవములును, చూడవలసిన విశేషములునువర్ణించి, 'మీరు, నేనుచెప్పినవానిలో నొకటై

నను తప్పకచూచి, యాత్రపూర్తిచేసుకొనకగాని యిచ్చటనుండిపోకూడదు. డబ్బు కావలసియుంటే యిప్పించెద' నని చెప్పును. ఆమాటలువిని వారుదిగులొంది. 'ఓయిబాబూ! ఇతడింకను మనలవిడుచునట్లుండలేదే మరల యత్నించుచున్నాఁడు. ఏలాగునసైనం దప్పించుకొంటిమేని బ్రతుకుదుము. లేదేని మనరక్తమును పీల్చి పిప్పిఁచేయకమానఁడు. ఇతని బారినుండి తప్పించుకొనుటయే మనకు యాత్రాఫలముఘటించుట ఇంకనిమిషమైన నిచటనుండకూడదు. ఇంతదూరము వచ్చినందుకును, కష్టపడినందుకును, యెట్లోయొకలాగు స్వామిని సందర్శించినాము. ఇంతేచాలును' అని కలియబలుకుకొని గుమాస్తాతో 'స్వామీ! క్షణమయినను మేమిచటనుండజాలము. ఇంతవరకునుం జూచినవిశేషములు చాలును. ఇంక ప్రయాణముకాకతప్ప'దని యతఁడెంతచెప్పినను వినక మాటలుచంకలనిడుకొని పయినమగుదురు. విధిలేక గుమాస్తాయున్ను బయలుదేరును. ప్రాకారములు దాఁటివచ్చినంతట యతఁడు వారితో 'మీరుచాలా ప్రయాసపొందియున్నారు నడువజాలరు. డోలీలలో యెక్కండి'యని చెప్పునుగాని వారు 'ఓయుబ్బా! చాలుచాలు డోలీలుమాకక్కఱలేదు. ఆసుఖముననుభవించితిమైనది. మేము మెల్లగానడిచియే వచ్చెద'మని నడువనారంభింతురు. మరలివచ్చునపుడు గుమాస్తాబాణమంతగా సాగకుండును. అతఁడు చెప్పెడిమాటలకన్నిటికిని వారు వ్యతిరిక్తముగాబలుకుచు, కష్టపడి మెల్లమెల్లగానడిచి కొండదిగి సత్వహీనులైవచ్చి శాస్త్రిగారొసంగినబసలో శరీరములనుబడవేయుదురు. గుమాస్తా తాను జరిగించినదంతయు శాస్త్రిగారికిచెప్పి తానుగడించినడబ్బులో శాస్త్రిగారి కివ్వవలసినభాగమునిచ్చివేసి, శేషించినది తానుతీసుకొనును. ఒకటిరెండుదినములు బడలికచే లేచుటకునయితము శక్తిలేనివారై యాత్రికులు పడియుండుదురుగాని గుమాస్తావలన యుపద్రవమువాత్రము వారికితప్పదు. అలమేలుమంగాంబను చూచియేతీరవలయుననియు, లేనియెడల యాత్రచేయవచ్చిన ఫలమేలేదనియు తొందఱపెట్టుచుండును. రెండుదినములుపడినవారు పడియున్నట్లుండి కొంచెముసమాళించుకొని, మంగాపురమునకుప్రయాణమై బండ్లనెక్కుదురు. వారిని ప్రయాణముచేసి గుమాస్తాముందుగానేపోయి చేయవలసినయేర్పాటులన్నియుం జేసి వీరిరాకనిరీక్షించుచుండును. యాత్రికులురాగానే

పుష్కరిణిలో స్నానముఁ జేయించి తోడ్కొనిగుడికిపోవును. గానిస్నానము చేయునపుడు సంకల్పముచెప్పెడి బ్రాహ్మణులయుపద్రవమువారికితప్పనేతప్పదు. గుమాస్తావారికి మామూలనిచెప్పి వేలువేలుగాదక్షిణలిప్పించి తనకమీషను చేత వేయించుకొనును. దేవాలయమునకు పోయినతరువాత స్వామిగుడిలో నడిచినయంశములయందొకటియైనను జ్ఞో అంతయుండదు. కొన్ని యేర్పాటులు గుమాస్తాగారు క్రొత్తగాచేసిడబ్బునూడదీయుటయుంగలదు. ఇంతటితో యాత్రికులయొద్దనుండిన డబ్బు జాడాయగును. ఇంక వేంకటేశ్వరుఁడేగతియనియెంచి వారమరలిశాస్త్రిగారియింటికివచ్చి వారినిచూచి 'స్వామీ! దయచేసి మమ్ములమాయూరుచేర్పవలసినభారముమీయందున్నది. మాయొద్దడబ్బుబొత్తిగాలేదు. మేముతెచ్చినదియు, మీయొద్దపుచ్చుకొనినదియు దమ్మిడియైనను లేకపోయినది. మాకురైలుచార్జి సెలవులకు యేబదిరూపాయలు యిప్పించండి ఊరికిపోయి మీరుయిచ్చిన డబ్బంతయుఁబంపి మానగలు తెప్పించుకొనెదము' అనియడుగుదురు. శాస్త్రిగారామాటలు విని నవ్వి "అయ్యో! ఈవిషయమును నిన్ననే చెప్పగూడదా? నాయొద్దనెప్పుడును డబ్బుసిద్ధముగాయుండునా? మీవంటివారువచ్చి యిచ్చినదేగాక మాకు వేరే యెచ్చటనుండివచ్చును? వేయిరూపాయలుండినవి. నిన్నసాయంత్రమే మీవంటివారే యొకరు చాలాయవసరముగా కావలయుననియడిగిసందునయిచ్చినాను. ఇంక యాత్రికులెవ్వరైనను వచ్చిననే నాయొద్దడబ్బు. లేకున్నలేదు 'చేతనుండిన రూపాయలనిచ్చితినే, మనకు కావలసిననెట్లా'యని నేనుదిగులుపడుచున్నాను. త్వరపడియిచ్చినాను, ఈవూరిలో నే నెవ్వరినియడిగెడివాడ కలేదు. ఒకవేళయడిగినను నిచ్చువారు లేరు. అందఱు నంతంతమాత్రములోనివారలే! అయ్యో! పాపము. నాయొద్దనుండిననిచ్చియుందును. మీకొసంగినభయమేమి? ఇట్లు సందిగ్ధముగాయేర్పడినది. 'నిన్నమాటమాత్రము కావలసినట్లు మీరు చెప్పియుండినచో నేనుయిచ్చియేయుండను. ఇపుడువ్యసనమొంది ప్రయోజనము లేదు.' అని కొంచెమాలోచించి 'ఎటుచూచినను దారికనుపడలేదు. నేనొకయుపాయముఁజెప్పెద. నటులచేయండి. కాదేని మీకుచాలాకష్టముకలుగును. ఏమనగా మీరుకుదువపెట్టించిన నగలకు వృథావడ్డి యచ్చుకొనుటయేల గానివానినివిక్రయించండి. వారికియివ్వ

వలసినదిపోను శేషించినది మీకు సెలవులకువచ్చును. అప్పుగాతీసుకొన్నను వారికచ్చుకొనకతప్పదుగదా! ఆడబ్బుపెట్టి మరలచేయించుకోవచ్చును. క్రొత్తనగలుగానుండును. నష్టమేమియునుండదు. ఇదియేయిప్పటికి లాభకరమైనపని. వారివారియిండ్లకుపోయి దేవులాడవలసిన యాగత్యము లేదు. దీనినిమించినయుపాయమేదియు నాబుద్ధికితోచకున్నది" యనిచెప్పును. వారేమిచేయుదురు. కొంతతడవు తమలో తాము కలతనొంది. ఎట్లయినను నూఁకుచేరవలెనుగదా! విధిలేకయానగలను విక్రయించివేయుటకు సిద్ధపడి శాస్త్రిగారితో 'అయ్యా! మేముక్రొత్తవారము. ఇచ్చటనెవ్వరిని యెఱుంగము. ఆపనియుమీరే చేయుండి, తగినవారియొద్ద వెలమతింపుచేయించి మాకుకొంచెము లాభముగానుండునట్లు చేయుండి' యనిచెప్పుదురు. శాస్త్రిగారు, వారితో, 'ఆవిషయముమీరు చెప్పవలయునా? మోసముచేయగ పనులు నాయొద్దనెవఁడునుం జేయఁజాలఁడు. మీకంటె నాకుకావలసినవారెవరు? మీబోటివారు పదిసందిమాయొద్దకు వచ్చుచుండిననేకదా! మాకుజీవనము. మీరేమియుభయపడవలదు. నాతోకూడాయుండుఁడు. మీయెదుట నలుగురికిచూపి యెచ్చటవెలహెచ్చుపడునో యచ్చటనే తీర్మానించుకొందము. ఒకరి మొగమోటము మనకుకావలసినదిలేదు' అని తటాలునలేచి లోపలికిబోయి గుమాస్తాతో చెప్పవలసిన విషయములుచెప్పి వచ్చికూర్చుండి కొంచముతడవ యేదోమాటలుచెప్పుచుండి గుమాస్తానుపిలుచును. అతఁడురాగానే యెవఁడోయొకనిపేరుచెప్పి 'యతఁడున్నాఁడేమోచూచి శీఘ్రముగారమ్మ'నిచెప్పును. గుమాస్తాత్వరితముగా పోయివచ్చియున్నాఁడనిచెప్పును. అంతటశాస్త్రిగారు, యాత్రికులలో ముఖ్యుఁడుగాయుండు వానినివెంటబెట్టుకొని, తత్పూర్వమానగలుపెట్టుకొని తానేరూపాయలిచ్చినవాఁడుకావున యనియాత్రికులకు తెలియకుండునట్లు గుమాస్తాచేతయొసఁగి తనకుకావలసినవానియొద్దకు ముందుగనేపంపివెనుకతాను పోయి యామనుష్యునిచూచి 'ఏమయ్యా! నీయొద్దనుంచిన నగలువిక్రయించదలంచినాము. కావలసియుంటే నీవేతీసుకొనుము, లేదా? యవి తీసుకొని సరాబుయొద్దకురమ్ము విక్రయముచేసి నీకుచేరవలసిన మొత్తమిచ్చెద'మని యడుగును. తానే కుదువయుంచుకొని రూపాయలిచ్చినట్లు నటించెడి యామనుష్యుఁడు "సరాబులయొద్దకు పోయినచో, నగ

ముకాజేయుటకు ఏలనష్టపడెదరు. ప్రాతనగలకు కూలికట్టియివ్వరు తెలిసిన విషయమేకదా! సరియైనవెల తీర్చియిచ్చినచో నేనేతీసుకొని నా బాకీపోను మిగత మొత్తము నిచ్చివేసెద"ననును. శాస్త్రి "సరే! తెమ్ము వన్నెచూచి యెంతవెలకు తీసుకొనెదవో చెప్పు" మనును. వాఁడానగలనింటిలోనుండి కొనివచ్చి యొరచిచూచి "అబ్బే! తగ్గువన్నె బంగారమే! నేను మంచిదని భ్రమపడినాను. పాపము! వీరు నవరలే యిచ్చియుంటారుగాని, కంసలవాఁడు తగ్గుబంగారమును కలిపి చేసియిచ్చినాఁడు. అటువంటి మోసగాండ్రకే యిదిమంచి కాలము. నాకక్కఱలేదు మీరెచ్చటనైనను విక్రయించి నామొత్తమిచ్చివేయుఁడు. మీరు తెమ్మనిన చోటునకు తెచ్చెద"నని పెదవులు విరచును. శాస్త్రిగారు వానితో, "నీవెంతకు తీసుకొనెదవో దానిఁబలుకుమని యడుగును. ఆమనుష్యుఁడు "ఏమండీ! నే నడిగినయెడల మీకు కోపమువచ్చును. ఆనిష్ఠూరమెందుకు? ఇచ్చినడబ్బు వచ్చినచో యదియే చాలును. నేనయినచో—అనును.

శాస్త్రి:—నీయిష్టము దాచనేమెందుకు? బయటఁ బెట్టుము.

ఆమనుష్యుఁడు:—బయటపెట్టనేమేయున్నది. ఎనిమిదినూఱుల రూపాయలుగదా! యీరెంటిమీఁదను నిచ్చియున్నాను. ఆమొత్తమునకైనచో నేనుపుచ్చుకొనెదను. ఇపుడే యమ్ముకొనుచున్నారు గాన వడ్డితోసివేసెద. మఱియొకనికి విక్రయించినచో, నాకు వడ్డితో యివ్వవలసియుండునుగదా! నేనుపుచ్చుకొన్నచో మీకదిలాభము. ఇతరుఁడు కొన్నయెడల వడ్డి మీరు చేతినుండి యివ్వవలసియుండును.

శాస్త్రి:—అయ్యో! అంతేనా? పాపము! వీరు యెక్కువవెలయిచ్చి చేయించినారఁట. నీవిటుల నడుగుచున్నావు. ఇంక నేమైనను కొంచెము—

ఆమను:—ఇంక కొంచెము లేదు గించము లేదు. వడ్డినాకునష్టమే! వీరు యెక్కువవెల యిచ్చియేయుంటారు. నేను ముందే చెప్పినాను గదా! కంసలవాఁడు మోసము చేసినాఁడు. వీరికి తెలియదు. ఇంక నంతకుమించి వెలపడదు. మీరు యెవ్వరికైనఁజూపి ధర వచ్చిన యివ్వండి.

అంతట శాస్త్రిగారున్నూ యాత్రికులు నొకరిమొగ మొకరు చూచుకొని, నగలతో యామనుష్యునివెంటఁదోడ్కొని తనకనుకూలులుగా యుండెడి నలుగు రైదుగురియొద్దకు పిలుచుకొనిపోయి నగలు చూపును. వారు వానిని యోచించిచూచి పెదవులు విరిచి మొదటివాఁడడిగినదానికన్నను నూఱురూపాయలు తక్కువగా నడుగుదురు. అపుడు శాస్త్రిగారు యాత్రికునిజూచి రహస్యముగా "కుదువఁబెట్టుకొనినవాని కివ్వడమే లాభముగా యున్నది. తన బాకి సరిపెట్టుకొనడమే గాక వడ్డి తోసివేసెనదనుచున్నాఁడు. ఆదండుగ తప్పిపోవును. మీరు మీవూరికిపోయి రూపాయలుపంపి నగలు తెప్పించుటకులోపల నేనోటీసుయిచ్చి యాఱుమూడుగా యేలమువేయించి యింకా బాకీయున్నదని దావాకూడా చేయును. ఈవూరివారలు కడుదుర్మార్గులు నమ్మకూడదు. బాకీతీర్మానం చేసుకొనుటయే మంచిది. మీకు రయిలుచార్జీలు కావలసియుంటే, మఱియేదో యొకనగను విక్రయించి డబ్బుతీసుకొని పోవుదురుగాక. ఈపీడనివర్తిచేసికొనండి" యని చెప్పి వారు జవాబుచెప్పుటకు పూర్వమే తానే మొదటివానినిచూచి "రావయ్యా! వీరందఱును నడివీధి దోపిడిగాండ్రుగాయున్నారు. నీవుచెప్పినట్లు నీబాకీకి సరిపెట్టుకొని రశీదుయిచ్చివేయుము" అని చెప్పును. యాత్రికుఁడు యెంతనోవెలయిచ్చి చేయించిన నగలను సగముఖరీదైనను లేక తుదకు రైలుచార్జికి సయితము దమ్మిడియైనను మిగలకుండ వెలకవి విక్రయింపవలసివచ్చెగదా యని వ్యసనముజెంది చేయునది లేక తానుతీసుకొనిన బాకీమొత్తమునకుచెల్లుగాయిచ్చివేయును. శాస్త్రిగారుతంత్రముగాచెప్పిచెల్లురశీదు మాత్రము కడుదృఢముగా వ్రాయించియిచ్చి "యింటికిపోవుటకుముందే మఱియేదేని యొకనగను విక్రయించి వయికము పుచ్చుకొనండి. దానికొరకు మరలనొకసారిరావలసిన యక్కఱలేకపోవును." అని చెప్పి కొంచెము దూరముగాపిలిచి "యీయూరిలో వీఁడే కొంచెము యోగ్యుఁడు. మీరు విక్రయించబోయెడినగను వీనికేవిక్రయించుట మంచిది. ఇతరులకంటె నొకపావుసొమ్ము వీరివద్ద లభించును" అని చెవిలో గుసగుసచెప్పును. ఒక్కొక విషయముగా చూచి శాస్త్రిగారి యాడావడియు దార్జన్యముం దెలిసికొని యుండియు, క్రొత్తచోటగుటచే తాను చేయునది యేమియును లేక, "యేమినష్టమైనను సయ్యో

నింక యీదుర్మార్గుల బారినుండి యూరుచేరుట మంచిది. వీరింక మ
మ్ము పీల్చి పిప్పిచేయక విడువరు. ఊపిరియుండినచో నగలెన్నియైనం జే
యించుకొనవచ్చు"నని తెగువచేసి మరల నేదో యొకనగను విక్ర
యించి యాడబ్బు పెట్టుకొని నాఁడే రైలుకు ప్రయాణమగుదురు. శాస్త్రి
గారు తా నేమో వారికెక్కుడు సహాయము చేసినవానివలె వారిని
చూచి "మాకష్టము చాలా తగ్గించినారు. సరే! కానిండు. మీకుజ్ఞా
పకమున్న చాలును. ఇంకమీఁదట మీరుగాని మీయిలాకావా రెవ
రుగాని వచ్చేయెడల యిచ్చటికే రావలసినది. ఇది మీస్వంతగృహము
ని యెంచండి. సుఖముగా పోయిరండు" అని యనుజ్ఞనొసంగి గుమా
స్తాతో "నీవు వెంటపోయి వీరికందఱకును మొత్తముగా నొకటే ప్యా
సుతీసియిచ్చి జాగ్రతగా రైలు నెక్కించి"రమ్మనిచెప్పును. వారిసామా
నులను వారిని బండ్లమీఁద నెక్కించుకొని గుమస్తా రైలుస్టేషనుకుపోయి
దిగి, టిక్కట్లు నిచ్చెడివానితో గుసగుసమాట్లాడివచ్చి యాత్రికులతో
"విన్నారా? వేఱువేఱు టిక్కట్లను కొనవలసినదే కాని మొత్తముగా
ప్యాసు నివ్వననుచున్నాఁడు. యెంతయో బతిమాలుకొనగా తనకురెం
డురూపాయలు యిచ్చినట్లయిన ప్యాసునిచ్చెదనని చెప్పినాఁడు. పోనీ,
వేఱువేఱుటిక్కట్లే తీసుకోవచ్చునని యోజించిన 7-8 రూపాయలుచా
ర్జి అధికమగునట్లున్నది. మీయిష్టము" అనును. వారు ఇంకను మనకు
పట్టినశని విడవలేదు కాఁబోలు"నని విసుగుతో సరే! రెండురూపాయ
లును సమర్పించి ప్యాసేతీయండి!" యని చెప్పుదురు. అంతట గుమా
స్తాపోయి నాలుగణాలు టిక్కెట్లు నిచ్చువానిచేతబెట్టి తక్కినది రొండి
నిదోపుకొని ప్యాసు తీసుకొనివచ్చియిచ్చి తానుకొంగున కట్టుకొనివ
చ్చియున్న జమాకర్చు లెక్కకాగితమునుతీసి "అయ్యా! ఇదిగో లెక్క
చూడండి! వచ్చిననాడు మీరు నాచేతయిచ్చినడబ్బుపోను మీకపుడ
పుడు సంగడులలో నేనెక్కువగాతీసుకొనివచ్చి ఇచ్చినసామానులకుఁగా
మీరు పదునైదురూపాయలు యివ్వవలయును వారునన్నుతొందర
పెట్టుదురు. అది ఫయిసలుచేయండి!" యని వస్తువులపేరులేకనే
తన యిష్టప్రకారము వ్రాసిపెట్టినపద్దులనుచూపును. అది యాయాత్రి
కులుచూచి "అయ్యో! ఈయమదూత యింకను విడువలేదే! మరల
డబ్బునిమ్మని తగులుకొన్నాఁడే! ఓ వేంకటాచలపతీ! వీనిచేతులనుండి

మమ్ము తప్పించుటకు నీకును సాధ్యము కాకున్నదికదా!" యనిమహాభయముతో "యేమైన సర్యేను. మన కాపురమునకు లేకపోయినను వ్యసనములేదు. వీడడిగినట్లు పదునైదు రూపాయలనిచ్చి శీఘ్రముగా పోయి రైలులోకూర్చుండి ప్రాణములు దక్కించుకొందము. ఆలస్యముచేసితిమే మఱియు నేమేమిసాకులుచెప్పి డబ్బు దెమ్మనునో" యని యెంచి మారుపలుకక వాని లెక్క ప్రకారము రూపాయలనిచ్చి లెక్క కాగితమును చించివైచి త్వరితముగా గేటులోపలికరుగుదురు. అపుడు వారు తమసామానులం గొనివచ్చుటకు కూలివాండ్రను మాట్లాడుకొనుచున్నను, వలదని యడ్డపడి పోర్టరులద్వారా యెత్తించి ప్లాటుఫారమునబెట్టించి యొకటికి నాలుగంత లధికముగా వారికి కూలి యిప్పించును. ఇదిజాస్తికూలిగాయున్నదే యనినచో "ఇచ్చటనిదిమామూలు. పోర్టరులతప్ప యితరులు లోపలరాకూడదు. అందుచే వారు యెక్కువగా కూలిపుచ్చుకొంటా"రని చెప్పును. యాత్రికులు గ్రుక్కుమిక్కురుమనక యిచ్చివేసి బండివచ్చుటకు కొంచె మాలస్యముగా నుండుట నెఱింగి "మరల వీడేమి యాలోచనజేయునో దైవమా! ఉన్నమట్టుకు నైపోయినదే! బండియునువచ్చుట కాలస్యముగాయున్నదే! ఇది మాగ్రహచారము కాఁబోలునని ప్రాణములు పిడికిటఁబట్టుకొని యటునిటు దిరుగుచుందురు గుమాస్తాయాత్రికులజట్టునకు ముఖ్యుఁడగు వానియొద్దకు మరలవచ్చును. వానినిచూడగానే యాత్రికుఁడు నోటతడియారి వెలవెలబోయి 'దైవమా; మరలవచ్చినాఁడే! ఏమిగతి? ఈసారి యెంతమొత్తమునిమ్మనునో, ఎచ్చటదెచ్చి ఇవ్వఁగలను?' అని తనలో తల్లడమునొందును. గుమాస్తా యతనితో వినయముగా 'అయ్యా! మీరుగొప్పవారు, చాలామంచివారు, ఎక్కువడబ్బు సెలవుచేసి యాత్రజరుపుకొన్నారు. వేంకటేశ్వరుఁడెపుడును మీకు సహాయుమైయుండగలఁడు. నేను మీవిషయములోపడిన ప్రయాసయంతయు నెఱింగియేయున్నారు. ఏదోయొకవిధముగా యూరికరుగునపుడు గొప్పబహుమానమును చేసి పోవుదురని కొండంతయాశఁ బెట్టుకొనియుంటిని. మీరు నామాటయే మఱచినట్లున్నది. చూచి కష్టమునుయోజించి సంతోషపెట్టిపోవడము మీకు క్షేమకరము' అని కడునయముగానడుగును. ఆమాటవినగానేయాత్రికునితలపై బండబడినట్లుతోఁచి 'అయ్యో! చచ్చితినే? మరలదగులు

కొన్నాఁడే! ఈపాడు రైలింకను రాకున్నదే! ఎచ్చట నాశమైనదో కదా! ఇపుడు తప్పించుకొనడ మేలాగు?' అని దిగులొంది 'స్వామీ! మాయొద్ద నేమియును లేదు. ఉన్న నగలతో కూడా ముగించితిరి. ఇంకను మా ప్రాణములనైనను నుండనివ్వరాదని తలంచినారా! ఎక్కడ తెచ్చి ఇవ్వమనెదరు? చెప్పండి! ఇంతతో మమ్ము విడిచిపెట్టండి' యని మహాకష్టముతో పలుకును. గుమాస్తా వేసటతో 'ఏమయ్యా! అన్యాయము. మీకుగా నేనెంత ప్రయాసపడితిని? ఎఱింగియుండియు నేదో యొకవిధముగా నంతోషపెట్టి పంపక, యేమి లేదనెదవు నీకు నోరెట్లాడుచున్నది? దైవసహాయము కలుగునా? ఇట్టి యప్రయోజకులని యెఱుంగక కుళ్లాయి బెట్టుదురనెడి యాశతో నానా కష్టములు పడినాను కడపట కుళ్లాయి పెట్టియే పోవుచున్నారు. ఇది మీకు శ్రేయస్కరమైన పని కాదు' అని యచ్చటనుండువారి నందఱను గుంపుగూర్చి, తానువడిన కష్టములన్నియు వర్ణించి చెప్పి, తన కేమియు నివ్వక పోవుటను వివరించి "అయ్యలారా! పాలు అన్నము తినిన మీరైనా చెప్పండి. వీరు కృతఘ్నులుగా యున్నారు. నాచేత పనులు చేయించుకొని పరిహారముగా నేదయినను నివ్వవలసినదని యడిగితే యేడ్చుచున్నా"రని రచ్చ చేయుట కారంభించును. అచ్చటనుండిన వారా యాత్రికుఁ డెన్ని చెప్పినను వినక, గుమాస్తా మాటలు నమ్మి వానికనుకూలముగా 'పాపము! ఏదో కొంచెము యివ్వండి. చాలా కష్టపడినాననుచున్నాఁ'డని యాత్రికునితో చెప్పుదురు. రెండో మూడో రూపాయల నతఁడివ్వవచ్చినచో తీసుకొనక "ఇదేమిటిదండి బిచ్చము, నేను బిచ్చమడుగుచున్నానా? రూపాయలు లేకపోయిన యెడల మీ వ్రేలి యుంగరమైన నివ్వండి. అది యేగొప్పగా నెంచుకొనిపోయెద. ఏమిచేయవచ్చును?" అని మొండిపట్టు పట్టును. ఏలాగుననైనను వానినుండి తప్పించికొననెంచిన యాత్రికుఁ డుంగరము దీసియిచ్చును. అంతలో రైలువచ్చును. అందఱును యెక్కుదురు. గుమాస్తా వారిని చూచి, 'పోయివచ్చెదరా? గోవిందనామసంకీర్తనము చేయండి' యనును. యాత్రికు లతనికి దండములు బెట్టి అయ్యా! గోవిందా! గోవిందా! ఊరినుండి తెచ్చిన రూపాయలు, గోవిందా! యొడల్ల ధరించియుండిన నగలు గోవిందా! తుదకు చేతనుండిన యుంగరముసైతము గోవిందా! మీబారినుండి తప్పించుకొనిపోవుచున్నా'మని చెప్పుచుండగా రైలు 'కూ' యని కూతవేసి పరుగెత్తును. జనులారా చూచి

తిరా? ఎంతయో ద్రవ్యమును కర్చుపెట్టుకొని భగవద్భక్తిచేదూరదేశములనుండి వచ్చెడి యాత్రికులను పెరికితినెడియీదుష్టరాక్షసులుచేయు దుండగములిట్లుండును. ఈపాపాత్ములిట్లుచేయుచున్నను దేవుఁడుసయితము వారికెట్టికీడునుం గలిగింపకుండుటచిత్రము. భగవంతునకును వీరినిచూచిన భయముకాఁబోలు. ఇది తిరుపతియాత్రకు వచ్చువారివిషయము. ఇంకరామేశ్వరము మొదలగు మహాస్థలములయందును నిట్టిదుష్టరాక్షసులు పెక్కండ్రుగలరు. వీరు పుస్తకములను చంకలనిడుకొని ప్రతిరైలునందును సీజన్‌టిక్కెట్లుతీసుకొనితిరుగుచు, చిక్కినవారిని లొల్లిగాండ్రనుజేసి పంపుచుండుదురు. యాత్రకువచ్చువారు వీరిమాటలునమ్మి మోసపోక తమయిచ్చానుసారముగ నెచ్చటనైనను బసఁగుదుర్చుకొని భగవంతునిసందర్శించి సేవించి ధన్యులగుటమంచిది. వీరితోసంబంధముకలిగెనా? హాశ్రముచేయకమానరు.

గీ. యాత్రికులఁగని తోడ్కొని - యరిగిబసలు
చూపి బలుమాయలనుబన్ని - సొమ్మునూడఁ
దీసికొనెడి నేర్పరులైన - మోసగాండ్ర
నమ్మకుఁడు వారినమ్మిన - నష్టమొదవు.

## కలశముపెట్టి దొంగను కనిపట్టు మోసము.

ఇద్దరుముగ్గురు మోసగాండ్రు జతగూడి,ఎచ్చట దొంగతనము జరుగునాయని విచారించుచుండుదురు. ఏగ్రామముననైనను,ఎవరింటనైనను సొత్తులు దొంగతనముగాకొనిపోఁబడినట్లు తెలిసెనేని వారిలో నొకఁడేదోపనికలిగి యా యూరికివచ్చినవానివలె ప్రవేశించి యటునిటుందిరిగి, సొత్తులుపోయిన వివరమును తెలుసుకొని దారినిపోవువానివలె యాదొంగతనముజరిగిన యింటికివచ్చి "అమ్మా! కొంచెముత్రాగుటకు నీళ్లనిచ్చెదరా?"యని యడుగును. ఇంటిలోనివారిలో నెవరో యొకరుకూర్చుండుమనిమంచినీళ్లు తెచ్చియొసంగుదురు. కొంచెముత్రాగి వాఁడుచాలాబడలినవానివలెవాకిటియరుగుపై కూర్చుండును. మంచినీళ్ళనిచ్చినయాడుమనిషి యతనినిచూచి 'అయ్యా! ఏవూరు? ఎచ్చట

నుండివచ్చెదవు? అనియడుగును.

మోసగాఁడు:—మూఁదిగోగులపాలెము. ఒకగొప్పసంకటము తటస్థించి తంటాలుపడుచున్నాను. మాగ్రహచారమువల్ల నిట్లువచ్చినాను.

ఆమనిషి:—'ఏమయ్యా! అంతటిసంకటము? పాపము! చాలాకష్టపడినట్లుమాట్లాడుచున్నావే! చెప్పకూడదా?

మోస:—చెప్పఁగూడని దేమియు లేదు. కష్టమని మెల్లగాచెప్పెదవా? ఆదేవునకే యెఱుక. జోలెడుసొమ్ము పోగొట్టుకొన్నాము.

ఆడు:—ఏమీ? పోగొట్టుకొన్నారా? ఎట్లు? ఏలపోయినది.

మోస:—ఎట్లనిన నేమిచెప్పుదును? దొంగలెత్తుకొనిపోయినారు.

ఆడు:—అయ్యో! ఏలాగుపోయినదయ్యా? నగలా? డబ్బుగానా!

మోస:—రెండును నాలుగువేలరూపాయలు వెలగలనగలు, వేయి రూపాయలురొక్కము. దేవుఁడు మాకొంపముంచినాఁడు.

ఆడు:—కన్నము వేసికొనిపోయినారా?

మోస:—ఔను-ఎండకాలమగుటఁబట్టి యందఱమును చల్లగాలికొఱకు వాకిటపరుంటిమి. పెరటిలో కన్నము వేసి వారియిష్టప్రకారము. శాంతముగా పనిచూచుకొనిపోయినారు.

ఆడు:—ఇప్పుడీయూరి కేలవచ్చినారు? పోఁబడి యేమైనంజిక్కినదా?

మోస:—ఇప్పటి కేమియును లేదు. దానినికనిపట్టుటకే ప్రయత్నించుచున్నాము. దారినిపోవుచుండి మంచినీళ్లకొఱకీ గ్రామములోనికి వచ్చినాను. మఱియేమియు నిచ్చటపని లేదు.

ఆడు:—పోలీసులకు తెలియఁజేసితిరా? లేదా?

మోస:—ఏల? వారివలన నేమగును? వారిమొగము.

ఆడు:—మఱియెట్లు కనిపెట్టఁదలంచినారు? రహస్యము కాఁబోలు.

మోస:—రహస్యమే! అయినను మీతో చెప్పినందువలన నేమిభయము? మీరీమాట నెచ్చట చెప్పబోయెదరు?

ఆడు:—అదేమియు లేదు. అసలుమీగ్రామమిచ్చటికి చాలాదూరము మేమిదివనిగావచ్చి యెవరితో చెప్పుదుము?

మోస:—ఒకమహాప్రజ్ఞావంతుఁడైన మంత్రగాఁడున్నాఁడు. వానిసామర్థ్యము జెప్పనలవిగాదు. వానిద్వారా సొమ్ముపోయినవిధముకు,

గొనిపోయినవారినిం దెలుసుకొనదలంచినాము. అతఁడొకచో టనుండువాఁడుకాఁడు. ఆమాంత్రికునికొఱకు తిరిగితిరిగి నానా కష్టములఁ నుపడి తుదకుకనిపట్టినాను. అతనితోమాట్లాడియే యూరికిపోవుచుండి దాహముకొఱకు వచ్చినాను.

ఆడు:—ఏమిచెప్పినాఁడు? పట్టియిచ్చెదనన్నాఁడా?

మోస:—సందేహమా? అతఁడు తలంచినయెడల దొంగయు, సొత్తును పాతాళలోకములోయుండినను మనకువచ్చినట్లే! రేపువచ్చెదనని చెప్పినాఁడు. ముందుగాపోయి కావలసినవస్తువులు తయారుచేసిపెట్టవలయునని నేనుపోవుచున్నాను.

ఆడు:—ఆలాగా? మాకుబట్టినదశయే నీకునుబట్టినదే! ఆమంత్రగాఁడు మాకు కనబడునా?

మోస:—ఏమీ! అతనితోనేమిపని? మీయింటనేమైనపోయినదా?

ఆడు:—అయ్యో! ఆదుఃఖమునేమిచెప్పేది. నాయనా! అయిదారువేల రూపాయలనగలు. అన్నియుపెట్టెలో పెట్టియుంటిమి మాదరిద్రము. పెట్టెపెట్టెగానేపోయినది. రిపోర్టుచేసినాము. ఏమియుప్రయోజనము లేదు. దారబోసుకొని కూర్చుండియున్నాము.

మోస:—ఎన్నిదినములయినది? మంత్రగాండ్రెవరైనంజూచిరా?

ఆడు:—లేదు లేదు. మంత్రతంత్రాలాట మాకుతోఁచలేదు. ఆదుఃఖముతోనేసరిపోయినది. అదియునుగాక వట్టిటక్కుపిక్కులేగాని తగినవాఁడున్నచోటు మాకు తెలియులేదు. ఇప్పటికి పదునైదుదినములైనవి. పోఁగొట్టుకొని అల్లాడుచున్నాము.

మోస:—పదినైదుదినములేనా? అయితే ఫరవాలేదు. సొమ్మునిప్పటికి నశింపైయుండదు. నేనుచెప్పినయామనుష్యునియొద్దయినం బిలుచుకొని వచ్చితిరేని మీసొమ్ము గవ్వయైనను పోకుండా వచ్చును. నిశ్చయము. నేనుదృఢముగాచెప్పగలను. కాని యతఁడు వచ్చుటమహాకష్టము. అతనినినమ్మతిపరచుటకుగా నేనుపడిన ప్రయాసయింతింతగాదు. ముత్రా

ఆడు:—అతఁడెక్కడయుండును? మేముచూడడమెట్లు? మంచి

మోస:—నేను మాయూరికిపోయి యతఁడు చెప్పినవన్నియుం చ్చట పెట్టి పిలుచుకొని పోవుటకుగా మరలవచ్చెదను. నేనువెం

కొనిపోవునప్పుడిచ్చుటకేదో యొకసాకుఁజెప్పి పిలుకొనివచ్చెద. అప్పుడుమీరుగట్టిగ బ్రార్థించి సమ్మతిపడునట్లుచేసుకొనుఁడు. మీరేపోయి యతనితో మాట్లాడవచ్చునుగాని, అతనిని మీరు కనిపట్టజాలరు. మీకు మనిషి తెలిసినవాడుకాడు. చూచుటకు యేమియు తెలియనివానివలెయుండును. మీకంతటికష్టమేల? నేను తీసుకొనివచ్చి కనపరచెదను. అటుమీఁద మీయిష్టము.

ఆడు:—అయ్యా! దేవునివలెవచ్చినావు. కొంచెముకూర్చుండుము పోవుదువుగాని. మేమునునీవలెనే పోగొట్టుకొన్నాముగదా!

అనియాడుమనిషి బిరబిర లోనికరిగియింటిలోనివారికావృత్తాంతమును తెలిపి పిలుచుకొనివచ్చును. ఇంటియజమానుఁడును, తక్కినయాడంగులునువచ్చి తమయరుగుపైఁ గూర్చుండియున్న మోసగానియొద్దఁజేరుదురు. ఇంటికామందా మనుష్యుఁడు తత్పూర్వమాడుమనిషితోఁజెప్పినది వాస్తవమేనా యనియడుగును. వాఁడు నిజమేననిచెప్పును. అంతట యజమానుఁడామంత్రగానిఁ జూపవలసినదిగా బ్రార్థించును మోసగాఁడు, యెల్లుండి యీమార్గముగా పిలుచుకొనివచ్చెదనని దృఢముగా వాగ్దానముచేసి, త్వరితముగా పోవలయునని వెడలిపోవును. ఆయింటివారు, ఒకరితోనొకరు, 'మనసొమ్ము మనకు లభించుకాలము వచ్చినదికాఁబోలు. పిలిచినట్టుయీమనుష్యుఁడువచ్చినాఁడు; మంత్రగాఁడు చాలాసమర్థుఁడని చెప్పినాఁడు. ఆమాట మనకొఱకే చెప్పినదికాదు. మనయింట సొమ్ముపోయిన దతఁడెఱుంగునా? తనసొమ్ముపోఁగొట్టుకొని దానికొఱకుగా యామాంత్రికుని గనుఁగొనుటకువచ్చినాఁడు. ఏపుట్టలో యేపాముగలదో యెవరెఱుంగుదురు? దేవుఁడుమనపాలనుండుటఁబట్టి నేఁడితఁడువచ్చి యీమంచిసమాచారముఁ జెప్పినాఁడు. చూతము" అని మాటలాడుకొని మాంత్రికునిరాక కెదురుచూచుచుందురు. మూఁడవనాఁడతఁడు మఱియొకని తమజట్టులోనివానిని వెంటఁబెట్టుకొని వారియింటికివచ్చి, తాను ముందుగా లోపలికిపోయి ఇంటివారితో మాంత్రికుఁడు వచ్చియున్నాఁడనిచెప్పును. వారు తొట్రుపాటుతో వెలుపటికివచ్చి వాకిటనిలిచియుండెడి మాంత్రికవేషధారినిచూచి దండములుపెట్టి "అయ్యా! లోపలికిదయచేయండి! అచటనిలిచినారే! ఇది మీగృహముగానే భావించండి. రండిరండి" యని

మిక్కిలి మర్యాదగా యాహ్వానింతురు. వానిని వెంటబెట్టుకొనివచ్చి నగరుము యింటివారికి సహాయముగా మాంత్రికునిఁజూచి "అయ్యా! దయచేయండి. ఎండ కొంచెముచల్లబడినంతట పోవుదము. మీరు నాకు తెలిసినవారు కొంతతడవిచ్చట విశ్రమించండి!" యని వినయముతో ప్రార్థించును. మాంత్రికుఁడచ్చటనిలుచుట తనకిష్టములేనట్లును, వారి ప్రార్థనమువలన విధిలేక సమ్మతించినట్లును నటించి లోపలికరిగినంతట యింటివారు మర్యాదచేసి చాపపఱచి కూర్చుండబెట్టుదురు. అంతట యింటియజమానుఁడు విధేయతతో సమీపమునఁగూర్చుండి "నేను మిమ్మెప్పుడును చూచినదిలేదు. ఇటీవల మీప్రభావమునువిన్నాను. ఇపుడీ పుణ్యాత్మునిమూలముగా మీదర్శనములభించినది. లేనియెడల మీరుగోగులపల్లెకు వచ్చెదరని తెలిసినందున నచ్చటికివచ్చి దర్శనము జేయదలంచియుంటిని

మాంత్రి:—నాతోడ మీకింతటియగత్యమైన పనియేమి?

యజ:—పాపాత్ములు మాకొంపముంచిపోయినారు. దానికొఱకు.

మాంత్రి:—ఎవరాపాపాత్మకులు కొంపముంచడమేటిది?

యజ:—ఎవరా? దొంగలంజకొడుకులు. ఉన్నమట్టుకు జాడాగాతీసుకొనిపోయినారు. పదునైదు దినములైనవి.

మాంత్రి:—మీయింట్లో దొంగతనము జరిగినదంటారా?

యజ:—ఔనండి అదే! సర్వము నెత్తుకొని పోయినారు.

మాంత్రి:—సరే! అయిన? దీనికి నేనేమి చేయగలను?

యజ:—ఏమిచేసినను మీరుచేయవలసినదే! మఱియొకరివలన యీకార్యము కానేరదు. బొత్తుగా చెడిపోయినాము మాయందుకరుణయుంచి, ఏలాగునైనను వానియున్నచోటు కనుఁగొని రాబట్టియివ్వవలయునని ప్రార్థించుచున్నాను. మీకష్టము వ్యర్థమగునని తలంపకుఁడు మాశక్తికొలఁది—

మాంత్రి:—ఇపుడా విచారమెందుకు? నేనంత సామర్థ్యముకలవాఁడను కాను. మఱియెవఁడైనం దగినవానినిపిలిపించి చూడమనుఁడు. నావలనకాదు.

యజ:—మీకంటె తెలిసినవారిని మేము కనిపట్టబోయెదమా? తలం

చితిరేని యీపని మీకు లెక్కలోనిది కాదనుట మేమెఱుంగుదుము నమ్మినాము.

ఇటుల నతఁడు చెప్పగా వానిం దోడ్కొని వచ్చినవాఁడు. వినయముతో "అయ్యా పాపము! చాలాసొమ్మును పోగొట్టుకొనినారట, పుణ్యముఉంటుంది. ఉపకారము చేయండి. మీవంటివారు యిటుల చెప్పినచో మఱియెవ్వ రిటువంటి కార్యమును సాధింపగలరు? దయయుంచండి" యని యింటివానికి సహాయముగా బలుకును. ఇంటివాఁడును మిక్కిలి దైన్యముతో ప్రార్థించును అపుడా మాంత్రికుఁడు మాఱుబలుకక కొంతతడవు యోజించి తనవెంట వచ్చినవానిం జూచి "ఏమోయ్! దారిపొడుగునను నెన్నో యిటువంటివి యుండనేయుండును. వీనినన్నిటిని బాగుచేయుట కెవనితరము? ఏమో చాలా ప్రార్థించితివని కనికరించి నేను నీయింటిపనివిషయములో సమ్మతించినాను. అదియిపుడాలోజింపగా తప్పుగాఁ దోఁచుచున్నది. కాదా? నీపనిని నీవుచూచుకొనక యూరూరియందును, ఇంటింటియందును, నేవేవియో సాకులుచెప్పి పిలుచుకొనివచ్చి ఇట్లు సిఫారసులు చేయుచున్నావు. బాగానేయున్నది. మాటలు చెప్పెడివాఁడవేకదా! నీకేమి? ఒకపనికి పూనుకొన్నచో, దానికిగా పడవలసిన కష్ట మెంతయోయున్నది. ఆకష్టము మీ కెఱుంగజాలక సులభముగా మాటలాడెదరు. శక్తి నావాహనము చేసినపుడు జరుగవలసినవిధులలో యేదైనా కొఱతపడినచో మాప్రాణము మీఁదికివచ్చును. అపుడుమీరు రక్షింతురా? పోదము లెమ్ము" అనును.

పిలుచుకొచ్చినవాఁడు:—అయ్యా! కోపము మానండి! మీరు దయదలచి చేయవలసినపనిగాని, బలాత్కరించువారము కాము. మీకు శక్తి నావహించుటలో యేకొఱంతయు లేక యున్నియుం దగినట్లు చేసెదరు. పాపము! వీరినిచూచిన నాకెంతయు జాలిపుట్టుచున్నది. ఇట్లు చెప్పితినని నాయందాగ్రహ మొందకుఁడు.

ఇంటివాఁడు:—అయ్యా! ప్రార్థించుచున్నామే కాని, యధికార మేమియు లేదు. మీదయ ఉపకారము చేసితిరేని మిమ్ము దేవునిఁగా భావించుకొనెదము. మీకు పుణ్యమున్నూ కలుగును. వినండి! మీరు పూజచేయుడమునకు కావలసినవెవ్వియైనను, తక్కువ

లేక సిద్ధపరచెదము. మీరు కష్టపడినందుకు మీఋణము పెట్టు కొనము. మాశక్తికిదగినట్లు మీకు గౌరవముగా మర్యాదతాంబూల మొసంగెదము. మామనవి నంగీకరించి ఈయుపకారమును చేయండి.

పిలుచుకొనివచ్చినవాడు:—అయ్యో? పాపము! చాలా వేడుకొనుచున్నారు, మీరు కొంచెము కనికరించండి! ఈపని మఱియెవ్వరుం జేయజాలరు.

మాంత్రికుడు:—నేనిచటనుండినచో నీయింటిపని యెట్లగును?

పిలుచుకొనివచ్చినవాడు:—ముందుగా వీరింటిలో చూచి, పిమ్మట మాయింటికి పోవుదము. మరల నిచ్చటికి రావలసినపనియుండదు ఇచ్చట కార్యము పూర్ణమగువరకును, నేనును మీయొద్దనే యుండెదను. విడిచిపోయినచో మీరెటుల పోవుదురో మిమ్ము కనిపట్టుట కష్టము నాపనికానసాగక పోవును.

మాంత్రికుడు:—కొంచెమాలోజించి తన వెంటవచ్చినవానిం జూచి "నీవు నన్నిచ్చట చూడవలయునని సిఫారసు చేయుచున్నావు. నీపని వెనుకబడిపోవును. నీయిష్టము.

పిలుచుకొనివచ్చినవాడు:—ఎన్నాళ్లువట్టును? చాలా ఆలస్యమగునా?

మాంత్రికుడు:—ఏమనుకొంటివి? మఱి పోయినసొత్తును, సొత్తునుకొనిపోయినవానిని తెలుసుకొనవలయునుగదా! దానికిగట్టిగానాలుగుదినములు పట్టును అటుపిమ్మటనే మీయింటికి రావలసియుండును. నీవును వుండెదవా?

పిలుచుకొనివచ్చినవాడు:—అబ్బో! చాలా ఆలస్యమగునే! అటులనైన ముందుమాయింటిపనినిచూచి పిమ్మటనిచటికిరావచ్చును.

ఇటులచెప్పగా యింటివాడు దిగులొంది యతనింజూచి "అయ్యా! కాదుకాదు. ఇదంతయు నీదయవలన జరుగుకార్యము. ఈమహానుభావుని మేమిపుడు విడిచితిమేని యింకవచ్చుననుట నిశ్చయము కాదు. మాయందు కనికరించి ఇచ్చటిపనినిచూచుకొని మీయింటికి పోవుటమంచిది. అంతవరకును మాప్రార్థన నంగీకరించి నీవునుయిచ్చటనే యుండుము. ఏమియుం దక్కువయుండదు. ఇది మీగృహముగానే భావింపుము. వేఱు యోజనసేయవల"దని మిక్కిలి వేడుకొనును,

వాఁడు విధిలేక సమ్మతించినవానివలె యచటి కార్యముగువరకును మాంత్రికునితో కూడా యుండుటకు సమ్మతించి, యతనితో "అయ్యా చాలా దైన్యముతో ప్రార్థించుచున్నారు. నాకు జాలిగలుగుచున్నది. ఏమిచేయవచ్చును? ఆలస్యమైనను నయ్యెడుఁగాక. నేనును నిచ్చటనుండెద. మొదట యీపనినే చూడండి" యనును. మాంత్రికుఁడు తనకు సమ్మతిలేనట్లును, నిర్బంధించుటచే యొప్పుకొనినట్లును, నభినయించి విసుగుతో సరే వస్తువులు సిద్ధముచేయండి. ఏది తక్కువయైనను కష్టముసంభవించును మీయిష్టము" అనిచెప్పును.

ఇంటివాఁడు:—ఏమేమి కావలయునో చెప్పండి తెప్పించెదను. కావలసిన వస్తువులన్నియు నొకపట్టికగా వ్రాసియివ్వండి. అన్నియుం జేర్చెద.

మాంత్రికుఁడు:—ఈపని రెండువిధములుగా చేయవలయును, ఎందువలననఁగా చాలా ఆలస్యమైనది. సొత్తులు పోయినపిమ్మట రెండుమూడుదినములలోనైయుండినచో, మీకింతకర్చును, నేనెక్కుడు కష్టపడవలసినదియు లేకయుండును. కాలముజరిపినారు. ఇపుడు దానిని గురించి విచారపడుటవలన లాభములేదు. ఎట్లును పూనినపనిని సాధించుట ముఖ్యము.

ఇంటివాఁడు:—ఔనౌను. అంతేనండి! అదేమిగా కావలసినది. కాని, రెండు విధములని శెలవిచ్చినారుగదా! ఎట్లు? ఏమేమి కావలయును? చెప్పండి. మిమ్ము మేమెఱుంగక పోవుటచే కాలమువృధాగా జరిగినది, దేవుఁడువచ్చినట్లువచ్చి, ఈయన మీప్రభావము చెప్పి తోడ్కొనివచ్చి పుణ్యముఁగట్టుకొన్నాఁడు.

మాంత్రికుఁడు:—సరే! ఎట్లో యొకలాగు జరిగినది. ఇంక చేయవలసిన విధానము వినండి. ఇంటిలో కలశముపెట్టవలయును. దానికి ముందుగానే రాత్రికాలమున గ్రామపొలిమేరయొద్ద యొకపని చేయవలయును. ఆపనిని చేసినచో సొత్తులీ గ్రామములో యున్నదియు, మఱియేగ్రామమునకు కొనిపోబడినదియుం దెలియును. కలశపూజవలన సొత్తులు కొనిపోయిన మనుష్యుఁడు స్పష్టముగా తెలియును. ఇట్లు రెండువిధములఁ జేసినచో మీ సొత్తులు మీకువచ్చును.

ఇంటివాఁడు మాంత్రికుఁ డిట్లు చెప్పగానే యపుడే తనసొత్తులు వచ్చినట్లు తలంచి మహాసంతోషముతో యతనిఁజూచి "ఏమిచేసినను మీావయ్యయే! దేవునివలెనమ్మినాము. ఇంక కావలసినవానిం జెప్పండి" అనును.

మాంత్రి:—ఆకును గంటమును దెమ్ము వ్రాసెదను. వెలుపటిచేయుపనికి కొంచెమధికముగా సెలవగును. ఇట్లుకర్చుపెట్టించుట నాకు బొత్తుగా యిష్టములేదు. ఏమిచేయవచ్చును? విధిలేకయున్నది. ఇదంతయు మీానేరమే!

ఇంటివాడు:—కానిండు. ఎంతకర్చైననునగును, పనినెరవేరినచాలును.

పిలుచుకొనివచ్చినవాఁడు:—మీాయదృష్టము మంచిది. ఇంకను సందేహమా. మీాసొమ్ము మీాకువచ్చినట్లే! త్వరితముగా, తాటాకును గంటముం దెచ్చియివ్వండి.

ఇంటివాఁడు ఆకునుగంటమునుం దెచ్చియిచ్చును. మాంత్రికుఁడు ఇంటిలోకలశము పెట్టుటకుగా పూజసామానులును, పొలిమేరచెంతచేయుపనికిని రెండుపట్టీలువ్రాయును. మొదటిదగుపూజపట్టికలోసామానులు యిరువదియాపాయలకు తక్కువవెలలోయుండవు. రెండవపట్టిలో నైతేనో, భేతాళకుట్టిశాత్తాగ్రహములకు కుంభముపోసి యాహుతియొసంగుటకుగా యీాక్రిందవివరించినలాగున వ్రాసియొసంగును. అవి యేవనగా—

మాంత్రికుఁడు వ్రాసిన రెండవపట్టీ.

| | |
|---|---|
| కుంభమునకు మేలైనప్రాతబియ్యము | 40 శేరులు. |
| పప్పుచేయుటకు మంచిపెసలు | 4 శేరులు. |
| బెల్లము-పానకమునకుగా | 2 వీసెలు. |
| తమలపాకులు | 1 కట్ట. |
| మంచివక్కలు | 10 పలాలు. |
| కూరగాయలు | 2 వీసెలు. |
| ఉప్పు | 2 సేరులు. |
| మిరపకాయలు | 1 వీసె. |
| చింతపండు | 2 వీసెలు. |
| ఆవాలు | 10 పలాలు. |

| | |
|---|---|
| మిరియాలు | 5 పలాలు. |
| కర్పూరము | 1 పలము. |
| సాంబ్రాణివత్తులు | ½ పలము. |
| నిమ్మకాయలు | 1 వంద. |
| సారాయి | 10 డ్రాములు. |
| ధోవతులుచాపులు | 1 జత. |
| నల్లనివెండ్రుకలమేకలు | 1 జత. |
| తెల్లకోడిపెట్టలు | 1 జత. |
| కోడిగ్రుడ్లు | ½ వంద. |
| నేయి దీపమునకు | ½ వీసె. |
| నూనె దీపమునకు | 1 వీసె. |

మఱియుం జిల్లరవస్తువు లవియువియుంగొన్ని ఇట్లు వ్రాసి సుమారు యేబదియిరువదిరూపాయలకు తక్కువలేకుండునట్లు పట్టియిచ్చెను. అదిచూచి యింటియజమానుఁ డేమియుంబలుకజాలక యాప్రకారము తెచ్చుట కొప్పుకొనెను. మాంత్రికునిఁబిలుచుకొని వచ్చినవాఁడు, 'నేడు సాయంత్రమునకే యన్నియు సిద్ధముచేయుండి. ఈరాత్రి కేపనినారంభిం చుటమంచిది వృథాకాలహరణముచేయవలదు ఈయననిలుచుటకష్టము. వెళ్లెనేని మనకు మరలదొరుకుటకల్ల" యనిచెప్పి ఇంటివానిని తొందఱ పెట్టెను. ఇంతలో మఱియొకమనుష్యుఁడు వారియింటికివచ్చెను.అతఁడు క్రొత్తవాఁడగుటచే యింటివారు వానివంక నట్టెచూచుచు "యితఁడె వఁడు? ఎక్కడనుండివచ్చెను? ఇచ్చటనేమిపని?" యని యాలోజించు చుండుదురు. అతనినిచూడగానే మాంత్రికుఁడు, మొగముచిట్లించు కొని, తనకుసంబంధించిన మనుష్యుఁడని యితరులకు స్పష్టమగునట్లు గా "ఏమీ? ఏలవచ్చినావు? నేనిచ్చోటనుండుటయెట్లు తెలుసుకొంటి వి?" యని యడుగును. క్రొత్తవాఁడు మారుబలుకక సైగఁజేసి యే మోరహస్యముచెప్పెడివానివలె కొంచెము యెడముగాబిలిచి మాంత్రి కునిచెవిలో నేదియో గుసగుసబలుకును. మాంత్రికుడందలివిశేషమును గ్రహించినవానివలె, వెల్లబాటుజెందినలాగున నభినయించి, యట్టె యాలోజించును.

క్రొత్తవాఁడు:—ఆలోజించి లాభములేదు. రాకతప్పదు. ఇప్పుడాహా

పాయలను వారికిచెల్లింపనిచో, వరువుదక్కదు. ఊరూరును వెదకుచు తిరిగితిరిగి నాకాళ్లుబొబ్బలెత్తినవి. ఎట్లో విచారించుచు వచ్చికనుగొన్నాను. నాలుగుదినములకుముందే వంపునట్లుచెప్పి వచ్చినావట. వారికత్యవసరమట. వారుచేయుచున్న తొందర చెప్పితీఱదు నీవువచ్చి మఱియెచ్చటనైనను బదులుగానైనను తీసియిచ్చిరావలయును వారు నేటిసాయంత్రమే ప్రయాణమై పోయెదరట.

మాంత్రికుఁడు:—ఓహో! ఔను! నేను చెప్పివచ్చినదినిజమే! ఆమాటయే జ్ఞాపకము లేదు మఱచినాను. వారికార్యమున కాటంకము చేయుట మర్యాదకాదు. మరియాదమాట యెట్లుండినను అక్కఅపనిర్మైయున్నది. ఇపుడెట్లు?

క్రొత్తవాఁడు:—పోదమురమ్ము. నీవువచ్చినచో యెచ్చటనైనను దొరుకును. ఈయుక్కఅసమయములో వారికిచ్చినంపిరిమేని, మనము పిమ్మట సమాళించుకొనవచ్చును. మనకుఇవ్వవలసినవారు నయితమొకరైన నివ్వకున్నారు.

మాంత్రికుఁడు:—అయ్యో! ఇదియుకిపుడే తటస్థించినదా? ఏమిచేయగవచ్చును? ఇచ్చట, పావము వీరిదొక గొప్పపనినిపెట్టుకొన్నాను. నన్నునమ్మియున్నారు. సామానులుకూడా తేబోవుచున్నారు. ఈరెండురోజులు తెలిసయెకల నేనువచ్చుటకు వీలుండును. నీవు వారిని సమాధానపెట్టివంపజాలవా?

క్రొత్తవాఁడు:—బాగానేయున్నది. అక్కఅవనికివా రడుగుచుండగా సమాధానపెట్టడమెట్లు? నావలన నగునట్లుండిన నేనింతదూరమేలరావలసియుండును? ఈమాట లేలగాని ప్రయాణముగమ్ము. మఱియొకనాఁడువచ్చి ఇచ్చటపనులు చూచుకొనవచ్చును మునిగిపోయిన దేమియును లేదు.

మాంత్రికుఁ డేమియుం బలుకజాలక తత్తఱపడుచున్నవానివలె కనుపట్టును. వారిప్రసంగమును వినుచున్నయింటివారు. మాంత్రికుడా మనుష్యునివెంట పోవునేమోయనియు, పోయినయెడల తమయత్నము నకు భంగముకలుగుననియు దలంచి దిగులొందుచుండుదురు. మాంత్రికుఁడు కొంచెముతడవట్టైయోజించి ఇంటివానితో "ఇతఁడు నామే

నల్లంచు నాకొఱకై వెదకుచు చాలాకష్టపడివచ్చినాఁడు. నేను మాబం
ధువులొకరియొద్ద నొకయవసరమైనపనికలిగి నూఱుహూణములు బదులు
పుచ్చుకొనియుంటిని. ఆనూఱుహూణములు వారు పెండ్లికార్యమునకు పెట్టుకొ
నియుండిరి. కార్యమున కభ్యంతరములేక యిచ్చునట్లు నమ్మకముగా
చెప్పి తీసుకొన్నాను. రేపటిదినము పెండ్లిముహూర్తమనియు, బయలు
దేరిపోవలయుననియు, హూణములు కావలయుననియు తొందఱపెట్టు
చున్నారఁట. నమ్మించితీసుకొని వారికి పనికి భంగముకలిగించుట న్యా
యముకాదు. ఇచ్చియే తీరవలయును. ఏమి చేయవచ్చును? అసందర్భ
ము తటస్థించినది. కాఁబట్టి నే నితనివెంటపోయి మఱి యెవ్వరినైనను
యడిగి తీసుకొని వారికొసంగి పంపవలసినది యగత్యముగాయున్నది.
నేను చెప్పవలెనుమనగా, ఇపుడీ ప్రయత్నమును మానండి. ఊరికిపోయి
పనులు చూచుకొని మఱియొకనాఁడువచ్చి నాచేతనయినసహాయముఁ జే
సెద. ఆలస్యమగుటవలన ఈపనిని సాధించుట కష్టతరము. ఏమైనను
నాటంకము కలిగినపు డేమిచేయుదము? నేనుప్రయాణమైపోయెద" నని
చెప్పను. ఇంటివాఁడేమియుందోఁచక గుటకలుమ్రింగుచు కళాహీనమై
నముఖముతో చూచుచుండెను. మాంత్రికుఁ డచటికి తన్నుబిలుచుకొని
వచ్చినవానింజూచి 'అబ్బా! మీయింటిపనినయితము నేనుమరలవచ్చిన
పుడేచూచెదను. నీయొద్దనైనను తీసి యీయవసరమున కితనిచేతనిచ్చిపం
పి, పిదప సమాళించుకొనవచ్చునని తలంచినను అదికానేరదు నీయూరి
చ్చటికి చాలాదూరము. పాపము నీవెట్లివ్వగలవు? కానిండు మరియొక
సారి వచ్చెదననును అపుడు వాఁడుదిగులొందినట్లు గాముఖలక్షణంబులు
కనపరచి మారువలుకక తటాలునలేచి యాయింటివానికిసైఁగఁజేసి వా
కిటికి పిలుచుకొనిపోయి 'చూచితివా! పిడుగుపడినట్లుగా వీఁడొకఁడువచ్చి
నాడు. అనుకొనినపనిజరుగునుగదాయని సంతోషించితిమి. ఇపుడు మాం
త్రికుఁడు పోయితీఱవలయుననుచున్నాడు. ఈసమయములో విడిచితి మేని
యింక మరల నితఁడువచ్చుటయుం జేయుటయు నమ్మతగినమాటకాదు.
ఎంతో ప్రయాసనొంది యిపుడు పిలుచుకొనివచ్చుటకే విశ్వప్రయత్నము
చేసినాను. ఇతనినికనిపట్టుట మహాకష్టము. ఈదిన మిచటనుండిన రేపు
కాశిలోయుంటాడు. చపలచిత్తుఁడు. ఇటువంటివాఁడు మనకు మఱియొ
కఁడు దొరకబోడు. ఇతనివలన మనకు దృఢముగా కార్యమనుకూల

మఱుటనెఱింగియే నేనింతప్రయాసపడి పిలుచుకొనివచ్చితి. ఇపుడుమన మీనిని విడిచిపెట్టకూడదు విడిచితిమా? మనసొమ్ము మనకింకరానే రాదు. కాబట్టి నేనుచెప్పెడమేనగా, ఇపుడు నీయొద్దనుండినను, లేక మఱియొకచోటతెచ్చియైనను ఇతనికిపుడక్కరకలిగిన నూఱురూపాయలును నీవిమ్ము. నేనేయిచ్చివేయుదునుగాని మాయూరిదికాదు. చాల దూరముగదా! ఒకవేళ నీకుతొందర యుండినచో, మీయింట పనికాగానే యితనినిపిలుచుకొనిపోవుదునుగదా! అపుడు నావెంటనొకమనిషిని పంపుము. నీరూపాయలనిచ్చి పంపెదను. పనిచేసినందుకై యితనికిబహుమానమివ్వవలసియుంటుందిగనుక నేనుదానికి చెల్లుబెట్టుకొనెదనుమీద ఇతరముగా నేమియు యోజించవలదు. వెంటనేరూపాయలునిచ్చి, ఆవచ్చిన వానినిపంపివేయుము. పిమ్మటనెట్లుకూలమో, అలాగుచేసుకొనవచ్చును. ఆలస్యముచేయువల"దని చెప్పెను. ఆమాంత్రికునివలన తమపోయినసొమ్మురాగలదని గట్టిగానమ్మియుండెడి యింటివాఁడా మనుష్యుడు ప్రోత్సహించుటవలన, నెట్లైనను రూపాయలుతెచ్చియిచ్చి మాంత్రికుని జాగివ్వక నిలుపవలయుననియు, ఒకవేళ యారూపాయలు మరల నివ్వకపోయినను, తమసొమ్మువచ్చినతరువాత నతనికిబహుమానము చేయుట యొకటికలదుగదా, దానికై నం జెల్లుబెట్టవచ్చుననియు తలంచి తనతో మాట్లాడుచున్న మనుష్యునితో 'అయ్యా! మాంత్రికునివిడువడము నాకునూ సమ్మతముగా నుండలేదు. పిమ్మట నీవుయిచ్చెదనంటివి అటుల కాకపోయినను, ఇతని కీరూపాయలే బహుమతిచేసినట్లయిన నగును. నాయొద్దపాజరులో నంతమొత్తములేదు. సామానులకే కొంచెమించుమించుగా నూఱురూపాయలు కావలసియున్నవి. మఱియెచ్చటనైనను, బదులుగానైనం దెచ్చియిచ్చెద నీవు మాంత్రికునకునచ్చజెప్పి నిలుచునట్లుచెప్పుము' అనును. అపుడామనుష్యుడు. సరే! అతనితో చెప్పెదముగమ్ము. రూపాయలివ్వబూనుకొనినంతట మనకుభయమేమి? వీనికొఱకేకదా తానుపోదలంచినాఁడు." అని యింటివానిని మాంత్రికుని దగ్గఱకు తోడ్కొనివచ్చి 'అయ్యా! మేమొక యోజనఁజేసినాము' అనిచెప్పెను.

మాంత్రి:—మీరు యోజనఁజేయుచునేయుంటారు. ఆలస్యమగుచున్నది. చాలాదూరముపోవలయును. ఏమో మీరు మాట్లాడు

కొనుచుండగా చెప్పిపోవలయుననియుంటిని. ఇంక నేను పోయి వచ్చెదను. మీకు భయము లేదులెండి.

ఆమను:—త్వరపడకండి! మీవిషయమును గూర్చియే యాలోజనఁజేయుచుంటిమి. మీరు పోవడము మాకిష్టము లేదు.

మాంత్రి:—అయ్యో! పోకుండిన యెట్లు? నన్ను గూర్చి మీరు యోచన చేయుడ మెందుకు? ఆయాలోజన యేమిటిది?

ఆమను:—విశేషమేమియును కాదు. ఇపుడు మీకు అగత్యముగా కావలసిన రూపాయలు మేమివ్వదలంచినాము. ఆరూపాయలు యిచ్చి మీ మేనల్లుని పంపివేయుఁడు. వచ్చిన పూనిన కార్యమును నెరవేర్పక మీరు పోవడము సరికాదు. మిమ్ము నమ్మియున్నాము. నిలువవలయునని మా ప్రార్థనము.

మాంత్రి:—అయ్యో! పాపము! వలదు వలదు. ఇంతవరకును నేనేమియుం జేయలేదు. వృథా మీవలన నూఱురూపాయలు ముందుగనే తీసుకొనుట ధర్మము కాదు. ఇటుల చేయుడము నాకు సమ్మతము కాదు. ఈప్రయాస మీకేల? ఊరికిపోయి యెచ్చటనో యొకచోట తీసియిచ్చి వచ్చెదను.

ఇంటివాఁడు:—అటులగాదు. దీనివలన మాకేమియుం బ్రయాసలేదు. ఎంతమాత్రమును ఈపని కాక మీరు పోకూడదు. రూపాయలు యిచ్చిపంపి మీరు నిలువవలెను. మిమ్ము మేము విడువము. కొండంతయాశ పెట్టుకొనియున్నాము.

మాంత్రి:—మీరు చెప్పుచున్నారు గాని యీపని యోగ్యమని నాబుద్ధికి తోచలేదు ఈపని హటాత్తుగా యొడ్డము వచ్చినది. లేనిచో మీసొత్తులు రాఁబట్టి యివ్వక పోనేపోను.

ఇంటివాఁడు:—మీరు మావిషయమున నటుల భేదాభిప్రాయము పెట్టుకొనకూడదు. ఈరూపాయలు మీకు యివ్వడములో మాకేమియుం బ్రయాసము లేదు. మామనవివినండి!

మాంత్రికుఁడు విధిలేక యొప్పుకొనవలసినవానివలె తలప్రేలవైచినట్లు నటించి కొంచెమాలోజించి తనమేనల్లునివంకఁజూచి "ఏమిరా! వీరు నన్ను వదలననుచున్నారు. పాపము! చాలాప్రయత్నము చేసినారు. గొప్పపని. నన్ను నమ్మినారు విడిచి రావడము నాకున్నూ సమ్మత

ముగా నుండ లేదుగాని విధిలేక రాఁదలంచినాను. ఇపుడు మనము పెండ్లి వాండ్లకు యివ్వవలసినరూపాయలు వీరిచ్చెదననుచున్నారు. ఇవి తీసుకొనిపోయి వారికిచ్చి పంపివేయుము. ఇచ్చట పనులుచూచుకొని నేను వచ్చెద. ఇంతేగదా?' యనిచెప్పును. క్రొత్తగావచ్చినవాఁడు "సరే! అలాగే తీసిఇమ్ము. ఈతొందరలేనిచో యిపుడు నీవురావలసినయగత్యము లేదు నీపనులుచూచుకొని రావచ్చును. నేనుపోయెద'నని చెప్పును. మాంత్రికుఁడింటివానితో 'అయ్యా సరే! రూపాయలుయివ్వండి మీరు చాలాప్రార్థించుచున్నారు. పాపము! మీపని నెరవేర్చియే పోయెదను. రూపాయలకు భయపడవలదు. నాలుగురోజులు నిదానించినచో మీ రూపాయలు మీకు తెచ్చియిచ్చి వేసెద'ననును. ఇంటివాఁడు. ఆమాటలిపుడేల? మీరుయిచ్చితీఅవలయునని యిపు డెవరు నిర్బంధము చేసిరి. ఇదిగో! తెచ్చెదనని చెప్పి తనయొద్ద లేకున్నను, భార్యమెడలోయున్న యేదోయొకనగను గొనిపోయి యవసరమునుబట్టి అడిగినంత వడ్డిఇచ్చునట్లు ఒప్పుకొని కుదవబెట్టి నూఱురూపాయలుం దెచ్చి మాంత్రికునిచేత ఇచ్చును. అతఁడారూపాయలను వారియెదుటనే మేనల్లునిచేతయిచ్చి "ఇంక శీఘ్రముగాపో! సమయానకు మనకిచ్చినారు. వారిడబ్బువారికి చెల్లించివేయుము. ఈపనులన్నియుంజూచుకొని నేనువారముదినములలో యూరుచేరెద. తడవుచేయక పొ'మ్మనును. వాఁడారూపాయలు పుచ్చుకొని వడివడిగా యచ్చటనుండి కదలిపోవును.

అంతట మాంత్రికుఁడు యింటివానితో "ఈపెద్ద యుపద్రవము తీఱినది. ఇంక మీరుచేయవలసిన ప్రయత్నము చేయుండి. నేఁటిరాత్రికే పని యారంభించవలయునని చెప్పును. ఇంటివాఁడు నానాకష్టములుం బొంది సాయంకాలమునకు మాంత్రికుఁడు చెప్పినప్రకార మన్నియు సిద్ధముచేయును. నాఁటిపగలును రాత్రియు మాంత్రికుఁడును వానిం దోడ్కొనివచ్చినవాఁడు షడ్రసోపేతముగా యచ్చటనే భోజనముచేసి, రాత్రి ప్రొద్దుపోయినతరువాత పొలిమేరయొద్ద చేయవలసినపనికిగా కావలసిన వస్తువులన్నియు నెత్తించుకొని రహస్యముగా బయలుదేరిపోయి గ్రామ యెల్లయొద్దబెట్టించి "ఇంకమీరుపొండు. ఎవ్వరును నుండకూడదు. ఇచ్చటచేయుపనిని చూచినచో ప్రాణహాని సంభవించుననిపంపి వేయును. మాంత్రికునిం దెచ్చినవాఁడు అచ్చట నెవ్వరిని నిలువనీయక

వెంబ బెట్టుకొనివచ్చి గ్రామములో ప్రవేశించును. వేగుజామునకు మాంత్రికుఁడు తడిబట్టలతోడను, కుంకుమబొట్లతోడనువచ్చి యిల్లుచేరి యింటివానింజూచి "ఓయబ్బా! ఎన్నిచోట్లనో పనిచేసితినిగాని యింతకష్టపడి యెఱుఁగను. దినములుజరిగినందున నింతప్రయాసపడవలసివచ్చినది. అయినను సాధించి తెలిసుకొన్నాను. ఇప్పటికి మీసొత్తులెవ్వియు యెల్లదాఁటి పోలేదు. అన్నియు ఈగ్రామములోనే యున్నవి. ఇంకఫరవాలేదు. రేపు కలశముపెట్టి, సొమ్ములుండుచోటును, వానిని దొంగిలించినవానిని కనిపట్టెదను." అనిచెప్పెను. ఇంటివాఁడు చాలా సంతోషముతో "ఏమిచేసినను మీదయయే! నమ్మియున్నాము. మీరుమాపాలిటికి దేవుఁడనియె మాతలంపు" అనిచెప్పి కట్టుటకుపొడిధోవతులు యిచ్చి పడక నమర్చెను. వాఁడు హాయిగాపరుండి నిద్రించి మఱునాఁడు కలశస్థాపనకు ప్రయత్నించి, యొకగది శుభ్రముగా శుద్ధిచేయించి యందొక యెఱ్ఱ పీటపై కలశము బెట్టి మామిడియాకులు టెంకాయయు దానిపైనుంచి, పూవులు పత్రి గంధాక్షతులు మొదలైనవానిచే యలంకరించి పూజచేసి, ధూపదీపములొసంగి, వారు చేసియుంచిన భక్ష్యములును, పలురకముల పండ్లును నైవేద్యముచేసి, కర్పూరహారతి సమర్పించి తాంబూలము బెట్టి యింటివానింజూచి "ఓహో! అన్నియుసరిగానే చేసితివిగాని దక్షిణపెట్టలేదే! ఏమి? మఱచితివా? కలశముపెట్టినచో మామూలు దక్షిణ పదిరూపాయలు. ఇదివరకు యిరువది పెట్టించుచుంటిని గాని కొందఱు పేదవాండ్రు యివ్వలేరని సగముతగ్గించి ఈవాడుక నేర్పఱచినాను. శీఘ్రము తెచ్చి పెట్టుము" అనును. తనయొద్దనుండిన డబ్బంతయుకర్చుపడి చేత కాసైన లేకున్న యాయింటివాఁడు దక్షిణ పదిరూపాయలు కావలయు ననుటను వినగానే దిగులొంది "అయ్యో! దేవుఁడా! ఇంకనేమిగతి ఎవరిచెంతకు బోయిన నెవ్వరిచ్చెదరు? ఇవ్వకున్నచో యితఁడు పనిచేయునట్లుండలేదే!" యని తత్తఱపడుచు బిరబిర మరల నేదో యొకవస్తువుంగొనిపోయి కుదువబెట్టి రూపాయలుతెచ్చి దక్షిణపెట్టును. అంతట మాంత్రికుఁడు పూజముగించి, ఇంటివానితో "అయ్యా! దీనికనిచెప్పక, దేవుఁడిపూజజరుగుచున్నది. తాంబూలమును పుచ్చుకొని పోదురు చనుదెంఁ"డని యూరిలో పదుగురినిం బిలిచి తోడ్కొనిరమ్ము. మఱి యెవ్వరైన నిచ్చటివారుగాకున్నను, కను

పడినచో వారినిసయితము రమ్మనుము. ఎవరీ దొంగతనములో సంబంధముగలిగియుండుదురో తెలుసుకొనవలయును. ఒకనినైనను విడువ కూడదు. త్వరితముగా తోడ్కొనిరమ్మని చెప్పెను అతఁడు పోయి యూరిలో యందఱిం బిలిచి వచ్చునప్పుడు వీధిలో యెదురుపడిన క్రొత్తవాఁడైన యువకు నొకనిగని "అయ్యా! రమ్ము. మాయింటపూజజరుగుచున్నది. తాంబూలము పుచ్చుకొని పోవుదువుగాక" యని వాఁడుతానవసరముగా పోవలయునని చెప్పినను, విడువక బతిమాలి వెంటబెట్టుకొని వచ్చెను. గ్రామస్థులును, "ఎవఁడో మాంత్రికుఁడువచ్చి ఫలానివారి యింట బోయినసొమ్ములను తెప్పించియిచ్చునున్నాఁడట. ఆవింతయెట్లో చూచి వత్తముగాక" యని యందఱును వచ్చిచేరి మాంత్రికుఁడు చేసియున్న యాడంబరమును చూచి యాశ్చర్యముఁ జెందుచుండుదురు. వాఁడేదియో మంత్రించు చున్నవానివలె కొంతతడవు కండ్లుమూసుకొని పెదవులు గదల్చుచు, గొణుగుచు గూర్చుండియుండి పిమ్మట కనులుదెరచి, వచ్చియున్న వారినందఱిం జూచి, ఏమో తెలుసుకొనినవానివలె నభినయించుచుం దలయూచి యింటివారితో "ఏమయ్యా! మీనగలు దొంగిలించిన మనుష్యునిం దెలుసుకొంటిని. అయినను, తెలిసియే తెలియకనో తప్పుచేసినవానిని త్వరపడి బయలుపరచుట మంచిదికాదు. నేఁటి రాత్రికా నగలుతెచ్చి యితరులకు తెలియక నాచేత యిచ్చినయెడల నేను దొంగను బయలుపరచుటలేదు. అలాగు యీరాత్రికి జరుగనిచో రేపటిదినము మనుష్యుని చెప్పడమేగాక నగలుండుచోటును సయితము చెప్పివేసెద. మొదటనే యవమానము చేయుట మాకు న్యాయము కాదు. "ఇతనికెట్లు తెలిసినది? ఊరకనె భయముపెట్టుటకు తలంచి యిటులచెప్పుచున్నాఁడు. నిజముగా దొంగయు, సొత్తులును నితఁడు కనుగొన్నాఁడా? ఇదియంతయు వట్టిమోసపు మాటలు" అని మీరందఱును నాలోచింతురు. నేనటువంటి మోసపు మాటలు పలుకువాఁడను కాను. మోసగాఁడను కాను. స్పష్టముగా యెఱింగియే చెప్పుచున్నాను. గాని పోయిన వానియందలి దయతో, యవమాన పరచరాదని నేనిపుడే చెప్పకున్నాఁడను. ఆవిషయమును నేనెట్లు తెలిసికొంటినో, యాశక్తి నాకుఁ గలదో లేదో మీకందఱకును స్పష్టమగుటకుగా యిపుడు మీకొక దృష్టాంతమును చూపెద. అదికనుగొని, యటులనే నేను తెలిసికొంటినని

మీరు తలంపవచ్చును. "దొంగను తెలిసికొన్నంతట నెవడో చెప్పక
దాచనేమిటికి? ఏమిదాక్షిణ్యము?" అని కొందఱు తలంపవచ్చును.
కొందఱు తెలివితక్కువచే నయితేము ఏదో యొకకారణమున దొంగి
లింతురు. అటువంటివారు పిమ్మట తాము చేసినపని తప్పుగా యె
ఱింగి పశ్చాత్తాపము చెంది, తామా విషయమును బయలుచేసిన
శిక్షాపాత్రుల మగుదుమని వెఱచి యున్నకుందుదురు అటువంటివారిని
బయలుపరచకూడదు "ఈదొంగతనము జేసినవా రటువంటివారేనా?"
యనినచో, యావిచార మనావశ్యకము." మొదటనే దొంగను బయలు
పరచి యవమానించవలదు. దొంగలలో యవమానింప తగినవా రు
ను కూడనివారును నయితే యుందురు. కాఁబట్టి త్వరపడక, వారిని
తెలిసికొన్నవిధము వారికితోఁచునట్లుచేసి, దానికిని లోబడనిచో బయ
లుపరచవలసినదని నాకు గురువాజ్ఞ చేసియున్నాఁడు. కాన ఈదినము
చెప్పక రేపుచెప్పెదను నేను తెలిసికొంటిననుటకు పయిన చెప్పినట్లు దృ
ష్టాంతమును చూపుదుం. ఎట్లనఁగా, ఇచ్చటవచ్చియున్నవారిలో నెవఁ
డైన నొకయుంగరమును నాచేతనొసంగుఁడు. దానిని నేనీకలశమునొద్ద
నుంచి వెలుపటికిదూరముగాపోయెద. అంతట నెవడోయొకఁడా యుంగ
రము తీసి దాచుకొని నన్నుపిలువవలసినది. నేనువచ్చి యందఱిచేతను,
అక్షతలిచ్చెదను. అవి యొకరొకరుగావచ్చి కలశముపై వేయువలసినది.
అందఱును వేసినయెనంతట యుంగరముతీసిపెట్టుకొనియున్నవాఁడు ఫలా
నివాడని కనబరచెదను. అటులనే పోయిన సొత్తులం దెలిసికొంటినని మీ
కవుడు దృఢముగాతోఁచును" అనిచెప్పెను. వచ్చియున్నవారాశ్చర్యపడి
'అదిగొప్పవిషయమే! అదిచూడవలయు' నని చెప్పుదురు. వారిలో నె
వఁడోయొకఁడు తనవ్రేలియుంగరముఁదీసి మాంత్రికునిచేతనొసంగును.
వాఁడు దానినికలశముదగ్గఱ మంత్రించిపెట్టి 'ఇంక నేను బయటపోయెద
మీలో నెవఁడో యొకఁడుంగరమునుతీసి రహస్యముగా దాచిపెట్టుకొని
నన్నుపిలువుం'డని చెప్పి ఇంటివెలుపటికిపోయి వీధిలో కొంతదూరమున
నిలిచియుండును. ఇంతలో నచ్చటివారిలో నొకఁడాయుంగరముందీసి
దాచుకొని యెఱుగనట్లుండును. అంతట యింటివాఁడు మాంత్రికునిఁ
బిలువగా నతఁడులోపలికివచ్చి యెవ్వరితోడను నేమియుంబలుకక యం
దఱిచేతను కొంచెముకొంచెమక్షతలిచ్చును. ఒకఁడొకడుగావచ్చి వారం

దరును నవి కలశముపై వేసి తొలఁగియుండుదురు. అందఱును వేసి కాగా
నే, మాంత్రికుఁడు, రెండునిమిషములుకండ్లుమూసుకొని ధ్యానించుచు
న్నవానివలెకూర్చుండి పిమ్మట లేచివచ్చి యానమూహములో నిలిచి
యున్నయుంగరముదాఁచుకొనిన మనుష్యునియొద్ద గుఱుతుగావచ్చి 'నే
నుకలశముదగ్గఱపెట్టినయుంగరమునితఁడు తీసుకొన్నాఁడు. అది యిప్పుడిత
నియొద్దనున్నది" యనిచెప్పును. అతఁడే యుంగరముతీసినవాఁడని యం
దఱు నెఱుంగుదురుగాన, మాంత్రికుఁడతనిం దెలిసికొన్నందుకు మిక్కిలి
యాశ్చర్యముఁజెంది 'ఓయబ్బా! ఇతఁడు సామాన్యుఁడుకాఁడు. పోయిన
నగలును, దొంగయును, నితనికిస్పష్టముగా తెలిసియుండడముసత్యమే
కాని పొల్లుగాఁ'దనియెంచి మెచ్చి వానిని స్తోత్రముజేయుదురు. పిమ్మట
మాంత్రికుఁడు "నేఁటిరాత్రికి నేను యింటివెలుపల పరుండియుండెద.
కొనిపోయినవారు సొత్తులను రహస్యముగా తెచ్చి నాచేతియిచ్చిరేని,
నేను వారెట్టివారని తెలుపుటలేదు. లేనిచో రేపు బయలుచేసి పోలీసు
వారి యధీనముచేసి యల్లాడించినగలుతీసికొనునట్లుచేసెదను. ఇంకమీ
అందరును పోవచ్చు"నని చెప్పును. ఇంటివాఁడు మాంత్రికునిమహిమకు
మెచ్చుకొని యతనిమూలమున తమసొమ్ము తప్పకరాఁగలదని మునుపటి
కంటె నెక్కుడునమ్మకమును, నతనియందు గౌరవమునుంగలవాఁడై
వచ్చినవారికందఱకును తాంబూలములిచ్చి పంపివేసి మహాసంతోష
ముతోయుండును. ఆదినము మాంత్రికునకు విందుజరుగును.

తానుచెప్పినట్లే యతఁడు యింటివెలుపట మంచము వేసుకొని
యొంటరిగా పడుకొనియుండును. దొంగిలించినవాఁడు కొంచెము
పిరికిగుండెగలవాఁడుగా యుండినచో "మాంత్రికుఁడు తెలిసికొన్నాఁడు.
రేపుబయలుపరచినచో యుపద్రవము తటస్థించు"నని వెఱగొంది యం
దఱును నిద్రించుచున్న సమయమున కొనిపోయిననగలు మూటగట్టి
మెల్లగాతీసికొనివచ్చి మాంత్రికుని పడకపై పడవేసిపోవును. దానికి
గానే కనిపెట్టుకొనియున్న మాంత్రికుఁడు నిద్రపోవుచున్న వానివలె
యుండి ఆమనుష్యుఁడుపోయినంతట మూటతీసుకొని యచటలేచివచ్చు
టకనువుగా తామేర్పఱచుకొనిన సంకేతప్రకారము పడుకొనియున్నతన
నంగడికానిని మెల్లగాతట్టి మేల్కొలిపి వానివెంటబెట్టుకొని వెడలిపోవు
ను. దొంగిలించినవాఁడు ధైర్యశాలిగాయుండి యాప్రకారము కొని

పోయినసొమ్ము నొకవేళ తెచ్చియివ్వకపోయినను తత్పూర్వమే లభించి
నంతటితోనే తృప్తిపొంది పారిపోవుదురు. ఎల్లకాలములో నేమోచేయు
వలయునని కొనిపోయిన సామానులన్నియు నెట్లుపోయినవి? నందఱు
నటనించి వచ్చినతరువాత యీమాంత్రికుని జతలోచేరినవారు కని
పెట్టుకొనియుండి వానియొద్దకువచ్చి యీవస్తువులన్నియు మూటగట్టు
కొని సంకేతస్థానమునకుఁ గొనిపోయి పెట్టియుందురు. మొట్టమొదట
వానిఁదోడ్కొనివచ్చినవాఁడును, మేనల్లునివరుసగల్పించుకొని రూపా
యలకుగవచ్చినవాఁడును, పొలిమేరయొద్దనుండిసామానులుకొనిపోయి
నవాఁడును, కలశముమీఁదయక్షతలు వేయునపుడు ఇంటివాఁడువీథినిపోవు
చుండఁగాఁజూచి పిలుచుకొనివచ్చిన యువకుఁడును, అందఱును మాంత్రి
కుని జట్టులోనివారలే కాని యన్యులు కారు. ఉంగరమును కనిపట్టిచెప్పిన
దెట్లనఁగా, మొదటనేవారు చేయవలసినపనులన్నియు నేర్పాటుచేసుకొని
యుందురు గాన వారిలోనొకఁడు సమయము తెలుసుకొని తానెచ్చట
నుండియో పోవుచున్నవానివలె కలశముపెట్టించిన వానికెదురుగా
వచ్చును. వీథిలో కనుపడినవారినందఱిం దోడ్కొనిరమ్మని మాంత్రి
కుండు చెప్పియుండునుగాన వాఁడామనుష్యుని బతిమాలి పిలుచుకొని
వచ్చును. ఇతఁడు తాను మాంత్రికునకు సంబంధించినవాఁడుగా తోఁ
చకుండువిధంబున నటించుచు గ్రామస్థులతోఁ చేరి యావింతను చూడ
గోరినట్లు వారియొద్దనేయుండును. ఉంగరము దాచుకొన్నంతట మాం
త్రికుఁ డంజలికిని యక్షతలిచ్చి యొకరొకరుగావచ్చి కలశముమీఁదవే
యుండనిచెప్పును. అచ్చటనుండి యుంగరము తీసినవాఁడు ఫలానివాఁ
డని తెలుసుకొనియున్న యాక్రొత్తవాఁడు జాగ్రతగాయుండి, ఉంగ
రమును దాచుకొనినవాఁడుపోయి కలశముమీఁద యక్షతలువేయ
గానే వాని తరువాత తానుపోయి వేసివచ్చును తన యిలాకావాఁ
డెవుడువచ్చి యక్షతలు వేయునో యంతకుముందువచ్చి వేసిపోయిన
వాఁడు వస్తువునుతీసి దాచి పెట్టుకొన్నవాఁడని మాంత్రికుఁడు తెలు
సుకొనును. ఇది వారేర్పఱచుకొనియుండు మర్మమైనసంకేతము. కావు
న తప్పిపోవక యామనుష్యుఁడు వస్తువు దాచినవాడు వేసినతోడనే
తానువేయును. ఆమనుష్యుని గుఱుతుపట్టియుండి అందఱును వేసినపై
నంతట దాచినవానిని మాంత్రికుఁడు ఫలానివాఁడని చెప్పును. అంద

అను ఆశ్చర్యము చెందుదురు. ఇవుడును క్రొత్తవాఁడైన యువకుఁ డప్రేధముగా జేయూటకేనచ్చి తను చేయువలసినపనిని నెరవేర్చి మరల నచట నిలువక వెడలిపోవును. మాంత్రికుఁడు ఉంగరము తీసిన వానిం జెప్పగానే యింటివారికి తనసగలు సయితము మాంత్రికుడు తెలిసికొన్నాఁడనియు, తప్పక తెప్పించుననియు నమ్మియుందురు. అమోసగాండ్రలో లోపల పడుకొనియున్నవాఁడు యింటివారు నిద్రించుచుండు సమయములో తనకు లభించిన పాత్రములు మొదలైన సామానులను జాగ్రతగా మూటగట్టుకొని మాంత్రికుఁడుగా యున్నవాఁడు పిలువగానే యామూట నెత్తుకొని వానితోకూడి పారిపోవును. ఇంక చెప్పవలసినది యేమిగలదు? తెల్లవారినంతట యింటివాఁడా మాంత్రికుడుగాని, వానిం బిలుచుకొనివచ్చిన వాఁడుగాని కనుపడక పోవుటం జూచి బహిఃప్రదేశమునకు వెళ్ళియుందురేమో యని తలంచుచుండునుగాని వారెంత తడవునకు రాకపోవుటవలన సందేహముచెంది వెదుకనారంభించును. ఇంతలో యింటిలోనివా గు, పాత్రలు మొదలైనసామానులు కనుపడలేదని గోలపెట్టుదురు. అమోసగాండ్రజాడయైనం గనుగొనజాలక వారు జగజ్జాలగాండ్రనియు, యేమరించి తనయొద్ద డబ్బును యింటిలోని సామానులును సంగ్రహించుకొని పోయినారనియునమ్మి తామామూర్ఖులచే మోసబోయినామనియు నిశ్చయించుకొని, "సొమ్ములు దొంగలు గొనిపోయినది గాలక దానికివిడ్డిగా చేతులార డబ్బుదారబోసుగొంటిమిగదా" యనియుల్లాసుదురు. నగలమూట సయితము వారికిచిక్కినది యింటివారికి తెలియునే తెలియదు.

ఆతంత్రగాండ్రు యీప్రకారముచేసి సంపాదించి గొనిపోయినడబ్బును, నగలను, సామానులును, సంకేతస్థలమున జేర్చుకొని భాగములుపంచి పుచ్చుకొని మరల నేదేనియు నిటువంటిపని చేయుటకువరకును, భోజనసెలవులకును, సారాయి కల్లుద్రాగుటకును, తమ యింపుడుగత్తెల కిచ్చుటకును, వినియోగింపుచు, క్రొత్తవ్యాపారమునకై యచట నచటందిరిగి విచారించుచుందురు. ఎచ్చటనైన నేదైన నిటువంటి సందర్భము జరిగినట్లు వారిలోయెవడు తెలుసుకొనివచ్చినను, అందఱును చేరి యోజించి యుస్థలములో నటింపదగినరీతిగా వేషములు వేసిపోయి మోసము చేయుచుందురు. పోలీసులతో చెప్పినను, వారి

వేషభాషలు మొదట నుండి యట్లుగాక మాఱుబాటుగా నటించుటఁ బట్టి కనుగొనుటకష్టము. సాధ్యమే కాదు. లోకుల నివ్విధముగా మోసముచేసి దయాదాక్షిణ్యములు లేక తమ సుఖమునే సుఖముగా నెంచి డబ్బునుసంపాదించి దుష్క్రియలుఁ జేయుచుండెడి యీపాపాత్ములకు భగవంతుఁ డెట్టిశిక్షవిధించునో తెలిసినది కాదు. మన దేశమున పెక్కండ్రు పనిపాటులుచేసి సంపాదించుట కొల్లక సోమరులై యిటువంటిదుష్కార్యములు చేయుచుండుట మిక్కిలి శోచనీయము. అన్యాయమడఁగంటినపుడే దేశము క్షేమమొందును.

గీ. మంత్రవేత్తను నేనునా మహిమవలన
దొంగ కొనిపోయినట్టిసా త్తులనుమీకు
లభ్యపరచెదననిడబ్బు లాగుకొందు
రజ్ఞులనుమోసగించిదు రాత్ములవని.

---

# నగలు చేయువారు మోసము.

ఎవరైనను నేదేనియు సొమ్ము చేయించుటకుదలంచి బంగారము తీసుకొనిపోయి యిచ్చి యేబంగారుపని చేయువానినైనా తాముకోరిన నగను చేసియివ్వవలసినదిగా చెప్పినయెడల మంచిదని యాబంగారు నొరసిచూచి, యదియెక్కువవన్నెకలదై యుండినను, 'అబ్బే! ఇదిచాలామట్టుబంగారే! దీనినిపెట్టి నగచేయడమువలన ప్రయోజనమేమి? వృథాకూలినష్టము. సొమ్ము నాణెముగాయుండదు. ఇట్టిదానితో చేసి ఇచ్చినచో మాపేరు చెడిపోవును. మఱియెక్కడనైనా చేయించుకొనండి. లేదా? వీనిలో నగమునవరబంగారుకలిపి చేయుమనినచో చేసెదను. ఎట్లును బంగారమును చేర్చియే తీరవలయును. ఏలననగా యిదిచాలదు. అటులకలుపునది నవరబంగారముగానే యున్నయెడల బాగాయుండును. మీయిష్టము. కలిగినమాటచెప్పినాను' అని యాబంగారమును యిచ్చినవారిచేత మరలయివ్వబోవును. సొమ్ము చేయింపవచ్చినవారు 'మఱియొకనియొద్దకుపోయినను ఇటులనేకదా? చెప్పును. ఏమిలాభము?' అనియెంచి వానితో 'సొమ్ము బాగాయుండకున్న ప్రయోజనమేమి? సరే! నీయిష్టప్రకారము నవరబంగారముకలిపియే చేయుము. ఇది

యెంతయుండునో తూనిక వేయుము' అనినచో 'ఇది ఇట్లే తూనిక వేయ కూడదు. చాలా నష్టకలదిగా యున్నది. కూర్చుండండి. కరగి తూనిక వేసెదనని యా బంగారమును మూసలో పెట్టి కరగనూది యపుడపుడు నందలి మైలదీయు వానివలె నీరుకాలువతో కలియబెట్టుచు కొంచెము కొంచెముగా కుంపటిలో పడునట్లు చేయును. పిమ్మట మూస నెత్తునపుడు తొణికించి కొంచెము నిప్పులలో పోసి చిన్నగా యెత్తి కడ్డీగా బోసి చల్లార్చి త్రాసులో పెట్టి తనయిష్టప్రకారము చేసి పెట్టుకొనియుండు తూనికకట్లు వేసి తూచును. ఆకట్లు వరహాయెత్తునకు ఖండితముగా పావుయెత్తు తక్కువవైనవై యుండును. వానితో తూచునపుడు 'నగచేయించువారు ఇదేమి! తూనికకట్లు ఎత్తు తక్కువగా యున్నట్లున్నవే!' యనినచో 'అబ్బే! అదేమి మాటండి! క్రొత్తకట్లు క్రిందటి సంవత్సరపు కట్లుగా నుండినను మేము వాడము. లోకులు నష్టపడుదురని ప్రతిసంవత్సరమును క్రమమైన క్రొత్తకట్లు తెప్పించుచుండుదుము. మాయొద్దకువచ్చువారందరును చాలాగొప్పవారు. ఏమాత్రము పొరబాటు కలిగినను మాకు మాటవచ్చును. దానివలన మేము జాగ్రతగా యుండుదుము. మీకు సందేహముగా యుండినచో దీనినికొని పోయి వేరే యంగడిలో తూనిక వేయించండి. లేనిచో మఱియొకరియొద్ద నుండి త్రాసును కట్లును కొనిరండి అట్లు చేయడము మాకును మంచిదియే! మాజవాబుదారి తప్పిపోవును' అని చెప్పును. బంగారముకలవారు 'సరే! అలాగైనచో తూచు' మనునుగాని వాడు తూనిక వేయక 'ఏమండీ! సందేహము కలిగిన తరువాత త్వరపడి తూనిక వేయవచ్చునా? మామాట సత్యము మీబోటివారికి తెలియువలదా? మీకు క్రొత్తవారగుటచే యడుగుచున్నారుగాని మాయొద్దకు వాడుకగా వచ్చువారు బంగారము తెచ్చి మాచేతనొసంగి ఫలానినగను చేయవలసినదియని చెప్పిపోవుదురు. తూనికకేగీనిక వారుచూడనే చూడరు. నగచేసినంతట ఇంత యెత్తని మేము చెప్పితిమేని మాఱుపలుకక సంతోషముతో కూలియిచ్చి నగతీసుకొని పోవుచుండుదురు వారికి మాయందంతటి నమ్మికయుండును. మేమన్ననో, యటువంటివారి విషయములో నించుకైనను పొరబాటు లేకుండునట్లు చేసియిచ్చుచుందుము. ఆపాపపుణ్యము లెట్టివో మేముచెప్పినదితప్ప వారేమియు నెఱుంగరు. మీరును నొకసారిచూచినచో రెండవతడవ పలుకనే పలుకరు. ఈయూరిలో తక్కినవారు చేయు

చున్నట్లు మేముచేసినచో మామొగము నెవ్వరైనం జూతురా? న్యాయముగా ప్రవర్తించువారమనియే యందఱును మాయొద్దకు వచ్చెదరు. సాధారణముగా బంగారపుపనిని చేసెడివారు మోసముచేయుచుండుట నిజమేగాని మేమట్టివారము గాము. అట్టివారివలన మాబోటి న్యాయవంతులకు సయితము పేరుచెడిపోవుచున్నది అయినను బుద్ధిమంతులు, గాడిదను, గుఱ్ఱమును నొకచోట చేర్చి కట్టక మంచిచెడుగులు తెలిసికొందురు. ఇపుడే మీకు దృష్టాంతమును చూపెదను. మీసంశయము తీఱును' అని వారు 'వలదు వలదు. తూనిక వేయుమనుచుండినను, తూచకనే తనయంగడిలో పనిచేయుచున్న పిల్లవానితో 'ఒరే! కాళప్పా! శీఘ్రముగా పోయి, ప్రక్కయంగటిలో కీసరయుం త్రాసునుం గొనిరమ్ము. పోయి!' యనిపంపును. సంకేతమెఱింగియున్న యాపిన్నవాడు పోయి రెండుమూడు నిమిషములలో త్రాసువగయిరాలు గొనివచ్చును. అవి ఇటువంటివారిని మోసగించుటకై పెట్టుకొనియుండునవియే కాని ఇతరము కాదు. ఇట్టివి ప్రతివానియొద్దనునుండును. ఒకనియొద్ద మఱియొక్కడు తెమ్మనినపుడు యిట్టిదానినే ఇచ్చును. ఇదివారిసంకేతము. పిల్లవాడు తెచ్చిన కిసరయు త్రాసునుం జూడగానే, యవిపుచ్చుకొని యంగడివాడు, వచ్చినవానిం జూచి 'ఏమండీ! ఇవిగో! చూడండి. మీకే బోధపడు'నని త్రాసులో నొకవైపున తనయొద్దనుండినకట్లును, రెండవవైపున తెప్పించిన కట్లును వేసితూచును. అపుడు తెప్పించినవి ప్రతికట్టును, వానియొద్దనుండువానికంటె యెత్తుతక్కువగాయుండును. అటుల తూచిచూపి, యంగడివాడు "చూచినారా? ఇట్టివానితో తూచి లోకులను మోసగించెదరు. మేమటుల చేయము. ఇంకను రెండుచోట్లనుండి తెప్పించెదను పరీక్ష చేయండి. మీకే బోధపడును. ఇది న్యాయమునకు కాలము కాదండీ! మోసగానికే మంచికాలము. అటువంటివారినే జనులునమ్మెదరు. వారికే జీవనము బాగుగాజరుగును ఏమయినను వారికాపాపము తప్పదు. మాకా మోసములుగీసములునక్కఱలేదు. న్యాయముగా దేవుడిచ్చినదే చాలును. ఏమనియెదరు? ఈ తెప్పించినకట్లువేసి తూచమనెదరో, నాయొద్దనుండువానిని వేయుమనియెదరో, లేక మఱియొకరియొద్దనుండి ఇంకనుం దెప్పించమనియెదరో చెప్పండి' యనును. వచ్చినవాడు, కట్లయెత్తులో భేదముచూచి యాయంగడివాడు క్రమస్థుడుగానే

యున్నాడనియెంచి వానితో 'ఇంకనీవెచ్చటనుండియుం దెప్పించవల దు. తడవగుచున్నది నీయొద్దనుండు కట్టువేసితూచుము. నీవు న్యాయవం తుడవని యేకదా! నీయొద్దకువచ్చితి' వనిచెప్పెను. అంగడివాడు 'ఔనండీ! బ్రతుకునదినాలుగురోజులు, న్యాయముగా కాలముగడపుచు మంచిపేరు సంపాదించవలయునుగాని పాడుడబ్బునకై చేయతగనిమోసములుచేసి గడించి యేమిప్రయోజనమండీ! ఇదిగో! చూడండి' యని యాయున్యా యపుకట్లువేసియు గురిగింజలువేసియు నొకటిసగముగా తూచియిన్నివరహా లయెత్తని లెక్కచెప్పెను. ఆలెక్కశుద్ధమోసము. తప్పులెక్క. వచ్చినవా డు గొంచెముగడుసువాడుగాయుండి 'మీలెక్కతప్పు. సరిగాచూడండి' యనినచో మరలలెక్కవేసి 'ఔనౌను. కూడికలోపొరబాటు ఇపుడుసరి పోయినది. ఒకవేళ మీరుగాని నేనుగాపొరబడి లెక్కతప్పిపోయినను భ యము లేదు. మేము మీరుపోయినంతట మరలతూచిగాని పనికిప్రారంభిం పము. అపుడు తెలిసికొందుము. మీరువచ్చినపుడు చెప్పుదుము. దీనికంతటి కిని మీరుయోజించవలసినది లేదుగానిసవరబంగారుకు రూపాయలివ్వండి యని తోచినట్లులెక్కచెప్పి రూపాయలుపుచ్చుకొని యతడుశీఘ్రముగా చేసిఇమ్మనినందుకు వారములోజులలోగా తయారుచేసి ఇచ్చునట్లుచెప్పి పంపివేయును. ఆమనుష్యుడుపోగానే కుంపటిచల్లార్చి యందు తానువడు నట్లుచేసి బంగారమును కరుగులోబోయునపుడు మూసలోనిలుచునట్లు చేసినబంగారమును తెచ్చినదానిలో సగమునకంటె ఎక్కువగానేసంగ్ర హించును. తూచునపుడు బంగారుతెచ్చినవాడు 'అయ్యో! చాలాతగ్గిపో యినదే నేనుయిదివరలో తూనికవేయించగా చాలాఎక్కువగాయుండిన ది' యనినయెడల 'అలాగా? ఔను అపుడు మీరు ఉన్నదున్నట్టే తూని కవేయించినారు. అందువలన నెక్కువయుండినది. ఇపుడుకరిగించి తూ చుటవలన తగ్గిపోయినది. ఎందువలన? అందలిపాడుమట్టు పూర్ణముగా ఎగిరిపోయి అసలుబంగారముమాత్రమేనిలిచినది. కావున యెత్తుతగ్గినది. ఐననేమి? పరిశుద్ధముగా ఏర్పడినది.' యనిసమాధానము చెప్పిపంపివేయు ను. ఇంకసొమ్మును శీఘ్రముగాతలంచినట్లు చేసిఇచ్చునా! అదియెక్కడ మాట? ఇచ్చినబంగారమును తానుస్వంతమునకువినియోగించుకొని రే పని మాపనియు నిచ్చినవానికి వాయిదాలుచెప్పును కనీసమాఱుమాస ములవరకును త్రిప్పును అప్పటికి మఱియెవడైనను ఇట్టివాడుదొరికిన

ఎడల వాఁడిచ్చినబంగారునుతీసికొని దానిలో ముక్కాలుభాగము కేవలము తక్కువగాయుండుబంగారునుకలిపి లోపల టంకటము బెట్టి జాగ్రతగా యుతికి యెట్లోయొకలాగు నగను తయారుచేసి నాజూకుగామెఱుగుబెట్టి సొమ్ముగలవాఁడురాగానే తూనికవేసి సరిపడునట్లు లెక్కచేయును తిరిగితిరిగి విసిగియున్న యామనుష్యునకు 'ఎట్లోయొకవిధముగా ఇచ్చినసొమ్ము మరలవచ్చినదిగదా! ఇదియే గొప్పయదృష్టమనితలంచి మారుపలుకక యిచ్చినదానిని తీసుకొనును. ఇంక కూలి యెంతయనియడిగినచో 'మామూలు తెలిసియేయుండలేదా? మీయొద్ద నెక్కుడు పుచ్చుకొందు ననుకొంటిరా? ఇవ్వండి' యని యడిగి చేయుటకు న్యాయమైనకూలి నాలుగు రూపాయిలుగా యుండినను ఎనిమిదిరూపాయలని చెప్పి "ఏమియున్నదండీ! ఈవ్యాపారమువలన ప్రయోజనము లేదు. వేఱువృత్తిలేక బోవుటవలనను, పూర్వమునుండి పరంపరగా యీపనియే మాకు జీవనాధారముగా నుండినందువలనను, విడువజాలక చేయుడమేకాని, మా బ్రతుకు బొత్తుగా జెడిపోయినది. ప్రతివాఁడును యీపనిని నేర్చుకొని జేయనారంభించినాడు. కావుననే ఇట్లు స్వల్పకూలికి జేయవలసివచ్చినది" యని దైన్యపుమాటలు పలుకును. అధికమైనకూలి తీసుకొనవలసినదానికి తాను తక్కువతీసుకొనబోవునట్లు వగచును. ఆమనుష్యుఁడు వానిమాటలువిని 'ఓయబ్బా! ఇంతకూలియా? యెక్కడనులేదే! మొన్న మావారు వీరాచారియొద్ద ఇదేమాదిరి నగనుచేయించినారు. దానికి నాలుగురూపాయలు కూలి యతఁడు పుచ్చుకొన్నాఁడు. నీవుజెప్పడము నగకరీదుకు సమముగాయున్నది. దీనికంటె యీనగను మీకే యిచ్చిపోవడము మేలు' అని విసుకుతో పలికినయెడల వానికి లేశమైనను మనసుకరఁగదు. దయాదాక్షిణ్యములులేక యేమోటుగొట్టుకొన్న వానివలె చూచుచు, 'ఏమండీ! అన్నివిషయములుం దెలిసినవారు యిట్లుచెప్పెదరు? మీకు మనుష్యుల తరాతరములు తెలియవు. కావున తోఁచినట్లు మాటలాడెదరు. మీవారు చేయించిన నగను తెప్పించి దానిని దీనినిం జతగాబెట్టిచూడండి. అప్పుడు మీకు తెలియును. ఆతంత్రము తెలుసుకొనుటకు మీకు సాధ్యమగునా! అందు బంగారము నాల్గింట నొకభాగమేయుంటుంది. అందుచే యతఁడు యెంతతీసుకొన్నను నష్టములేదు. అంతయు మోసమే! మేమట్లుచేయము. క్రమ

ముగా చేసియిచ్చియు తక్కువకూలినే పుచ్చుకొనుచున్నాము. కావున
నే మాకు పూటగడచుట కష్టముగాయున్నది. ఈమర్మము తెలిసినవా
రికి మా సత్య మెఱుంగనగును గాని, మీకేమి తెలియునండి! ఇది మోస
ముచేయువానికేగాని మావంటి న్యాయప్రవర్తనగలవారికి కాలము
గాదు. మీరిటుల తకరారుచేయుదురని తోచియుండినచో మీయొద్ద
యీపనిని పుచ్చుకొనియేయుండను. న్యాయము నెఱింగినవారుకదా
యని తలంచినాను ఇది తక్కువయేకాని యెక్కుడుకూలిని యన్యా
యముగా మీయొద్ద నేను తీసుకొనదలంచలేదు' అని తానుచెప్పినంత
యు నివ్వవలసినదేనని పట్టుపట్టును. ఇంక చేయవలసినదేమి! నగ
చేయించుకొనినవాఁడు 'తనలో అయ్యో! మొదటనే నిర్ధారణచేసు
కొననిదోషముగదా యిది. వీనితో వాదించి ప్రయోజనములేదు. బుద్ధి
లేక వీనియొద్ద యిచ్చినందుకు బాగుగా ప్రాయశ్చిత్తమైనది. ఇది స్వకృ
తాపరాధము. ఇచ్చితీరవలసినదేకాని తప్పదు. నష్టమైనను లాభమై
నను ననుభవింపవలయు' నని విధిలేక వాఁడడిగినంతయు మారుబలు
కక ఇచ్చి నగకొనిపోవును. పాపము! ఆసొమ్ము ఇంటికికొనిపోవుటకు
లోపలనే, దారిలో వారువారు నాణెముచూచుచు నొకరినుండి యొక
రుగైకొనుటచే, వారిచేతులుతగిలి దానికివేసినమెఱుఁగుకొంచెముపం
పోయి తెల్లగా ఇత్తడివలెనగును. ఇంటికిగొనిపోయిచూపినచో, స్త్రీలు
దానినిచూచి వెలవెలబోయి 'నవరబంగారముగాదా? ఇట్లున్నదేమి?
మనమిచ్చినది నవరకరఁగిన పరిశుద్ధమైన బంగారమైయుండగా దీనికిఇత్త
డిరూపమెట్లువచ్చినది? కంసలవాఁడు మోసముజేసినాఁడు. ఇంకేమిచే
యవచ్చును? దీనినిధరించుటకన్న నూరకుండుటయే మే'లని పెట్టుకొనక
యునమ్మతమును గనబరతురు. దానిని మరలజేసినవానియొద్దకు గొని
పోయి "ఇదితెల్లగా చాలా తక్కువబంగారమువలె యున్నదేమి?"యని
యడిగిన, వాఁడుకోపముతో "మంచివాఁడవే! చాలును పోవయ్యా!
తక్కువకూలికి చేసియిచ్చినది చాలక వన్నెతక్కువ బంగారని మరల న
డుగుటకు వచ్చినావు. బాగానే యున్నది. నీవుయిచ్చిన బంగారమును
పెట్టి నీకు చేసియిచ్చినాము. మేము తింటిమనితలంచితివా? ఇటువంటి
తగరారువాఁడవని తెలిసియుంటే మేము తీసుకొనియేయుండము. బుద్ధి
వచ్చినది. ఎందఱికో యెన్నియో నగలుచేసి యిచ్చుచుండెదముగాని

నీవలె మమ్ము మఱియెవరు నిదివరకిటుల నాక్షేపించిగాని యడిగిగాని యెఱుంగము. మోసగాండ్రైనచో మీకు తగియుందురు. సొమ్ము సొమ్ము'అని నిరాకరించును. ఆనగను తెచ్చి యెట్లో యూడవారిని బతిమాలుకొని ఇచ్చిన వారు నాలుగుదినములు ధరించగానే యెక్కడి యుతుకు లక్కడనీకి యనువమోగముగా యేర్పడుచు. మరల చేయించుకొనఁదలంచి దానిని మఱియొకనియొద్దకుం గొనిబోయి కరగించినచో వట్టిబంకముగాని బంగారుగాని, బంగారము వరహాయెత్తులో నాలుగవ వంతుప్రకారమైనను నుండదు. ఉన్నయాస్వమైనను హీనమైన తెల్లబంగారముగానుండును. అపుడు నగచేసినవాని మోస మిట్టిదనిఁ తెలిసికొని సొమ్ము చేయించుకొన్నవాఁడు లబలబలాడును. ఏమిఫలము? ఇటుల నష్టపడుచుండినను మనదేశమున స్త్రీపురుషులు వివేక హీనులై బంగారు నగలుచేయువారితంత్రములును మోసములును కొంచెమైనను యోజింపక ప్రతిదినమును లెక్కలేని నగలు చేయించుకొనుచుండెదరు. ఇట్టివారు తామిచ్చిన సొమ్ములో వుచ్చుకొనినది నగమాత్రమే! ఈనగలు వెఱ్ఱి దేశమున నశింయించుకొలఁదిని బంగారుపని చేయువారిదుకాణము లేపట్టణమందు చూచినను, యేపల్లెయందు చూచినను, లెక్కపెట్టతరముగాక మితిమీరి పోయినవి. ఒక కంసాలజాతిమాత్రమేగాక యితర జాతులవారు నయితము నగలుచేయుటకునేర్చుకొని, వీధివీధిని, సందుసందునను నంగళ్లు పెట్టి దినదినమును తమబుద్ధి కుశలతవలన నొక్కొక్కక్రొత్తమాదిరిని కనిపట్టి నగలుచేసి లోకులను భ్రమింపఁజేసి, తమయొద్దకు సొమ్ము జేయించుకొనవచ్చెడి వారిని టోపీవేసి పంపుచుందురు. అన్యాయముగా స్త్రీపురుషులివ్విధంబున నగలకని తాము కష్టపడి సంపాదించినడబ్బు వ్యయముచేసి నష్టము చెందుటకన్నను, యాధనమును సత్కార్యములకు వినియోగించినచో, యిహమున కీర్తియుం,బరమున నానందమునుం గలుగునుగదా! ఎంతనష్టమునకైనను సమ్మతింపుదురుగాని, యిట్టి మంచి కార్యములు చేయుట కొల్లనే యొల్లరు. ఈనగల వెఱ్ఱితనము మన భారతదేశముననేగాని యితర దేశములయందు లేదు. ఒకవేళ యుండినను నత్యల్పము. ఇట్టి యవివేకము తొలంగినపుడుగాని దేశీయులు సుఖము నొందజాలరు. ముఖ్యముగా యీవెఱ్ఱితన మధికముగా ధనికులయందే కనుపట్టుచున్నది. విద్యా

బుద్ధులుగలిగి హానివృద్ధు లెఱింగినవారు నయితము దీనినిషయమై లేశమేనియు విచారించుట లేదు ఇంతకంటె విచారకరమైనవిషయ మేమియున్నది? బంగారునగలు వెండిసామ్ములు మొదలగునవి చేసెడివారు లోకులనివ్విధముగ మోసగించి ద్రోహముచేసి మితిలేని డబ్బును సంపాదించెదరుకాని యన్యాయార్జిత మగుటచే నెంతగడించినను, వారికి మధ్యాహ్నదారిద్ర్యమే! ఏనాడు సంపాదించినది యానాడే కల్లునకో, మద్యమునకో, కాఫిహోటలునకో, వేశ్యలకో దారబోసి చేతులు కడుగుకొని మొగడుచచ్చిన ముండలవలెవచ్చి మరల నెవడు దొరుకునా యెవనికి టోపీవేయుదమాయని చూచుచుందురు. ఎవరో నూటికొకరిద్దఱు దప్ప సాధారణముగా యీవర్గములోని వారందఱును దొంగలేగాంద్రనియే చెప్పవలయును. వీరెట్లుచేయుచుండినను, పనులుతీరగనే లేనందసట్లు పుష్పుదునే యుందురు. గవర్నమెంటువారి గొప్ప యాఫీసుల కొన్నిటిలో సెలవుదినము లుండును కాని, యీబంగారుపనివారి కొంగిళ్లకు, విశ్రాంతిదినమే యుండదు ఎక్కడైన నేమిచేసియుండకూడదనియు చిన్నలు పెద్దలు పెండ్లిండ్లకు కూర్చుండెడి లేనిబాధలు పడుచుండుట నెపుడును మనము చూచుచుందుముగదా ! ఓభారతీయులారా! మీరు సంపాదించిన ధనమును నగలనిమిత్తము వెచ్చించి మొగనికై నగలుగా పుచ్చుకొని ధరించి యానందించుటవలన ప్రయోజనమునేదు. అనవసరమైక సంతోషమునుగాదు. అట్టి నష్టమునకు లోనైనదానికంటె ఎక్కుడగా డబ్బు కలిగియున్నచో, దానిని ప్రజోపకారముగ వినియోగించుటకు మార్గము లెన్నిలేవు ? మీడబ్బును సద్వినియోగముచేసి కీర్తిపొందుట మంచిది. మీరు చేయించి ధరించు రత్నాభరణములకన్నను, సత్కార్యములు సలుపుటవలన గలుగు, పుణ్యమును కీర్తిప్రతిష్ఠలను నధికమైనవని తలంపుడు. అవి మహాదలంకార యుక్తములైన విలువలేని యాభరణములని యెఱుంగుడు. వృథాగా మోసగాండ్రైన నగలుచేయువారి కర్పితము చేయకుడు. ఎప్పుడును వారిని నమ్మరాదు. వీరితంత్రము లెఱింగినవాఁడు కావుననే (నమ్మకు మగసాలివాని) నని మహాబుద్ధిమంతుఁడైన సుమతిశతక గ్రంధకర్త చెప్పియున్నాఁడు. ఇప్పటికైనను మిమ్ము వారివలలో దగులుకొని నష్టపడకుండునట్లు భగవంతుఁడు మీకు మంచిబుద్ధి బ్రసాదించుఁగాక.

గీ. నగలు చేసెదమని పైఁడి గైకొని నగము
హరణ మొనరించి దానిలోఁ గదియు నిదియుఁ
గలిపి కడు నేర్పుతో నొక్క గతి నొనర్చి
యొసఁగు నగసాలి దుర్గతిఁ గొందకున్నె?

# రసవాదము జేయువారి మోసము.

ప్రపంచమున మహాసమర్థులైన వంచకు లెందఱో గలరు. వారికి పరులను మోసగించి డబ్బు సంపాదించుటయే ముఖ్యమైన వృత్తి. కష్టము నకోర్చి యేదేనియు నొక యోగ్యమైన పనిఁ జేసి గడించిన డబ్బుతో జీవనము చేయుటకు వారొల్లరు! ఔను! సులభముగా సంపాదనముఁ జేయు మార్గము కలిగియుండగా వారికి కష్టపడవలసిన నిమిత్త మేమియున్నది? ఈవంచకులు యెప్పటి కెట్టుల కావలయునో యాటుల సమయానుగుణ్యముగా వేషమును దాల్చి బహుచాతుర్యముతో తగినట్లు నటించి పరులను సులభముగా మోసగింతురు. వారితంత్రములు తెలుసుకొనుట మహాకష్టము.

ఒకరకములో చేరినవారియం దొకఁడు కాటి యంగరకాయను, రుద్రాక్షమాలపేరులను, కఱ్ఱపాళి కమండలములును ధరించి ముఖమున విభూతిరేఖలు దీర్చి తాను చేయబోయెడి టక్కుపనులకు కావలసిన వస్తువులు జాగ్రతగా చేసి సంచిలో పెట్టుకొని, యాచటనచట గ్రామములలో తిరుగుచుండు, 'ఎవఁడు దొరకునా, ఎవరితలపై చేయినిడుదునా' యని చూచుచుండును. ఏయూరిలోనైనను గొంచెము మంచిసంసారిగను, తన మాట నమ్మెడివానిగను గనుపెట్టెనేని, పిలిచినవాఁడుపోయి సలాముచేసి యాసంసారి ఇంటివాకిటికిపోయి యరుగుమీఁదఁ గూర్చుండి 'జేగురునాద్! జేశంకర్!' అని బైరాగివలెపలుకుచు సంకకుతగిలించు కొనియున్న చిన్నసంచిలోనుండి గంజాయిపొగత్రాగుచిలిమియు దానికింజుట్టుగుడ్డయు వెలికిదీసి ఇంటివానింగని 'బావాజీ! కొంచెము గురునాథుడికి నిప్పుఇప్పించండి' యనియడుగును. 'పాపము ఎవడో బైరాగిగా యున్నాఁడు. గంజాయిపొగ ద్రాగవలయును కాఁబోలు'నని నిప్పును తెప్పించిఇచ్చును. అతఁడు నిప్పుతెప్పించుటకులోపలనే బైరాగి కొంచె

ము గంజాయియాకును పొగాకునుచేర్చి తనయొద్దపాత్రములోయుండు
నీళ్లువిడిచినలిపి చిలిమిలో పెట్టియుండును. నిప్పుతెచ్చియివ్వగానే సంచి
నుండి యొకయంగుళము పొడవుగలదియు, గొడుగుకమ్మి మందముగల
దియునైన రాగికమ్మి నొకదానిని తీసి యాచిలిమిలో వేసి పిమ్మట
నిప్పువేసి, భగవంతునిధ్యానముఁజేసి, 'జేమహాదేవ్! శంకర్!' యని
రెండుమూడుసారులు పొగపీల్చి తలఎత్తిమీఁదికివిడుచును. ఇదియంత
యు నాయింటిసంసారి కొంచెముదూరములో కూర్చుండి చూచుచుం
డును రెండుమూడునిమిషములవరకును బైరాగి పిలిపిలిపి పొగపీల్చి
విడుచుచుండి తృప్తిపొందినవానివలె 'జెయ్! భగవాన్ గురునాథ్!'
అని చిలిమిలో కొంచెమునీరువిడిచి యందలిబూడిదను చేతిలో క్రుమ్మ
రించుకొని అందుండి తత్పూర్వము తానువేసినరాగితునుకను తీసుకొని
యాబూడిద మరలచిలిమిలోపోసి గుడ్డలోచుట్టి సంచిలోపెట్టుకొనును.
తరువాత యాముక్కను బాగుగాకడిగి వస్త్రముతో తుడుచును అపు
డదియపరంజియై నిగనిగమెఱయుచుండును. ఆచిత్రమును చూచుచున్న
సంసారి యాశ్చర్యమునొంది భ్రమించి యాబైరాగి మహాత్ముఁడుగాని
సామాన్యుఁడుగాఁడని తలంచును. బైరాగి రెండునిమిషములవరకును
నేమియుంబలుకకుండి, పిమ్మట సంసారినిచూచి 'బావాజీ! ఇదిగో! ఈ
బంగారుతునుకనుకొనిపోయి యెవరికైన నమ్మివచ్చినడబ్బులో సగము
నీవుతీసుకొని సగము నాకుదెచ్చియిమ్ము. గురుప్రసాదం (గంజాయియా
కు) కొఱకేగాని మఱిదేనికిని నాకు డబ్బుకావలసినదిలేదు. భగవాన్
కటాక్షం ఎప్పుడున్నా మాకుడబ్బుకలిగియేయుండును. నీవుమంచివాడ
వుగా కనబడుచున్నావుగనుక యొకపలము గంజాయియాకు క్రయము
ను నాకొనంగి తక్కినది నీవుపెట్టుకొను'మని యతనిదగ్గఱకుపిలిచి బంగా
రుతునుకనిచ్చును. సంసారి యతని నచ్చట కూర్చుండియుండుమని చెప్పి
యాతునుకంగొని కంసలవానియొద్దకరిగి వన్నె చూపుమనును. వాఁడు
దానినొరచిచూచి యపరంజిబంగారమని చెప్పి తూనికవేసి పదిరూపా
యలు వెలచేయునని చెప్పును. సంసారి యాతునుకందీసికొని తనలో 'ఇది
యపరంజి, పదిరూపాయలువెలయని తెలిసినది. బైరాగి యొకపలము
గంజాయికి తనకొనంగిన చాలునని చెప్పెను. కాఁబట్టి యీబంగారము
నిల్లెనేనుపెట్టుకొని యాతఁడుకోరినరూకలు నేనేయిచ్చెదను' అనితలంచి

యింటికివచ్చి బంగారమును దాచుకొని, తన ఇంటనుండి రెండురూపా యలు తెచ్చి బైరాగిచేతిలో బెట్టును. అదితీసుకొని యతఁడు చాలాసంతోషించినట్లు కనబడి 'బావాజీ! చాలాసహాయము చేసినావు. నీహృదయము మంచిది. దేవుఁడు నీకు మేలు చేయును. నీవు మిక్కిలి చిక్కులు పడుచుండెదవనియు, నీకు కొంచెము సహాయము చేయవలయుననియు బుద్ధిపుట్టినది. గురునాథుని యాజ్ఞయైనది. కానిమ్ము. మఱియొకనాఁడు గురుప్రసాదం నీకు లభించునుగాక. ఇంక నేను పోయెద'నని లేవబోవును. సంసారి యతనిని పోనివ్వక కూర్చుండబెట్టి తనలో 'బంగారుచేయువిద్య యితనికి బాగుగా తెలిసియున్నది, ఇతఁడు గొప్పమహిమగలవాఁడు. ఎపుడు కావలయునని తోఁచునో యపు డెంతయైనం చేసికొను శక్తిగలవాఁడుగాయున్నాఁడు. ఇటువంటివారిదయ గలిగినచో దారిద్ర్యము తొలగినట్లే! సందేహము లేదు. తానుగానే సహాయము చేయదలంచినా ననుచున్నాఁడు. గాని యది యిపుడుగాదఁట. మఱిఒకనాఁడు వచ్చినపుడఁట. బైరాగులొకచోట నుండువారుగారు. ఇతనిని గనిపట్టు టెట్లు? ఇంకొకనాఁడు వచ్చునను టేమినిశ్చయము? పిలిచిన వచ్చినవానివలె యింటికివచ్చినవానిని విడిచి యెపుడో వచ్చునని యెదురుచూడడము వెఱ్ఱితనముగాని వేఱుగాదు. ఇపుడే ప్రార్థించి యెట్లయిన నితనివలన మేలుచెందవలయునుగాని విడువకూడదు'' అని యెంచి 'స్వామీ! ఎక్కడికిపోయెదరు? అవసర మేమి?' అనును.

బైరాగి:-బావాజీ! మాకొకచోటు నిశ్చయము లేదు దేశమంతయుం దిరుగుచుందుము. ఫలానిచోటునకు బోయెదనని యెట్లు చెప్పుదును?

సంసారి:—అలాగైనచో నేఁడు మీరిచ్చటనే యుండరాదా? నిలువండి! మీ కేమి కావలసియుండినను తెప్పించి ఇచ్చెదను.

బైరాగి:—నీవు చాలామంచివాఁడవు గాని, యేమి నావశ్యము లేదు. నా కేది కావలసినను గురునాథుని యనుగ్రహంవల్ల లభించును. నేనిచటనుండినందువలన నీ కేమిలాభము? ఉన్నదా?

సంసారి:—మీరిచటనుండుట యే లాభము. మీబోటివారికి దయగలిగిన యెడల ఎంతటిలాభమైనను గలుగును. తప్పదు.

బైరాగి:—(నవ్వుచు) ఇపుడు నీ కేమి కావలయును? నీతలంపును దాచక చెప్పుము. గురునాథుఁడు నీయందనుగ్రహించిపోవును.

అతఁడట్లు చెప్పగానే సంసారి యానందముతో తనకుకలిగియుండు సంకటములు సంసారమునందలి యిబ్బందులును, తగినంతధనములేక పోవుటయుం దెలిపి "స్వామీ! నాపాలిటి దేవునివలె పిలిచినట్లువచ్చినారు. ఇది నాకుమంచి కాలమని తోఁచుచున్నది. పేదవాఁడను. నాయందు కటాక్షించి నాసంకటములు నివర్తియగునటుల చేయవలసినభారము మీయందుంచుచున్నాను. మీకు మీరుగానే సహాయము చేయ దలంచినట్లు సెలవొసంగినారు. మఱియొకసారి తామిచటికి దయచేయుటయనిన నదియంతదృఢముగా నమ్మదగియుండలేదు. దేశమంతయుం దిరుగుచుండెడి మీకిది యొకగొప్పవిషయముగానెంచి నాకొఱకుగా వచ్చుట నిశ్చయముకాదు. నాప్రార్థననంగీకరించి ఇపుడే భగవత్ప్రీతిగా యుపకారముచేసి నన్ను కృతార్థునిఁజేయవలయునని వేఁడుచున్నాను" అని వినయముతో ప్రార్థించి తటాలున నతనిపాదములు బట్టుకొనును. బైరాగి, యతఁడట్లుచేయుటచే జంకినవానివలె కొంచము వెనుకకు జరిగి 'బావాజీ! వలదువలదు. పాదములుపట్టుకొననేమిటికి? మేము సర్వసంగపరిత్యాగులము సాధ్యమగునంతవరకును పరోపకారముఁజేయుటయే మాకువిధి. నీసంకటములం దెలిసికొని నీవడుగకపూర్వమే నేనుగానే చెప్పితినిగదా! ఎప్పుడో మఱియొకసమయమున వచ్చినపుడు సహాయముచేయవచ్చునని తలంచితిని. అటులకాకవని నీవు పట్టుబట్టి వేఁడుచున్నావు. నిన్నుచూచి నీమాటలు వినగా జాలిపుట్టుచున్నది సరే! గురుకటాక్షం. నాశక్తికొలఁదియు నీకు మేలుచేసెదను. గాని మొదట నేను నిన్నుకొన్నిప్రశ్నలడిగెద. వానికిసమ్మతించి సరియగు సమాధానముచెప్పితివేని భగవంతుఁడు నీకు మేలుచేయును. అట్లులచెప్పకపోయిన యెడల నీవెంతప్రార్థించినను ప్రయోజనము లేదు. నాదారిని నేనుపోయెదను. ఏమీ? సమ్మతమేనా? సరియైన సమాధానముం జెప్పెదవా? ఆప్రశ్నలెవ్వియైనదియుం బలుకుమనిరొదరా?" యనిపలుకును. సంసారి సంతోషముతో "స్వామీ! సెలవివ్వండి! నాకు తెలిసినంతవరకును సరియైన సమాధానమును చెప్పెదను. తెలియనిదైనచో యెట్లుచెప్పఁగలను?" అనును.

బైరాగి:— తెలియని వేవియును లేవుగాని వినుము. ఇపుడు నీకేమికావలయును? బంగారమా? అయినచో యెంత?

సంసారి:—అదియే నాకోరిక. ఇంతయనిమితి నెట్లుచెప్పగలను? మీదయ. నాదారిద్ర్యమును తీఱునట్లు చేయుఁడు.

బైరాగి:—సరే! ఇది కడు రహస్యమైన విషయము. ఇపుడు నేను చేసికొని నట్లు గొంకైమైనచో భయములేదు. అప్పటికప్పుడు నిమిషములో చేయవచ్చును. నీపనియిట్టిది కాదు. ఎక్కువగా కావలసియుండుటలన నాలుగైదురోజులు పట్టును. కాబట్టి నేనుండుటకు రహస్యముగా నొకయుస్థలము కావలయును. ఏర్పాటుచేయఁగలవా?

సంసారి:—అభ్యంతరమేమి? ఇచటనే వెనుకప్రక్క నొక యిల్లున్నది. యది బాగుచేయించెద. అచ్చోటికెవ్వరును రాజాలరు.

బైరాగి:—మంచిది దానికి కావలసినకర్చులు భరించుటకు నీకుశక్తి యున్నదా? ఇది ముఖ్యవిషయము యోజింపుము.

సంసారి:—ఎంతమాత్రము పట్టును? చాలా మొత్తము కావలయునా?

బైరాగి:—డబ్బుగా విశేషము కర్చుపెట్టవలసినది లేదు. కావలసినది బంగారము. అదియు పరంజిగాయుండవలెను నీవు యెంతసెలవు చేయుదువో, దానికీడగినంతఫలము నీకుకలుగును.

సంసారి:—అనగా నదియెట్లు? వివరముగా సెలవియ్యండి.

బైరాగి:— ఓహో! ఇంతమాత్రము తెలియదా! వేయిరూపాయలబంగారము పెట్టినచో, రాగిగాని, యినుముగాని, యేబదివేల రూపాయలు చేయునంత బంగారుగా చేయవచ్చును. నీయిష్టము. ఎంత పెట్టుకొనినను పెట్టుకొనుము.

సంసారి:—బంగారము లేక చేయుటకు సాధ్యముకాదా?

బైరాగి:—వెఱ్ఱివాఁడవుగా యున్నావు. రసవాదరహస్య మనేకవిధములు వానిలో మాకు యీవిధి గురుకటాక్షం అయినది. అన్నివిధములలో ఇదియేయుత్తమము. తక్కినవి దీనివలె నమ్మకముగా నగునవికావు. ఇదిభోగబుషి పులిప్పాణికిని యామహాత్ముఁడు మాగురునాథుని గురునాథునకు నుపదేశించినది. అది క్రమముగా నొకరినుండి యొకరికివచ్చుచున్నది. నాయందుగల దయచే నాగురునాథుఁ డీయోగమును నాకనుగ్రహించినాఁడు. ఇతరులకెవ్వరికినిం జెప్పలేదు. పద్ధతిప్రకారము చేయకుండిన యెట్లగును. శాస్త్రమెఱుంగుదువా?

ఆ. పదింటనొక్కపాలు బంగారమునుగూర్చి
తనరలోహమైనఁ ద్రాక్షమైనఁ
బుటముబెట్టి మదిని దిటవుగా గురునెంచి
భస్మమింతవైవ బైడియగును.

ఇట్లుచెప్పియున్నాఁడు. నీకుశక్తియుండెనా? పూనుకొనుము. లేకున్నయూరకుండుము. నీయందు కనికరించి నేనీపనిని చేయబూనినాను. ఇతరము కాదు.

బైరాగి చెప్పినంత బంగారము తెచ్చుటకు తనకు శక్యముగాకున్నను, యీమంచి యవకాశమును పోగొట్టుకొనరాదనియు, నెట్లయినను ప్రయాసపడి తెచ్చినచో, మితిలేని భాగ్యము కలుగుననియు నిశ్చయించి బైరాగింజూచి "అయ్యా! అలాగే! కానిండు. రేపటిదినము పనికి ప్రారంభించండి యనిచెప్పెను. బైరాగి, వానితో, "దీనికి కొన్ని పసరులు కావలయును. ఆయాకులను సంపాదించుకొని వచ్చెదను. నేను వచ్చుటకులోపల జేనపొడవును ముక్కాలంగుళము మందమునుగల యినుపతునుకలు పది పదిహేను తెచ్చిపెట్టుము. వానిని పసరులో ముంచి తడిపియుంచవలయును. సూర్యాస్తమానమునకు వచ్చెదను." అనిచెప్పి వెడలిపోవును. "ఇంతదూరము చెప్పిన బైరాగి యింకరాకపోడను నమ్మకముతో యినుపకమ్ములు విక్రయించెడి చోటునకుంబోయి యతఁడుచెప్పిన కొలతగల తునుకలు యిరువది ముప్పది కొట్టించి యొకటేసారిగా యవియన్నియు బంగారు కడ్డీలుచేసి పెట్టుకొనవలయుననెడి తలంపుతో యింటికి కొనివచ్చి యుంచి తనయొద్ద డబ్బు లేకపోయినను భార్యసొమ్ములును, ఇల్లు వాకిలి భూమి పుట్రలు కుదువయుంచి, బైరాగి చెప్పినట్లు వేయి రూపాయలకును మేలైనయుపరంజి గొనివచ్చి మహాత్మునిరాక కెదురుచూచుచుండును. అతఁడేవియో కొన్నియాకులను గుఱుతు తెలియకుండఁలాగున నలిపి చేతబట్టుకొని చెప్పినకాలమునకు సరిగా వచ్చిచేరును. రాగానే తానుచేసిన పనులనుచెప్పి యినుప తునుకలు తెచ్చి ముందుపెట్టును. బయిరాగి వానినిచూచి "ఓయబ్బా! ఇన్నియా? యివి యన్నియు బంగారమగుటకు మూడు వేలరూపాయలు సెలవుచేయవలసి యుండును. మొదట కొంచెముగా చేయుట మంచిది. వానిలో సగముచాలును" అనిచెప్పి యొక్కొక్క

టిగా తీసుకొని వానికి తాను తెచ్చిన యాకుల పసరు బూసి యెండ బెట్టును. బైరాగి భోజనముఁ జేయఁడు. అతనికి కావలసినవరకును పాలు, పండ్లు, చక్కెర తెచ్చియిచ్చువానిని భోజనము చేసినదానికన్నను నధికమైన తృప్తికలుగునట్లు భుజించి బైరాగి నేలనే శయనించును. సంసారియున్ననో నిద్రపట్టక, తనకు కలుగబోయెడి భాగ్యమును గూర్చియు, బంగారపుకడ్డీలను రొక్కముగా మార్చుటను గురించియు, వినియోగింపవలసిన రీతులను గురించి ననంతములైన యాలోచనలు చేసి గాలిలో మేడలు గట్టుచుండును. ఈవృత్తాంతమంతయుం దెలిసియున్న యతని భార్య రహస్యముగా పెనిమిటియొద్దకు వచ్చి బంగారుకడ్డీలలో నగలు జేయించుకొనుటకు రెండుతునక లిచ్చియే తీరవలయునని పట్టుబట్టి యతనిని సమ్మతింపఁజేసి వారములోపల తాను సమస్తాభరణములు ధరించి శ్రీమహాలక్ష్మివలె నుండబోయెదనని యమితానందమును జెందును. పాపమా దంపతులకీ యాలోచనలోనే యెంతప్రొద్దుజరిగినదియుం దెలియక పక్షుల యరపులవలన తెల్లవారినదని కనుగొని 'బయిరాగి యెపుడు లేచునో ఎప్పుడు పుటముఁ బెట్టునో' యని త్వరపడుచుండుదురు. ఇంతలో నతఁడును లేచి కాల్యాకరణీయములు తీర్చుకొని సంసారితో 'బంగారము ఇపుడవశ్యము లేదు. నీయొద్దనే యుంచుకొనియుండుము. అది కడపటిదినము కావలయును. నేనడిగినపుడు కొనిరమ్ము. అన్నిపనులును నీవు ముందటనే యుండి చేయవలయును' అని నమ్మకము బుట్టునట్లు చెప్పి రహస్యస్థానమున చచ్చౌకముగా నరగజము వెడల్పును, పాతికగజములోతును గల్లము త్రవ్వించి అడుగున యుమక బోయించి దానిపై నొకయినుపతునక యుంచి మరల యుమక బోయించి యిట్లే యన్నియుం బెట్టించి పైన పిడకలు వేసి పుటము బెట్టును. మరునాడు వానినితీసి ముందుదినమువలెనే చేయును. ఇట్లు రెండుమూడురోజులు జరిగించి ఇంటివానితో 'నేఁడు బంగారము చేర్చువలయును. ఇదికడపటిదినము రేపటికి మనము పెట్టినవన్నియు సపరంజికడ్డీలుగానగును' అనిచెప్పి మరల పుటము వేసి దానికి ధూపదీపనైవేద్యములొసంగి ప్రదక్షిణము చేసి కూర్చుండి ఇంటివానిని చెంతగూర్చుండబెట్టుకొని 'ఏదీ? నీవు తెచ్చిన బంగారుకడ్డీని నిప్పులోబడవేయుము' అనిచెప్పును. వాఁడు దానిని తానే యాపుటము బెట్టిన నిప్పులో వేయును. అంతట బైరాగి లేచినిలిచి గురుధ్యానము జేసి 'జయశంకర్ భగవాన్-జయ్

గురునాథ్' యనిముమ్మారుపలికి తననంచిలో డబ్బియందుంచుకొనియు
న్న యొకవిధమైనపొడిని కొంచెముయెత్తి యానిప్పులోవేయును. వేయ
గా యమితమైన పొగయు కాఱునుంగలిగి యొకరిముఖ మొకరికి కన
బడకుండునట్లుగున దట్టముగా వ్యాపించును. అపుడాసంసారి యాకాఱు
నకు దగ్గుచు, పొగలో కండ్లు తెఱచుటకుకష్టమై నిలువజాలక తటాలున
లేచి కొంచెము వాకిటికిపోయినిలుచును. అలవాటుపడియున్న బైరాగి
కదలక ఇంటివాఁడుతొలఁగినతోడనే గుఱుతుగా వాఁడు నిప్పులోపడ
వేసిన బంగారుకడ్డీని నీరుకారుతో త్వరితముగాయెత్తి తనయొద్దనుండు
నీటిలోనుంచి తీసి దాచుకొని, తాను తయారుచేసి పెట్టుకొనియున్న
ఇత్తడికడ్డీని నేర్పుగా నిప్పులోజొనిపి మఱికొన్ని పిడకలమీఁద వేయును.
ఇంతలో పొగ కొంచెమడగును. సంసారివచ్చి యెప్పటివలె కూర్చుం
డును. బైరాగి వానినిజూచి "బావాజీ! ఏలపోయినాడవు? గురుభస్మ
ము వేసినపుడు భయపడవచ్చునా? అది వేసినపుడే నీవుపెట్టిన బంగారు
కరఁగి పొగరూపమునుదాల్చి పరుసయొక్క మహాత్మ్యమువలన నాకర్షిం
పఁబడి మనముపెట్టిన ప్రతియినుపకడ్డీయందునుం జేరి తనరూపముగా
మార్చివేయును" అనిచెప్పి నిప్పుకొంచెము తొలగించి యందు తానుం
చిన యిత్తడినిచూపి "అదిగోచూచితివా? అపుడేబంగారైపోయినది"
యనిచెప్పును. వాఁడానిప్పులలో కాలి పచ్చగామెఱయుచున్న ఇత్తడికడ్డీ
నిచూచి 'ఔను. బాగా కనబడుచున్న'దనను

బైరాగి:—నీవుచాలా అదృష్టవంతుడవు. గురుకటాక్షం నీయందుబా
గుగా ప్రకాశించినది. రేపటికి నీవీస్థితిలో యుండవునుమీ!

సంసారి:—స్వామిగారూ! ఒకకడ్డీమాత్రము మనకు కనబడుచున్నది.
తక్కినవి యడుగునయున్నవి. అవియన్నియునయితము పయిదా
నివలెనే మారియుండునా? లేక—

బైరాగి:—అరే! గురునాథ్. నీవుచాలా తొందరకాఁడవును. ఆత్ర
గాడవునుగాయున్నావు. ఒకటైనవు డింకొకటికాకపోవునా?

ఇంటివాఁడు తానపుడే కుబేరుఁడైనట్లు తలంచి యానందవా
ర్ధిలో మునిఁగిపోవును. బయిరాగి యాసంసారితో "బావాజీ! గురు
నాథుని యాజ్ఞచొప్పున ఈబంగారములో నాకు భాగమివ్వవలయును.
ఇట్లు తీసుకొనినదానిని మేము మఠములు మొదలగు ధర్మకార్యము

లకు వినియోగింతుము. ఇపుడు యేబది యరువదివేలరూపాయలక్రయముగల బంగారము తయారైనది. దీనిలో సగము నేను పుచ్చుకొనుట విధి. కాని మొదట నుండియు నీకు మేలుచేయఁదలంచియున్నందున నిపుడు దీనిలో నర్ధభాగము పుచ్చుకొనుట నాకు సమ్మతముగా నుండలేదు. గురునాజ్ఞ తప్పకూడదుగదా! దానికిగా యథోచితము అనగా యిన్నూరురూపాయలు గురుప్రీతిగా నాకొసంగి యంతయు నేవేయనుభవింపుము." అని చెప్పెను. అపుడా సంసారి తనలో "ఓహో! అర్ధభాగ మితనికొసంగినచో మిగత సగపాలుమాత్రమేకదా నేను తీసుకొనవలయును. అదిసరిగాదు. ఇతఁడు కనికరముతో మంచి యుపాయము నే చెప్పినాఁడు. అడిగిన యిన్నూఱు రూపాయలునిచ్చి యితనితోడు దప్పించుకొనినచో యంతయు నేనే పెట్టుకొనవచ్చును" అని దురాశా పిశాచ ప్రేరితుఁడై తన భార్యకా వృత్తాంతముం దెలిపి యామె యొద్ద మిగిలియున్న సొమ్ముల నడుగును. మరునాఁడే విలువలేనియాభరణములు ధరించుట సమయము రాఁబోవుచున్నదని తలంచుచున్న యామె నిరాటంకముగా నిచ్చును. ఇంటివాఁడు వానిని కొనిపోయి కుదువయుంచి ఇన్నూఱు రూపాయలుం దెచ్చి బయిరాగికి సమర్పించును. అతఁడవి పుచ్చుకొని సంసారితో "నేఁడు పుటము కదల్చకూడదు. దానికదిగానే చల్లారవలయును. రేఁపటిదినము ధూపదీపములు సమర్పించి టెంకాయలుకొట్టి నివేదనచేసి పిమ్మట పుటముకదలించి బంగారుకడ్డీలు తీసుకొనవలయును. రేపటిదినమూ పనియంతయు నీవే చేయవలయునుగాని యింక నేను దానివిషయమై జోక్యము పుచ్చుకొనకూడదు. ఈదినమంతయు నిచటనేయుండి, రేపు నీవుకడ్డీలు తీసుకొన్నంతట నీయతిశయమైన సంతోషమును కన్నులారచూచి నేను పోయెద" నని చెప్పెను. సంసారికిమాత్రము బైరాగి యపుడే పోవుట మంచిదనియు రేపు కడ్డీలుచూచినంతట మరల నేమైన నిమ్మని యడుగునే మోయనియు యోజన కలుగును. అయినను తనతలంపు తెలియఁబడనీక మిన్నకుండును. బయిరాగి నాటిరాత్రి వాడుకప్రకారము పాలును, పండ్లును దృప్తిగా భుజించి వాకిట పండుకొని యందరును నిద్రించు సమయముఁజూచి మెల్లగాలేచి కమ్మిదీయును. తెల్లవారినంతట యింటివాఁడా బయిరాగింగానక [illegible]ట నెట్లోపోయినాఁడనియు మరలరా

గలఁడనియు, నతఁడు వచ్చునంతకులోననే తాను పుటముకుత్తివేసి కడ్డీలు తీసుకొనవలయు ననియు నెంచి వేగిరపాటుతో పుటమునకు బయిరాగి చెప్పినప్రకారం చేయవలసిన కృత్యము లన్నియుం జేసి పుటమును దీసి చూచును. ఎవరైనను వచ్చి తమ రహస్యముం దెలుసుకొందురే మోయని యతనిభార్య తలుపు లన్నియు బిగించి తనకు చెందిన వాగ్దానము మేరకు రెండుకడ్డీలును నపుడే తీసుకొనవలయున నడి తలంపుతో బిరబిర మగనియొద్దకు వచ్చును. అయ్యో! పాపము! ఆమెయిష్టము నెరవేరుట యున్నదా? యా సంసారి పుటముదీసి యందుంచిన యినుప తునుకలు పెట్టినవి పెట్టినట్లుండుట నధికముగా యిత్తడితునుక యొకటి యుండుటయుం గనుఁగొని బయిరాగిచేసిన మోసము తెలుసుకొని "భగవంతుఁడా! ముంచినాఁడే! మొదలంటం జెడిపోయినానే నిజమని నమ్మితినే!" యని తలమీఁద గొట్టుకొని దుఃఖించును. తాను వచ్చుటకులోపల భర్త పుటముదీయుటయు నేడ్చుచుండుటయుం గని యతని భార్య తనలో తనకు కడ్డీలు యివ్వవలసివచ్చునని యటుల దుఃఖించుచున్నాఁడనియెంచి దగ్గఱకువచ్చి "నీవెంత యేడ్చినను మొత్తుకొనినను నేనువదలను ఇచ్చియేతీఱవలయు"నని యాతురముతో పలుకును. "తరువాత మగడుచెప్పగా వర్తమానము నెఱింగి తానును, తమకు సంభవించిన గొప్పనష్టముం దలంచి యత్యాశవలన యీఫలము కలిగిన" దని వాపోవ నారంభించును. కొంతవడి దుఃఖించి సంసార మహాకోపముతో బయిరాగిని వెదకనుగాని వాని జాడయే తెలియదు. నిరాశజేసుకొని యేల్లాడుచు నిల్లుజేరును. జనులారా! చూచితిరా? ఈబంగారముమీఁద యాశవడువారి దుస్థితి యెట్లగుటయునుం దెలిసికొంటిరి గదా! ఐశ్వర్యమును భగవంతుఁడు కటాక్షించి యొసంగినచో కలుగవలెను గాని యిట్టి పనులవలన లభించునా? వెఱ్ఱితనము. ఆశాపీడితులైనవారు మోసగాండ్ర మాయలలోజిక్కి లాభముఁ జెందుటకు మారుగా తమకు కలిగియున్నది నయితము పోఁగొట్టుకొని లొట్టికాండ్రగుచుందురు. ఈభ్రమవలన నిరుపేదలై యల్లాడుచుండువారెందఱోకలరు. ఉన్నదంతయుం బోయినంతటగాని యిటువంటివారికి బుద్ధిరాదు. ఈలాగున వరుల నేమరించి సమయమునకు తగినట్లు నటించి డబ్బుగడించిన పాపాత్ములును సౌఖ్యవంతులు గాజాలరు. ఆధనమును

దుర్వ్యయముచేసి తుద కధోగతిని జెందుదురు. బయిరాగులవలెను, గోసాయిలవలెను వేషములుధరించి వచ్చువారిని మహాత్ములనియు, వారికి బంగారుచేయు యోగముఁ జేయుచున్నట్టు నటించునప్పుడు చూచి తెలిసియుండునని భ్రమించి పెక్కండ్రు వారినాశ్రయించి చెడిపోవుదురు. పయిన చెప్పినలాగున యీ మోసగాండ్రు మంచిబంగారమును చిన్నతునుకగా జేయించి దానికి సరియగు రాగితునుక నొకదానినికూడా తమ దగ్గఱ పెట్టుకొనియుండుదురు. ఉపయోగించవలసిన స్థలము నిర్ణయించుకొన్నంతట ముందుగానే బంగారుతునుకను గంజాయిచిలిమియడుగున వేసిపెట్టి, తాము మోసగింపఁదలఁచిన మనుష్యుఁడు చూచుచుండగా యాచిలిమిలో గంజాయినలిపిపెట్టి నిప్పువేసి, దానిపై తనయొద్దనుండు రాగిముక్కను పెట్టి నాలుగైదుసారులు పొగపీల్చి నిప్పుచల్లారునట్లు నీళ్ళుఁడిచి చేతిలో యుండలి బూడిదను క్రుమ్మరించుకొనును. అపుడు చిలిమియడుగున బెట్టియున్న బంగారుముక్క చేతిలోపడును. పయిననుంచిన రాగిముక్క చేతిలోని బూడిదకడుగుననుండును. అంతట బంగారుతునుక దీసికొని రాగితునుకతోకూడా బూడిదను చిలిమిలోపోసి గుడ్డచుట్టి సంచిలో పెట్టుకొనును. ఆబంగారుముక్కను యెదుటచూచుచున్న వానిచేతనిచ్చి యమ్మి తనకుకొంచెమిచ్చి శేషము తనిని తీసుకొనుమనిచెప్పును. ఇదియంతయుంజూచుచున్నందున యామనుష్యుఁడు భ్రమపడి యదిసత్యమనియు, బంగారుకావలసినపుడంతయు నతఁడు చేయుగలఁడనియు, కావుననే యపుడంత నిర్లక్ష్యముగా కొంచెము తనకొసంగి మిగిలినదానిని తీసుకొనుమనుచున్నాఁడనియు నెంచి యెట్లయినను వానివలన లాభముపొందవలసినదిగా యెంచును. తత్క్షణమే యాశాపిశాచమావేశించి యామాయకాని వలలో చిక్కియున్నది పోఁగొట్టుకొని బిచ్చగాఁడై కూటికి గుడ్డకులేక యల్లాడుచుండును. కాబట్టి యిట్టిమాయకాండ్రను నిజమైన మహాత్ములని నమ్మినచో చెడుటనిశ్చయము.

ఆ. వైడిచేయనేర్చు బైరాగివలెవచ్చి, సమయమునకుదగిన చందమరసి
టక్కుజేసితమకు జిక్కినవారిచే, ధనముగొండ్రుమాయ తంత్రగాండ్రు.

# భూమిత్రవ్వి ధనముతీయు మోసము.

లోకములో తమకుభగవంతునివలనచే కలిగియుండెడి భాగ్యముతో తృప్తినిపొందకయు, దుర్వ్యయములు చేసియున్నది పోఁగొట్టికొనియు, ధనాశాపీడితులై ఎప్పుడును నదియే చింతతో యల్లాడుచుండెడివారు పెక్కండ్రుగలరు. వీరెప్పుడును తమకు గొప్పనిధి యొకటిదొరికినచో బాగాయుండునని పేరాశఁజెంది ఎవఁడైన ధనముగలచోటుఁదెలిసికొని యదిలభించునట్లు చేయునాయని కనినవానితోనంతయు, నిదియే ప్రసంగముఁ జేయుచుండుదురు. ఇటువంటివారు గాలిలో మేడలునిర్మించుటకు యోజింపుచు, ఇతరులసంపదనుచూచి సహింపలేక సదామనోవ్యాధివలన దుఃఖమనుభవించుచుండుదురు. వీరికెప్పుడును నాలోచనయే! వీరితత్త్వమెఱింగిన మోసగాఁడు సన్న్యాసివేషముతో వారిలో నెవనియొద్దకో యొకనియొద్దకు దారినిపోవువానివలెవచ్చి కూర్చుండి కొంతతడవు లోకాభిరామాయణమునుగూర్చి మాటలాడుచుండి ప్రొద్దువంకచూచి 'ఓహో! అస్తమానమగు సమయముగాయున్నదే! చాలాదూరము పోవలయును. పోఁగలనా? దేవునిపల్లె ఇచ్చటి కెంతదూరముండును!' అని యాపేరాసగాని నడుగును. అతఁడు 'ఓయబ్బా! సాయంత్రములోపల దేవునిపల్లెకుపోవడమా? తెల్లవారునంతవరకును నిలువకనడిచినను రేపటిసూర్యోదయమునకుగాని చేరుటకు సాధ్యముకాదే! ఇచ్చటి కిరువదియైదుమైళ్లున్నది అస్తమానసమయమైనది యీరాత్రికి ఇచ్చటనే యుండి వేగుజామున లేచిపోయినచో యెండబెట్టలేక సులభముగామధ్యాహ్నమునకు చేరవచ్చును. ఇపుడుపోయిన కష్టపడియెదరు. చీకటి దారితెలియదు'అనును సన్న్యాసి కొంచెము యోజించి "సరే! ఈదినమగు కార్యము రేపగును మించిపోయిన దేమియును లేదు. అంతదూరమని నేనుతలంచలేదు. నేటిరాత్రి యీగ్రామములోయుండి నీవుచెప్పినట్లు వేకువజామునపోయెద" నని చెప్పి మరలయాపేరాశగానియొద్దకూర్చుండి సంభాషింప నారంభించును.

పేరాస:—అయ్యా! దేవునిపల్లెలో మీకు తెలిసినవా రున్నారా?

సన్న్యాసి:—తెలియడమనగానెట్లు? ఇపుడుమీరు తెలిసినవారుకారా? అందఱు నిటులనే! అచట నొకపెద్దమనిషియింటికి పోయెదను.

పేరాశ:—ఏమిపనియో చెప్పకూడదా? రహస్యమా? అట్లయినచెప్ప వలదు.

సన్యాసి:—రహస్యమనుట నిజమేకాని, ఎచ్చటను బయలుపరచకుండు నట్లయినచో చెప్పవచ్చును. అదివిశేషమైనవిషయము.

పేరాశ:—రహస్యమైన వృత్తాంతమును బయలుజేయుదునా? రామ రామ! దేవునిమీదయాన, నేనటువంటి అయోగ్యుఁడనుకాను.

సన్యాసి:—ఔను. నీవు మంచివాఁడవుగానే కనుపడుచున్నావు భయపడ వలసినదిలేదు. అదిధనసంబంధమైనవిషయము. రహస్యము.

పేరాశ:— అనగానాకు తాత్పర్యము తెలియలేదు, ఎక్కడధనము?

సన్యాసి:—ఇంతమాత్రము తెలుసుకొనలేవైతివా! ఒకచోట భూమి లోయున్నది. యదియచ్చటనొక నిన్నువంటి పెద్దమనుష్యునకు తీసియిచ్చునట్టు వాగ్దానముచేసినాను. నేఁటిరాత్రి కచ్చటికి చేరునట్లు చెప్పియుంటిని దానికొఱకే పోవుచున్నాను చెప్పిన ప్రకారం పోవుటకులేకపోయినది. పాపము! అతఁడు సర్వమును సిద్ధముచేసుకొని నాకొఱకై కాచియుండును.

ఇట్లుచెప్పగానే యాయాశబోతు భ్రమించి తానుకోరుచుండిన ప్రకారము చేయదగినవాఁడు తలఁపనితలంపుగా తటస్థించుటకుమిక్కిలి సంతోషించి యేయుపాయముచేతనైనను నతనినినిలువుకొని తనకొక నిధిని పెల్లగించి ఇచ్చులాగున ప్రార్థించవలయుననెడి తలంపుగలవాఁడై యతనిఁ దమయింటికిపిలుచుకొనిపోయి మరియాదచేసి కూర్చుండ బెట్టి 'అయ్యా! మీరెచ్చటికినింబోవలదు. రాత్రి కిచటనేయుండుఁడు. మీకు కావలసినవన్నియు జాగ్రతపరచెద. రాత్రిభిక్ష ఇక్కడనే జరిగిం చండి' యని వినయముతో చెప్పినిలుపును. సన్యాసి విధిలేక నిలిచినవాని వలెనొప్పుకొనును. అంతట పేరాశగాఁడు తనయభిప్రాయము నతనితో చెప్పదలంచి సందర్భానుసారముగా తెలుపవచ్చునని సంభాషణకుప్రా రంభించును.

పేరాశ:—అయ్యా! భూమిలో యెక్కడచూచినను ధనము ఉంటుం దనిచెప్పగా వినియున్నాను. నిజమేనా?

సన్యాసి:—సందేహమేల? నాస్తవమే! కాని అది ఎవనికి ప్రాప్తమో వానికిలభించును.ఆలక్షణమును తెలిసికొనియే నేను ఎవరికైనను

సహాయము చేయుచుందును. చూడగా నీముఖమునందుసైతము ధనలక్ష్మీ విలాసలక్షణములు కనపడుచున్నవి. నీకున్నూలభింపవచ్చును.

పేరాశ:—అలాగా! అటులనైనచో యది నాకెటుల లభించును?

సన్యాసి:—నీకపుడపుడును, ధనముదొరికినట్లును లెక్క పెట్టినట్లును, యేవేవియో గొప్పకార్యములు చేసినట్లును, స్వప్నములు కలుగుచుండును. ఇట్లుజరుగుచుండుటకలదా? లేదా? నిజము చెప్పుము

పేరాశ:—ఔను! ఇదిసత్యమేనండి! కండ్లుమూసినచో నదియేమిమాయమోగాని ధనమువచ్చినట్లును, యెంచిసంచులలో బోసినట్లును కనుపడుచుండును. అయ్యా! అటులనుండుట కేమికారణము?

సన్యాసి:—అది తెలియలేదా? నీకుధనము లభించుప్రాప్తమున్నది. ఈ సమీపమున నెచ్చటనో నిడియున్నది. అది నీకట్లు కనుపించుచున్నది. దానినికనిపట్టి తీయవలయును. ధనమును లేవదీయుటయంతగా సామాన్యమైనపనికాదు. మహాకష్టము మొదట నుండుచోటును కనుగొనుట మిక్కిలికష్టము. మంచినేర్పరిగాని యెత్తజాలడు.

పేరాశ:—స్వామీ! మాయింటి వెనుకప్రక్క ధనమున్నదని పెక్కండ్రు చెప్పియున్నారు కాని, నేనుచూచినదిలేదు. స్వప్నములు మాత్రము కలుగుచుండును. మీరున్ను యున్నదనుచున్నారు. అదియుండుస్థలమును కనుగొనవలయునని వేడుకొనుచున్నాను కరుణించండి.

సన్యాసి:—మంచిది రాత్రికిదీపముపెట్టి చూచి యుండెడిచోటు తెలుసుకొనిచెప్పెదను. కర్పూరమును టెంకాయయుం దెప్పింపుము.

పేరాశ:—ఆలాగే తెప్పించెదనుగాని, చూచి ఫలానిచోట నున్నదని చెప్పడమువలన ప్రయోజనములేదు దానినిలేవదీసి ఇవ్వవలసిన భారముకూడా మీయందేయున్నది. ఇది మీరుచేయకతప్పదు.

సన్యాసి:—ఆవిషయము పిమ్మట నాలోచింతము. ముందు తెలుసుకొనవలెగదా?

ఆపేరాసగాడు, బిరబిర భార్యయొద్దకుపోయి వృత్తాంతమును

చెప్పి నేఁటికి మనకు మంచికాలము వచ్చినది. దేవుని వలె వచ్చినాఁడు. ప్రాప్తకాలము వచ్చినప్పుడన్నియు నట్లే తమకుఁ దామే సమకూడును. ప్రక్కయూరి రేగుపాటి చలమయ్యగారికి భాగ్యమెట్టుల వచ్చినదో తెలియునా? యిట్టులనే యొక మహాత్ముఁడు వచ్చి పడమటింటిలో మూఁడు బిందెల బంగారు నాణెములు తీసి ఇచ్చి పోయినాఁడు. తత్పూర్వము వారికేమియుండినది? గంజినీళ్లకు గతిలేక యుండిరి. ఇప్పుడు గదా మిద్దెలు మేడలు నగనట్రలు, మాన్యగ్రామములలో భూములు కలిగినవి. తమ పూర్వపు స్థితి మరచిపోయి విఱ్ఱవీగుచున్నారు. ఎందఱికో ధనము తనకుఁ దానే లభించియున్నది. జనార్దనపంతుల మాటఁ జెప్పుము. వినియున్నావు గదా! ఎట్లు వచ్చినది? ధనము ఇంట్లో పెట్టుకొనుటకు ప్రయత్నించి గోడలు పెట్టుటకు కడగాలు త్రవ్వుచుండగా ఒక పెద్దబిందెయు మఱియొకటి చిన్నదియు దొరికినవి. అది మొదలుకొని వృద్ధియైనది. మన్నారు నాయుడుగారికిని పొలములో దొరికినదే? ఎందఱికో దొరికినది. మన దురదృష్టమేమో కాని ఎందఱింటనో మన పెరటిలో నున్నదని చెప్పుచుండుదురు కాని యిది లభించినది కాదు. ప్రాప్తకాలము రాలేదు కాఁబోలు. ఇప్పటికి మంచికాలము తటస్థించినదని తోఁచుచున్నది. దేవుని దయవలన మన కీసన్న్యాసి మూలమున గొప్ప బిందె దొరికెనేని, చెన్నకేశవస్వామివారికి వెండితేరును, గిరీశ్వరస్వామికి గాలిగోపురమును నిర్మింపఁ జేసి నిత్యోత్సవము జరుగుటకు ఏర్పాటులు గావింపఁదలంచినాను' అని మహదానందముతోఁ జెప్పెను. ఆమాటలు వినియామె మొగము చిట్లించుకొని 'బాగానే యున్నది. దొరికిన యూరవంతయును నీవు తేరులకు గోపురములకు కర్చుపెట్టిన యెడల నా నగలమాట ఏమి చేయవలెనని తలంచితివి? నలుగురును దేహముల నిండఁగా నగలు ధరించి విఱ్ఱవీగుచుండగా నేను మాత్రమిట్టుల నేమియు లేకుండుట నీకు సంతోషము కాఁబోలు' ననిసణుగును. అతడు భార్యకు సమాధానముగా చెప్పి టెంకాయయుం గర్పూరమును దెప్పించి సన్న్యాసికెఱిఁగించును. అతడు కాళ్లుచేతులును గడుగుకొని వచ్చి ఇంటిలో ఒక అరయందు గూర్చుండి దీపము వెలిగించి టెంకాయఁ గొట్టి కర్పూరము వెలిగించి కొంతతడవు తదేకదృష్టితో దీపము వంక చూచుచుండి తానేమో గ్రహించిన వానివలె తల యూచుచు, చూచుట చాలించి ఇంటివానితో 'ఏమయ్యా! తెలుసుకొన్నాను. ఇంక నేమియుం జూడవలసినది లేదు' అని చెప్పెను.

పేరాశ:—స్వామీ! ఉండడము నిజమేనా? ఎక్కడ?

సన్యాసి:—సందేహమేలనండీ! ఉండినను గొంచెముగాదు. గొప్పబిందె యున్నది. అన్నియు బంగారపుకాసులు. రెండులక్షలరూపాయలుండును.

పేరాశ:—అది యుండెడిచోటును చెప్పండి. సాధ్యమా? అసాధ్యమా?

సన్యాసి:—మీ పెరటిలో బావికి రెండుబారలదూరములో యున్నది. సాధ్యాసాధ్యములు మాటనెట్లు చెప్పవచ్చును? దానిదానికి తగిన పనిచేయుగలిగినచో యసాధ్యమేయుండదు. అన్నియుసాధ్యము లేయగును. అటులచేయలేనపుడు సాధ్యమైనదియు నసాధ్యమగును.

పేరా:—స్వామీ! మీరుచెప్పినట్లుజరిగించెద. ఎట్లయినను దానినివెలువరించండి. మీరుదప్ప మఱియొకరీపనిని జేయ సమర్థులుగారు.

సన్యాసి:—ఇదిచాలా కష్టమైనపని నాలుగుదినములుపట్టును. అంతకాలము నేనిచ్చటనుండుటకు వీలులేదు. ఆయూరిలో పెద్దమనుష్యునినమ్మించియున్నాను నాకొఱకతఁడు కనిపెట్టుకొనియుండును. ఉండనిమ్ము. ఏమిమునిఁగిపోయినది? ఇంకొకనాఁడు వచ్చెదను.

ఇంటివాఁడా సమయమున నతనివిడుచుట కిష్టములేక 'దయచేసి యీకార్యమును నెరవేర్చిపోవలసిన'దని బహువిధంబుల ప్రార్థించును. అతనిమాటలకు తప్పించుకొనలేక లోఁబడినవానివలెనటించి సన్యాసి యతనింగని 'నీవుపట్టినపట్టు విడువకున్నావు. నీవు మంచిమనస్సుగలవాడుగానుండుటచే నీమాటనిరాకరింపజాలకున్నాను. సరే! కానిమ్ము. ఏమైననగునుగాక. నిలిచి నీకీయుపకారమును చేసియేపోయెదను. ఈవిషయములో మనకొకయేర్పాటుండవలయును నేనిచ్చట లిబ్బిందీసినను మొదటనే యేర్పాటుచేసుకొనుట వాడుక. ఏమనగా దానినివెలువరించుటకై కొంతకర్చులగును. ఏలననగా ధనమునాశ్రయించి కొన్ని భూతములుండును. వారికిశాంతికలుగునట్లు తగినయాహుతి వేయవలయును. అటులచేయకున్నయెడల నదిలభింపదు. అందుకగు వ్యయమంతయు నీవేభరింపవలెను. ధనమును వెలువరించినంతట దొరికినదానిలో సగమునేనుతీసుకొందును. తక్కినసగభాగమును నీవుతీసుకొనవచ్చును.

ఇదినీకుసమ్మతమైన నిలిచెదను. నేను శ్రీశైలమునకావలయొక మఠము కట్టించుచున్నాను. ఈధనముదానికివినియోగించబడును. అందుకొఱకే నేనిట్టువంటిపనులు కష్టపడిచేయుచున్నాను' అనిచెప్పెను. ఆయాశబోతుగానికి మనస్సులో సన్యాసికి సగముయిచ్చుటకు ఇష్టములేకపోయినను, ఇవ్వననినచో యతడు దానిని బయటదీయడను భయముగలవాడై తనలో 'సరే! తీసినతరువాతగదా పంచిఇవ్వమనుట. ఇది రహస్యమైనపని యగుటవలన ఇతరులతో చెప్పబోవునది లేదు. వీనికిచటసాక్ష్యమెవరు? చూచుకొందమనితలంచి యతనితో 'మంచిది ఆలాగే! మీయిష్టప్రకారమేచేయుండియనిచెప్పెను. అంతటనాటిదినమే ప్రారంభమని పూజసామానులు ఇరువదిముప్పదిరూపాయలకు పట్టిఏర్పాటుచేసిఇచ్చెను. ఆశగాఁడుచెప్పినప్రకారం కొనివచ్చెను ఆదినంరాత్రి పెరటిలో బావికినాలుగుబారలదూరమున పూజచేసి యాస్థలములో రెండుగజములనిడివియు,గజమువెడల్పును, అరగజములోతునుంగల గోతినిత్రవ్వించి మరల పూజజరిగించి వారిని ఇంటిలోనికిపొమ్మని యచ్చటయుంచిన పండ్లు,ఫలాహారములు, భక్ష్యములు తనకుకావలసినంతవరకునుతృప్తిగాభుజించి భూతాహుతి కావింపఁబడినదనిచెప్పి మిగిలినవానిని సంచిలో దాచుకొనును. ఇట్లు రెండుమూఁడుదినములుజరిగినంతట, వానిజట్టులోచేరినవాఁడును, పరస్పరముగానుండి యుపుడపుడును నడుచువృత్తాంతమును తెలిసికొని సన్యాసి తానుతిననదిపోను దాచియున్న మిగతను రహస్యముగా రాత్రులు కొనిపోవుచుండువాఁడునునైన మఱియొకఁడు నిశీథికాలమున నోరువెడల్పు ప్రాత తపిలెనొకదానిని మెడవరకు కత్తిరించి కొనివచ్చి తనరాకకై కనిపెట్టుకొనియున్న యాసన్యాసిచేతఇచ్చి జాడ తెలియకుండా వెడలిపోవును. ఇంటివారు నిద్రించుచుండగా యాసన్యాసి తనసంగడికాఁడు తెచ్చియిచ్చిన తపిలమూతింగొనిపోయి తాను త్రవ్వించినగోతిలో నొకయడుగులోతునఁ బూడ్చిపెట్టి యేమియుండెలియనివానివలెవచ్చి పండుకొనును. మఱుసటిరాత్రి యాయింటి దొరాశాపరునింబిలిచి 'ధనముచాలాయధికముగాయున్నది. నేనుకొంచెమే ననుకొంటిని యొకదానిపైనొకటిగా నాలుగుబిందెలున్నవి ఈదినము బిందె కనుపడితీఱవలయును. గొప్పగ్రహములు నాశ్రయించియున్నవి. కావున నేఁడుకొంచెమెక్కుడుగా దానికాహుతి వేయవలయును. లేని

ఎడల ధనములభింపక పోవుటయేగాక మీకును నాకును గొప్పయపాయ ముకలుగును. ఈదినము కడుజాగ్రతగాయుండవలయు'నని మరల నాటి పూజకుగా నేబదిరూపాయలకు లీస్టువ్రాసిఇచ్చును. నాలుగుబిందెలున్నవని యతఁడు చెప్పినమాట విన్నంత దురాశాపూరితుఁడు తనలో 'ఓహో! నాలుగింట రెండుబిందెలు వీఁడుతీసుకొని పోవఁదలంచియున్నాఁడు కాఁబోలు. అటులకొనిపోవకుండుటకు తగినయోజన చేయవలయు'నని యెంచి సన్యాసి చెప్పినట్లు సామానులు తెచ్చును. ఆనాఁటిపూర్వమువలెగాక మఱికొంత యాడంబరము చేసి, మొదటిబిందె మీఁదికి వచ్చియున్నది. తక్కినవి దానియడుగునయున్నవి. మొదటతరువాత మొకటిగా నెత్తవలయును. జాగ్రతగామన్నుదీయు' మని చెప్పును. ఇంటివాఁడు పారతో నాలుగయిదు పారలమట్టి వేయఁగానే లోపలపూడ్చఁబడియున్న తపిల మూతియొక్కయంచు కణిల్లుమని పారకు తగులును. అపుడాపేరాశగాఁడు 'ధనము బిందె వచ్చినది' యనియెంచి యానంద సాగరములో మునిఁగిపోవును. వానిభార్య దాపునచూచుచుండి యాశబ్దమువిని ఇంక తనకుకోరినన్ని సొమ్ములువచ్చునని యుప్పొంగుచుండును. శబ్దమువిన్నంతట సన్యాసి ఇంటివానితో 'ఉండుము. త్వరపడి ఇంకత్రవ్వవలదు. దానికి చేయవలసినపని చాలాయున్నది. అటుల చేయనిచో తటాలున నది బావిలోనికి దిగిపోయినను పోవును. ఆలాగుపోయెనేని పిమ్మట నదిమనకు లభింపదు. ఇంతశ్రమ చేసినను వ్యర్థమగును.' అని వారించి వానిని యావలకు రమ్మని తానాగోతిలోదిగి, మంత్రాక్షతలు నాల్గుదిక్కులను, గుంటయందునుంజల్లి చేతులతో మన్నునిటు నటుం ద్రోయును. అపుడు తపిలమూతిస్పష్టముగా కనబడును. దానిని చూడగానే పేరాశగాఁడును వానిభార్యయు నుబ్బిపోయి సన్యాసి కడు మహిమకలవాఁడనియు, నతఁడు చెప్పినట్లు నాలుగుబిందెలు నుండుట సత్యమేననియుదలంతురు. అపుడా సన్యాసి యతనిఁజూచి "అబ్బా! దీని మీఁద ఘోరభూత మావహించి యున్నది. దానిని శాంతిపరచి తొలగింపక మనమేమియుం జేయఁగూడదు. కాఁబట్టి యిప్పటికిదీనినిట్లనిలిపి, కావలసిన వన్నియు జాగ్రతచేసుకొని రేపటిదినము వెలువరింతము. త్వరపడకూడదు. అది చాలా యపాయ"మని చెప్పి యాతపిల మూతిపై మూతబెట్టి గట్టెక్కును. కండ్లార తపిలను చూచినంతట పేరాశగానికి

నమ్మక మెక్కుడై సన్యాసి యేమిచెప్పినను చేయుటకు తయారుగా యుండును. తరువాత యింటిలోని కరుదెంచి సన్యాసి పేరాశగలవానితో "అయనించినది. ఇంక ననంతమైన ధనము లభింపబోవుచున్నది. గ్రహమన్ననో చాలా క్రూరమైనది. యాశ్రయించియున్నది. దానిని తొలఁగించినచో మనకు డబ్బువచ్చినట్లే! అటుల తొలంగించుట కొక హోమమును చేయవలయును. అదియిచ్చట చేయకూడదు. ఊరివెలుపట నెవ్వరును లేనిచోట రాత్రికాలమున చేయవలయును. దానికి సామానులును, కొన్నివిధముల సమిధలును కావలయును. ఇది యన్యులకు తెలియకూడదు. కాఁబట్టి మన మిరువురము రహస్యముగా నిర్వహింపవలయును. దీనికిగా నన్నూరురూపాయిలు పట్టును. నేనపుడపుడుం దానిని చూచుచు నటునిటుం బోనివ్వక దిగ్బంధనము చేయుచుండవలసియున్నది వెలుపట పోవుటకు వలనుగాదు. కావున నీవుపోయి నేనుచెప్పెడి చెట్లనుండి సమిధలు విరుచుకొనిరమ్ము. రూపాయలు నాచేతనిచ్చితివేని నీవువచ్చుటకులోపల నిచ్చటనే యుండెడువాఁడను గాన కావలసినవస్తువులన్నియు నేను జాగ్రతపెట్టి యుండెదను. చీకటిపడగనే పనికి ప్రారంభించవలయు"నని చెప్పెను. కండ్లారగాబిందెనుచూచియుండుటచేతను, దొరికినదానిలో సగము తీసుకొనఁదలంచి యుండుటచేతను, సన్యాసి మోసగాఁడు గాఁడనియు, నతఁడు తప్పక నాఁటిరేయి ధనము తీయుననియునెంచి యతని మాటలు సత్యములనినమ్మి యాదురాశాపరుఁడు తనయొద్ద లేకున్నను యిల్లునైనం గుదువయుంచి యెచ్చటనైనను, నన్నూరురూపాయిలుం దెచ్చి సన్యాసిచేతనొసఁగి "మీరు సామానులు తీయుండి. కావలసిన సమిధలు చెప్పితిరేని తెచ్చెద"ననును. సన్యాసి యేవేవియో నాలుగైదు రకములుచెట్లు చెప్పి వానిపుడకలు వేఱు వేఱుగా సేకరించుకొని సూర్యాస్తమానములోపల రమ్ము"అని చెప్పెను. అంతట మహోత్సాహముతో పేరాశగాఁడుపోవును. తరువాత సన్యాసి రూపాయిలు మూటగట్టుకొని ఇంటియజమానురాలు పోరుగిండ్లకు పోఁజూచి అయిదాఱు దినములుండి యంతయుం దెలిసికొనియున్నవాఁడు గావున బీగములున్నచోటు కరిగి తీసుకొని పెట్టెదెఱచి కలిగినమట్టుకు నగనట్రలు సంగ్రహించుకొని మెల్లగా యిల్లువెడలి యూరుదాఁటిపోయి యట గాచియున్న సంగడికాండ్రంగూడి పాఱిపో

వును. ఆమె యింటికివచ్చి పెట్టె తెఱచి యుండుటయు నందువస్తువులు లేకుండుటయు, సన్యాసి కనుపడకుండుటయుంగని దిగులొంది యన్యు లతో చెప్పుటకు వెఱచి తత్తరిల్లుచుండును. ఇంతలో సాయంత్రమగు టయు పేరాశగాఁడు వచ్చి వృత్తాంతమును విని, సన్యాసి సామానులకుఁ బోయియుండుననియు రాగలఁడనియు, తనభార్య యజాగ్రత వలన నెవరో యింట ప్రవేశించి యున్నమట్టుకుం గొనిపోయి యుం డుదురనియుం దలంచి, యపారమగు భాగ్యము కలుగబోవుచున్నదను సంతోషముతో యావిషయమున నంతగా శ్రద్ధగైకొనక యుపేక్షించి సన్యాసిరాక కెదురుచూచుచుండును గాని యామాయకాని దర్శనమే మరల కాకుండును. ప్రొద్దుజరిగిన కొలఁదియు నింటివానికి సందేహము కలిగి తెల్లవారువరకును రాత్రియంతయు నిద్రపట్టక యల్లాడుచుండి, మఱునటి యుదమువరకును సన్యాసి రాకపోవుటవలన నప్పటి కతఁడు మోసగించి పోయినాఁడని తెలుసుకొని తాము త్రవ్వినగుంటలో బిం దెయున్నదో పోయినదో యని యచ్చటికరిగి పాఱతో మట్టి చుట్టునుం ద్రవ్వగానే, బిందెయుంచు లేచివచ్చును. అంతట "యత్యాశచేయున్నది సయితము పోయినదిగదా! పాపాత్ముఁడు మోసగించి పోయినాఁ" డని మహా దుఃఖముతో నితరులతో చెప్పవెఱచి యాశలు నిరాశలు చేసుకొని తన యవివేకమును తానే నిందించుకొనుచు గుక్కురు మిక్కురుమనక యుండును. మోసగాఁడా డబ్బుంగొని చెలికాండ్రతో గూడి కులాసాగా మద్యదేవత సేవఁజేసి యానందించును.

గీ. ధనముఁదీయుదు భూమిలో ద్రవ్వియనుచు
వచ్చి యత్యాశగలిగిన వానిఁజేరి
నమ్మఁదగినట్లు తంత్రమొ నర్చిమాయ
కాండ్రుగొనిపోదు రర్థంబుఁ గానరాక.



# వైద్యము చేయువారి మోసము.

మన పూర్వికులు వైద్యముచేయువాఁడు మిక్కిలి యనుభవముగలవాఁడుగను, విషయము చక్కగా గుర్తెఱింగినవాఁడుగను, నాడీశక్త్యము తెలుసుకొను వివేకము గలవాఁడుగను, యత్యాశ లేనివాఁడుగను, హస్తవాసి గలవాఁడుగను నుండవలయుననియు నటువంటి వానియొద్ద నౌషధము పుచ్చుకొనుట శ్రేయస్కరమనియుం బలుకుచుండెడివారు. యోగ్యుఁడని తోఁచిననేగాని వారు మందు పుచ్చుకొనువారుకారు. అటుల తెలివిగల వైద్యునియొద్ద నౌషధముఁగొని యారోగ్యముఁ జెందుచుండిరి. ఆనియమ మడుగంటినది. ప్రస్తుతకాలము వేఱువిధముగా పరిణమించినది. ఎవఁడుచూచినను వైద్యుఁడే! ఏవీథిఁగన్నను బోర్డులే! లెక్కపెట్టుటకే సాధ్యముకాదు. సాధారణముగా నూటికిఁ దక్కువగా చంపిన వైద్యుఁడు వీరిలో నొకఁడైన నుండఁడు. ప్లేగువ్యాధి, కలరా, మసూచి మొదలైన వ్యాధులకంటె యీవైద్యులు ప్రజలపట్ల నెక్కుడు క్రూరవ్యాధులని తలంపవచ్చును. జనాభాయెక్కువగా యుండు గ్రామములో ఈతరగతి వైద్యుని రెండుమాసములుంచినయెడల యాయూరు తన సామర్థ్య విశేషమున నిర్జనముగావించి భూభారమును తక్కించును. సాధారణముగా మరణములసంఖ్య యితరదేశములకన్నను, మన దేశమున నధికము. ఎందువలన? ఈకొఱగాని వైద్యులే కారణము. తమకేమియుం దెలియకున్నను, నాయుర్వేదశాస్త్రముం జదివినామనియును, గొప్పపట్టణములను పొందినార మనియు డంబముగా చెప్పుచు 'వైద్యరత్న, భిషక్శిరోమణి, ఆయుర్వేదభూషణ,' ఇత్యాది బిరుదు పేరులుదాల్చి "అమృతాశ్రమము—ధన్వంతరి వైద్యశాల—ఆయుర్వేద నిలయము—ఆరోగ్య భవనము—సుఖాధారసదనము" మొదలయిన పేరులతో గొప్పపట్టణములలో వీథివీథియందును నొక్కొకయింటివాకిట పటములు వ్రాయించి వ్రేలగట్టియుండుదురు. ఈతరగతి వైద్యులు చేయునది యేమనగా—జనసమ్మర్దనముఁగల పట్టణములలో వసతియైనచోట నేదైనాయొకయిల్లును బాడుగకుతీసుకొని యందు రెండు పెద్దవైనయద్దములుతాపిన బీరువాలు తెచ్చిపెట్టి వానిలో చిన్నవియుపెద్దవియునుగా నేడెనిమిది రూపాయలకు వివిధములైన సీసా

లుకొని వరుసలువరుసలుగా పెట్టియుంచుదురు. కొన్నిటిలో పలురంగులుగల భస్మములును, కొన్నిటిలో పెక్కువిధములమాత్రలును, మఱికొన్నిటిలో లేహ్యములును, ఇంకంగొన్నిటిలో తైలములునునుంచును. కొన్ని సత్తుడబ్బీలలో మైనములు వగైరాయుంచి, యన్నిటికిని యౌషధముల పేరులు ముద్రింపబడిన చీటీలనంటించియుందురు. పేరులుమాత్రము శాస్త్రమున చెప్పబడిన గొప్పయౌషధముల వేగాని మందులు నిజముగా నవికానేకావు ఇటికరాళ్లపొడియు, సోడాఉప్పును. బొగ్గుచూర్ణమును, వస్త్రకాళితము చేసి యవియేవియో భస్మములని చెప్పుదురు. మాత్రలమాత్రము వాముము, కరకకాయలు, సొంటి, మిరియాలు మొదలైన యల్పవస్తువులతో సలుతెలుగులు జేసిపెట్టుదురు గాని బంకమట్టియుండలుం గొన్నిటిలోవేసి యుంచుటగలదు. లేహ్యములు యేవేవియో వేసి బెల్లముం వేసి సాదిపెట్టుదురు. తైలములుగొబ్బెరనూనెలో నను మంచినూనెలోనను రంగులుగలిపినవే కాని యన్యములుకావు. ఇవ్విధమున నౌషధశాల నేర్పాటుచేసి, తనపేరును బిరుదమునుం దెలియునట్లు ఈక్రిందవివరించిన విధముగా ప్రకటనము వ్రాయించిన పలకను వాకిటవ్రేలగట్టుదురు.

(ప్రకటనము)

ఇందుమూలమున సకలజనులకు తెలియజేయునది ఏమనగా:—వైద్యశిఖామణి పద్మనాభం అను సకలవిధరోగములను చికిత్స చేయుటయందును, రోగముల లక్షణములు తెలుసుకొని యాయావ్యాధులకు తగినవియు నాయుర్వేదశాస్త్రానుసారముగ మిక్కిలి ధనము వ్యయముచేసి తయారుచేసినవియునగు దివ్యౌషధములనిచ్చుటయందును గుప్రఖ్యాతి గడించినవారు. ఈవైద్యశాల జనోపయోగార్థము స్థాపించి క్రింద పేర్కొనినలాగున సకలవ్యాధులకును, చికిత్స జేయుదురు. వివరము.

1. వ్యాధిగ్రస్తులను చక్కగాపరీక్షించుట, ఆయారోగములకు తగినలేహ్యములు, భస్మములు, మాత్రలు, మొదలైనవానిని, అసలు కరీదునకే రోగులకొసంగి యారోగ్యవంతులను జేయుట, కోరినచో యొకరూపాయ ఫీజు ఇచ్చినయెడల రోగులను వారియిండ్లకే పోయిచూచుట ముఖ్యవిషయములు

2. పరీక్షించుటకుగాని, వైద్యసంబంధమైన విషయములను

మాట్లాడుటకుగాని, ఉదయము 7½ గంటలనుండి 9 గంటలవరకును. సాయంకాలము 5½ గంటలనుండి 7 గంటలవరకును, వచ్చి మాటలాడ వచ్చును.

3 నిరుపేదలైనవారికి యుచితముగా మందులొసంగి ధర్మముగా చికిత్సలు చేయబడును అటువంటివారు ప్రతిదినము నుదయమున నే రావలయును.

4 ఏయౌషధమునకైనను, దానినిచేయుటకైన కర్చునకంటె యెక్కువగా చార్జిని యెంతటి ధనికులవలనగాని పుచ్చుకొనబడదు.

5. వైద్యులింకకుదురదనివిడిచిన రోగుల వ్యాధులుసయితము యిచ్చటనుండెడి యమూల్యదివ్యౌషధములు సేవించినచో యనతికాలమున నారోగ్యముకలుగును.

వైద్యశిఖామణి పద్మనాభం,
ఆయుర్వేద వైద్యశాల.

ఇట్లు ప్రకటనలుప్రాయించి కట్టియుండుటను చూచి యెవఁడైనను, వ్యాధిగ్రస్తుడు లోపలికిపోయినయెడల నచ్చటనుండు నౌకరు విచారించి యాతనిని వైద్యుఁడు కూర్చుండియున్న మేడయొక్కగదిలోనికి పిలుచుకొనిపోవును. ఒకటేబిలు ముందువేయించుకొని వైద్యశిఖామణిగారు కుర్చీపైకూర్చుండి రోగిని కూర్చుండుమని విచారించి యతఁడు చెప్పెడి మాటలసందర్భములో వ్యాధియిట్లుండునుగదా యని గ్రహించి నాడీలక్షణమే తనకు తెలియుచున్నను, చేయిపట్టి కొన్నినిమిషములు నిదానముగను గనిపట్టుచుండి ఏమో గ్రహించినవానివలె దలయూఁచి "సరే! నీకు బాగుగాకాలమున కాకలియుంటుందా?" యని ప్రశ్నఁగావించును.

రోగి:—లేదండీ! బొత్తుగా నాకాకలియే లేకపోయినదండీ!

వైద్యుఁడు:—ఔను, ఆవిషయమునాడిలో స్పష్టముగా తెలియు చునే యున్నది. ఆకలియుండనేయుండదు. ఏమిచెప్పెదవో యని యడిగినాను. కాలప్రవర్తి సరిగాజరుగుచుండునా? ఆకలిలేనపుడది మాత్రమేలయగును? బద్ధకముగానేనా?

రోగి:—అయిదారు దినములనుండి ప్రవర్తి కావడమే లేదు.

వైద్యుఁడు:—అది నేను మొదటనే తెలుసుకొంటిని. వాతపిత్తశ్లేష్మము

లుమూడును సమ్మేళనమైయున్నవి. ఇదిద్వంద్వవ్యాధి నిద్రపట్టు చుండునా?

రోగి:—అయ్యో! కంటనిండుగా నిదురపోయి మూడుమాసములయి నది. ఎప్పుడును కణతమంట తలనాడుగా నొప్పిగాయుంటుంది. అమితదాహము

వైద్యుఁడు:—ఆ!—సరే; నేనేయేలక్షణములు కలిగియుండునని తలం చితినో యవియున్నవి. ఇట్లుండుట నాడీ స్పష్టముగా చెప్పుచు న్నది. ఇంతేగదా? ఇదివరకే నీవుమాయొద్దకు వచ్చియుండవల సినది ఎక్కడెక్కడి పాడుమందులలో తిని తని దేహతత్వమును చెడగొట్టుకొన్నావు. అయినను భయములేదు. దీనికి నలుబదిదిన ములు మందుపుచ్చుకొనినయెడల నీకారోగ్యము కలుగును.

రోగి:—స్వామీ! అలాగే పుచ్చుకొనెద. నాపాలిటికి మీరు దేవుఁడని తలంచుకొనెదను. దయచేసి శీఘ్రకాలమున స్వస్థతకలుగఁజే యుండి.

వైద్యుఁడు:—ఆవిషయము నీవుచెప్పవలసినది లేదు. మాయౌషధము లు తక్కినవారి మందులవంటివికావు. తప్పక గుణమునిచ్చును. ఇటువంటి గొప్పశాస్త్రీయములైన మందులగుటచేతనే బజారు లో విక్రయించు బూటకపువానివలెగాక మాయౌషధములకు వెలయెక్కుడుగానుండును. ఈపట్టణములోనే వైద్యునియొద్ద గాని మామందుకు సమాధానమైనది యొక్కటియైననుండదు. అన్నియు టక్కుమందులే! కావుననే యక్కడక్కడచూచి యే మియు లాభములేకపోవుటవలన తుదకు మాయొద్దకువచ్చి యా రోగ్యవంతులగుచుండెదరు. ఒకసారి మాయౌషధ ప్రభావము ను తెలుసుకొనినవాఁడు మఱియొకనియొద్దకు పోఁజాలడు.

రోగి:—సరే! గాని, స్వామీ! మందుకరీదు యెంతయగును?

వైద్యుఁడు:—అది నీవువిచారించవలసినదియే లేదు. మేమీవైద్యశాల ను లోకోపకారార్థము యేర్పాటు చేసియున్నాముకాని లాభ ముకొఱకు పెట్టినవారముకాము. ఎవరియొద్దనయినను సరే! మం దుకు తగులుబడియైన అసలుకరీదుతప్ప దమ్మిడియైననెక్కుడువు

చ్చుకొనము. ఔషధము సేవించి ఆరోగ్యవంతులైనంతట సంతో షముతో వారుగాపిలిచి యేమైనను బహుమానమొసంగినచో పుచ్చుకొందుమేగాని లేనిపోని మాటలుచెప్పి డబ్బుపుచ్చుకొనుట మావనిగాదు అటులచేయువారునుంగలరు. వారులేదు. మాకదిగిట్టదు.

రోగి:—అయ్యో! తెలియక చాలాడబ్బు కర్చుపెట్టినాను. ఎన్నిమారులు. ఎందరువైద్యులు. ఏమియుంబ్రయోజనములేదు. వృథాయైపోయినది.

వైద్యుఁడు:—ఔను. అటుల మోసపుమాటలుచెప్పి డబ్బులాగువారికే ఇది మంచికాలము. నిజముచెప్పినచో నమ్మనేనమ్మరు.

రోగి:—నమ్మకపోవడమేమిగాని మందుఖరీదులశెలవివ్వండి.

వైద్యుడు:—నలుబదిరోజులు పుచ్చుకొనవలయును. వ్యాధి దేహమున బాగుగా నాటుకొని యుండుటవలన దానికి తక్కువకాలముపుచ్చుకొని యుపయోగములేదు. అంతవిశేషముగా నగునదేమియునుండదు. నీకు దినమునకు 1రూపాయకరీదు మందుచాలును. పూర్ణముగా నారోగ్యముకలుగును.

ఇట్లు చెప్పగా రోగి నలుబదిదినములకును నలుబదిరూపాయలు కావలయునుగదాయని కొంచెముసంశయించి విధిలేకసమ్మతించి యౌషధమునిండని రూపాయల నిచ్చివేయును. అవి తీసుకొని యేదోయొక సీసాలోనిభస్మమును చిన్నచిన్నకాకితపుతునుకలలోకొంచెకొంచెముగావేసి పొట్లములుగామడిచి వానికొసంగి 'ఈయౌషధమే ఇతరులయొద్దనుండినచో యీనలుబదిదినములకును ఇన్నూఱురూపాయలు పుచ్చుకొనియుండుదురు. మేమటుల యెక్కువకోరుటలేదు. నీవీభస్మమును ఉదయమును సాయంత్రమును వెన్నలోకలిపి పుచ్చుకొనుచుండవలయును. దినము విడిచిదినము చక్కగా మంచినూనెనుకాచి బాగుగా తలకంటించుకొని స్నానముచేయుచు జీర్ణమగు మంచివస్తువులం దినుచుండవలయును. పాలు మంచిపండ్లు కావలసినంత భుజింపవచ్చును ఇట్లుచేయుదువేని త్వరలో గుణముకలుగును" అని చెప్పి పంపివేయును.

ఆరోగి యుండిచ్చినదేమో మహౌషధమని తలంచికొనిపోయి పద్ధతిప్రకారముగా పుచ్చుకొనును. ప్రతిదినమును నింటిలోనివారు చేసె

డియుపచారముల వల్లను, విడువక శిరస్స్నానము చేయుచున్నందున యుష్ణము కొంత యుపశమించుట చేతను, లఘువైన యాహారమును, మంచివండ్లనుం దినుటచేతను, యేదోయొకవిధముగా నించుకతత్వము మాఱి యనుకూలముగా యున్నట్లు తోఁచి రోగి యావిషయమును వైద్యునకు చెప్పినయెడల, తనయొక్కయు తనమందుయొక్కయు ప్రభావమును కడు డంబముగా వర్ణించుచు 'ఔనండీ! ఎటువంటివ్యాధియైనను తగినయౌషధము నుపయోగించిన గుణమునొసంగకుండునా? ఏవేవియో పనికిమాలిన మందులిచ్చినచో డబ్బు నష్టమేగాని లాభమేకలుగదు. మందొకదారియు, రోగమొకదారియునై యుండును. నెలరోజులకు క్రిందట యొకనికి శూలవ్యాధి కలిగియున్నందుకుగా వైద్యులందఱును తమవలననైనవరకునుం జికిత్సచేసి సాధ్యముగాదని మానినారు. మాయొద్దకు వచ్చినాఁడు. విచారించండి మా దేపూటలు. ఒకమందునిచ్చితిని. నెమ్మదియైనది. సంతోషించి నన్నుపిలుచుకొనిపోయి రెండు సిల్కుకండువాలును, నూఱురూపాయలును మహాసంతోషముతో తాంబూలములో పెట్టియిచ్చినాఁడు. మొన్నటిమాట చెప్పండీ! వారముదినములైనది. పక్షపాతముకలవాఁడు. ధనికుఁడు. నాయొద్దకువచ్చి "అయ్యా! ఎంతయొకర్చుపెట్టినాను ఫలము లేదని దుఃఖించినాఁడు. దానికొకమందు క్రొత్తగా తయారుచేసియిచ్చినాను. రెండుదినములకే వ్యాధినెమ్మదించినది కాని యింకను కొంతమందు పుచ్చుకొనుమని చెప్పినందున తీసుకొనుచున్నాఁడు. బాగుగా తనకారోగ్యమైనంతట నన్నూఱురూపాయలనిచ్చునట్లు చెప్పియున్నాఁడు ఔషధము మంచిదైనయెడల నెటువంటిరోగమైననేమి? నీవ్యాధి శరీరమున బాగుగ నూరియున్నది. ఇవుడుపుచ్చుకొనినమందు చాలదు. ఇంకను నలుబదిదినములు తప్పోడనే సేవించితివేని సంపూర్ణారోగ్యముకలుగును" అనిచెప్పి మరల నలుబదిదినములమందుకు కరీదుపుచ్చుకొనియిచ్చును. వానికి మంచికాలముగా యుండి యేదోకారణమువలననైనను నదికొంచెము నెమ్మదించెనేని మేలే! యటుల నెమ్మదిగాక యట్లేయుండినను, నెక్కుడైనను నడిగినచో, పథ్యమునందలి లోపమనియో మఱియేదియో సాకులుచెప్పి యౌషధమును మార్చవలయునని మరల నూఱో యేబదియో యూడదీసి యేదోయొకటియిచ్చును. వాఁడగిపుచ్చుకొనియు లాభములేకపోయినచో

మరల వైద్యునియొద్దకుపోయినచో మందుమూల్యవలయునని చెప్పి డబ్బు దెమ్మనునని భయపడి భగవత్సంకల్పప్రకారము జరుగునని యావంక చూపుటయే మానుకొనును. వైద్యుఁడని యెఱింగియు నెఱుంగన ట్లుండును.

ఈతరగతిలో చేరిన మఱికొందఱు భిషగ్మణులు తమయొద్దజీత ములిచ్చి కొందఱు స్త్రీలనుంచుకొని యుందురు. వారచ్చటచ్చట పరస్పరముగా నేయింటనైన నెవరికేనియు రోగము కలిగియున్నదా? యని విచారించుచుండి యెచ్చటనైన నటుల కలిగియుండినట్లు తెలిసినచో, గొప్ప ధనవంతుల యింటిస్త్రీవలె యొకమంచి చీరనుగట్టి బంగారుగిల్టువేసిన నగలఁ ధరించి రోగియున్న యింటికిపోయి యటునిటుం జూచుచుండును. ఇంటివారు చూచి క్రొత్తమనిషియైన యీమె యెవ్వరో యేలవచ్చినదో యని దగ్గఱకువచ్చి "అమ్మా! మీరెవరు? ఏల వచ్చినారు? ఎవరిని చూచుచున్నారు?" అని యడిగినచో "ఇచ్చటికెవఁడైనా వైద్యుఁడు వచ్చినాఁడా? ఎవరో యావైపునఁ బోవుచుండి మీయింటికి వచ్చినట్లు చెప్పగా నిజమని వచ్చినాను. ఇచ్చట కనుపడలేదు" అనును. "ఆవైద్యుఁడెవఁడు? ఇచటికేల వచ్చినాఁడట?" యని వారడిగినచో "మీయింట నెవరికో దేహము స్వస్థముగాయున్నదనియు, వచ్చినాఁడనియు వింటిని. నిజమో కాదో నేనెఱుంగను. ఆయన మీకు తెలిసియే యుండువాఁడు అనుకొంటాను. సుందరమూర్తియనెడి పేరుగలవాఁడు, ఎపుడును సులోచనములు ధరించియుండును. సుమారు ముప్పదియేండ్లుండును. చామనచాయ దేహము. పెద్దజుట్టుముడికలదు. ఎవరో చెప్పినమాటనమ్మి వచ్చినాను కోపగించుకొనకుఁ"డనును. వారాస్త్రీనిచూచి "ఇంతమాత్రమునకే కోపమా? కాని యెందఱో వైద్యులుండగా యాయననే వెదకుకొనిరావలయునా? మఱియెవ్వరును లేరా?" యనినయెడల 'వైద్యులెందఱోయున్నారుగాని యేమి లాభము? అతనిశక్తివేఱు. యెంతమొండివ్యాధియైనను సరే! అతఁడు తప్పకకుదర్చగలఁడు. అతనిది యమృతహస్తము. మందు పుచ్చుకొనుటలో కాని, పథ్యమందుగాని రోగి కేలాటికష్టమునునుండదు. అదియునుగాక యితరులవలె యత్యాశగలవాఁడుకాఁడు. చాలా యోగ్యుఁడు. నాకు తెలిసినంతవరకును నతఁడు మందిచ్చినవారలలో నొకరికైనను

గుణము కలుగకపోయినదిలేదు. మే మతనియొద్దనేగాని మఱియొకనిదగ్గరవుచ్చుకొనము. ఇపుడు మాకోడలికి కొంచెము జబ్బుగాయున్నది. దానికొఱకై తోడ్కొనిపోవుటకువచ్చినాను" అని బహుచాతుర్యముగా చెప్పును. తమయింట రోగియుండుటవలన, వారాస్త్రీమాటలునమ్మి 'అమ్మా! ఆయన యిచ్చటికి రాలేదుగాని,మాయింటిలో రోగియొకడున్నాఁడు. చాలా బాధపడుచున్నాఁడు. యెన్నోమందులుపయోగించినాము గుణముకలుగలేదు. నీవుచెప్పెడి వైద్యుఁడు గొప్పవాఁడుగా నుండునని తోఁచుచున్నది. దయచేసి యతని నిచ్చటికి వచ్చునట్లు చేయవలెను' అని బతిమాలుదురు. ఆమాయలాడి వారినిచూచి "సత్యమే! ఆయన చూచినాఁడన్ననో, తప్పక యారోగ్యముచెందినట్లే. అమ్మా! ఆలాగే! కనుపడినచో చెప్పెద"నని యచ్చటనుండి వెడలిపోవును. దానిని విచారించి వైద్యుఁడు వారియింటిలోనివిషయములన్నియుం దెలిసికొన్నవాఁడై నాఁటిసాయంత్రమో, మఱుసటిదినము ఉదయముననో, యాయింటికి పోవును. అతని నింటివారుచూచి క్రొత్తమనిషిగాయుండుటవలన సంశయించి యీ వైద్యుఁడుగానే యుండునేమోయని "అయ్యా! రండీ! మీరెవరు?" అని మరియాదగా యడుగుదురు. అతఁడు "నేను వైద్యుఁడను, నిన్న పరశురామనాయఁడిగారితోఁబుట్టినామెతో మీరు నన్ను రమ్మని చెప్పినారఁట. ఆమె చాలా గట్టిగాచెప్పినది. ఇపుడు నేను జడ్జిగారియింటికి పోవుచుండి యీ దారినివచ్చినాను. ఆమెచెప్పినమాట జ్ఞాపకము వచ్చినది" యని చెప్పును. "అతను చెప్పిన పరశురామనాయుడు చాలా ప్రసిద్ధపురుషుఁడగుట వారెఱుంగుదురు. తమ యింటికివచ్చినది యతని తోడబుట్టినామెయని యతఁడు చెప్పగా విని అయ్యో! ఎవరోయని తలంచినాము. తెలిసియుండిననెంతో మరియాదచేసి యుండుదుము. ఆమెయున్న విధమును చూడగా మాకామెయంతటి గొప్ప యింటిమనిషియని తోఁచలేదు. ఔను గొప్పవారు డంబముగా నుండుదురా? ఏమియు లేనివారికే యధికడంబము. ఆమెనుచూడగా సాధారణమైన యింటిస్త్రీవలె యుండినది. ఆహా! ఎంతజ్ఞాపకము? మామాట మఱువక మీతో చెప్పి పంపినది కదా! గొప్పవారికి గొప్ప గుణములు''అని శ్లాఘించి "రండీ! రండీ!" యని యతనిని లోపలికి పిలుచుకొనిపోయి కుర్చీమీఁద కూర్చుండఁ

డని తామనలికిబోయి యొండొరులు రహస్యముగా "పరశురామనా యుడు స్వల్పులను దగ్గఱచేర్చువాఁడు కాఁడు. అతనియింట వైద్యము చేయువాఁడనిన గొప్పవాఁడుగానే యుండవలయును. జడ్జీగారు మొద లైనవారు సామాన్యులుగాయుండువారిని పిలిపింపరు. ఈవైద్యుడు గట్టిగానే యుండును. కాబట్టి మనవానికి తనయొద్ద మందునిప్పించుట యుక్తముగా యుండు"నని కలియఁబలుకుకొని నిర్ధారణచేసి, వైద్యుని యొద్దకువచ్చి "అయ్యా! మాయింట నొక చిన్నవానికి కాయిలాగా యున్నది. దయచేసి చూడండి" యని యతనిని రోగి పండుకొనియుం డుగదిలోనికిఁ బిలుచుకొనిపోయి చూపుదురు. అతఁడు రోగి నెగడిఁ జూచి పరుండియున్నవానిని కూర్చుండుమని చేయిపట్టుకొని యైదునిమి షంబులు నాడీ పరీక్షచేసి, నాలుక చూపుమని పరీక్షించి యింటివారి వంకతిరిగికని "ఇతని కిపుడు మందు నిప్పించుటలేదా?" యని య డుగును.

ఇంటి:—ఎన్నో పుచ్చుకొన్నాఁడు. ఇప్పించి విసికిపోయినాము. ఇపుడు యిరువదిరోజులనుండి మందు లేదు. ఊరకనే యున్నాఁడు.

వైద్యు:—ఊరకున్న యెట్లు? మంచిమందు యిప్పించవలెను. ఇదివర కును వ్యాధికి తగిన యౌషధము పుచ్చుకొన్నట్లుండలేదు. వృ థాగా అదియునిదియుం బుచ్చుకొనుటవలన లాభముగలుగదు. పైగా వ్యాధి యెవయగును. ఇది చెడ్డరోగము.

ఇంటి:—ఔను ఏమి చేయగలము. వచ్చిచూచినవైద్యులందఱును నా లుగురోజులలో నెమ్మదించు ననడమేకాని గుణముమాత్రము లేదు. ఎంతయో కర్చుపెట్టినాము.

వైద్యు:—నిజమే! అటుల పలుకుదురు. ఒకఁడైనను వ్యాధిలక్షణము ను కనిపట్టి యుండఁడు. అది తెలిసుకొనుటయే వైద్యునినేర్పు. రోగము తెలిసికొనుట చాలా కష్టమువని.

ఇంటి:—నిజమేనండీ! ఇదివరకు నొకఁడును ఇది యీరోగమని తెలు సుకొన్నదియే లేదు. ఏదోయొకటిచెప్పి తమకుదోచినమందునిచ్చి డబ్బు లాగుకొనిపోవడముతప్ప మఱేమియు లేదు. అయ్యా! మీ రుచూచినారుగదా! ఎట్లున్నది? ఈరోగము మీకేమిగాతోఁచు చున్నది? సాధ్యముగాయుండునా?

వైద్యు:—తగినమందు నుపయోగించినయెడల నెటువంటిరోగమైనను సాధ్యముకాకపోవునా? ఇంతవరకును మంచిమందు తగిలినది కాదు. ఇది పెద్దవ్యాధియగుటచే క్రమక్రమముగా పలువిధములుగా మాఱి తుదకసాధ్యస్థితిలో విడుచును. ఇప్పటికింకను సాధ్యములోనేయున్నది.

ఇంటి:—ఇదియేమి వ్యాధియనియెదరు? తెలుసుకొంటిరిగదా?

వైద్యు:—రోగమునే తెలుసుకొనకపోయిన, నింకమందునివ్వడమెట్లు? ఇది మేఘపైత్త్యోష్ణవాయువువలన కలిగినది. ఇపుడిది యొకక్రొత్తరోగప్రారంభమైనది. ఈవ్యాధికలిగినవారిని నేను నలుగురైదుగురినిచూచినాను. వైద్యులందఱును కుదరదనినతరువాత, నేనే మందుఇచ్చి నెమ్మదిపఱచినాను. దీనికి ముఖ్యలక్షణము లేవనగా—ఆకలిమందముగానుండుట, పాలుమాలిక, కడుపులో వికారము, తలతిరిగినట్లుండుట, కాలమునకు ప్రవర్తికాకుండుట, కండ్లుమంటలు, నిద్రసరిగాలేకపోవుట, మూత్రమువిడుచునపుడు మంట, కాలుచేతులునొప్పి, బలహీనత, దాహము, నోరుచప్పగానుండుట యీమొదలయిన లక్షణములు కలిగియుండును. అపుడపుడు నివి పలుతెఱంగుల మాఱుచుండును. దుర్వ్యాధిగాని యితరముకాదు.

ఇట్లుచెప్పగా యీవ్యాధులక్షణములలో నేవియోకొన్ని లక్షణములయినను రోగికి కలిగియుండకపోవు. కావున, రోగి 'ఔనౌను. అట్లనేయుండు' నని తనకు కలిగియున్నవానికిని లేనివానికిని యొప్పుకొనుచుండును. వైద్యుడు వ్యాధిలక్షణములన్నియు బాగుగాకనిపట్టినాడని ఇంటివారు భ్రమపడి యతనిని యౌషధమునిచ్చి యారోగ్యము కలిగించవలసినదిగా ప్రార్థింతురు. వైద్యుడుయోచించి 'సరే! కానిండు. దీనికి ప్రస్తుతము నాయొద్ద మందులేదు. తయారుచేసిఇవ్వవలయును. ఇటీవల జయదేవరావుగారి తమ్మునికిదేవ్యాధికలిగి నన్ను పిలిపించినారు. నేను పోయిచూచి మందుతయారుచేసి యిచ్చినాను. అతనికి వారమురోజులలో నెమ్మదించి యిపుడుకులాసాగాయున్నాడు. ఆమందులో నాకువైద్యభాగమువచ్చినదికాని మఱి యిరువురకిచ్చినాను. అందువలన నైపోయినది. మీరు చేసిఇవ్వమనినచో తయారుచేసెదను. ఆయౌషధమును

వారముదినములు పుచ్చుకొనగానే స్వస్థమగును. ఐన ననుమానముకూడదు. పిమ్మట నొకపక్షముదినములు తీసుకొనుట మంచిది ఏమియుంగష్టము తోఁచదు. ఇక్కాపథ్యము. మీయభిప్రాయమును చెప్పండి. నేనుగంట ప్రకారముజడ్జిగారి ఇంటికి పోవలయు"నని పలుకును. ఇంటివా రాలోజించుకొని 'అయ్యా మంచిది. మందుతయారుజేసి యివ్వండి. యీవ్యాధి మీవలననే బాగుకావలయును మీకష్టమునకు తగినట్లు నెమ్మదియైనంతట తాంబూలము సమర్పించెదము.' అని వినయముతో చెప్పుదురు. వైద్యుఁడామాటలకు తలయూపుచుండి 'దానికేమిలెండి మీరుగాక యెవ్వరెవ్వరో యెరుగు. నేనుమందునిచ్చినంత కితనికి శీఘ్రముగానారోగ్యము కలుగవలయునుగాని మీరు నాకష్టము గుర్తెఱిఁగి సన్మానము జేయకపోరని నేను వ్యసనపడలేదు. గుణముకావడమే నాకుముఖ్యము. మంచిది. మందుకర్చులకుఇవ్వండి. ఆలస్యమగుచున్నది. పోవలయును.

ఇంటి:—ఎంత కావలయును? చెప్పండి.

వైద్య:—ఇదివరకు నలుగురుచేయించి పుచ్చుకొనియున్నారు. మీరు వారినడిగియివ్వండి. ఇప్పుడుతొందరలేదు. రేపుతీసుకొనిపోయి ప్రారంభించెద. ఇంతలో నేమిమునిఁగినది?

ఇంటి:—విచారించడమేల? మీరు పొల్లుచెప్పుదురా? వలదువలదు. మీరుచెప్పడమేచాలును. మాకునమ్మకమే!

వైద్య:—దానికి కావలసినవస్తువుల కొకటియే రేటండి! హెచ్చుకాదు. తక్కువయుంగాదు. ఎవరికైనను నొకటియేపద్ధతి. నూఱురూపాయలుపట్టును. ముత్యములు, పగడములు, మంచిబంగారము, కస్తూరి, మొదలగు వెలపొడుగువస్తువులు కావలయును. ఈ నూఱురూపాయలకును వస్తువులుతీయవలయును. మందును నూఱుటకు కూలి నైదురూపాయలుపట్టును.

ఇంటివారికా మొత్తమధికముగాతోఁచి కొంచెము సందేహించినను రోగియిచ్చి చేయించవలసినదిగా పట్టుబట్టును 'వ్యాధివచ్చినవాడు వెఱ్ఱివాడునొకటియే!' యందురుగదా! పాపము తనకారోగ్యము కలుగునని యతనిభ్రమ. విధిలేక యింటివారు మందుకర్చునకును, కూలికి రు105లు నొసంగుదురు వైద్యుఁడవిపుచ్చుకొని 'ఇంకనాలుగురోజులలో మందుతెచ్చియిచ్చెదను. చేయుటకంతకాలముపట్టును. మీరుభయపడ

వలదు. ఇతనివ్యాధి నివర్తిచేయుభారము నేను వహించుచున్నా'నని నమ్మబలికి బయలువెడలి జడ్జీగారియింటికి పోవుదారిఁబట్టి కొంచెము దూరముపోయి యచటనుండి స్వగృహము చేరును. మఱినాలుగురోజులుగడచినంతనె యేదోయొకటి తెచ్చి మిక్కిలివిలువగల దివ్యౌషధమని చెప్పి ఇచ్చిపోవును. అదియారోగిపుచ్చుకొనునుగాని లేశమైనను గుణము కనఁబడదు. వైద్యునిఁ గూర్చి యడిగినపక్షమున 'అతనితత్వమునకా మందు సరిపడలేదు. వేఱేయొకమందు చేసియివ్వవలెను. దానినిచేయుటకు యిన్నూరురూపాయలుపట్టును. అది చాలాగొప్పయౌషధ' మని చెప్పును. వారదివిని 'చాలుచాలు యిప్పటికి యిచ్చిననూఱునుచాలక, మఱలయిన్నూఱు తెమ్మనుచున్నాఁడు. రూపాయలుపోవడమేకాని గుణముమాటనున్న. భగవత్సంకల్పప్రకారము జరుగునుగాక, ఇంకయీయప్రయోజకులయిన వైద్యులమాటలునమ్మి వీరొసంగెడిమందులు పుచ్చుకొనుట యవివేకము. ఏదో మనకు తెలిసినట్లు మనమేచికిత్సచేసికొనుటమంచిది' యని తలంచి మరలనతనిముఖమును చూడనొల్లక పోయినంతవరకుండ బోయినదని మిన్నకుందురు. ఆవయిద్యుఁడు వారు తనయొద్దకు రాకపోవడమే గొప్పయదృష్టముగా తలంచి సంతుష్టాంతరంగుఁడై మఱియొకచోటు వెదకును.

ఈతరగతిలోనివయిద్యులు మఱికొందఱుచేయుట యెట్లనగా— తమకునాడీపరీక్షించుటకు రోగలక్షణములు కనిపెట్టుటకును దెలియకపోయినను సర్వముందెలిసియున్నట్లు నటించుచు, ఏవయిద్యునియొద్దనైనను నేవోనాలుగుమందులు ఖరీదునకుఁదీసుకొని, వానిని చిన్నచేతిపెట్టెలో నుంచుకొని యేయింటనైన వ్యాధులుగలవారుందురాయని విచారించుచుండి యటువంటి యిల్లు తెలిసికొని తానే యచ్చటికిపోయి, ఇంటివారినిచూచి 'చంద్రశేఖరంనాయుడుగారి గృహమిదేనా?' యని యడుగును. ఇంటివారతనినెఱుంగక, యేలవచ్చెనోయని 'ఔను! ఇదియే! అయ్యా! మీరెవరు? ఏమిపనిగలిగివచ్చినారు?' యని యడుగకపోరు. అటులనడిగినప్పుడు 'నేనువయిద్యుఁడను, నాపేరు విశ్వనాథరావంటారు ఎక్కడనుంప్రసిద్ధియే! మీరువినియుండరుకాఁబోలు. నేనీదారిని పోవుచుండగా, ఆయన యెవఁడోగాని, చామనచాయగ యుంటాఁడు, తల క్రాపుచేసుకొని, స్పర్టికల్సువేసుకొనియున్నాఁడు. ఎవుడో యొక

మీరు నాయొద్దకుఁతనువచ్చిన జ్ఞాపకమున్నది. ఆపరిచయమువలన నన్ను గురుతుపట్టి 'అయ్యా! ఇదిగో ఈవీధిలోనె 112వ యింటిలో నుండువారలు మాకుబంధువులు. వారియింట నొకయాఁడుమనిషి యస్వస్థముగా యున్నది. చాలామంచివయిద్యులు చూచినారుగాని నెమ్మదికలుగలేదు. తమబోటివారివలనగాని యీవ్యాధి నివర్తి కానేరదు. కాబట్టి దయచేసి ప్రయాణమునకు కొంచెము నాయందుదయయుంచి యటుపోయి చూడవలయునని కోరుచున్నాను. నేనును మీవెంటవచ్చి యింటర్వ్యూస్ చేసి వత్తునుగాని తొందరపనిపై వెళ్లుచున్నాను. ఆలస్యమైనయెడల యీపని చెడిపోవును. ఫరవాలేదు వారుమిక్కిలి యోగ్యులు మీరేపోయిచూడవచ్చును. పాపమామనిషి మిక్కిలిబాధపడుచున్నది.కనుకనిరాకరింపక పోయిచూడండి'యని చాలదూరము ప్రార్థించి తొందరగావెళ్లినాఁడు. ఆపెద్దమనిషి యంతదూరము ప్రార్థించినంతట చూడకుండుట మరియాదగాయుండదని తలంచివచ్చినాను. 'వ్యాధిగ్రస్తురాలినిపిలిపించండి చూచిపోయెద' నని చెప్పెను. ఆయింటివారతనిమాటలువిని, తమకు బంధువును; తనయందంతటిప్రియముతో తానుగానే వయిద్యునిం బనిచినవాఁడును నైన యీమనుష్యుఁ డెవఁడుగాయుండునో యని తమలో తాము కొంచెముతడవాలోచించి నిర్ధారణఁ జేయఁజాలక కడపట 'ఎవఁడైననేమి? ఇందువలన గలిగిననష్టమేదియును లేదు. మనమును, నెవనినైననయిద్యునిఁబిలిపించి రోగిని జూపవలయునని యోచించుచుంటిమి గదా! ఇపుడేమిచెడినది? వ్యాధిగ్రస్థురాలిని తనకుఁగనబఱచి, యేమి రోగమని చెప్పునో చూత'మని యోచించి, మఱియేమియుంబలుకక రోగిని బిలుచుకొనివచ్చి యతనియెదుటనిలుపుదురు. వయిద్యుఁడామెనెగాదిగఁ జూచి తలయూఁచి కూర్చుండఁబెట్టి ధన్వంతరితానేయని వారికిఁదోచునట్లుగా, తెలివిగలవయిద్యులు రోగులనుబరీక్షించునపు డచ్చుటచ్చుటం జూచియున్నవాఁడుగావున, యాప్రకారముగానే తానునునభినయింపుచు, నాడీలక్షణము గుర్తించువానివలె కొంతతడవు కుడిచేయియుం గొంత తడవు యెడమచేయియుంబట్టి మార్చిమార్చిచూచి, నాలుకయు, కన్నులును, మూత్రమునుబరీక్షించి మఱియు నెన్నోనిదానములుగనుచుండును. అపుడింటివారు తమలో 'ఈ వైద్యుఁడుచేయు పరీక్షలు చూడగా యితఁడు సమర్థుఁడుగానే తోచుచున్నది ఇదివఱకు వచ్చినవయిద్యులేవో

రెండుమాటలుచెప్పి తమకుతోఁచిన రెండుమాత్రలు చేతఁబెట్టి పోవుచుండిరేగాని, ఇతనివలె నింతశ్రద్ధగా యిన్నివిధముల నొక్కఁడైనను బరీక్షించిన వాఁడుకాఁడు. మన మితనియొద్దనే యౌషధము నిప్పించుటయుక్తము. చాలా యోగ్యుఁడుగా నుండుటబట్టి తప్పక యితనివలన గుణముకాఁగలదు" అని యాలోచించుచుండుదురు. వైద్యుడు పరీక్షించుటను చాలించి ఇంటివానింజూచి "ఈవ్యాధి చాలా యుపద్రవకరమైనది. దానికి తోడుగా తెలిసియుం దెలియనివారు తమకు తోఁచినమందులన్నియునిచ్చి వ్యాధిని తగ్గించుటకు మాఱుగా యెక్కుడగునట్లుచేసినారు. ఆమందులవలన మొదటి రోగతత్వము వేఱువిధముగా మాఱినది. దానివలన బాధ యతిశయించినది. ఇపుడు దీనికి శీఘ్రముగాతగిన యౌషధము నివ్వకున్నయెడల ప్రాణాపాయము సంభవించుట నిశ్చయము. ఎవుడుగాని వైద్యుఁడు యోగ్యుఁడైనదియుం దెలిసికొనక, ఇటువంటి గొప్పరోగములు గలవారికి మందులిప్పించుట మిక్కిలి హానికరమైనవిషయము. యోగ్యతా యోగ్యతలు యీకాలమున విచారించువారెవరు? రోగముల సంఖ్యకన్నను వైద్యులసంఖ్య నూఱురెట్లు మించిపోయినది. ఎక్కడచూచినను వైద్యాలయములే, ఎక్కడ చూచినను వైద్యులే! ఏమిప్రయోజనము? యిటువంటి యల్పజ్ఞానులందఱును వైద్యవృత్తి నవలంబించుటవలననే వైద్యముయొక్క గౌరవము చెడిపోయినది. మాబోటివారలకు జీవనహాని యేర్పడినది. సమర్థుడైన వయిద్యునిగుర్తించుటయే కష్టముగా యేర్పడినది. అయినను, బంగారమువిలువ యెపుడును దగ్గిపోనేరదు. బుద్ధిమంతులైన మీబోటివారు మమ్ము తెలుసుకొనుచునేయున్నారు. సరే! ఇంక యీమాటవలన లాభములేదుగాని, ఈమెకు నన్ను మందునివ్వమంటిరేని యిచ్చెదను. లేదా? మీయిష్టము. మఱియొకనియొద్ద ఇప్పించవచ్చును. మీరు నాయొద్ద నౌషధమును పుచ్చుకొనకపోయినయెడల నష్టములేదు గాని యొకవిషయమునుమాత్రము మీరు జాగ్రతగా గమనించుట మంచిది. ఏమనగా వయిద్యుఁడని పేరుఁబెట్టుకొని వారి యుండఱియొద్దను మందునిప్పించకుఁడు. సమర్థుఁడుగా నుండువానిని గుర్తించి వానివలన నిప్పించితిరేని మీకు లాభముకలుగును. ఇదియే నేను మీకుఁ జెప్పదలంచినది. ఆలస్యమైనది. పెక్కుచోటుల కరుగవలసి యున్నది. ఇంక

బోయెద"నని లేవనుంకించును. ఇంటివారు న్యాయముగా తోఁచుచున్న యతనిమాటలువిని యాలోచించి యతనియొద్దనే మందునిప్పించుటకు తీర్మానించుకొని మరల నతనిఁగూర్చుండబెట్టి "అయ్యా! మీరే సమర్థులని మాకుదృఢముగాతోఁచినది. కాఁబట్టి శ్రద్ధవుచ్చుకొని యౌషధమును మీరే యివ్వండి. చేతగానివారందఱును మందులిచ్చి తుదకు రోగమును పెద్దదిగా జేసినారు. ఇంక నటువంటివారి యౌషధములు మేము తీసుకొనజాలము. ఈవ్యాధి మీహస్తమువలననే తీఱవలయును"అని వినయముతో ప్రార్థింతురు. వైద్యుఁడు వారలఁజూచి "నరే! నన్ను యివ్వమనినచో యిచ్చెదనని మొదటనే చెప్పినానుగదా! అభ్యంతరము లేదు. యిచ్చెదను. త్వరితము నివారణయగునట్లు చేసెదననిసయితము దృఢముగా చెప్పగలను. కాని ఇపుడీమెకు యివ్వవలసిన యవుషధము తయారుచేసి యివ్వవలయును. నాయొద్దనున్నదికాని యది మఱియొకరికిగా చేసినది అది యిచ్చుట న్యాయముకాదు. వ్యాధితీవ్రముగా యుండుటచే దీనిని మీకిచ్చినచో వెంటనే వారికి మరలచేసికొనిపోయి యివ్వవలసి యుండును. ఈవిషయమున మీయభిప్రాయముఁజెప్పండి" యనును. యింటివా రాలోచించి "హాజరుగా యుండు మందు నిప్పించుటయే మంచిది. చేయడమనినచో తడవగును. మనకు దగ్గఱనుండు మందునిచ్చి వేరే తయారుచేసి యదియివ్వవలసిన వారికిచ్చుట యుక్తమని చెప్పుద"మని నిశ్చయించి అదేప్రకారముచెప్పి మందుచేయుటకుపట్టు కర్చు నడుగుదురు. వయిద్యుఁడు వారితో "ఇదిగొప్ప యవుషధము ఈయోగమితరులకు తెలియనే తెలియదు. ఇటువంటి మందు నివ్వకున్నయెడల యిప్పటి తత్వము మాఱి వ్యాధి యభిముఖముకానేరదు. దీనిని చేయుటకు యేబదిరూపాయలు పట్టును. తక్కువ కానేరదు" అని ఖండితముగా చెప్పును. అతఁడుచెప్పినది యెక్కువగా తోఁచినను, సిద్ధముగాయున్నమందు నిప్పించకపోవుట ప్రయోజనము కాదనియెంచి యతనికి మందుకర్చునకుగా యేబదిరూపాయలును సమర్పణఁజేయుదురు అవితీసుకొని తనపెట్టెతెఱచి అందు తానుకొని మహాపదిలముగా పెట్టుకొనియున్న యేదో యొకయవుషధమునుతీసి "ఇది దివ్యౌషధము. దీనినిచేయడము మిగులకష్టమైనపని. ఇంత యుత్తమమైనమందును పుచ్చుకొనియుండినయెడల యీమెరోగ మిదివర కెన్ని

దినములకుపూర్వమో స్వస్థమైయుండెడిది" యని వారికొసఁగి తీసుకొన వలసినమితమును, అనుపానమును, పథ్యమునుం జెప్పును. ఆపద్ధతులు తనకు మందొసంగిన వయిద్యునివలనఁ దెలిసికొనియుండకపోవుటచే ఇష్టమువచ్చినట్లును తత్కాలమున తోఁచినట్లుం జెప్పి రెండుమూడు రోజులకొకసారి వచ్చిచూచి పోవుచుండుదు" నని నమ్మబలికి వారివలన మర్యాదలుచెంది వెడలిపోవును. కాని మరల నతనిదర్శనమా యింటి వారికి సిద్ధింపదు. అతఁడిచ్చినమందునకును వ్యాధికిని యెనుమంతయు సంబంధము లేకపోవుటచే యేదోయొకమందును పుచ్చుకొనుచున్నకార ణమున రోగివ్యాధి మఱియొకవిధముగామాఱి యధికమై తత్పూర్వ మునకంటె బాధ యెక్కుడగుచుండును. ఆవిషయమునుగురించియడిగి యేమిచెప్పునో తెలిసికొనవలయుననెడి యుద్దేశముతో యెంతవెదకి నను వానిజాడ తెలియదు. ఇతరవయిద్యులవద్దకుపోయి తమతో యతఁ డుచెప్పినపేరునుచెప్పి యతని నివసించుచోటు నడిగినయెడల యాపేరు గలవాఁడు మేమెఱింగినవయిద్యులలో నొక్కఁడును లేదని చెప్పెదరు. అంతట వారు వానినినమ్మి మందుపుచ్చుకొనిన తమబుద్ధిజాడ్యమునకై చింతింపుచు మరలిపోవుదురు. ఇంకచేయదగిన దేమికలదు?

ఇట్లేవచ్చి మఱికొందఱేదో యొకటి చేతఁబెట్టి డబ్బులాగుకొని పోవుదురు. వారుఇచ్చినదానినిపుచ్చుకొనినపుడు పూర్వము తమకుకలి గినరోగబాధ యట్లుండగా వేరుదుర్గుణములు పుట్టును. అపుడు వారిని కనుఁగొని యడిగినచో 'నేనుఇచ్చినమందు నీతత్వమునకు సరిపడలేదు. మఱియొకటి చేసియివ్వవలయు'నని మరల నౌషధము చేయు కర్చులకు గా డబ్బులాగును. అపుడును నేదోయొకటిఇచ్చును. దానివలననయిత ము కుదరనిచో మఱియొకటి చేయవలయునని చెప్పును. వ్యాధిగలవారు యీప్రకారము రెండుమూడుసారులు చేయించి పుచ్చుకొని, డబ్బుపో వుటయేకాని వేఱుగుణము లేకపోవుటవలన నతనివలన నివృత్తికానేరదని ఇప్పటికి బుద్ధితెచ్చుకొని మానుదురు.

ఈతరగతిలోనివారు మఱికొందఱు అరచేతిలో వైకుంఠముచూ పువారివలె రోగి చావసిద్ధమైయుండినను, నాడిపరీక్షించి 'ఫరవాలేదు. ఇపుడు మంచిమందువాడినయెడల రోగమభిముఖముకాగలదు. మందు మాత్రము తగినదిగాయుండవలెను, అటులచేసినచో ప్రాణభయము

లేదు ఆలస్యము జేయక వెంటనే సంగ్రహముచేసి వేయవలయును' అనిదృఢముగాచెప్పి మందుకుగా నూటలో యేబదియో కర్చుపట్టునని బెట్టుగా వారియొద్ద డబ్బుపుచ్చుకొనును. పాపము! రోగము నివర్తించి రోగి జీవించుననెడియాశతో ఇంటివారు తమకది విపత్సమయమగుటవలన యోచనచేయక వాఁడడిగినంతయు నిచ్చి 'అయ్యా! శీఘ్రముగా తయారుచేసియివ్వండి' యని ప్రార్థింతురు. వాఁడుయింటికిపోయి, యంగడిదినుసులెవ్వియో ౨ అణాలకు దెచ్చి మెత్తగానూరి దానినిపదిలముగా డబ్బిలో పెట్టుకొని వచ్చియిచ్చును. అదియిచ్చి వాఁడువాకిలిదాఁటుటకు లోపలనే రోగి మృతినొందును. ఇంటివారాదుఃఖముతో నుండుసమయమున యాఘనవయిద్యుఁడు మెల్లగా నచటనుండిజారి తడవుచేసినచో యింటివారేమిచెప్పుదురోయని బిరబిరకదలిపోవును.

జనులారా! ఇప్పుడు మనదేశములో వయిద్యులమని పేరుబెట్టుకొని తిరుగడివారిలో నూటికి తొంబదిమంది ఇటువంటివారలే! వారికి రోగలక్షణములు కనుగొనుశక్తిగాని నాడీపరీక్షచేయుటకుగాని యవుషధములుచేయుటకుగాని బొత్తుగా తెలియదు. అయినను సర్వముదెలిసినయట్లునటింపుచు సమయానుగుణ్యముగా మాటలాడి జనులనునమ్మించి ధనాకర్షణకు దారివెదకుచుండుదురు. మిక్కిలిశిక్షితజ్ఞవేత్తలవలె బలుకు వారిమాటలు నిజముగానుండుననినమ్మి రోగులువ్యర్థముగా ధనవ్యయముఁ జేసికొనుచుండెదరు. అంతమాత్రమేగాని లాభమేదియుంగలుగదు. అటువంటివారు చెప్పెడిమాటలుగాని, వారొసంగుమందులుగాని, వట్టిమోసమేగాని వేఱుకాదు. కాఁబట్టి అవుషధము పుచ్చుకొనదలంచినపుడు, అనుభవముగలవాఁడును, హస్తవాసిగలవాఁడును, దురాశాపరుఁడుగానివాఁడును, బుద్ధిమంతుఁడునునైన వయిద్యుని విచారించి యతనియొద్ద పుచ్చుకొనుట శ్రేయస్కరము. వయిద్యనామధారులందఱును తెలిసినవారలేయనియెంచి వారిచే మందుదీసికొనినపక్షమున డబ్బుబోయెడిమాట యట్లుండగా యామందువలన మఱికొన్ని దుర్గుణములు కలిగి వానిచే బాధపడవలసివచ్చును. ఇదిదృఢమైనమాట. ఈవిషయమున జాగరూకత కలిగిమెలంగినచో అవుషధములవలన సుగుణములుగలుగును, ఆరోగ్యవంతులగుదురు.

గీ. అశ్వినులవంటి వయిద్యుల మనుచుఁ జెప్పి
యొక్కటియుఁ దామెఱుంగక యున్నఁగాని
తెలిసినట్లునటించిరో గులకుమందు
లొసఁగి యర్థంబుఁగొనువారి దెసఁగనకుఁడు.

---

# జోణంగులుచేయు మోసము.

మహమ్మదీయులలో జోణంగులనుజాతి యొకటికలదనుట నందఱునెఱుంగుదురు ఈజాతికిచేరినవారు, పాత్రసామానులను విక్రయించుట ముఖ్యవ్యాపారముగా చేయుచుండెదరు. వీరలుచేయుతంత్రములు తెలిసికొనుట మహాకష్టము గొప్పపట్టణములందును, గ్రామములయందును తిరిగి, ప్రాతవగు ఇత్తడి, రాగి, కంచు, ఇత్యాదులగు పాత్రములను, క్రొత్తవానిని నిచ్చి మార్చుకొనిగాని, ఖరీదునిచ్చిగాని తీసుకొందురు. వీరుయితరులయొద్ద కొనునపుడు పై లోహములు సాధారణముగా విక్రయింపబడుచుండువెలలో యెనిమిదవవంతుఖరీదు. అనగా బజారులో క్రొత్తయిత్తడి సేరు ఎనిమిదిఅణాలుగాయుండినయెడల అధరపైతమలాభముఁజేర్చి సేరు పదియణాలప్రకారము లెక్కచేసి క్రొత్త పాత్రములిచ్చి యాఖరీదునకు చెల్లుగా సేరునకొకటిన్నరయణాలో, రెండున్నరయణాలో లెక్కకట్టి వారి లెక్కప్రకారముగా రావలసిన ప్రాత యిత్తడిని కొనుగోలుచేయుదురు. ప్రతిలోహము విషయమునను, వీరిటులనేగావింతురు. సాధారణముగా మనగృహములలోని యాడవాండ్రు తరమనవేసి మెఱుగుపెట్టి వీరుకొనివచ్చువివిధములైన పాత్రములనుంజూచి వానింగొనవలయుననెడియాశతో, తమకుఁగలిగెడి నష్టమును కొంచెమైనయోజింపక. యెట్టిగట్టిపాత్రమైనను సరే! యెచ్చోటనైన నొక్కింత రంధ్రముకలిగియుండినయెడల దానినొకయణానిచ్చి యతికించినచో యెన్నిదినములో వాడుకొనవచ్చుననుట మఱచి జోణంగులకు మార్చి క్రొత్తవితీసుకొనుటకు యత్నింపుదురు. అపుడుపదిసేరుల తూనికగలదయిన ప్రాతతపిలెసేరు 1కి రు 0-2-0లు ప్రకారముగా ధరకట్టి రు 1-4-0లు అనిచెప్పి తాముతెచ్చినగిన్నెయో, మఱియొక చిన్నపాత్రమేదియో యొకటిరెండుసేరుల తూనికగలదానిని సేరు 1-కిరు 0-10-0లు

ప్రకారం లెక్కచేసియిచ్చి సరిపెట్టుదురు. "ఏమి సాయెబూ! అంగటి వాండ్రునేను మంచియిత్తడి యేఅణాలు ప్రకారమిచ్చుచుండగా మీారు పదియణాలని చెప్పెదరు. చాలా వ్యత్యాసముగాయున్నది. ప్రాతయిత్తడి వాండ్రునేను నైదణాలవంతున తీసుకొందురు. మీారు రెండణాలెక్కువ పుచ్చుకొనుట లేదనెదరు. రెండువిధములును మాకు చాలా నష్టముగా నున్నదే!" యని యడిగినచో నప్పుడు "ఎన్నాంగో! అప్పిడిచొల్లిగిరీరేగే! అదుంయిదుం సూపండి అవర్ సుద్దమోసం. ఇది యిప్పిడి లేదు. గట్టియిసుక్కుం, కరచ్చికయిల్లామెయడిచ్చి చేసినపాత్రం ఇది యదియెంగికెడైగే, అందమోశక్కారర్ కొడుప్పార్గళ్. మేము కొడుక్కలేము. ఇష్టమాయిరుందాల్ కొనండి. లేదన్నాల్ విడుంగళ్. బలాత్కారం యిల్లై" యని యఱవమును తెలుగునుంగలిపి యర్థముకానట్లు మాటలాడుదురు. వారి మాటల నవ్వడినిబట్టి యభిప్రాయముం దెలిసికొని, ముచ్చటగాయున్న వారుతెచ్చిన పాత్రములనువిడువమననురాక, ఇంటిలోయున్న యించుక ప్రాతగిలిన బోకెలన్నియుం దెచ్చి వారికర్పించి తమకుకావలసిన వేవియో కొన్ని చిన్నచిన్నపాత్రములు తీసుకొని యిచ్చినదానికిని తీసుకొనినవానికిని సరిపెట్టుకొందురు. కొందఱు తాముయిచ్చిన ప్రాతపాత్రములు కరీదుకొనిన క్రొత్తపాత్రముల కరీదునకు సరిపోవక బాకీయేర్పడి కొంతకు డబ్బునిచ్చుటయుం గలదు. జోణంగులీ ప్రకారమునా లోహపాత్రములు నంపాదించికొని పోయి వానిలో కొంచెము దృఢముగా నుండువానికి సొట్టలు లేకుండునట్లుతట్టి తెలియకుండులాగున వానికిగల రంధ్రములడికి, కావిపూసి, సొగసుగా తళిమని గీరలుపట్టి చూచుటకు క్రొత్తపాత్రమువలె నుండునట్లుచేయుదురు. వానిని క్రొత్తపాత్రముల నెలకట్టి, ప్రాతయిత్తడికో, కకిమునకో పూర్వమువలెనే యమ్ముదురు. ఆపాత్రమును వారికి స్వల్పక్రయమునకు యిచ్చినవారే మరల దానినే యధికక్రయమునకుకొనుటయుంగలదు. ఆపాత్రము వారు క్రొత్తగాచేసి తెచ్చినదని నమ్మి తీసికొందురు. కొలది దినములలోనే యాగుట్టు బట్టబయలగును. పాత్రముపైపూసిన కావిరంగుపోయి యది ప్రాతదని తెలియవచ్చును. మఱి నాలుగురోజులకు దాని యతుకులుపోయి నీరుకారుట ప్రారంభించును. కనుపడినప్పుడు వారినడిగినచో "ఎన్నాపేచ్, యెంతో యాపా

రం సేసుకోం, యెవరుం సెప్ప లేదు. మేము మోసకారనా? ఇది మరి యాదయిన్లై, నూసిదాక వాంగినీర్ కాదూ? ఇది యెన్నాయని సెప్ప తారు" అని జగడమునకు దొడంగుదురు. వారితోడ పోరాడజాలక తమ యవివేక మటులనై పడని గ్రుక్కిళ్లు మ్రింగి మిన్నక పోవుదురు. సంపాదించిన ప్రాతసరుకులో పైనిచెప్పిన ప్రకారముగా నుపయోగించినవిగాక తక్కిన లోహములకరగించి యవియన్ని వేఱు వేఱురకములుగా వివిధములగు పాత్రములు తయారుచేసి మఱియొక జట్టుగోతములో యాపాత్రములు వేసి వీపులకుకట్టుకొని గ్రామములలో విక్రయింతురు. వీరుచేయునది ముందుచెప్పినవారిపద్ధతి కాదు. ఇది వేఱు, ఎట్లనగా—వీరు వాయిదా పెట్టుకొని పాత్రము లప్పుగాయిచ్చి లెక్క వ్రాయించి తీసుకొనిపోవుదురు. అప్పుఇచ్చెదరని తెలియగానే ఇంటింటి యమ్మలక్కలును వారినిచుట్టుకొని తమకుతమకు కావలసినవానిని తీసుకొని, న్యాయమైన ఖరీదుకంటె యెన్నోరెట్లు యెక్కుడుగా వారుచెప్పినప్రకారం ధర తీర్మానించుకొని తమయిండ్లలో మగవారికి తెలియకున్ననువారిపేరులుచెప్పి లెక్క వ్రాయించి యిచ్చి పాత్రములు కొనిపోవుదురు. రెండు మూడు మాసములో, మూడునెలలో, యేర్పాటుచేసుకొనిన గడువు ముగియగానే జోగులంగులు బాకీలు వసూలు చేయుటకువచ్చి వారింటిలో దైవమువలెనా కిటుకూర్చుండుదురు. వారలంగని యీ సరకును నేనెఱుగను నన్నెటుంగని యింటి యజమానుడు "ఏలవచ్చితి"రని యడిగినచో "బాకీ కొడుక్క వేణుం. ఇదిగో కణక్కు సూడండి" యని తనపేరట వ్రాసియుండు లెక్క జూపుదురు. తానెఱుంగని యీవిషయమును గురించి యతండాశ్చర్యమొంది, లోపలికరిగి భార్యనుజూచి "ఈజోలంగు లేలవచ్చిరి? వీరికి బాకియెక్కడిది? నాపేరిట లెక్క నెవ్వరు వ్రాయించినారు?" అనియడిగినచో యామె మొగము చిట్లించుకొని "ఇది బాగానేయున్నది. ఈమేశమెప్పుడు నుండునదియే కాని క్రొత్తగాదు మీరు పాత్రములు తేకున్నచో యెట్లుజరుగుననుకొన్నారు! ఆకష్టము మీరెఱుంగుదురా? ఇప్పుడు వంటచేయుచున్న తపిలయు కళాయిపూయించిన పెద్దగిన్నెయు, నెచ్చటినుండి వచ్చినవనుకొన్నారు? కష్టమున కోర్వజాలక యాయూరివారందఱుం దీసుకొనుచుండగా, యెన్నో కావలసియుండియు మీరేమందురో యని సందేహించి ముఖ్యముగా కావలసిన యారెండును

మాత్రము తీసుకొన్నాను. లెక్కమీపేరటగాక యాడుదానవగు నా పేరటనా? వ్రాయించవలసినది. ఏదైనను ఇచ్చినవారు బాకీయడుగవచ్చినయెడల యీపోరు సదాకలిగి యుండునదియే! యేదో యొకవిధముగా వారిబాకీ గుట్టుగాయిచ్చి పంపివేయండి" యని కడువేసటతో పలుకును. యజమానుడా మాటవిని "అయ్యో! ఈవిషయమును నేఁటివరకును నాతో చెప్పనే లేదే! ఇది నేనెఱుంగనే! ఇపుడు తటాలున వచ్చి వీరు వాకిట గూర్చుండిన నేనేమి చేయుదును? నాయొద్దనిపుడుడబ్బులేదు. మఱియొకనాఁడు రమ్మని నీవే సమాధానముఁజెప్పిపంపివేయుము. పిమ్మట చూతు"మనిన యామె మహాకోపముతో "ఔరా! మీమాటలు విచిత్రముగా యున్నవి. మీతో యీవిషయమును చెప్పడమునకు మఱచినాను. అది గొప్పనేరమైనది కాఁబోలు. నేనేమియుం జేయరాని కర్చులుచేసి మిమ్ము ముంచివేయలేదు. ఇంటికి కావలసిన వస్తువులు తీసుకొన్నది తప్పువనియని మీవలె మఱియెవ్వరుం జెప్పఁజాలరు. పైగా, బాకీదారులను సమాధానపఱచియో, బాకీచెల్లించియో పంపక, యాడుదానవగు నన్నుపోయి వారిని పంపివేయుమనుచున్నారు. ఈమాటవినగా నెంతో సిగ్గుగాయున్నది. మీరు మగవారై యుండి యిట్లుచెప్పడము నెవరైన వినిన నవ్విపోవుదురు. చాలుచాలు గాని వారినిసమాధానము చెప్పిపంపండి. లేదా ఇవ్వండి. ఇది మీపనిగాని నాపనిగాదు" అని గట్టిగాచెప్పును. ఇంటివాఁడు చేయునదిలేక జరిగిన విషయమును గురించి భార్యతో పెనగులాడుటవలన ప్రయోజనము లేదనియెంచి జోణంగులయొద్ద కరిగి "అబ్బా! ఇపుడు నాయొద్దడబ్బులేని సమయము. మఱియొక దఫావచ్చితిరేని మీబాకీ పూర్తిగాయిచ్చెదను కోపసపక పోయిరండు" అని చెప్పినయెడల, వారు వానిమాటలకు సన్మతింపక "ఎన్నాసామి! యార్ వన్తారు. అక్కడివల్ల కాదు. ఇచ్చివేయండి. నాంగళ్ దూరంపోవాల, పరమాట్టోం నాలుగుమాసములు అయ్యిరంది. ఎన్న సెప్పతాను? మనుబడి లేదు. అది ముడియాదు. ఇదిగా, సూహ వేష్టుం" అనికడుమూర్ఖముగా బలుకుచుందురు. సమయమునకు డబ్బులేక యిప్పటిపోయిచ్చుటకు వీలు లేదనియు, మఱియొకసారి వచ్చినపుడుగాని వలనుకాదనియుం జెప్పినచో కోపముతో 'పోఘుమాట్టోం. నాపాడుయిచ్చుమట్టుంపోము. ఇక్కడయిరుప్పోం" మని మొండి

తనముగా రచ్చచేయుచు కూర్చుండుదురు అన్నముబెట్టియైన సమాధానపఱచి పంపవచ్చునని యెంచి పెట్టబూనినయెడల వచ్చిన నలుగురైదుగురునుం గూర్చుండి తృప్తిగా భోజనముచేసి యంతటనైనం బోవక పైపంచలు పఱచుకొని వాకిట పరుండుదురు. అల్లరిఁజేయుదురు. ఇంటియజమానుఁడా యల్లరికి సిగ్గుపడి యింటిలో నుండెడి వస్తువులలో యేదో యొకటి కుదువబెట్టి వారికివ్వవలసిన మొత్తమునిచ్చి గుట్టుగా యిల్లుజొచ్చును. అంతవఱకును వారువిడువరు. ఇటువంటి దుర్మార్గుల యొద్ద తెలివిలేని యాడువాండ్రు పాత్రములు తీసుకొని నష్టపడము మాత్రమేగాక వారువచ్చిన సమయమున బాకీయిచ్చుటకు డబ్బులేక యల్లాడిరచ్చపడి ఇంటిలోని మగవారికి నయితము కష్టము నవమానముంగలుగునట్లు చేయుచుండుదురు. ఇది యెంతయు నవివేకమువలన జరుగుచుండును. పాత్రలు కొనదలంచినపుడుగాని ప్రాతదానిని మార్చఁదలంచినపుడుగాని కంచర దుకాణములకుపోయి తెలిసినవారిని ముందటనుంచుకొని, ఇత్తడిమార్చియో కరీదునిచ్చియో తమకుకావలసిన పాత్రములఁగొని తెచ్చుకొనుటమంచిది. కాని యిటువంటి యవ్యక్తపు బేరములు చేయుట యుక్తముకాదు. ఒకటికి పదంతను లాభమునుతీసుకొనియు పాత్రములు మంచివైననివ్వక మనయొద్దకొనిపోయినవానినే చక్కబరచి రంగుబూసి తెచ్చి మరల మనకే విక్రయించుచుండు మహామోసగాండ్రైన ఇటువంటివారితో బేరముచేసి పాత్రములు కొనుటను మానుటశ్రేయము.

గీ. ప్రాతపాత్రములకుఁగాని | వరగఁబూసి
తరమునం బెట్టితెచ్చిక్రొ | త్తవియటంచు
నక్రమంబనియెంచక | విక్రయించు
కుటిల జోణంగి పాత్రముల్ | గొనగరాదు.



# వి. పి. కంపెనీలలో చేయు మోసము.

గొప్పపట్టణములలో నెక్కడచూచినను, పుస్తకములు, మందులు, వస్త్రములు, గిల్టునగలు, వేయేల సకలవస్తువులును కోరినవారికి యితరచోట్లకు తపాలుద్వారా వి-పి (వ్యాల్యూపేబిల్)గా పంపునట్టి కంపెనీలు లెక్కకెక్కుడుగాగలవు. ఏవీధిలోచూచినను, 'వేంకటేశ్వర అండ్ కో, లక్ష్మీవిలాసం అండుకో, శారదాభవనం, భానూదయుంకంపెనీ, రాధామాధవ విలాసం బుక్ డిపో, సత్యాలయం.' అని యిటుల నేవేవియో పేరులుపెట్టి బోర్డులువ్రాయించి వ్రేలగట్టుదురు. కంపెనీప్రారంభించ బూనినవాఁడు స్వంతగృహముకలవాఁడైయున్న తనయింటను, లేనివాఁడేదైన నొకయిల్లునద్దెకు పుచ్చుకొని యందునుచూపునకేవియో నాలుగుసామానులు తెచ్చిపెట్టుకొని మిక్కిలి డంబముగా బోర్డునువ్రాయించి వాకిటగట్టి యెచ్చటనైన యేబదిరూపాయలేదో యొకతంత్రముచేసి యప్పుతెచ్చి, యితరులయొద్దను బజారులోనను దొరుకు వస్తువుల పేరులన్నియుసేకరించి కేటలాగుగాముద్రించి, పోస్టేజికివెను దీయక యాక్యాట్లాగుల నూరూరునకును తానుగానే గ్రామమునసబుల పేరనో, కరణముల పేరనో, వినిగాని కనిగానియుండిన మఱియేప్రసిద్ధుఁడగు పెద్దమనుష్యునిపేరనో పంపును. వారాక్యాటలాగులను చూచినచో "యందు మాయొద్దదొరకు సకలవస్తువులును, మిక్కిలి శ్రేష్ఠమయినవియు, సన్నకమయినవియునునై చూచుటకు నాణెముమించియుండును. ఇవియన్నినితరులయొద్దదొరకు బూటకపు వస్తువులవలెగాక మేముస్వయముగా యార్డరుయిచ్చి మాకొఱకు ప్రత్యేకముగా తయారుచేయించి, ఇంగ్లండు, జర్మనీ, అమెరికాదేశములనుండిరప్పింపబడిన యుత్తమమైనవి. మాసరకునాణెమును, మాసత్యమును నందఱునుఁదెలియుటకై మేముపంపెడి సామానులపై లాభమపేక్షింపక యీనెలాఖరువరకును తెప్పించుకొనువారల కసలువెలలకే పంపుచున్నాము. త్వరపడి తెప్పించుకొనుఁడు. లేనిచో ఆశాభంగముకలుగును. ఈమంచిసమయమును కోలుపోవకుఁడు' అనిముఖపత్రమున వ్రాయబడియుండును. మఱియొకపుటలో కంపెనీరూల్సులు ఈక్రిందివిధముగా వ్రాయఁబడియుండును.

1. మాయొద్దనేవస్తువుగాని, గ్రంథములుగాని కావలయునని

కోరినవారికి, వారుఆర్డరుపంపిన వెంటనే తడవుచేయక, వి-పి పోస్టుద్వారా యాసామానులను జాగ్రతగా ప్యాకీచేసిపంపుదుము.

2. ఏదిగాని మాయొద్దనుండి రప్పించుకొనెడివస్తువు ఒకరూపాయకుతక్కువ వెలగలదిగా యున్నయెడల యట్టిదానిని, వి. పి గా పంపజాలము.

3. పదిరూపాయల కెక్కుడువెలగల సామానులుకోరెడివారువారి యార్డరుతోకూడా అయిదురూపాయలు అడ్వానసుపంపవలయును. లేని ఎడల సామానులుపంపబడవు. అడ్వానసుపంపినచో సామానులఖరీదుల మొత్తములో పంపినదిపోను మిగతడబ్బునకు వి. పి. గా పంపబడును.

4. సామానులకు ఆర్డరువ్రాసిపంపి, మేముపంపెడి పార్సలును త్రిప్పివేయకూడదు. అందువలన మాకు తపాలుచార్జిదండుగయగును. కావున అటులత్రిప్పివేయువారలు వ్రాయకుండుటయే మంచిదనియెంచవలయును.

5. మాక్యాటలాగులో కనపరచియుండునవి గాక తెప్పించుకొనదలంచినవారికి మఱియేసామానులు కావలసినను పంపగలము.

6. 25రూపాయలకుపైగా మాకార్డరు యిచ్చువారికి ఒకరూపాయవెలచేయు ఫౌంటనుపేనాగాని, సిగరెట్లుపెట్టెగాని, సబ్బుబిళ్లలుగాని, చలువకంటి యద్దములుగాని, వీనిలోకోరినదానిని యినాముగా పంపుదుము. అటులనేవియుంగోరనిచో మొత్తములో యొకరూపాయ తగ్గించి మిగతరూపాయలకు, సామానులను వి. పి చేసిపంపుదుము.

7. మాయొద్ద తెప్పించుకొనెడి యేవస్తువునకుగాని యదిమంచిదికాదని ఋజువుచేసినయెడల క్రయము వాపసుచేయుదుమని పూచీ యివ్వగలము. తెప్పించుకొనినవస్తువు మంచిదిగా యుండినచో క్రయము వాపసుయివ్వబడదు.

8 50 రూపాయలకుగాని యంతకుయెక్కుడుగాగాని తెప్పించుకొనువారికి నూటికి రు 5లుగాని, యంతవెలచేయు గడియారము మొదలగు వస్తువులలో నేదోయొకటి బహుమానముపంపుదుము.

9. రిజస్టరు చేయబడినమాకంపెనీ కేటలాగుకోరినవారికి ఉచితముగా పంపబడును. కేటలాగ్‌లో కనబఱచిన సామానులును మాయొద్దదొఱకును.

10. వస్తువులకు వ్రాయువారలు మా కంపెనీరూల్సును చక్కగా చూచి యిందుచెప్పబడిన నియమములననుసరించి, తమ పేరును, గ్రామమును, తపాలాపీసును, జిల్లాయును తాలూకాయును, వివరముగా వ్రాసి పంపవలయును.

ఇట్లు రూల్సువ్రాసియుందురు. ఇంక సామానులమాట చెప్పవలసినదియే లేదు. తరతరంపరులుగాయున్నవియు, లేనివియు, పేరులు మాత్రమెతెలింగినవియు నందు కనబరచియుందురు. వానిలో కొన్నిసామానులకు వాని గుణవిశేషములనుగురించి వర్ణించి వ్రాసియుందురు. అదియెట్లనగా—క్యాటలాగులో వస్తురూపమును తయారుచేయించి ముద్రించి ఒక్కొకచిత్రము పేరును వ్రాసి దానిక్రింద యావస్తుప్రమహిమను తెలియబరచియుండును.

అత్యద్భుతమైనది! వెలస్వల్పము!! ఫలమధికము!!!

ఎలక్ట్రిక్ బంగారపు గజ్జలయొడ్యాణము.

ఈయొడ్యాణము మంచి పనితనముకలిగి, క్రొత్తమోస్తరుగా తయారుచేయబడి బంగారపునీట్లు యివ్వబడినది. మిక్కిలియందముగను చిన్నవారికిని, పెద్దలకును సరిపడునట్లు మరలమర్చబడినదిగను, నాజూకుగా గిల్టుచేయబడినదిగా నుండును. దీనినిచూచినవారు అసలుబంగారువడ్డాణమనియే భ్రమింపగలరు. బంగారముతో చేయించి ధరించుటకు శక్తిలేనివారికి యీ వేసుకొనుటకిది మంచిసమయము. ఇవి జర్మనీలో స్పెషలుగా తయారుచేయించి తెప్పించినారము. ధనికులునయితము వీనినామములను చూచికొని వాడుచున్నారు. అపుడే తెప్పించినవానిలో మూడుభాగములు ఖర్చుపడినవి. కొలదియేమాత్రమేయున్నవి. త్వరపడినవారికి లభించగలవు. ఇట్టివిదివరకును మీరుచూచియేయుండరని దృఢముగాచెప్పగలము. మాయొద్దనొకమారు తెప్పించుకొనినచో మానత్యాసత్యములు తెలియును. ఇపుడేయొకదాని కార్డుకుయివ్వండి. పదునాల్గుక్యారట్ల బంగారమునకు మేముపూజియివ్వగలము. పోస్టేజిగాక వెలరు 8 మాత్రమే!

ఈప్రకారముగా నొక్కొకదాని క్రిందను వ్రాసి, ముకుగులు, గొలుసులు, నాగపడగలు, జడబిళ్లలు, ఉంగరములు, వంకీలు, చంద్రహారములు, కాసులదండలు, రాళ్ళుగలకమ్మలు, అడ్డీగలు, ఇవియువి

యనసేల? యెన్నెన్నివిధములగానో నగలును, గ్రంథములును, సిల్కులు, చీరలు, రవికలు, పేనాలు, బూట్సులు, గొడుగులు, ఫోటోగ్రాఫు పెట్టెలు, యెలక్ట్రిక్ దీపములు, చొక్కాయులు, మొదలుగాగల సమస్త సామానులును. వానివానిరూపములతోడను, గుణవర్ణనలతోడను,చదివెడివారి కపుడే యాశకలుగులాగున ప్రకటించియుండుదురు. వానివలననేమైనం బ్రయోజనముకలదా? యని చూచినయెడల, అయ్యో! ఆదుఃఖము వ్రాసితీఱునట్టిదికాదు. ఎవడైన క్యాటలాగునందలి వ్రాతనుచూచిభ్రమించి, యేదయిననొక నగనుపంపుడని వ్రాసి తెప్పించిన యెడల నదియిత్తడిమీఁద గిల్టుచేయబడిన దగుటచే నాలుగుదినములు కొంచెము మినమినలాడుచుండి పిమ్మట యాతల్కుపోయి యసలుయిత్తడిబయలుపడును. అటుమీఁదట దానిని పారవేయ వలసినదియేగాని దేనికినుపయోగింపదు. అసలుదానివెల యొకరూపాయయో, యొకటిన్నరరూపాయలో యుండునుగానియెక్కువయుండదు. దానిని 7-8 రూపాయలకుపంపుదురు. పైగా తపాలు, వి. పి, కర్చులుసయితమిచ్చుకోనవలయును.అటుల తెప్పించినను పదిదినములైన నవియుపయోగింపవు. వానివిషయమై పంపిన కంపెనీవారికి వ్రాసినయెడల జవాబువ్రాయనే వ్రాయరు. దూరస్థలములనుండి తెప్పించుకొనినవారు, రైలుచార్జీలు పెట్టుకొనిపోయి వారినడుగుటకు శక్తిలేకయు, శక్తియుండినను, మొదటనర్పించినదిచాలక దానికై మరలకర్చులు దండుగబెట్టుకొననొల్లకయు మిన్నకుండుదురు. ఒకవేళ నెవ్వఁడైన యాకంపెనీయున్నచోటునకు పోవలసినపని తటస్థించినచో, ఆపట్టణమునకుపోయినపుడు కంపెనీయున్నచోటు విచారించి తెలుసుకొని పోయి వారినిచూచి, యడిగినపక్షమున వారుచెప్పెడిదేమి? "ఔనండీ! మీకు దానిని వాడవలసిన పద్ధతి తెలియదు. మీయుండ్లలోనివారు, అసలుబంగారునగలువలె ధరించవలెనంటారు. అటుల చేసినమనునా? బంగారునగయేమైనను, యెపుడును వాడుచుండిన మెఱుగునిలుచునా? వేడుకగా యెపుడోయొకప్పుడుధరించి జాగ్రతగా యుంచుకొనవలయును. మాయొద్దనెందఱో తెప్పించుకొన్నారుగాని యిదివరకిటుల నడిగినవారెవరు అదిమీలోపమేగాని మాలోపముకాదు' అని సమాధానముఁజెప్పి ముగింతురు వచ్చినవాఁడామాటలువిని చేయునదిలేక "మీయొద్ద తెప్పించుకొనినవారి

యుందటికిగనియు నిశ్చయముండును. కావున ఇంతకెక్కుడులాభమునుపొందియుండజాలను" అని తనలోనాలోచించుకొనుచు వెడలిపోవుచు. పాపము! ఏమిచేయగలను? ఇట్టి ఏవస్తువు గాని యోగ్యతగుయిచ్చి పరీక్షించడనే, యంగడివీధికి గాని, సుప్రసిద్ధ కంపెనిదారులయొద్దకుగాని పోయి తమకుకావలసినవస్తువునక్కితీసుకొని దానిక్రమముగా తమకుపయోగపోను మిగతలచ్చి కొనుచుందురు. దానివిజయమైనవారు ఒకరూపాయకైయున్నచో శ్యాట్లలాగులో నాలుగురూపాయలు వేసియుందురు. ఆప్రకారముకోరినవారికి బంపుదురు. వారును, మరికొందరైన నవివేకులకుచోటునకు పోవునప్పుడు తెప్పించుకొనుట లాభమనుట యోజింపక, ఒకరూపాయక్రయము గలదియు, పనికిరాలిన రకములోచేరినదియు, పై తళుకుచే భ్రమింపజేయునదియునైన యూవస్తువునకు దండుగగా నాలుగురూపాయలను, దానికి నక్కి యనిమిదణాలు తపాలుఖర్చు యిచ్చితీసుకొని పిమ్మట తన యవివేకమునకై చింతనొందును. ఇది నగలు మొదలగుసామానులవిషయము. ఇంక మందులవిషయమునుగూర్చి విచారించితిమేని యదియంతకంటె మించినమోసమనవలసియుండును. వీనికి తక్కినవస్తువులకంటె వర్ణనయధికము. ఒక్కయౌషధమే వేయిరోగములుమాన్పుశక్తిగలదిగా వ్రాయబడియుండును. మందులపేరులన్నచో; ధన్వంతరి, అశ్వినీదేవతలు, అగస్త్యుడు, పులిప్పాణి మొదలైనవారుసయితము మెచ్చంగియుండరనిపించును. వానిగుణములు ప్రత్యక్షరూపములుదాల్చి యెదుట నిలిచినవనినే తోచును 'కామానందము, మన్మథవిలాసము, రామబాణము, సకలరోగవిధ్వంసిని, కాసరోగనివారిణి, కఫసంహారిణి, స్వేత్యరోగశమని, దద్రునాశని, జ్వరాంతకము.'' యిట్టి పేరులు వ్రాసియుండును. లేహ్యములు, భస్మములు, మాత్రలు, తైలములు, ద్రావకములు, లెక్కపెట్టుటకు సాధ్యమేకాదు. వానిని గూర్చిన ప్రకటనని క్రింద వ్రాసియుంచును.

→ అజీర్ణరోగ నివారణ గుళిక. ←

ఈమాత్రలు రసగంధకపాషాణాదులగు వస్తువులు చేర్పబడక నూటయిరువది వనమూలికలును కొన్నియంగడి వస్తువులుంజేర్చి తయారుచేయబడినవి. ఇదియొక మహాత్ముని కృపవలన మాకు సిద్ధించినది. యిటువంటి యౌషధము మరియొకటి లేదని ఖండితముగా చెప్పగలము.

చేసి యెండించి సీసాలలో లెక్క ప్రకారం వేసి మూతులకు కార్కుబి
గించి లక్కముద్ర వేసి చూచుటకు డంబముగా కనుపడులాగున
ముద్రించిన కాకితములనంటించి సిద్ధము చేసిపెట్టి లోకులను మోస
గించి దివ్యౌషధములని పంపుదురు. ఒక సామాన్యవస్తువులు తెచ్చి నూరి
సిద్ధము చేసిన మాత్రలు యివన్నియు సామాన్యులకు విక్రయింపుదురు. లేహ్య
ములు ద్రావకములు, తైలములు, భస్మములు నన్నియు నిటువంటివే
గాని వేరు కావు. ఏమందైనను సరే సూరువ్యాధులను పోగొట్టునని
వ్రాయుదురు. ఆర్డరిచ్చినవారి కాయా మందునకు తగినట్లు తగరపు
డబ్బీలును, సీసాలును, కాకితపు డబ్బీలును, నుపయోగింతురు. ఈ
వి. పి. కంపెనీ వారి మందులలో నొకదానివలననే యన్నిరోగములు కు
దురుటయే నిజమైయుండినచో లక్షలకొలదిగా ద్రవ్యము వెచ్చించి
సర్కారువారు లెక్కలేనన్ని యాసుపత్రులు లోకుల క్షేమమునకై
యుంచవలసిన కష్టము వారికి లేకపోవునుగదా! ఈమహానుభావులమూ
లముననే ప్రజల నారోగ్యవంతులఁ జేయించి వీరినెంతయో గౌరవిం
తురుగదా! అటుల జేయుచుండుట కేమికారణము? వీరి ప్రభావము
వారెరుంగుదురు. ఇటువంటి మోసము మరి యేవ్యాపారమునందును
నుండదు.

పుస్తకముల మాట చెప్పవలసినదియే లేదు. "మొండిమొగఁ
డు—దండగ పెండ్లాము—బంగారుచిలుక—రతిరహస్యములు—మో
హాశ్రమము—ఇనకతక్కిడి పేడతక్కిడి—మొదలుగాగల పేరులతో
పుస్తకములు ముద్రింపించి వానినిగురించి యెంతెంతయో శ్లాఘనలు
చేసి వ్రాసి ప్రకటింపుదురు. పుస్తకము నెం ఒక అణా యైనయెడల ఆరు
అణాలు అని ఖరీదు వేసియుండుదురు. ఈ పేరులు చూచి యేమో విం
తగాయుండునని యెవరైన సందెప్పించి చూచినయెడల నిరుపయో
గపు విషయములే గాని లేశమైనం బ్రయోజనము కలుగదు. ఇట్టి పుస్తక
ములు చదువుచున్న జ్ఞానాభివృద్ధికి బదులుగా దుర్గుణములు పట్టుపడుట
తప్ప వేరులాభము కలుగదు. ఈ వి. పి కంపెనీలవారలు తాము మ
హాన్యాయప్రవర్తకులవలెను, ఋషిపరుల మోసగాండ్రవలెను, ప్రకటిం
పుచుందురు. ఇది ఈకంపెనీల వారికలవటికును వాడుకయైన విష
యము. ప్రతివాడును, యాకరణయుండు తప్పులుచూపుచుండును. అం

దుపలన నొకరిపై నొకరు కోపగించుకొనుట లేదు. ఇందలి రహస్య మాలోచించినపక్షమున వీరిలో నొక్కఁడును న్యాయ ప్రవర్తనగల వాఁడు లేఁడని గట్టిగా చెప్పవచ్చును. వీరి వ్రాతలుగాని, వీరి నడవడి గాని, వీరుఁ బంపుసామానులుగాని, ఒకటియు నమ్మఁగూడదు. అంతయు మోసమే! ఈప్రకారము లోకులను మోసపుచ్చి యన్యాయముగా నొకటికిపదిరెట్లు వెలలేర్పఱచి వానివలన డబ్బుసంపాదించి మిద్దెలు మేడలుం గట్టించుకొని ఇంటిలో యాఁడవాండ్రకు కావలసినవన్నినగలు చేయించి మోటారుకారులు, గుఱ్ఱపుబండ్లుం బెట్టుకొని కడుడంబముగా తిరుగుచుందురు, వీరి యైశ్వర్యమంతయుం బ్రజలనేమరించి సంపాదించుటవలన గలిగినదియేకాని, కష్టపడిగడించినది ఒకదమ్మిడియైన నుండదు. ఈకంపెనీదారుల మోసపుప్రకటనలుచూచి నిజమని భ్రమపడినవారు ముఖ్యముగా పల్లెటూళ్లయందలి యమాయికులైనజనులు, తాము చెమటజార కష్టపడిగడించినడబ్బును, కొఱమాలిన సామానులకుధారబోసి, తెప్పించుకొని, తన్మూలముగా వీరిని ధనికులుచేసి, తాము నష్టముపొంది యల్లాడుచుందురు. వి. పి. కంపెనీలవారిమాయాతంత్రములు గుర్తెఱింగి వీరివలన జనులకు కలుగునష్టము తొలఁగదగిన మార్గమాలోచించి యనేకములయిన కట్టుదిట్టములను, ధర్మపాలకులయిన సర్కారువారు యేర్పఱచియున్నారుకాని, అయినను, ఆయేర్పాటులవలన నేదోయొకింతలాభముతప్ప వీరిదౌర్జన్యముపూర్ణముగా నడంపబడలేదు. కాలానుగుణ్యముగా యుక్తులుపన్ని కంపెనీలు యథాప్రకారము సాధించుచునేయున్నారు. అయ్యో! అన్యాయముగా జనులను మోసగించి తమసుఖమునే యధికమైనదిగాఎంచి పీడ్చిపీఁకుచుండు వీరిపాపమునకు భగవంతుఁడేమి దండనవిధించునో యదియెట్లుతీరునో తెలిసినదికాదు. జనులారా! మీరేదయిన నొకవస్తువును కొనఁదలంచినయెడల యదిదొరకుచోటునకు స్వయముగాపోయియో, లేకనమ్మకముగల మీబంధువులు, మిత్రులుమొదలగువారిమూలముననో, క్రమమైన విలువకుదీసుకొని ఉపయోగించుకొనుఁడు. ఈ వి. పి. కంపెనీదారులయొద్దనుండి తెప్పించినయెడల ఒకరూపాయి వెలగలదానికి యెనిమిదిరూపాయలు సమర్పణచేసి నష్టపడుటతప్ప లాభమేమియును లేదు. వీరుపంపెడివస్తువయినను మంచిదిగానుండునుగదాయని యెంచి

నను, అదికూడను లేదు. వట్టినిష్ప్రయోజనమైనది. మీరు కష్టపడి సంపాదించినడబ్బును యీమోసగాండ్ర పాలుచేయుటవలన ప్రయోజనము లేదు

గీ. సకలవిధ వస్తువులును పుస్తకములౌష
ధములు జనుల కధికమైన ధరలుకట్టి
పంపి డబ్బులాగుదురనే ర్పరులుచాల
వీ. పి. గా నేదిగాని తెప్పింపవలదు.

---

# వంటచేయు వానివలె వచ్చు వారి మోసము.

ఎవఁడైనను దంత్రగాఁడొకఁడు తానేజాతివాఁడో, యాజాతిలోనివాఁడైన, గొప్పయుద్యోగస్థునింటికిగాని ధనికునిఇంటికిగాని పోయి ఇంటియజమానునితో "అయ్యా! నాదిఉత్తరదేశము, ఒరంగల్లునివాసుఁడను, పూర్వమీజిల్లాలోయుండిన ఇచ్చటివాఁడనేగాని మాతాతగారు మాతండ్రిచిన్నవాఁడుగాయున్నపుడు ఇక్కడజీవనోపాయముగానక యెట్లోయచ్చటికిపోయి నివాసమేర్పఱచుకొని ఏదోయొకవిధముగా కాలము నుపాయముగాగడపుచు మాతండ్రికి వివాహముజరిగించి ఆయన వ్యాపారదశకు వచ్చినతరువాత కాలధర్మము నొందెను. మాతండ్రి యచ్చటివారినాశ్రయించి కాలముగడపుచుండి నేనుజన్మించి పదునాఱేండ్లవాఁడనైనతరువాత చనిపోయెను. తరువాతనేనునునాతల్లియు నచ్చట నిర్వహింపఁజాలక యిల్లుపాకిలివిక్రయించుకొని మరల నిచటనెందైనం జేరి యేదోయొకవృత్తి నవలంబించి జీవించవచ్చునని వచ్చుచుండగా మార్గమునమాతల్లికి హఠాత్తుగాయొకజబ్బుకలిగి చనిపోయినది. నావద్దనుండినయల్పధనము తత్కార్యములకు సరిపోయి యొంటరినై యచ్చటచ్చట గొప్పవారగు మీబోంట్లయిండ్లలో వంటచేయుపనిని నేర్చుకొని దానివలన జీవించుచున్నాను. ఊరూరుతిరిగి యేసంతర్పణకో, పెండ్లికో వంటచేయుటవలన సుఖము లేకున్నది. అవిఎపుడునుందొరుకు పనులుఁకావు. కాఁబట్టి మీవంటివారియిండ్లలో నెచ్చటనైనను నెలజీతము

నేర్పఱచుకొనియుండుట మంచిదనియెంచి ఇచ్చటికివచ్చినాను. మధ్యాహ్నము సత్రములో భోజనముచేసి కూర్చుండియుండగా యొకపెద్దమనుష్యుఁడు నావృత్తాంతమును విచారించి జాలిపడి మీయిల్లు మీపేరువిలాసము వ్రాసియిచ్చి మీకువంటమనిషి కావలసియున్నదనియు, నిచట నేర్పాటుచేసుకొనవచ్చుననియుం జెప్పిపంపినాఁడు. దయచేసి తమయొద్ద నిలుపుకొనుపక్షమున మీయిష్టానుసారముగా ప్రవర్తించుచు మీయొద్దనుండెదను" అనివినయముతో చెప్పెను. ఇంటియజమానుఁడు వాని మాటలువిని యాలోచించి, తనయొద్దకతనిని పంపిన పెద్దమనుష్యునిం దెలిసికొనజాలక తనలో 'ఎవడైననేమి? నన్నెఱింగినవాఁడుగా నేయుండవలయును. కానిదేని యిచటికేల వీనిని పంపును? ఆవిషయమెట్లుండినను, వంటవాఁడు మాకు కావలసియేయున్నది. ఈమనుష్యునింజూడగా చాలావిధేయుఁడుగా కనుపట్టుచున్నాఁడు. వంటయును బాగుగా చేయగలుగుననియే తోఁచుచున్నది. కాఁబట్టి యింటికివచ్చినవానిని విడిచి మఱియొకని వెదకనేమిటికి? వీనినే యేర్పాటుచేసుకొనవచ్చు'నని నిశ్చయించి వానితో 'ఔను మాకు వంటవాఁడు కావలయును. నిజమే! కాని జీతమెంతయొడిగెదవు?' అని ప్రశ్నించెను. వంటవాఁడు వినయముతో "అయ్యా! తమకు తెలియనిదేమికలదు? కష్టమును గుర్తెఱింగినవారికి నేనుచెప్పవలయునా? తమయిష్టము. ఎంతయివ్వదగునని తోఁచునో యంతయివ్వండి. మీవంటివారియొద్దనుండి మంచిపేరును సంపాదించినయెడల మఱియొకచోటునకుపోయినను, వారునమ్మి దగ్గఱఁజేర్తురు. మీదయ యుండవలయునుగాని జీతము పెద్దవిషయముకాదు' అనును. వానివినయమునకు సంతోషించి యింటియజమానుఁడు "నెలకు పదునైదు రూపాయలనిచ్చెదను. దానికధికముగా యిపుడు ఇవ్వజాలను. నాలుగుమాసములు జరిగినంతట నీనడవడిం దెలిసికొని జీతము నెక్కుడు చేసెదను. మాయింట నంతగాపనులధికమైనవి లేవు. ముఖ్యము మాకు కావలసినది నమ్మకము. నీవుజాగ్రతగా నడుచుకొనుచుండిన యెడల యుత్తరకాలమున నావలన మేలుపొందుదువు" అనిచెప్పెను. వంటవాఁడు యజమానునితో "అయ్యా! నాయోగ్యతను నేనుపొగడుకొనుట ప్రయోజనముకాదు. నడవడికపై తమకు తెలియగలదు. మీవంటిగొప్పవారికింతమాత్రము దయకలిగినదే కోటివరహాలువచ్చినట్లు. సరే! తమ

ఇష్టప్రకారముగా నేయివ్వండి. మీయందనుండెద" నని నమ్మించును. ఈపూర్వము వంటవారినివిచారించి నెలకు ముప్పదినలుబదిరూపాయల డిగినంతటను ఇవ్వనొల్లక యాలోచించుచుండిన యాపెద్దమనుష్యుఁడు మాటమాత్రముగా తనకు పదునయిదురూపాయలకే వంటవాఁడు కుదిరినందు కు సంతసించి వానిని తమయింటనుంచుకొనును. వాడు వారియింట జేరినదినములు మొదలు యజమానునికిని యింటిలోని యాఁడవారికిని మిక్కిలి విధేయుఁడై బహుజాగ్రతగా పనులుచేయుచు చేరినతరువాత నెలదిన ములకులోపలనే వారికితనయందు గట్టినమ్మకము కుదురునట్లు నటించు ను. వంటచేయుటమాత్రమే కాక యజమానుఁడు మఱియేపని చెప్పినను విసుకుకొనక చేయుచుండుటవలనను, ఇంటివారు యేదయినా వస్తువు నజాగ్రతవలన పెట్టి మఱచినచో దానిని తనసొమ్మువలె కడుజాగ్రతగా తెచ్చి వారికియిచ్చుచుండుటవలనను, ఇంటపదార్థములు స్వంతగాని వలె మితముగను, నేర్పుగను వాడుచు, గృహకృత్యములన్నియుం దానే నెరవేర్చుచుండుటవలనను, వానియందింటివారి కందఱికిని నమ్మకము ను, ప్రియమును నధికమగును. ఒకటి రెండు నెలలు జరుగగానే వాఁడే యింటియజమానుఁడేమోనని యితరులకు తోచునట్లునటించుచుండును. అప్పుడు ఇంటిలోనిస్త్రీలు వేళకుభోజనముచేసియిరుగుపొరుగున నమ్మ లక్కలను చేర్చుకొని సంబంధముకలవియు లేనివియునగు ప్రసంగములు చేయుచు, అట్టిసమయములలో తమకేదైనం గావలసినయెడల లేచి పోయి తెచ్చుకొనుటకు పాలుమాలికగలవారై పెట్టెబీగములువంట వానిచేతికిచ్చి యావస్తువుం దెప్పించుకొనుచుండుదురు. వాఁడును జాగ్ర తగా యావస్తువు దెచ్చి ఇచ్చుచుండును. క్రమముగా వానియుత్తమమైన నడవడినిచూచి సందేహములేనివారై పెట్టెబీగములనైతము తమయొ ద్దనుంచుకొనుటకు చాలనిసోమరులై బీగములు వంటవానియొద్దనే ఇచ్చి పెట్టుదురు. ఏదైనా కావలసినప్పుడు, యింటివానివలె మహాస్వాతంత్ర్య ముతో పెట్టెతెఱచి వాఁడే తెచ్చియిచ్చును. డబ్బుగాని, నగలుగాని, మఱియేవస్తువుగాని తెచ్చియిచ్చుటయు, కొనిపోయిదాచుటయు, వాఁ డే చేయుచుండును. ఇట్లు రెండుమూడుమాసములవరకును వారికిగాఢ మైననమ్మకము కలుగునట్లుచేసి, సంచినసమయముచూచి, రాత్రివేళ యందఱును నిద్రించినపిమ్మట, నెమ్మదిగా పెట్టెతెఱచి యున్నమట్టుకు

ను సొమ్ములును, డబ్బును సంగ్రహించి మూటగట్టుకొని పరారి చిత్తగించును. తెల్లవారినంతట ఇంటివారు వంటవానిం గానక వెలుపటి కెక్కడకైనఁ బోయి యుండునేమో యని కొంతతడవు తలంచుచుందురు. కాని, వాడెంతసేపటికిని రాకపోవుటవలన వారికి సంశయము కలుగును. ఇంతలో పెట్టెయున్న గదిలోనికి పోయి అదియా మోసగాడు పోవునప్పుడు మూయకున్నందున యట్లే తెరవఁబడియుండుటయు, అందు డబ్బుగాని, నగలుగాని లేకుండుటయు, వంటవాని జాడయే తెలియకుండుటయుం జూచి "నమ్మకముగా మెలంగుచుండి యాదుర్మార్గుఁ డున్నవరకును సంగ్రహించికొని పోయినాఁ"డని తెలిసికొని యాడవారలు శోకవారాశి రాగము నాలాపన జేయనారంభింతురు. వారివలన జరిగిన వృత్తాంతమును తెలిసికొని యింటియజమానుఁడు దిగులొంది, "అన్యమనుష్యుని నమ్మి వానివశమున పెట్టెబీగములనిచ్చి కొంపముంచితి"యని వానినిట్లు బిరబిరబోయి, పోలీసువారికెఱింగించును. వారు తమసామర్థ్యమంతయును వినియోగించినవానిని కనుగొనజాలరు. ఒకవేళ వానిని కనిపట్టినను పుష్కలముగా తనయొద్ద డబ్బును, నగలునుం గలిగియున్నందున యా మోసగాఁడు యేదోయొకవిధముగా కర్చుపెట్టి తప్పించుకొనిపోవును. పోగొట్టుకొనిన పెద్దమనిషి పోలీసువానిని గని యా జాడచిక్కలేదా? యని యడిగినచో "ఇంకనుం దొరకలేదు. విచారించుచున్నా"మని చెప్పుదురే కాని లేశమైనను లాభముఁ గలుగదు. పోఁగొట్టుకొన్నవాఁడు తిరిగితిరిగి నిరాశచేసుకొని కృష్ణార్పణమని తనబుద్ధిహీనతకు చింతించి నోరుమెదల్పక ఇంటికిపోవును. చూచితిరా? మోసగాండ్రు చేయుమాయలు. ఎంతబుద్ధిమంతుఁడైనను వారితంత్రములలో చిక్కుకొని యపరిమితమైన నష్టమునుపొంది యేడ్చుచుండును. కావున క్రొత్తవారిని దగ్గఱ చేర్చునపుడు వారియోగ్యతను చక్కగా గమనించికొని చనవునొసంగరాదు.

ఆ. వంటచేయువాని వలెవచ్చి ధనికుల
ఇంటఁజేరి పనులు చేయుచుండి
తనకుదొరినంత యును దాచికొనిపోవు
చెడుగులను గృహమునఁ జేర్పతగదు.

# డాఫరులు చేయు మోసము.

దేవదాసీలమని, దేవాలయములకు ముద్రలు వేయించుకొని, దేవుని సేవదప్ప వ్యభిచారాదులైన దుర్వృత్తులను తా మవలంబించుట లేదని కడు డంబముగా వలుకుచు, ఆలయములలో యుత్సవాదులుజరిగినపుడును, దేవుడు గ్రామమున నూరేగింపు జరిగినపుడును, సకలాలంకార శోభితలై దేవునియెదుట నాట్యముచేయుచు, తమకు దేవాలయమునవచ్చు రాబడియే జీవనాధారమని చెప్పుచుండు వేశ్యజాతిమహాతల్లులు సాధారణముగా నచ్చటచ్చట పట్టణములందును, పల్లెలయందును నుండుట యందఱు నెఱింగినవిషయమే! వీరు తాము చెప్పుచున్న ప్రకారము నటించుచుండెడివారని నమ్మకూడదు. సాధారణముగా వ్యభిచారవృత్తియందుండువారికంటె వీరియందే దుర్వృత్తియధికము. వ్యభిచారమే వృత్తిగాగలవారు, ఏధనికునినో, ఏయుద్యోగస్థునినో గుత్తగా యుంచుకొని వానికి తమమీఁద విడువరాని మోహమును గలిగించి డబ్బులాగి తన్మూలమున తామును తమకు సంబంధించినవారును జీవించుచుండుదురు. ఈ దేవదాసీలన్ననో, యటులకాదు. వీరి తంత్రములు, నడవడికయు వేఱు, తక్కిన వారివలె నివర్తించినచో తమ గుట్టు బయలగునని యెంచి బహుచమత్కారముగా డబ్బు సంపాదింతురు. ఇట్లు చేయుటకు వీరియొద్ద కొందఱు డాఫరుల తార్పుడుగాండ్రనుపెట్టుకొని యుండుదురు. ఈడాఫరులకు జీతము లేదు. తమరాబడుసొమ్ములో రూపాయకు నాలుగణాలచొప్పున కమీషను యిచ్చుచుండుదురు. ఇట్టి కమీషనువలననే డాఫరులు నెలకు ముప్పది నలుబది రూపాయలవంతున సులభముగా సంపాదించుకొనుచుండుదురు. వీరు యితర కార్యములు కష్టపడి తామేదియుం జేయనొల్లరు. ఇదియే తమకు సుఖమైనవృత్తియనియు, పదుగురితో పరిచయము గలిగించు గొప్పయుద్యోగమనియు భావించి దాసీల వాకిళ్ళగాచియుండుదురు. వీరుచేయువని యేమనగా-ఏదైన నొక దాసీయింటికి డాఫరువాఁడు ప్రొద్దుననే కలిగినమట్టుకును భోజనముచేసి నాణెమైనవియు, కావలసినపుడు వేషము వేసుకొనుటకుగా తయారుచేయించి పెట్టుకొని యున్నవియునైన యుడుపులను ధరించి యేదోపనిగలిగినవానివలెను, ధనికునివలెను, పట్టణములో నాలుగు వీధులుం దిరుగుచు, తనచేత జిక్కఁదగిన

వాఁడెవ్వఁడైన నుండునేమోయని వెదకుచుండును. ఎచ్చటనైననుకొంచెము మంచిస్థితిగలవారుగాతోఁచు యువకులు నలుగురుచేరి కులాసాగా మాటలాడుచుండుట కనుపడెనేని తానును నేదో పనికలిగి యావైపునకు వచ్చినవానివలె మెల్లగా వారియొద్దకు చేరును. వారి ప్రసంగముతో తనకెట్టి సంబంధమును లేకున్నను, తానుగానే కల్పించుకొని మాటలాడుటకు ప్రారంభించును. కొంతతడవు మాటలాడి, స్నేహితునివలె వారిపరిచయము కలిగించుకొని వారిస్థితిగతులన్నియు నేర్పుగా విచారించి తెలుసుకొని వారివెంటనే తిరుగుచుండును. ఇప్పటిలో తానొకగొప్ప యింటివాఁడని వారికి తోఁచునట్లు జేబులోనుండి యొకసారి పాయ తీసిమార్చి, సిగరెట్లు, చీటీలు, సోడాబుడ్లు, తాంబూలము మొదలగు వానినితీసి జారీగా వలదన్నను బలాత్కరించి వారల కొసంగియు, కాఫీ హోటళ్లకుబోయి ఫలహారములు పుచ్చుకొనునట్లు చేసి వారికి యివ్వవలసినది తానే యిచ్చియు, వారి మనస్సులను తనవంకకు మరల్చుకొనుట కెన్నితంత్రములు చేయవలయునో, యన్నియుం జేయును. వారిని విడిచిపోవుటకు మనసురానివానివలె సాయంకాలము వరకును వారినిగూడి తిరుగుచుండి యస్తమాన సమయముదాదాపుగా కాగానే ప్రసంగవశమున స్త్రీలప్రసక్తిని గూర్చి సంభాషింపుచు వారికిమిక్కిలి యుత్సాహముఁ గలిగించుచుండి యేదో నెపము సమయానుగుణ్యముగా కల్పించి సూర్యుఁ డస్తమింపగనే వారిని దోడ్కొని విలాసముగా మాటలసందడిలో యాయువకులను, తానుంబెంచి వేశ్య నివసించు వీధికి దోడ్కొనివచ్చి, యాయింటిముద్దకు రాగానే "మిత్రులారా! ఇదిగో! ఈమిద్దెటిల్లు చూచినారా? ఇది యొక వేశ్యనివాసము. ఈయింట నుండునది యాపట్టణములో కడుప్రసిద్ధురాలు, గానమునను, నాగరికత యందును, మరియాదయందును దీనిని మించినది మఱియొకటిలేదు. వేశ్యయైనను చాలా గుణవంతురాలు. వ్యభిచారమే జీవనముగా కలిగినదికాదు. దేవాలయమునకు ముద్రవేయబడినది. కావున గౌరవముగా కాలముగడుపుచుండును. అయినను, యోగ్యులైన మనవంటివా రెవ్వరైనను కోరినయెడల తగినడబ్బు నిచ్చినయెడల యటువంటివారికిమాత్రము సకృతుగా తనయొద్దకు వచ్చుట కనుమతించును. అనుమతించినను నది పరమ రహస్యము. ఇతరులకు తెలియున

ట్లుండవలయును, ఏమైననేమి? పురుషజన్మము నెత్తినవాఁడు క్షణకాలము దానియొద్దనుండిన చాలును. జన్మము పావనమైనటులనే! గాని వేఱుగాదు. ఆహా! దాని విలాసమును, ఆశృంగార చేష్టలును, తనయొద్దకువచ్చిన పురుషునిపట్ల నది నటించువిధమును, ననుభవించి చూచి తీఱవలయునుగాని మాటవలనఁ బ్రయోజనము లేదు. నెలయొకటికి యిన్నూరు మున్నూరు రూపాయలనిచ్చెద మనియు, తమయొద్ద నుండవలసినదనియు నెందఱో ధనికులు కబురుబంపినను, తన నియమమునకు భంగముగా నుండుననియు, తనకు ధనము ప్రధానము కాదనియు, గుత్తగత్తెగా నుండుటకు సమ్మతింపక నిరాకరించెను. ఎంత బుద్ధిమంతురాలై యుండునో దీనినిబట్టి గ్రహింపవచ్చునుగదా!" యని, దాని గుణములును, నడవడికయు, మరియాదయు, రూపమును, కడుచాతుర్యముతో వర్ణించి వారి చిత్తములు మోహాయత్తములగునట్లు చేయును. ఉదయమూఁదిగా తమతోఁ గూడాయుండి మనసుగలిపియున్న యామనుష్యుని మాటలన్నియు, సత్యములనియు, యావేశ్యయొక్క వృత్తాంతమంతయును వాఁడు బాగుగా యెఱింగియున్నాఁడనియు, వాని మూలమునఁ నొకనాఁడు రాత్రి దానియొద్దనుండి రావలయుననియు వారికిబుద్ధిజనించును. అంతట వారా డాఫరుగానిం జూచి "మిత్రుఁడా! నీవు సర్వవిషయములుఁ చక్కగా యెఱింగియున్నట్లు తోఁచుచున్నది. దీనిపేరేమి?" యని నవ్వుచు నడుగుదురు.

డాపరు:—దీనిపేరు మోహాసం రూపమునకు తగినట్లే కుదిరినది పేరు.

యువకులు:—నీకు చాలాపరిచయము కాఁబోలు. ఎప్పుడైనా—

డాపరు:—ఆమాటలెందుకుగాని మీలో నెవఁడైనా నేటిరాత్రికి—

యువకులు నవ్వుచు, ఔను? ఎట్లులభించును. ప్రస్తుతము మాయొద్దచాలినంత డబ్బులేదు "పయికం లేనివాఁడు పరస్త్రీవర్జితుఁడు" అని సామెతకలదుకదా! 'ఏమిచేయవచ్చును? మఱియొకనాఁడు చూచుకొందము' అని చెప్పుదురు డాపరు. "అట్లుకాదు. దానినిమీలో నెవఁడో యొకడునేఁడుచూచి తీరవలయును. సంస్కారము చూచినపుడుగాని నామాటలుసత్యము మీకు తెలియదు." అనిచెప్పి వారిలోఁ గొంచెము నాజూకుగలవాఁడైన వానినిచూచి "నీవు నేఁడుపోయిరమ్ము. డబ్బునకై యాలోచింపవలదు. ఇదివఱకుంచిన [illegible] వయసులో అనుభవించకున్న యెడలనే

మిం ప్రయోజనము? సరే! కాని నీయొద్ద నెంతడబ్బున్నది?

యువకుడు:—నేను నాలుగురూపాయలుమాత్రము తెచ్చినాను. అవియే నాయొద్దనున్నవి. దానికికట్న మెంతయియ్యవలయును?

డాపరు:—అదికొంచెమధికముగానే యగునని తలంచెదను.

యువ:—ఎంతమాత్రమగునని తోచును? చెప్పుము?

డాపరు:—కనీసము యేబదిరూపాయలైన నివ్వవలసియుండును.

యువ:—అబ్బా! యేబదిరూపాయిలా! ఎక్కడనున్నవి?

డాపరు:—వెధవరూపాయలు. యేబదిరూపాయలనగానే భయపడెదవేల? డబ్బును మనము సంపాదించెదము కాని అది మనల సంపాదించునా? అయిననేమి? నూరురూపాయలిచ్చియైనను నొకరాత్రి దానియొద్దనుండివచ్చినవానిదే పుణ్యము, నేనసలు కావలసిన పాయలనిచ్చిపంపుదునుగాన మాయిల్లు చాలాదూరముననున్నది. నీయొద్దనాలుగురూపాయలున్నవిగదా. ఈతక్కినవారియొద్ద నేమైననుండునా?

యువకుడు స్నేహితుల మొగముచూచినవ్వెను. వారాయువకునితో "నవ్వడమెందుకు. ఇష్టమున్నయెడల రాత్రికిపోయియుండి రమ్ము" అని చెప్పి "నాయొద్దనైదురూపాయలున్నవి కావలసిన నిచ్చెద" నని యొకడును "రెండురూపాయలున్న" వని యొకడును, తనయొద్ద "నాలుగురూపాయలున్న" వని యొకడునుం జెప్పుదురు. డాఫరు వేశ్య ఇంటికి పోదలంచినవానినిచూచి. 'వీరియొద్దయున్నవరకునుం దీసుకొనుము పదునైదురూపాయలైనవిగదా? ఇదిగో నాయొద్ద నైదురూపాయలున్నవి ఇచ్చెదను. అని జారీగా జేబులోనుండితీసి వానిచేత బెట్టును. తక్కినవారలును తమయొద్దనుండినంతవరకు నొసంగుదురు. అంతట డాఫరు తక్కినవారింజూచి 'మీరుయిండ్లకుపొండు. నేనితనికూడాయుండి మాట్లాడి కుదురుబాటుచేసి పంపిపోయెదను. రేపటియుదయము యేడుగంటలకందఱమును, ఈదినముండివచ్చినతోటలో కలుసుకొందమనిచెప్పి పంపివేయుదురు. పోదలంచిన యువకునికిడిచి తక్కినవారుపోవుదురు. డాపరుతనవలలోచిక్కిన యువకునింజూచి 'నీవిచట నేనిలిచియుండుము. క్రొత్తవాడవగుటచే త్వరపడిలోపలికరిగినయెడల, యెవరైనంజూతురని మోహానం కోపపడును. నేనుఁవాడుకగా వచ్చుచుం బోవుచుండు

వాఁడనఁగుటచే నన్నుచూచి యెవ్వరునుసందేహింపరు. నేనుపోయియే ర్పాటుచేసుకొనివచ్చి నిన్నుతోడ్కొనిపోయెద ‘ఏవీ! ఆరూపాయలనిటు లనిమ్ము’ అనిరూపాయలుతీసుకొని వానినివీధిలో ప్రక్కఇంటియరుగు పై గూర్చుండబెట్టి తాను వేశ్యయింటికిపోవును. ఆయువకుఁడు బిక్కి కాయలు దినినకోతివలె నచటగూర్చుండి పండ్లిగిలించుకొనుచు, వాని రాకకునిరీక్షించుచుండును. అరగంటసేపటికి డాపరుమరలివచ్చి యువ కునిజూచి, నిస్పృహజెందినవానివలె నభినయింపుచు మాటలాడక చెంతఁ గూర్చుండును.

యువకు:—ఏమిరా? కాయయా, పండా! నరేనన్నదా?

డాపరు:—కాయయుగాదు, పండునుగాదు. అటునిటుగాని స్థితిలోయు న్నది. ఏమిచేయవచ్చునా? యనియోజించుచున్నాను.

యువకు:—జరిగినవర్తమానమేమిటిదో చెప్పుము. పిమ్మటగదా యో జన—

డాపరు:—జరగడమునకేమియున్నది? అంతయుడబ్బువలననేగదా జరు గును. ఇరువదిరూపాయలు సమ్మతింపలేదు. మొదటనూఱురూ పాయలడిగినది. ఎంతదూరమో చెప్పి యేవేవియో యాసలు గలిగించి కడపట యేబదిరూపాయలకు కుదిర్చినాను. అప్పటికి తలప్రాణం తోకకువచ్చినట్లయినది. ఈగొడవవలననే యింత యాలస్యమైనది. ఇంక యేబదియు నివ్వకున్నచో లాభములేదు.

యువకు:—ఇపుడు మనయొద్ద నంతడబ్బులేదు. పోనీ! ఏమిమునిగినది. మనచేతనుండునపుడే యొకనాఁడురావచ్చును. నేనుపోయెదను. పాపము నాకొఱకు చాలాప్రయాసపడినావు. ఆరూపాయలేవీ? నీరూపాయలు నీవుతీసుకొని తక్కినవియిమ్ము చాలాప్రొద్దగు చున్నది. త్వరితముగా యిల్లుచేరెద.

డాపరు:—ఆరూపాయలు దానిచేతనే యిచ్చివచ్చినాను. ఏదోయుపా యముచేసి తక్కినరూపాయలతో నిన్నుపంపవచ్చుననెడి యుద్దే శముతో యీలాగుచేసినాను, దానితో యదేమాటచెప్పివచ్చి నాను. మరలపోయి దానిచేతయిచ్చినరూపాయల నడుగుటచా లా హీనత్వముగానుంటుంది. అదినాకుసమ్మతముగానుండలేదు.

యువకు:—అయ్యో! ఆరూపాయలుకూడా దానిచేతచిక్కినవా? ఇం

కనెట్లు? ఏమిచేయదలంచినావు? డబ్బులేనపుడిటుల యోజించి
నచో ప్రయోజన మేమైననుండునా?

డాపరు యేదోయోజించినవానివలె నటించుచు రెండునిమిషములు పలుకకకూర్చుండియుండి పిమ్మట తాను తగినయుపాయము నిశ్చయించినటుల తలయూచి నిట్టూర్పుపుచ్చి యువకునింజూచి 'నేనుచెప్పున దేమనగా యింతదూరము ప్రయత్నించి మనమునిష్ఫలముగా పోవుట యుక్తముకాదు. ఏవిధముగాని తలంచినకార్యమును సాధించితీరవలయును. విడువరాదు' అనిచెప్పెను. యువకుఁడు 'సరే! ఇపుడేమిచేయగలము? డబ్బునెవ్వరిచ్చెదరు?' అనును.

డాపరు:—ఇటులగాదుగాని, నేనొకయుక్తిచెప్పెదను. ఆలాగుచేయుటకు సమ్మతించెదవా? అదియీసమయమునకు తగినయుక్తి.

యువకు:—ఏమి? చెప్పుము. చేయదగినదియైన చేయుదుము.

డాపరు:—విశేషమేమియును లేదు. నీచేతులలోని బంగారుమురుగుల జతను యెచ్చటనైనం గుదువపెట్టి రూపాయలు తీసుకొనివచ్చి యిచ్చి యీరాత్రి దానియొద్దనుండుము. రేపటియుదయమున నేను మాయింటినుండి రూపాయలు తెచ్చి కుదువవిడదలచేసి యిచ్చెదను. పిమ్మటమనసముక్రమముగా సవరణచేసుకొందము. ఇదితప్ప యిప్పటికి తగినపని వేఱొకటిలేదు. ఆలోచింపక చేతయుండినరూపాయలు సయితము దానిచేతబెట్టి వచ్చినాను. ఏమనెదవు?

యువకునికటుల చేయుట కిష్టము లేకున్నను, నింతసేపుకాచి వృథాగా పోవుట సరికాదని తోఁచుటవలనను, ఆయువతియొద్ద నుండవలయున నెడి కోరిక యతిశయించుటవలనను, తమచేతిలోని డబ్బుకొంత వేశ్యచేతచిక్కుకొనియుండుటవలనను, యెట్లయిననునగును. అప్పటికా పనియైనం జేయవలయునని యెంచి డాపరుచెప్పినలాగున నొనరించుటకు సమ్మతించును. ఆమోసగాడు. వానిచేతి మురుగులను దీయించి తనకు తెలిసిన యొకరియింటికి బిలుచుకొనిపోయి వానినివాకిటనిలిపి తానులోనికరిగి, ముప్పదిరూపాయలు కావలసినదానికి యేబదిరూపాయలు తీసుకొని, వెలుపటికి వచ్చుటకులోపలనే ఇరువదిరూపాయలు దాచుకొని ముప్పదిరూపాయలు వానికిచూపి, అవితానేచేతబట్టుకొని ముందుగా

వేశ్యయింటికిలోనికిపోయి తత్పూర్వము లెక్కలోచేర్చిన తనతాలూక [illegible]పా పదునైదునుం గానుగొని మిగత రూపాయలు పదునైదును, కడమ వచ్చిన రూపాయలలోనివి ముప్పదియు వెరసి నలుబదియైదు రూపాయలును, మూడాసీదానిచేతబెట్టి రూపాయయొకటికి నాలుగణాలవంతున కమీషను, రెండున్నరరూపాయలు యినాముగాను దానివలన దీసుకొని యువకునియొద్దకువచ్చి 'అన్నియు నేర్పాటుచేసినాను. ఇంకనీవులోపలికి పోవచ్చును. నేటినుండి కాలము మనముకూర్చుండిన తోటయొద్దికి వచ్చితివేని రేపటియుదయము నేనునిన్నుకలుసుకొనెదను. నేనుపోయెదనని వానికిధైర్యముచెప్పి తానువెడలిపోవును. యువకుడు లోపలికి పోగానే యచ్చటనుండు వేశ్యమర్యాదచేసి కురిచీపైకూర్చుండబెట్టును. దానినిచూచి తనతో డాఘరువాడుచెప్పిన చక్కదనముగాని, లక్షణములుగాని దానికిలేకుండుటం దలంచి, యామనిషి వేఱొకతెగా యుండుననియు, తనకు మరియాదచేసినది నాయకురాలికి పరిచారికగా యుండుననియు, నాయికిప్పుడు రాగలదనియుం దలంచును గాని మఱికొంత తడవునకు నదివడినిబట్టి యసలునాయిక యదియేనని తెలుసుకొనును. అప్పుడుతనలో 'అరెరే! దీనినా? యతడింతటుల నర్ణించినాడు. ఈమోగమునకా యేబదిరూపాయలు.' అనితలంచును. పిమ్మటనది యతనియొద్దకూర్చుండి, వగలమాటలు పలుకుచు లాలనజేయ నారంభించును. దానిచేష్టలా యువకునకంతగా తృప్తికరములుగాకున్నను, 'ఏబది రూపాయలు దారబోసినపుడు, యెట్లో వచ్చినవాడను యీరాత్రిగడపి వెడలిపోవుటమంచి'దనియెంచి దానితో సమానగుణ్యముగా పలుకుచుండును. అదియిప్పటికప్పటికి నతనినమీపించి తటాలున నాలింగనమొనర్చి ముద్దుబెట్టుకొని, తత్పూర్వ మెన్నిదినములనుండియో తనయొద్దకు వాడుకగా వచ్చుచుండిన మనుష్యునియొద్ద నటించినలాగున స్వాతంత్ర్యముగా సంభాషించుచు, మోహముగలిగించి, తత్పూర్వము స్త్రీలజోలియే యెఱుగని యాయువకుని చతురతతో వశీకృతునింజేసికొని "ఏదీనీవ్రేలిలోయుంగరము నావ్రేలికిపట్టునో పట్టదోచూచెద"నని తీసి తనవ్రేలధరించి నవ్వుచు 'సరిపోయినది. ఇదినాదేకాబోలు. నాదిగాపుననే, నాయొద్దకువచ్చినది' సల్లాపము బలుకుచుండును. దానిచేష్టలవలన నివ్వెఱనొంది యితడేమియుం బలుకజాలక శిలావిగ్రహ

మువలెనుండును ఇట్టులనుండు సమయములో పనికత్తె ఒకటి రోజుచు పరుగెత్తివచ్చి యావేశ్యనుచూచి 'అమ్మా! మోసము. ఆయనవచ్చుచున్నాఁడు మోటారునుండి దిగి వాకిట నెవరితోడనో మాట్లాడుచున్నాడు. పైన నీయిష్టము' అని చెప్పెను. ఆమాటవినగానే, యామాయలాఁడి యులికిపడి యువకునిచూచి వేగిరపాటును భయమును నతిశయించినట్లు నటించుచు, యువకునిచూచి ''అయ్యా! మేము దేవధాసీలము. మేము వ్యభిచారవృత్తి నవలంబింపకూడదని నియమము ఐనను ప్రపంచముగదా! యౌవనసుఖము నెవ్వడైననొకనాడైన ననుభవింప వలయునని కోరికపుట్టును. దానికొఱకే ఎవరైన మీబోటి యోగ్యులైనవారిని రహస్యముగాచేరి మాకోరికఁ దీర్చుకొనుచుందుము. ఇటీవల నొక పెద్దమనుష్యుఁడు నాయాటపాటలు చూచి నాయందు మోహముగొని చెప్పిపంపెను. నేను మాకట్టుబాటును తెలిపితిని. ఆయన తాను ప్రతిదినము వచ్చుట లేదనియు నాలుగైదురోజుల కొకనాడు ప్రొద్దుపోయినంతట రహస్యముగావచ్చి తెల్లవారుటకు పూర్వమే పోవుచుండుననియు, నాయందు తనకు యెక్కుడు ప్రియముగలదనియు, నేను కోరినంతడబ్బు నిచ్చుచుండుటకు సమ్మతింతుననియు నెన్నెన్నియో యుక్తులుపన్ని తుదకు తనకులోఁబఱచుకొన్నాఁడు. చెప్పినట్లే ౫-౬ రోజులకొకసారివచ్చుచుం బోవుచుండును. అతఁడురానిదినములలో మీవంటివారలెవ్వరైన నపేక్షించినచో నిరాకరింప జాలక సమ్మతించుటకలదు. నేఁడురాఁడని తలంచినాను. తలవనితలంపుగా వచ్చినాఁడు. లోపలికి రావడము ఇతరులకు తెలియకూడదుగాని వాకిట నెవరోకనుపడగా వారితోమాటలాడుచున్నాఁడట, మాటలాడుచున్న వాఁడటుపోగానే లోపలికి వచ్చును. అతడు కడుదుర్మార్గపు స్వభావముకలవాఁడు. మనలచూచెనా? యిరువురకును ప్రాణముమీఁదికివచ్చును. కోపమొందక శీఘ్రముగా యతనికంట పడకతప్పించుకొని ఇంటికిపొండు. రేపుగానియెల్లుండిగానిమఱియొకనాఁడు మీరురావచ్చును. ఆలస్యముచేయవల'దని త్వరపెట్టును. పరిచారిక మరలవచ్చి వచ్చుచున్నాఁడని చెప్పెను. వేశ్య మఱియుభీతిచెందినదానివలె యతనినిచూచి 'లేవండి లేవండి! ఇంకనాలస్యముచేయవల'దని పరిచారికతో ''పాపము! చాలాయోగ్యుఁడు. వచ్చినందుకు నేఁడుప్రయోజనము లేకపోయినది. అయినను ఫరవాలేదు. మఱియొక

నాఁడు రావచ్చును. మునిగిపోయిన దేవియును లేదుగాని, క్రొత్తవాఁడగుటచే కనుఁగొనజాలఁడు. కావున వేగిరముగా నీయువను పెరటిదారి నుండి తోడ్కొనిపోయి వీధిలో విడిచిరమ్ము, పోపో" యని చెప్పెను. యువకుఁడేమో చెప్పదలంచినను, మాటలాడనీయక తొందరచేయును. ఇంతలో జాపగువాఁడు, వారుచెప్పిన మనుష్యుఁడు లోపలికి వచ్చుచున్నట్లు తోఁచులాగున సడికలిగించును. ఆచప్పుడువిని యటువంటి కఠినగండ్లపని యెన్నఁడును యెఱింగియుండని యాయువకుఁడు భయమొంది ప్రాణములు తప్పించుకొని బ్రతికినచాలునని పరిచారికవెంట బిరబిర వెడలిపోవును. వారుచేయు తొందరవలనను, భయమువలనను, అప్పటిలో తానుయిచ్చిన రూపాయలనుగురించి కాని తన వ్రేలినుండిలుకొనిన యుంగరమునుగురించి కాని తలంపఁడు. పరిచారిక యతనిని వీధిలోనికి పంపి దొడ్డితలుపు వేసికొని లోపలికి పోవును. పిమ్మట వారు హాయిగా పడుకొని నిద్రింతురు. ఆయువకుఁడు రూపాయలను, చేతిముఱుఁగులను, వ్రేలి యుంగరమును బోఁగొట్టుకొని యప్పటి చాలారాత్రి యగుటవలన నొంటిగా చిక్కులుపడి యెట్లోయిల్లుచేరి తెల్లవారునంతవరకును, తనకు సంభవించిన కష్టనష్టములను గురించి తలపోయుచు నిద్రపట్టక యల్లాడుచుండును. మఱునాఁటి యుదయమున తనయింటిలోని పెద్దవాండ్రు ముఱుఁగులు నుంగరమును చేతుల లేకుండుటకనుగొని కోపగింతురని భయపడి దొంగలరా ముష్టైన దాపకుచెప్పిన సంకేతస్థలమునకుపోయి యప్పటికిని వాఁడొక ధనికుల యింటివాఁడనియు, చెప్పినలాగున రూపాయలు తెచ్చి యిచ్చుననియు, ఆరూపాయలుయిచ్చి చేతిముఱుఁగులను తీసుకొని యుంగరము స్నేహితులకిచ్చినానని యింటిలో చెప్పవచ్చుననియు యెంచి నిరీక్షించుచుండును. గాని వాని దర్శనమే మరలకానేరదు. మఱి కొంతతడవునకు మొగనాఁటి సాయంకాలము చేసికొనిన యేర్పాటుప్రకారమూ యువకుని స్నేహితుఁడుచటికివచ్చి జరిగిన వృత్తాంతమంతయు వానివలనఁ దెలిసికొని వెలవెల బోవుదురు. వారిలో బుద్ధిమంతుఁడగువాఁడొ విషయమును గురించి యోజించి తక్కినవారిఁజూచి "ఇది యంతయు మహామోసముగా తోఁచుచున్నది. ఇంక దీనినిగురించి ప్రయోజనములేదు. ఎవరితోడనైనం జెప్పుటకును యోగ్యమైన విషయముగా నుండలేదు. పోయి

నది పోయినప్పట్టేగాని దానినిగూర్చి వ్యసనపడుట నిష్ఫలము. ఇపుడు ముఖ్యముగా పాపము! ఇతని సొమ్మువచ్చుమార్గము చూచుటమంచిది. ఆ మోసగత్తె చేత యిచ్చిన యుంగరమును రూపాయలును మనకు లభింప బోవునది లేదు. కాని మురుగులైన తెచ్చి యితనికి పెద్దవాండ్రచే యుపద్రవము చేయుట కర్తవ్యమని చెప్పెను. అంతట వారు నానా చిక్కులుంబడి మున్నూరురూపాయలు జమచేసి మురుగులు కుదువయుంచిన యింటికిపోయినయెడల తమయొద్ద తీసుకొనినది యేబదిరూపాయలుగాని మున్నూరుకాదనియు, మొత్తమంతయు నిచ్చిననేగాని మురుగులజత నివ్వజాలమనియుం జెప్పి డాపరు వ్రాసియిచ్చిన లెక్క చూపుదురు. "ఆమనుష్యుఁ డెవఁడో మీకు తెలియునా?" యని యడిగినయెడల వానిని తామెఱింగినవారయ్యు తమయొద్ద వాఁడుకగా యట్టివ్యాపారముఁ జేయుచుండువాఁడగుటవలన, వారా డాపరువానిని ఫలానివాఁడని చెప్పనేచెప్పరు. "అతఁడెవరో మేమెఱుంగము. మేమాయువకునిచూచియే యిచ్చినాము" అని పలుకుదురు. అంతట వారలు మరలిపోయి పడరాని కష్టములుపడి స్నేహితుఁడైన యాయువకుని రక్షించుట ముఖ్యకార్యముగా నెంచి కొఱవ రూపాయలు తెచ్చి వడ్డితో చెల్లించి మురుగులం దీసికొని దొంగకు తేలుకుట్టినచందమున గుక్కురుమిక్కురు మనక దాదాపుగా నూరురూపాయలు పోఁగొట్టుకొని యిండ్లకు పోవుదురు.

ఆ వేశ్య యింటిలోనుండి వెడలనను ప్రయత్నించినపుడు దానికొఱకు పోయినవాఁడు కొంచెము ధైర్యవంతుఁడును, బిరుసుదనము గలవాఁడునుగాయుండి దానితో "నాడబ్బును నాకిచ్చివేయుము. లేనిచో పోఁజాలను. నేనెవ్వరికిని భయపడవలసిన నిమిత్తము లే"దని కొంచెము ముష్కరముగా బలికెనేని, యట్టి సమయములలో నుపయోగించుటకై తయారు చేసుకొనియుండు షోదాలనురావించి చక్కగా మర్దించి మఱియు నేమైనా వానియొద్ద నుండినచో లాగుకొని, యక్రమముగా లోపల ప్రవేశించినాఁడని మెడబట్టి వెలుపటికి నెట్టించుటయో, తమయింటిలోని దొక పాత్రముతోకూడా వానిని పట్టుకొనిపోయి ఈ పాత్రమును దొంగిలించినాఁడనిచెప్పి పోలీసువారి కొప్పగించుటయో యేదో యొకటి చేయుదురు. అది వేశ్యయగుటచే దాని మాటకుగల

విలువ ఇతరుల మాటకుకలుగదు. అందఱును దానికే యనుకూలము గా బలుకుదురు. అపుడు డబ్బుపోయినది చాలక నలుగురిలో నవమానము నయితము సిద్ధించును. పాపాత్ముఁడైన యాజాఫర్ యివ్విధముగా మోసముచేసి డబ్బు నూడదీసి వేశ్యకిప్పించి తానును సంపాదించుకొని, మఱునాఁడా వేషమునుమార్చి వేఱువిధముగాధరించి మరల నటువంటివారిని చిక్కించుకొనుటకై తిరుగుచుండును. ముందు తనవలన మోసగింపబడినవా రెవరైనం గనబడినయెడల వారికిమొగముచూపక తప్పించుకొని జాఱిపోవుచుండును. ఎటువంటివాఁడైనను యీజాఫరుల మాటలనునమ్మి వారివలలోచిక్కి మిక్కిలి నష్టమును పొందుదురు. ఇటువంటి పాపాత్ములైన జాఫర్ మోసగాండ్రుప్రతివేశ్యాగృహమునను యిద్దఱుగాని ముగ్గురుగాని కాచుకొనియుండుదురు. వీరికి లేశమైనను ధర్మచింతగాని కనికరముగాని యుండనేయుండదు. ఇటువంటిపనులు గొప్పపట్టణములలో సదా యెన్నో జరుగుచుండును. దూరస్థలములనుండి వచ్చినవారును వివేకహీనులైన పల్లెటూండ్లవారును వీరిచే మోసగింపబడి డబ్బుగోల్పోయి యల్లాడుదురు. కాబట్టి బుద్ధిమంతులు యిట్టి క్రూరులమాటలు సత్యముగానమ్మి వీరివెంట పోవక జాగ్రతగా యుండుటమంచిది. కొన్నిసమయములలో వీరిమూలమున ప్రాణహాని నయితము తటస్థించుటయుం గలదు.

గీ. దేవదాసీలమని నిక్క ॥ తెఱవవిండ్ల
జాఫరులుజేరిమర్మంబు ॥ గా పరులును
వారితోగూడ్త మనిగొని ॥ వచ్చిదనము
గుంజుకొని పంపుదుష్టులఁ ॥ గూడతగదు.



# నగలవర్తకులుచేయు మోసము.

గొప్పపట్టణములలో నగలవ్యాపారము విశేషముగా జరుగుచుండును. "రాజమన్నారుశెట్టి అండ్ కంపెనీ, సోమనాథఅయ్యర్ అండుకో, బాలాజిసేట్ అండ్ సన్సు, నగలవ్యాపారం," అని యిట్లుబోర్డుపలకలవ్రాయించి వ్రేలగట్టుదురు. దళసరిపట్టలమీద 'ఇచ్చట విక్రయించబడు నగలకు, బంగారునకును, రత్నములకును పూచీయివ్వబడును. సమూనాయిచ్చినవారికి వాయిదాప్రకారము నాణెముగను, కూలిసరసముగను, సొమ్ములు తయారుచేయించి యివ్వబడును. మేలైన నవరము బంగారముతో క్రొత్తమోస్తరు, వివిధములైన యాభరణములును, దొరుకుచోటు' అని మరియు నేమేమియో వ్రాయించి యవియునుం గట్టియుండుదురు. ఇంటికి లోపలపోయినయెడల కడువిమర్శగా యద్దముల బీరువాలుంచి, క్రింద రత్నకంబళ్లును, జమకాణాలును పరచియుందురు. ఎలక్ట్రిక్కుదీపములు వెలుగుచుండును. విసనకఱ్ఱలు తిరుగుచుండును. బీరువాలలో, వివిధములైనబంగరు వెండినగలును, రాళ్లుచెక్కినసొమ్ములును, విశేషముగా యమరికగా దానిదానికితగిన వెల్వెట్టుపెట్టెలలోయుంచి మూతలుతెఱచియుందురు. దీపములవెలుగువలన యాసొమ్ములు కండ్లుమిరిమిట్లు గొలుపుచుండును. గాని వానిలో నిజముగా బంగారముతో చేయుబడినవియు, మంచిరాళ్లు కట్టినవియునైన నగలుపదింట నొకపాలునకంటె యధికముగాయుండవు. తక్కినవి జనాకర్షణమునకై చూపునకు గాంభీర్యముగాను, డంబముగాను తోచుచుండుటకై బంగారుగిల్టువేసి మెఱుగుపెట్టించబడిన యిత్తడిసొమ్ములును, అద్దపుబిళ్లలు, స్ఫటికపురాళ్లుంగట్టి తయారుచేసిన నగలునేకాని యితరములుకావు. అవిచూచి జనులుభ్రమించి తాముపోయిన యంగడి చాలాగొప్పదనియు, విశేషముగా వ్యాపారము జరుగుచుండుననియుం దలంతురు. అదివట్టిభ్రమ. ఏయంగడికిపోయినను, అట్లే తోచును. సాధారణముగా మనదేశములో స్త్రీలు తమకు విశేషముగా సొమ్ములు కావలయునని మల్లాడుచు, కష్టసుఖములను తలంపక తదర్థమై పురుషులను బాధించుచుందురు. ఈవెఱ్ఱితన మితరదేశములకన్నను యిచటనేయధికము. వారిబాధకు సహింపలేక యెవరైననొకడు,

భూములనడమానము బెట్టియో, గొడ్డుగోదలను విక్రయించియో, ఇల్లు కుదువయుంచియో డబ్బుతీసుకొని యేదైనా సొమ్ముకొనుటకై భార్యను వెంటబెట్టుకొని యీనగలవ్యాపారుల యంగడులలో నెందైననొక దానియందు చొచ్చునేని, యంగడి మేనేజరు చూడగానే బహుమరియాదగా 'రండిరండి! దయచేయండి యిగో కుర్చీపై కూర్చుండండి! అమ్మగారూ! ఏమికావలయును? క్రొత్తమోస్తరు గొలుసులు, గాజులు, కాసులదండలు, సరములు, వివిధములయిన మెడగొలుసులు, రవలయుడ్డిగలు, కమ్మలు, ఉంగరములు, మాటీలు, మీకేవస్తువు, యేరకములో, యెంతవెలలో యుండవలయునో మీరు కోరినవియున్నవి చూడండి. పిండికొలదిరొట్టెకదా! మీరు యెంతడబ్బుపెట్టెదరో దానికితగినట్లుయిచ్చెదము. మాయొద్ద తక్కినయంగడులందువలె దగా, మోసము, తంత్రములు యేవియును లేవు. మంచిరాళ్లకును నవరబంగారునకును గ్యారంటీవ్రాసి యిచ్చెదము. మానగలు శ్రేష్ఠమైనవని మేము చెప్పుకొనుట వలన ప్రయోజనము లేదు విచారించండి. గొప్పసంస్థానాధీశులు, ఆర్డరులిచ్చి తెప్పించుకొనుచుండుటయే మీకు నిదర్శనము. వారు మానమ్మకమునుబట్టి తాము రాకనే జాబువ్రాసి మేము పంపినంతట పయికమును మణియార్డరు చేయుదురు. ఏదైనను మిష్టికుజరిగినయెడల పంపుదురా? మాకు లాభము ప్రధానముగాదు. గొప్పపరిచయము కావలయును' అని యడుగకయే తనకుతోచినట్లంతయు, తమరియొక్కయు, తనసొమ్ములయొక్కయు, యతిశయమును పొగడి పలుకుచుండును. వచ్చినయామె యానగలనన్నిటింజూచుచు, వానిలో తనకు కావలసినదేదో యొకటి చూచి, దానిం దీయుండని చెప్పినయెడల మేనేజరు గుమాస్తాతో 'ఏమిరా! అమ్మగారేమో యడుగుచున్నారు. వెలుపటికిగొనివచ్చి కనపడచుము. అట్టె నిలిచియున్నావేమి?' యని యదలించును. వాడు బీరువ తెఱచి వెల్వెట్టుపెట్టెతో నగను తెచ్చి యామె చేతయిచ్చును. ఆమెసంతోషముతో దానిని భర్తయొద్దకు తెచ్చి 'ఏమీ? చూచినారా? నిండా బాగాయున్నది. క్రొత్తమోస్తరుసని. మొన్న మన పొరుగింటిసీతమ్మకు యీమోస్తరుదే తెచ్చినారు. కాని, అబ్బే! అదిబాగా లేదు. మోటుసని. ఈ కాలమునకు తగినట్లుండలేదు. ఇది యిప్పటికి తగినమాదిరి. దీనినితీసుకొందునా? ఏమనెదరు?' అని యడుగును. ఆమెకోరిన

యూనగయేమనిన, రవలుకట్టి పెట్టినయడ్డిక, దానిని చూడగానే, వచ్చినా యనగుండెలు జల్లుమనును. భార్యనుజూచి 'ఓయబ్బా! ఇంతవెలపొడుగు సొమ్ము తీసుకొనుటకు డబ్బు మనయొద్దనున్నదా? ఇట్టివిగొప్పధనికులు తీయవలసినదిగాని మనవంటివారికి శక్యమగునా? మనకుతగినదేదియో చూడవలయునుగాని దురాశచెందుటవలన లాభము లేదు' అని చెప్పినయెడల యామె మొగము చిన్నబుచ్చుకొని 'ఔనౌను, నేనేదైనంగావలయుననిన మీకుడబ్బు లేకపోవును. మీకు కావలసిన పనులకెంతైననుంటుంది. ఇట్టినగను ధరించి మీముందు తిరుగుచుండిన చూడముననుకును, సంతసించుటకును మీకుయిష్టము లేదుకాబోలు. తీసుకొనదలంచినపుడు యేదోయొకటి తీసుకొనినను పదుగురిలో ఘరానాగా యుండవలయునుగాని, పనికిమాలిన వెన్నియైన నెందుకు? అష్టవలుకల దీనిని తీసియివ్వండి దీనిపై మోజుగాయున్నది. అటుల ఇష్టము లేనియెడల మరేవియు నేనొల్లను. లెండి పోవుదము. ఎన్నిదినములనుండియో బతిమాలగా ఇప్పటికి నమ్మతించితీసుకొనివచ్చినారు. ఏమిఫలము? కొంచిసొమ్ము పెట్టుకొను ప్రాప్తము నాకు లేదు. నేనిటులనుండవలసినదాననే! ఇంక చాలును. కొనియివ్వడమును, నేనుధరించడమును, అయ్యెను. లేవండి!' యని చింతతో పలుకును. అంగడిమేనేజరు వారి ప్రసంగమును విని యామెకునవాయముగా యామెభర్తతో 'ఏమండీ! పాపము! ఆశపడినది తీసియిచ్చుటకు రానేవచ్చినారు. ఆమె కోరినదే తీసియివ్వండి! తక్కువధరలో తీసుకొన్నందున కలుగులాభ మేదియును లేదు. శీఘ్రకాలములో చెడిపోవును. ఇదియున్ననో, శాశ్వతమైనసొమ్ము. ఎన్నాళ్ళకును చెడదు ఎప్పటికిని యిపుడున్నట్లేయుండును. మీకువలదనితోచినపుడెవరికి విక్రయించినను, వదిరూపాయలు ఇంచుమించుగా మీరూపాయలు మీకువచ్చును. తీయదలంచినపుడు దీనినే తీయండి అమ్మగారికోరికతీరుటయు, ఇచ్చినసొమ్ము చెడకుండుటయు మీకుదీనివలన రెండులాభములుకలుగును. అంతగా యెక్కుడుధరయును లేదు. అమ్మగారు ధరించినయెడల నిండాబాగాయుండును. అమ్మా! అయ్యగారాలాగు వలుకుచుందురుగాని నామాటనువిని మీరు దీనినే తీసుకొనుడు. నేను మీకు మనస్ఫూర్తిగాయిచ్చెదను. దీనిని ధరించినపుడంతయు నన్ను దలంచుచుండగలరు'అని యొత్తిచెప్పును. వర్తకునిమాటలంవిని

యామె మనుపటికంటె యాశ యధికమై భర్తతో 'ఊరకున్నారేమి? చెప్పండి! నేను దీనినేతీసుకొనెదను. ఇది నాకుమిక్కిలితగియున్నది. ఇట్టిదానినిధరించి మీముందుచు సమురివములుంజూపుచు తిరుగరాదు గాలోలు. అయ్యో! నేను దీనినేతీసుకొనెదను. కాని మీరువెలచెప్పండి, ఈమనయెప్పుడును నిష్ఠే పలుకుచుండును' అని వర్తకునినడుగును. ఆవర్తకి ఆయననుచూచి, 'ఏమండీ! సమ్మతమేనా?' యనును. వచ్చిన మనుష్యుడు భార్యపట్టుదలనుచూచి, ప్రేమాతిశయమువలనబదులుపలుకలేక 'సరే! కష్టసుఖము లాడవాండ్లకు తెలియవు ఇంకవిడువదు. ధరచెప్పండి' యనిపలుకును. వర్తకుడు అతనితో 'చెప్పడమునకు మీకు తెలియని దేమియున్నది. చేటలో వెలగకాయ లేకదా! అందరు నెఱింగిన విషయమే! కూలి నలుబదిరూపాయలు. ఇంక బంగారము రవల తూనికయెంతయగునో దానిప్రకారము నవరలధర మీరెఱింగినదియే! రవల మాటయున్ననో, తోడుగా యేర్పఱించిన మేలైనవి. ఇది వేరేయొకరికొఱకు ఫర్మాయిషీగా చేయించబడినది. ఆర్డరుఇచ్చియున్నారు. వారు ఇంకారాలేదు అమ్మగారు కోరినారుగనుక వీరికియిచ్చి వేరేచేయించి యార్డరువాళ్లకుయిచ్చెదము.' అని మాటలాడుచు, ఏచేవిరో తనకు తోచినరాళ్లువేసి, తూచి వ్రేలితోముల్లుతట్టిసరిచూచి 'చూడండి! త్రాసురాళ్లువేసి తూచినాను. ఈకళ్లుయితరులు వేసిచూచరు. మాకుమోసముకూడదండి! చేయవలెనంటే యేలాగునైనం జేయవచ్చును. మీరు తెలుసుకొనజాలరు. నమ్మితీసుకొనివెళ్లుదురు. పిమ్మట నేదైనను లోపమైనచో నిందింపుదురు. మాపేరుచెడిపోవును.' అని రాళ్లు యిన్నిరతులకింత క్రయమనియు, బంగారుక్రయ మింతమాత్రమనియు లెక్కచేసి కూలితో మొత్తముచేసి, వేయియో, వేయిన్నియేనూరో అయినదని చెప్పును. కొనవచ్చిన పెద్దమనిషి 'అబ్బా! చాలధరగాయున్నదే! మొత్తముచాలాఅయినదే!' అనిన 'ఏమండీ! ఇదియెక్కువయనియా మీయభిప్రాయము. రవలుచౌకధరలో తీసికట్టించినందున యీక్రయమునకుతీఱినది. యిప్పుడుకొని కట్టించండి తెలియును. ఇదియే రెండువేల రూపాయలకు మతింపుగాగలదు. ఆయాశను మీవిషయములో నేను పెట్టుకొనలేదు. అప్పటి వెలప్రకారముగానే లెక్కచేసినాను.' అని చెప్పును. కూలియెక్కువగా యున్నది యనినయెడల 'ఏమీ? ఎక్కువయా?

మీరు చేయించినారనినచో యేబదిరూపాయలు తీసుకొందుము. మేము జీతములిచ్చి పెట్టుకొనిన పనివాండ్రగుటబట్టి యీమాత్రమునకు గిట్టినది. సరే! ఇంకాయుండే యంగడులలో విచారించండి. అక్కడివిషయములు కూచినంతట మీకే తెలియవచ్చును. మీవంటివారితో పొరబాటు చెప్పరాదని నేను ఖండితమైన తీర్మానము చెప్పినాను. రూపాయకు ఒక అణా లాభము మాకు దొరికిన చాలును. తక్కినవారివలె యంతటికంత లాభమును మేము కోరెడివారము కాము. వృథామాటలవలన ప్రయోజనము. మంచిసొమ్ము. ఇది మీకు ప్రాప్తమైనది తీసుకొనుడు. ఇష్టము లేకున్న మానివేయుడు బలవంతము లేదు. అసలు ఇది ముక్కెర యొకరిగా చేయించినది. అమ్మగారు మోజుపడినారని యివ్వదలంచినానుగాని, లేనియెడల యివ్వనేయివ్వను' అని స్పష్టముగా చెప్పును, అమ్మగారు దానిని తీసియివ్వవలయునని పట్టుబట్టి మగని గాచి యొక మొగము పెట్టును. అప్పుడతఁడు విధిలేక నాలుగునగలకుగా దెచ్చిన సొమ్మును యాగొంక దానికేయిచ్చి దానినికొని భార్యకంఠమున ధరించుకొనజేయును. అంతట వారు స్వస్థలమునకు పోయిన తరువాత, రెండుమూడు మాసములలో దానిరాళ్లు తళుకుమాసి నల్లబడును. బంగారు తెల్లగానగును. "అయ్యో! ఇంతమొత్తము బెట్టికొనియు నిదియిట్లాయనే" యని మరల యంగడివానియొద్దకుపోయి యడిగినచో 'ఏమండీ! ఇదివరకును మాయొద్దకొన్నవారెవ్వరును యిట్లు చెప్పినది లేదు. విచిత్రముగాయున్నది. రాళ్లనగలు జాగ్రతగా వాడవలయును. లేనియెడల యెంతమంచిరాళ్లయినను, నీరుదిగి మాసిపోవును. మీవారి యజాగ్రతవలననే యిట్టులైయుండునుగాని వేఱుకాదు. మీకది యిష్టము లేనియెడల తీసుకొనిరండు. నీరుతీయించి మరలకట్టించియిచ్చెదను. 'కూలి యేబదిరూపాయలకు తగ్గదు' అని చెప్పును. అతడదివిని తనలో "ఆడవాళ్ళ బాధపడలేక ఋణము తెచ్చితీసికొన్నందుకు యీగతిపట్టినది దానికి వడ్డిగా మరల యేబదిరూపాయలు కావలయునఁట, ఇంతమట్టుకును సమర్పించినది చాలును' అనియెంచి మాఱుపలుకక వెడలిపోవును. నగలవ్యాపారము చేయువారి యంగడులలో కొన్ని మంచివి లేకపోలేదుగాని మూడుపాళ్లు యంగళ్లపైన వ్రాసిన లక్షణములు గలవి చేయుగును. ఈయంగడివారలు, ఎవడైనను గ్రహచారము చాలక తమచేతచిక్కినయెడల, సమయమునకు తగినలా

యీరకములో చేరినవే, బెల్టులు, మెడపట్టీలు, తువాలాలు మొదలు గాగలవియు నిట్టిబూటకమైనవే గాని దృఢమైనది యొక్కటియును లేదు. జపానువస్తువులన్నియు నత్యేప్రక్రయముగలవిగానే యుండును. సూదులు, పిన్నులు, బట్టనులు మొదలుగాగల వస్తువులు సర్వమును తెంగ్లీసువారుచే చేయబడి చూచుటకుమాత్రము మిక్కిలియందముగా యుండును. ఏవంకపోయినను ఎందఱెండలో జనకూటము చేయు ప్రదేశము యుండును. హైరోడ్డుమోరలయందును యిట్టి వస్తునముదాయములను [illegible] బెట్టుకొని అమ్ముచుందురు. కొందఱు త్రోవుకుబండ్లపై వీధివీధులకుందెచ్చి విక్రయింతురు. వివిధములైన నగిన్నెలు, సబ్బులు, [illegible], బిస్కె లాట్లామకొను వస్తువులు. డజను ఒకయణాకు యెక్కువయుండదు కొన్నినమయములయందు దానికినితక్కువగానే దొరుకును కొన్నినమయములలో మొత్తముగా నేలమువేయుదురు. అప్పుడు తీసినవారికి మిక్కిలిచౌకగాలభించును. ఇటువంటి విక్రయశాలలను చెన్నపురిలో ఏవేవంకబోయినను ప్రతిదినమును నెందఱినో చూడవచ్చును. ఒకఅణాయిచ్చి టపాసుపెట్టె నొకదానిని తీసుకొనివచ్చి పిల్లవాండ్రకు ఇచ్చిన యెడల, వానిలో మందుకలిగి ప్రేలి శబ్దమునిచ్చునవి ఇరువదియుండెనా? అది మిక్కిలి మంచిరకము, తక్కినటపాసులన్నియు నిరుపయోగములైనవి. బంకమట్టి గట్టింపబడియుండును. అవియెట్లుకాలును, వేయేల? జపానునిప్పుపెట్టె నొకదానినికొంటిమేని, అవసరమేగాని దానిలో మండెడిపుడకలు సగమునకు తక్కువగానేయుండును. తక్కువ పుల్లలకు మందేయుండదు. అవియట్లున్నవని యెవరినడుగవలయును? అంగడివాడు జవాబుదారుడగునా? ఇది యిందఱు నెఱింగినవిషయము కదా! అన్నియు నిక్లిష్టశుద్ధమైన మోసము. చిన్నబుడ్లనియు, చట్రములనియు, పూవులు బాణములనియు, హస్తాభరణములనియు, సువాసనతైలపుసీసల పునుగులవలెను, సరీసృపములవలెను, నేర్పుమీఱంగ గలవియు, యిటువంటి వేని రకములు వేయింటికధికముగాయుండును. కొన్ని కట్టెకాగితములతో చేయబడియుండును. ఇంతకుపూర్వము మనదేశమున జర్మనీసామానులు మితిమీఱి విక్రయించి యనంతధనము గడించుకొనిరి. యుద్ధసంరంభమునకు పిమ్మట యచటనుండి సామానులువచ్చుట తగ్గిపోయినది. ఆయవకాశమునుకనుగొని జపానువారు, కడునేర్పుగా తమవస్తువులను

తయారుచేసి, మన దేశమునకుగొనివచ్చి విక్రయించి కోట్లకొలది ధన
ముంగొనిపోవుచున్నారు. వారివస్తువుల నాణెమునకు వింతపడి, తమకు
కలుగునష్టమును యోజింపక తాత్కాలికలాభమునుచూచుకొని వివే
కహీనులై యీవస్తువుల నన్నిటింగొని యట్టిమోసపు వస్తువులను మన
వారికేవిక్రయించి ఈదేశస్థులు, ప్రజలను మోసముచేసి నష్టములపాలు
చేయుచున్నారు. ఇదియెంతయుశోచనీయమైనవిషయము. ఇతర దేశస్థులు
యేవితెచ్చినను, మన దేశవాసులు కష్టపడి గడించిన డబ్బులువారకోసి
వానినికొని తామునష్టపడుటయేగాక తమతోడివారినిసయితము, బీద
వారింజేయుచుండ, మాయసరకులనంటగట్టి మిక్కుటముగా ధనముం
గొనిపోయి పొరుగుదేశములవారు సంపన్నులై సకలభోగములు ననుభ
వించుచుండెదరు. ఇట్టి నిరుపయోగమైనవానికొఱకు డబ్బు వెచ్చపెట్టు
టవలన నిష్ప్రయోజనముగాని లాభములేదు. ఎండలో పేదలు కూడు
గుడ్డలులేక వీధులలోయల్లాడుచుండగా, అటువంటివారికి ఇహపరసాధక
మనితలంచి శక్త్యానుసారముగా ధర్మముచేయుటకొల్లక, విలాసముపేరి
ట వ్యర్థముగా యీ మాయవస్తువులకు డబ్బుధారబోయుటచూడగా,
ఇట్టిబుద్ధులు వీరికికలుగుట దురదృష్టమనవలయునుగాని మఱియొకటి
కాదు. ఈదుర్వ్యాపకమెన్నఁడుతొలఁగునో, నాఁడుగాని భరతఖండ
మునకు మేలుచేకూఱదు. నిశ్చయము.

---

## కంపెనీలలో ధనము పెట్టినవారికి మోసము.

గొప్ప నగరములలో ప్రఖ్యాతిగా వడ్డీవ్యాపారము జరుగుచుం
డుకంపెనీలు మెన్నో యుండును. వానిలో యితరులు తమయొద్దనుండు
డబ్బు గొనిపోయి తమ యుత్తరకాలమున కవసరము కలిగినప్పుడు తీసు
కొను షరత్తులతో కట్టి వచ్చుచుందురు. అటువంటి కంపెనీలలో పయి
కము కట్టినవారికి కంపెనీదారులు యిచ్చువడ్డీ చాలా తక్కువ రు100కి
0-5-0లకుయెక్కువ యివ్వజాలరు. అయినను, అడిగినప్పుడు తాము తె
చ్చుకొనవచ్చునను నమ్మకముతో జనులు మొత్తములుగా కొనిపోయి
కట్టిపెట్టుకొనుచుందురు. ఇవ్విధముగా రాబడిన రూపాయలతో కం

పెనీదారులు వేరే వ్యాపారములు సాగించి యెక్కువధనమును సంపా
దింపుదురు. రూపాయలు కట్టినప్పుడు, యేయాటంకమును నుండదుగాని
యేదైనా యవసరము కలిగి కట్టినవారు తాము ఇచ్చినదబ్బులో నూరో,
యిన్నూరో కావలయునని కోరినయెడల యడిగిన వెంటనే యివ్వరు.
ఇచ్చుటకు వారియొద్ద యుండదు. ద్రవ్యమంతయు నితరవ్యాపారముల
పై వినియోగింపబడును. కాబట్టి తమతంత్రము యితరులకు తెలియనీ
యక కంపెనీ మెంబరులందఱుంజేరి ప్లానుచేసి బిల్లు యిచ్చిననేగాని
రూపాయలు యిచ్చుటకువలనుగాదని రెండుమూడుసారులుత్రిప్పి తుద
కెట్లో సమాళించి యిచ్చిపంపుదురు. ఈలాగున క్రమముగా జనులుక
ట్టియుండు దబ్బు మొత్తమధికమైనంతట రెండువిధముల లెక్కలు త
యారుచేయించి, సత్యమైన లెక్కను పెట్టుకొని రెండవదానిని దాచి,
ఉన్నట్టుండి కంపెనీ దివాలా యైనట్టు ప్రకటించి, యిల్లు తాళమువేసి
ముద్రించి పెట్టుదురు. దబ్బుకట్టినవారిలో నూటికి యొంబదిమందియో
తప్ప తక్కిన వారందఱును దివాలామాట వినగానే దిగులొందిపోయి
యడిగినవారల జవాబు చెప్పుటను నయితము కష్టము తమకుగలిగిన
నష్టమునకై ధనమును కట్టినవారలుచేరి కోర్టులో వ్యాజ్యము తెచ్చిన
యెడల తప్పులెక్కలను దాఖలుచేసి, కంపెనీదివాలాతీయుటకు యేవేవి
యో హేతువులుచెప్పి, పదివేలో యిరువదివేలో నిలువ గనబఱతురు.
కోర్టువారు ఆరూపాయలు రూపాయలుకట్టినవారికందఱికిని దామాషా
ప్రకారము భాగించి యొసంగవలసినదిగా యుత్తరువు చేయుదురు. అ
టుల భాగింపగా, వేయిరూపాయలుకట్టియున్నవానికి పదునైదో యిరు
వదియో రూపాయలు వచ్చును. అవి వ్యాజ్యకర్చులకైన మొత్తము
యొక్కవడ్డీకి సయితము చాలదు. ఏమిచేయుదురు? తలపై చేతులు
పెట్టుకొని "అయ్యో! సర్కారు సేవింగ్సు బ్యాంకిలో కట్టియున్నయె
డల వడ్డి తక్కువయే యైనను, అసలు సొమ్మునకు చెఱుపుగలుగదు
గదా! ఈ పాపాత్ములైన కంపెనీదారులుమాత్రము యెక్కువ వడ్డి
యిచ్చుచుండిరా? బుద్ధిలేకపోయెనే! తంత్రగాండ్రైన కంపెనీ యేజం
టుల మాటలనునమ్మి యున్నదబ్బును పాలకర్పణముజేసి యల్లాడుటకు
పాలైతిమే!" యని దుఃఖాక్రాంతులై తమ దారింబోవుదురు. కొంద
ఱికి మనోవ్యాధికలిగి వెఱ్ఱిపట్టుటయు, కొందఱు అదే దుఃఖముతో

మృతినొందుటయు సంగతము సంభవించును, అన్ని వ్యవహారములును తీర్మానమైనపిమ్మట కంపెనీ భాగస్థులు తాము దాచినడబ్బు నాలుగు లక్షలో నైదులక్షలో రహస్యముగా సమభాగములుచేసి పుచ్చుకొని, ఆడబ్బు పెట్టి, తమ మామల పేరుననో, యిల్లాండ్ల పేరుననో, బావమరుదుల పేరులతోడనో వేఱువిధముగా వ్యాపారమును సాగింపుచు కడుడంబముగా, సులోచనములును, వెలపొడుగు చొక్కాయిలును, బంగారు గొలుసులు తగిల్చిన గడియారములు, బూట్సులునుధరించి మోటారు కారులలో తిరుగుచుందురు. ప్రజల ఘోషవలన తమకును నటువంటి దుఃఖమును సంప్రాప్తించుట యనుట వారుతలంపరు. వీరిని మించిన పాపాత్ములును, మోసగాండ్రును మఱియెవ్వరు? బుద్ధిలేని జనులు తమకుకలిగియున్న డబ్బును, సర్కారుబ్యాంకీలలోననో, నమ్మకమైన యోగ్యులైన గొప్పవారియొద్దనో దాచుకొనక యీపాపు పాపాత్ములమాయ కంపెనీలలో పెట్టుకొని తుదకు పోగొట్టుకొని ఫకీరులై యల్లాడుదురు.

ఆ. కంపెనీలలోన | కలధనంబు నొసంగి
యవిదివాలయైన | యంతమీఁద,
వెఱ్ఱివారిభంగి | వెతనొంది దుఃఖింతు
రజ్ఞులైన మనుజు | లవనిలోన.

---

# పొగాకు పొడిచేయువారి మోసము.

హిందూదేశములో అధికముగా వినియోగింపబడు వస్తువులలో పొగాకును యొకటి దీనిని జనులుచుట్టుకొని చుట్టలుగాను, పొడిగాను, సన్నగా కత్తిరించి బీడీలుగా చుట్టియు, నోటిలో వేసికొని నమలి పుక్కిట బెట్టుకొనియు, మఱియునలు తెఱంగుల నుపయోగింపుదురు. దీని మహాత్వ మెట్టిదియో కాని సకలజనులును దీనియం దధికమైన ప్రీతిగల వారవుదురు. పొగాకు నుపయోగించు విధములలో, ముక్కుపొడిముఖ్యముగా నెన్నవచ్చును. గొప్ప పట్టణములలోననేగాక యించుక పెద్దవిగా యుండు యూళ్ళలో సైతము పొడియంగళ్లు పెట్టియుందురు. ఈబేరము చూచుట కల్పముగా కనుపట్టును. గాని దీనివలనవచ్చు లాభ

ము౦ దెలిసికొనినచో యత్యధికము. ఆశ్చర్యము గలిగించును. పట్టణ స్థలములలో పొడియంగడులుపెట్టి దానివలన మిక్కిలి ధనికులైనవారు పెక్కండ్రుగలరు. తమకు మొదటినుండియు నధికమైన మేలుగలిగించి నదంటచే ధనికులైనను వారు, ఆవ్యాపారమునే చేయుచుండుదురు గాని నొకటికంటె నెక్కువగా సాగింతురు

చెన్నపురిలో పొడియంగళ్లు విశేషముగా గలవు. కొన్ని కదుడంబము గా పదుగురుయిరువదిమంది పనివాండ్రను గుమాస్తాలను పెట్టి సాగింప బడుచుండును. చెన్నపురిరాజధానిలో పట్టంపొడియనిన దానికి నెక్కువఘుతింపుగలదు. ఈవ్యాపారముచేయువారు పొగాకుమంచిదిగా పైరు చేయబడు తూర్పుజిల్లాలనుండి మేలైనపొగాకురప్పించి, దానిని కాడలును, ఆకును వేఱువేఱుగాచీల్చి కత్తిరించి వేఱువేఱుగా నిప్పుంకుంపటిపై పెనములుపెట్టి పక్వముగా వేయించి, మంటిపాత్రములలోవేసి కొయ్యరోకళ్లతోనూరి పొడియైనంతట పదింటికొకభాగము మంచినేయియు, సన్నైకాఱుగలసున్నమును చేర్చి కలియనూరి జాడీలలోనింపి బిరడాలుపెట్టియుంచుకొని నన్నని యినుపగరిటెతో నడిగినవారికి ఇచ్చుచుండుదురు. ఇట్లుచేయబడినపొడి ప్రసిద్ధమైనదనిపేరు. ఇంకకొన్నియంగడులలో జరుగువిధము వేఱు. తక్కువరకమైన పొగాకును తెప్పించి పొడి చేయించి యది ఘాటుకలిగియుండుటకై యందు నవాసారముగాని, సారాయిగాని, మిరియాలుగాని, యెక్కుడు సున్నముగానిచేర్చి నూరి పెట్టుదురు. ఈపొడి పీల్చినయెడల ముక్కుపునికపాలమునకెక్కును. సువాసనగాయుండుటకై కొంచెము వాసనపొడిచేర్చి యుండుటయుంగలదు. తెలివిలేనిజనులు పొడి ఘాటుగలిగి యుండుటనుబట్టి దానిలో మోసమెఱుంగజాలక మిక్కిలి మంచినస్యమని భావించి కొనిపోవుచుండుదురు. ఇతరగ్రామములనుండి వచ్చినవారు, కాలువీసె, యరవీసె, డబ్బీలలోనను, సీసాలలోనను వేయించుకొనిపోవుదురు. పొడియధమమైనదిగా యుండినను వెలమాత్రము తక్కువగాదు. మంచిపొడికిగల ధరయే యుండును. కొందఱు నేయివేయుటకుబదులు పొడిలో నూనెవేసినూరుదురు. ఘాటుకొఱకు ముందుచెప్పినవేగాక మఱి యెన్నోవస్తువులను కలుపుదురు. ఇటువంటియంగళ్లు లెక్కకుమిక్కుటమైయుండును. ప్రతి యంగడియందును వాకిటపలకలుగట్టియుండుదురు. వానిలో "మేలైన

ము లేదు. ఎవరైనను మీవంటివారు కోరుదురని తెప్పించడమేగాని లాభము బొత్తిగా లేదు. ఒక్కొక్కసారి అసలునకే లోటువచ్చును'అని సమాధానముం జెప్పుదురు. కొందరు తంత్రగాండ్రైన పల్లెటూళ్ళవారు పొడి తెప్పించిన వెలయధికమనియెంచి తామే పొడితయారుచేసి ప్రత్యేకముగా యొకజాడీలో పోసిపెట్టి పట్ణంపొడియని యమ్ముదురు. ఇటువంటిపొడిని వాడుటవలన కపాలమునకు ప్రసరించి మెదడుచెడి పలు విధముల రోగములుకలుగును. ముఖ్యముగా దీనివలన నేత్రదృష్టితగ్గుటయు, పీనసవ్యాధికలుగుటయుం దటస్థించును. కొందరికి నాసికారంధ్రము పుండ్లై యెప్పుడును నీరుగారుచుండును. పొడివాడుటయే దుర్వ్యసనము. అందును యిటువంటి చెడువస్తువు నుపయోగించినవారి దుస్థితి చెప్పవలసినదియే లేదు. ఇట్టికష్టములకు లోనగుచుండియు జనులు విడవక దానినుపయోగించుచుండుట చూడగా, పొగాకునందు గొప్పమహిమయేదియో కలదని యాలోచింపవలసియున్నది. పొగాకుమహిమకన్నను, పొడిచుంగళ్ళవారల ప్రభావము మఱి యధికమైనదని చెప్పవచ్చును. సారాయి, కల్లు, గంజాయి, మాజము మొదలగు మత్తువస్తువులుపయోగించినవిధముగానే, సిగరెట్లు, బీడీలు, చుట్టలు, పొడి యివి వాడుటయు, దుర్వ్యసనమే కాని క్షేమకరములు కావు. వీనికొరకై చేయుఖర్చు నిష్ప్రయోజనమైనది. కాబట్టి బుద్ధిమంతులైనవార లిటువంటి చెడువాడుకలు విడిచియుండుట యెంతయు శ్రేయస్కరము. కొందఱు పొడివేసుకొనకుండిన తలనొప్పి కలుగుననియు పనితోంచదనియు, లెక్క బుట్టినట్లుండుననియు నేమేమో సాకులు చెప్పుదురు. అవి నిజమేయైనను మొదటనన్నియుం బొడి యలవాటు చేసుకొన్నందున గలిగినవియే కాని వేఱు కావు. ఏదేనియు నుపాయాంతరములచేత యీ చెడ్డయలవాటును విడిచినవారు సుఖపడగలరు. ఆహా! ఈపొగాకు మహాప్రభావము వర్ణనాతీతమైనది. ఇది జనాకర్షణము చేసినటుల మఱియొకటి చేయజాలదు.

ఆ. చెడుపొగాకువేచి పొడిజేసియందులో
చెడ్డవస్తువులను చేర్చికలిపి
మంచిపొడియటంచు వంచకులమ్ముదు
రదియెఱింగి యోగ్యమైనఁగొనుఁడు.

# ఇమిటేషన్ రత్నముల మోసము.

శాస్త్రసమ్మతములై ధనికులును, సంస్థానాధిపతులును, ధరించుటకర్హమైనవి నవరత్నములు. జగత్ప్రసిద్ధములని యందఱు నెఱుంగుదురు. అటువంటి రత్నములను సామాన్యజనులుకొని యాభరణములు చేయించుకొనజాలరు. భగవత్సృష్టియైన యీ వజ్ర, వైడూర్య, నీల, గోమేధిక, పుష్యరాగ, మరకత, మాణిక్య, ప్రవాళ, మౌక్తికములనెడి నవరత్నములకును బదులుగా యిప్పటి కలికాలానుగుణ్యముగా మనుష్యసృష్టియైన యిమిటేషన్ రాళ్లు వెలువడి ప్రపంచంబున నెచ్చటచూచినను విశేషముగా వ్యాపించినవి. అసలురత్నములకంటె యీమాయ రాళ్లు కాంతియు నాణెమును గలిగియుండును. చూచుట కందముగా యంత్రములవలన వివిధములుగా పట్టెలు తీర్చబడి, తరగతివారిగా వానికితగిన పెట్టెలలో పెట్టియుందురు. అందుగా యిగువదేసిరాళ్లు యేరి తెల్లని దళసరి రంగుకాకితములలో పొట్లములు మడిచియుంచియుందురు. ఇరువదిరాళ్లుగలపొట్లము ఒకకోడిగయని చెప్పబడును. ఒక్కొక్క పెద్దపొట్లములో పదియిరువది కోడిగల రాళ్లుంచుటయుంగలదు. పొట్లము విప్పిచూచినయెడల వాని కాంతి కనులు మిరుమిట్లుగొలుపుచుండును. వాని ప్రకాశమును, సొగసును గాంచి మంచి రత్నములమాటమఱచి సామాన్యజనులేగాక ధనికులుసైతము వానినేకొని, కమ్మలు, అడ్డిగలు, హారములు, జడబిళ్లలు, పతకములు, నత్తులు, ముక్కరలు, పుడకలు, మొదలైన యాభరణములను చేయించుటకు ప్రారంభించిరి. అందువలన నిజమైనమణులకన్నను, ఇమిటేషన్ రాళ్లకు గిరాకియెక్కువయైనది. ఏనగలయంగడికిపోయినను, మంచిరాళ్లతో చేయబడిన నగలొకభాగమున్నయెడల ఇమిటేషన్ రాళ్లనగలు తొమ్మిదిభాగములుండును. అద్దపునిలువుపెట్టెలలో యిట్టిసొమ్ములు పెట్టియుండుటచూచిన స్త్రీలు వానిపై మోజుపడి, తమయొద్దనుండు మంచిసొమ్ములను విక్రయించియైన వానింగొనుటకుతలంతురు. ఈరాళ్ల వ్యాపారము చెన్నపురి మొదలైననగరములలో యెక్కుడుగా జరుగుచుండును నూరురూపాయలుపెట్టి మంచిరాళ్లుకొనవలసిన యగత్యముకలిగినపుడు, పదిరూపాయలకే కావలసిన యిమిటేషన్ రాళ్ళువచ్చును. కాంతియు,నందమును

నిజమైనవానికన్న యివియే యధికముగా గలిగియుండును. వెల చౌకయు, నాణెమెక్కుడును నగుటవలన నందఱును వీనినేకొనెదరు. కాని పిమ్మట విక్రయించినపుడు తమకవిసొమ్మగునా? లేదా! యని యోజింపరు. ఈరాళ్లు విశేషముగా నేర్పడుటవలనను, చౌకగాదొరుకుటవలనను, బీదవారికినయితము రాళ్లనగలు మించిపోయినవి. పాకీవాండ్లవారికికూడా రాళ్లతోకట్టినసొమ్ములు లభించదొడంగినవి. ఇవి యెక్కుడైనకొలందిని మంచిమణులనియు, ఇమిటేషన్‌రాళ్లనియుం దెలిసికొనుటకు కష్టముగాయేర్పడినది. చాలా అనుభవముగలవారికేగాని భేదము యితరులకు తెలియదు   కొనుటకు పోయినయెడల ఇమిటేషనురాళ్లనే మంచిరాళ్ళని యేమరించి యొసంగుదురు. మనమొకనియొద్దకు రాళ్లు తీయుటకుపోయినయెడల 'రండిరండి! కూర్చుండండి! ఏమి కావలయును కెంపులా? పుష్యరాగములా? మాయొద్ద క్రొత్తగావచ్చిన మేలైనరాళ్లుగలవు. మీకు సన్నములుగావలసియున్నను, తసుపులు కావలసియున్ననుదొరుకును పచ్చలు, నీలములు, మంచిస్ఫటికములునున్నవి. చూడండి వెలసరసముగాయిచ్చెదము." అని మనముడుగకపూర్వమే పదివిధములుగలవి పదిపొట్లములువిప్పి ముందుబెట్టుదురు. అవితృప్తికరముగాలేవనిన, వేరురాళ్లుచూపెదమని మఱికొన్ని పట్లములుచూపుదురుకాని యవియు మొదటచూచిన రాళ్లవంటివే! వానిని వెలపొడుగురకమని బలుకుదురు ఒకకోడిగ పుష్యరాగములో, కెంపులో యేర్పఱచి వెలయెంతయని యడిగిన, "మీరు ఉన్నవానిలో మేలురాళ్లుఏర్పఱచినారు. ఇట్లు యిచ్చినయెడల సరుకు నాణెముచెడును. వీనికి వెలయెక్కువ" యని యొకటికి పదివంతు లధికముగా జెప్పుదురు. ఏదో యొకవిధముగా బేరముచేసిచేసి తీర్మానించుకొని వానిని కొనివచ్చి కమ్మలో, పతకమో కట్టించితిమేనినాలుగుమాసములలో నూనెయో నీరో దిగి పూర్ణముగా యారాళ్లు తను తళుకును విడనాడి చూచుట కసహ్యమైన వేఱొకరూపమును దాల్చును. మంచిరాళ్లుపెట్టి కట్టించినసొమ్మున నీరుదిగినయెడల వానిని విడదీసి మలినముం బోగొట్టి మరల కట్టించినయెడల నవి తమ పూర్వతేజము గలిగి ప్రకాశించును. గాని ఇమిటేషన్‌రాళ్లు నీరు దిగినచో మరల నుపయోగింపవు. తీసి పాఱవేయవలసినదే! ఇదిగాక ఈ యిమిటేషన్‌రాళ్ల   కట్టించినసొమ్ము నూఱురూపాయలు తగు

లఁబసిద్ధమైనదిగా యుండినను, అక్కఱగలిగి యెవరియొద్దనైన కుదువ యుంచబోయినచో వారా రాళ్లను లెక్కచేయరు. నగయంతయుండుబం గారము మతింపుచూచుకొని పదియో యిరువదియో యిచ్చునప్పటి కి గగనమగును. ఈరాళ్లనగలు యేర్పడినంతట మంచిరత్నములకొరక ట్రించినవి కొనిపోయినను, కుదువయుంచుకొనెడివారు నమ్మరు. కాల గతి యిట్లేర్పడినది. ఎవరైనను నిజమైన పుష్యరాగములు కొనవల యునని యీరాళ్ల వ్యాపారము చేయువారి యొద్దకుపోయి యడిగిన యెడల, తమయొద్ద లేకున్నను, ఉన్నట్టుచెప్పి కూర్చుండబెట్టి ఇమిటే షను రాళ్ల పొట్లమును విప్పిచూపి "ఇవి మిక్కిలి శ్రేష్ఠమైన పుష్యరా గములు, కమ్మలకుగాని, హంస బిళ్లలకుగాని, పతకములకుగాని యివి వేసినయెడల నద్భుతముగాయుండును. ఎవరైనను మీవంటివార లను గుదురని మేము మేలైనవిగా కొలందిగా తెప్పించెదము. ఇప్పుడీ పాడు ఇమిటేషను అధికమైనది. మంచిరాళ్లకు కర్చుతక్కువ. ధనికులు నయి తము ఇమిటేషనే తీయుట కారంభించినారు. ఏమి ప్రయోజనమండీ! ఎప్పటికైనను రాజురాజే! బంటుబంటే! తపస్సుచేసినను, వీని కవి సరివ చ్చునా? గుణము తెలిసిన మీబోంట్లు మాయకళంకుగల యాబికారిరా ళ్లను చేతులతో నయితము ముట్టుకొనరు. మీకు దేనికి? కమ్మలకా లేక యుడ్డిగలకా? ఇంకను ఉరువులో గావలసినను ఉన్నవి" అని పనిపొట్ల ములుతీసి పుష్యరాగములని చూపుదురు. అన్నియు మాయరాళ్లే వాని గుణానుభవము లేని యామనుష్యుఁడు వారిమాటలునమ్మి, పుష్యరాగ ములేయనితలంచి వెలయడిగిన 'కోడిక 15 రూపాయలనియో 20 రూ పాయలనియో చెప్పుదురు. వెల యెక్కువయని యతను మఱియొకయం గడికిబోవుట లేవబోయినయెడల కూర్చుండబెట్టి 'అయ్యా! వెళ్లుతారే మండీ! ఇంకొకగుమాత్రము మీకుఉచితముగాయిచ్చెదరా? మేముచె ప్పగానే భయపడెదరేల? అడగండి! చెప్పినంత యివ్వబోయెదరా? నేడు మొదటిబేరమిదియే! ఏదో విధముగా తీర్మానముచేసుకొని పా వు యెక్కువయో తక్కువయో, తీసుకొనండి! మంచిరాళ్లు, ఇట్లుమీ కు కావలసినతోడు మఱి యొకరియొద్ద దొరకవు. వచ్చినబేరగాండ్రను నమ్మతిపరచి యేదో విధముగా యిచ్చి పంపవలయును గాని, పోనివ్వ రాదు. మీ రెంతకడిగెదరో చెప్పండి" యని చెప్పుదురు. ఇరువదిరూపా

యలుచెప్పినరాళ్లను, వచ్చినవాఁడు పదిరూపాయల కడుగును. అంగడివాఁడునవ్వి "అయ్యా! ఇది వంకాయల బేర మనుకొంటిరా? సగమునకు సగముగా నడిగినయెట్లు? మాయొద్ద లేవు. మీయిష్టప్రకారము మఱియొకచోట చూడండి. ముమ్మాటికిని యిష్టముగా యుండినయెడల మొదటిబేర మగుటవలన అసలు ధర కోడిగ పదునైదు రూపాయలకిచ్చెదము. ఇష్టము లేనియెడల పోవచ్చును. అనిచెప్పుదురు" కొనచ్చినవాడు పదిరూపాయలధికముగా నైనయెడల నాకువలదని లేచినాలుగడుగు లటుపోవగానే 'ఇదిగో! ఒకమాట ఇటులరండు. కడపటిమాట పదమూడురూపాయలు' అనిపలుకుదురు. వారుచేయు తొందఱకులోబడి యామనుష్యుడు తుదకు పండ్రెండురూపాయ లిచ్చెదననును. అంగడివాడు 'రండి!' యని మరల కూర్చుండబెట్టి "పన్నెండున్నరరూపాయలు యివ్వండి! చాలానష్టము' అని గోజారి కడపటపన్నెండున్నరరూపాయలకును యామాయరాళ్లను వాని కంటగట్టును. వాని యసలుధర యొకటిన్నరరూపాయల కధికము ఉండదు. తెలియని యాబేరగాఁడు, "ఇరువదిరూపాయలు చెప్పినవానిని పన్నెండున్నరవరకు తీసినాముగదా! జాగ్రతగా బేరము చేయుటవలన ఏడెనిమిది రూపాయలు మిగిలినవి. చెప్పినట్లే యైనయెడల యన్నిరూపాయలుంబోయి యుండు" నని తన సామర్థ్యమునకు తానే సంతోషించుచు బోవునేగాని ఇమిటేషన్‌రాళ్లను మంచివని తగులగట్టి యొకటికి పదియంతలు డబ్బుగుంజుకొనిటోపీవేసినది తెలుసుకొనఁజాలఁడు. ప్రక్కయంగడివాళ్లకా తంత్రముతెలిసియుండియుం జెప్పనొల్లరు. అది వారి వ్యాపారపు కట్టుబాటు. ఒకవేళ వారిలో నెవనికైనను తాను తీసినరాళ్లను చూపినయెడల "చాలా మేలైనరాళ్లు, ధరయును చౌకయే!" యని పలుకుదురు. ఇటులనే ఈ ఇమిటేషన్ రాళ్ల వ్యాపారములో జరుగుమోసము లనంతములు లోకుల నిర్విఘ్నముగా వంచించి రాళ్లవ్యాపారులు లక్షలకొలఁది ధనమునార్జించి విఱ్ఱవీగుచుండుదురు. అంగడివీధికిపోయి చూచినచో, "మేలైనరత్నములకు పేరొందినచోటు అనియు, నిచ్చటనమ్మకమైనరవలు, కెంపులు, పచ్చలు వగైరాలు, విక్రయించబడుననియు, మాయొద్దరత్నములు కొనువారికి యవి మంచివి కావని రుజువుచేసిన డబ్బువాపసుయివ్వబడుననియు, ఖరారువెలలకు పరిశుద్ధమైన మణులు విక్రయించున్న

లము అనియు పెక్కువిధములు వ్రాసి కట్టియున్నపటముల నెన్నియో గనవచ్చును. ఎందుబోయినను, మోసము లేనిచోటు లేదనవలయును అసలు రత్నములు కొనఁదలంచినవారు వర్తకులయొద్దకు పోయినపుడు గాని రాళ్లనగలు తీయదలంచినపుడుగాని అనుభవము గలవారి ద్వారా వానిని పరీక్షచేయించి తీసుకొనుట మంచిది. లేనియెడల ఇమిటేషన్ రాళ్లనే తీసుకొని తమ తెలివిలేమికి పిమ్మట విచారము చెందవలసివచ్చును. ఈయిమిటేషను రాళ్లవర్తకమువలన ధనికులైనట్లే, పకీరులైనవారును పెక్కుండ్రుగలరు. పరుల మోసగించిన పాపమునకు భగవంతుఁడు తగినదండన చేయక మానఁడు.

క. ఇమిటేషన్ వ్యాపారం
బమితంబై భరతఖండ మందలమికొనన్
క్రమ మెఱుఁగ రాదుకదు మో
సము మంచివి గొనఁదలఁచిన జాగ్రతవలయున్.

## వకీళ్లయొద్ద జరుగు మోసము.

బుద్ధిహీనతవలననో, గ్రహచారక్రూరత్వమువలననో, ఏగ్రామములోగాని యేకుటుంబములోగాని యేదయినను వివాదముసంభవించి తమలోతాము మధ్యస్థులద్వారా తీర్మానించుకొనుటకు ప్రయత్నించ కోర్టులలో వ్యాజ్యముజరిగించదలంచి, ఎవడైనను, న్యాయస్థానము గల చోటునకువచ్చి వకీలును యేర్పాటుచేయుటకుదలంచి యే వకీలు వాకిటికైనను పోయినయెడల యచట కాచియుండు ప్రయివేటు వచ్చినవానినిచూచి "అయ్యా! ఏమిచూచెదరు? వకీలు కావలయునా? ఏమి వ్యాజ్యము?" అనివిచారించును. ఆవ్యాజ్యగాడు, వకీలునేర్పాటుజేసుకొనుటకే వచ్చినాననియు, వ్యాజ్యస్వభావమిట్టిదనియుం జెప్పును. ప్రయివేటు "సరే! ఇది గొప్పవ్యాజ్యముగ యున్నది. విషయములన్నియు నీకనుకూలముగానేయున్నవి. కాని మంచివకీలుపెట్టి జాగ్రతగా వాదము చేయించవలయును. అటులచేసినయెడల నీకు తప్పకజయముకలుగును. ఇచ్చటనుండు వకీళ్ళలో నందరికన్నను, ఈ బాలసుందరంఅయ్యర్